శ్రీ శివాయ గురవేనమః

ప్రథమ [illegible]

# ఉపోద్ఘాతము

మహాశయులకు విజ్ఞప్తి ।　　　　[illegible]

నేను డెబ్బదియారేండ్లవాడను. చిన్నప్పటినుండి యభ్యాసమగు కవిత్వ పురాణాది ధోరణుల చాలించి నా నమశ్శివాయ జపముతో కాలముఁ బుచ్చుచున్నాడను. ఇట్లుండ బాపట్ల పటేల్‌నగరమునుండి ఒక బ్రహ్మ సంఘము వచ్చి నన్ను రెండురోజులు బాపట్లలో నుండిపొమ్మని యాహ్వా నించిరి. మొదట ఆహ్వానములో గమనాగమన భోజనములు మాత్రమే యిమిడియున్నవి. అచ్చట చేరుసమయమునకు పూర్ణకుంభాదులతో వేద విజ్ఞానుల వేదపాఠాది మేళనములతో నెదుర్కొని స్వాగతాదులతో నొక వసతిలో ప్రవేశపెట్టిరి.

మరునాటినుండి యేదియో చెప్పుమనిరి. పై సందర్భముతో నుప క్రమోపసంహారముగ నుపన్యసించుటకు నలవాటు తప్పియుండుటవలన నాకు తోచినమాట చెప్పెదనంటిని. దానికి వా రంగీకరించి తగినయేర్పాట్లు చేసిరి. ప్రతిదినము ఉపన్యాసమందిరమునకుఁ బోవువేళకు నా దేవతార్చన సమయమున వేదపారాయణ చేయించుచు, సభకు ముందు కొంత స్వస్తి చెప్పించుచు వేదవిద్యాప్రధానముగ నీ యుపన్యాసములు నడిపించిరి. ఇట్లు ఇరువదియైదు రోజులు జరిగినవి.

అనుకొనకుండ జరిగిన యుపన్యాసములు గాలికిపోకుండ శ్రీ నెమ్మాని సీతారామయ్యగారు, శ్రీ ఇనుపకుతిక వీరరాఘవశాస్త్రిగారు, శ్రీ కోటంరాజు సత్యనారాయణశర్మగారు వ్రాయ మొదలిడిరి. ఆ విధ మున గ్రంథస్థము కావలసివచ్చిన ఈ యుపన్యాసములను శ్రీ నెమ్మాని సీతారామయ్యగారు ముగ్గురు వ్రాసిన ప్రతులను ఏకముచేసి హెచ్చుతగ్గుల సవరించి యేకముఖముగ ముద్రణార్హ మొనరించి, అందు తప్పొప్పుల సవ రించి యత్యాసక్తితో నేతద్రూపమును సంపాదించిరి.

ప్రతిదినము ఈ పేటలోనివారుగాక, ఊరిలోనివారుకూడ చాల మంది వచ్చి ముమ్మాటు తీర్థప్రసాదములఁ బుచ్చుకొనుట, శ్రద్ధగ ఉపన్యాసాదుల వినుటలతో నా హృదయ మానందతుందిలమొనరించిరి. అందరు అట్టివార లగుటచే పేరెత్తి చెప్పుటకును చెప్పకుండుటకును వీలులేకుండ నున్నది. విషయము విశదమగుటకు కొన్ని పేర్లు మాత్రము గ్రహింపవలసి వచ్చెను.

వెనుక చెప్పిన వసతిగృహము శ్రీ జమ్ములమడక వేంకటేశ్వర శర్మగారిది. శ్రీ దుడ్డు దక్షిణామూర్తి శాస్త్రిగారు ప్రతిదినము ఆరోగ్య విషయములో నా పరివారమునకు ఆయుర్వేద వైద్యము చేయుచువచ్చిరి. దేవతార్చనవద్ద భక్తితో పాటలుపాడుచుండెడివారు. శ్రీ చింతలపాటి మహాదేవశాస్త్రి, మరికొందరు తమ ఆప్తిని వెల్లడించుచు నీ కార్యమున మిక్కిలి పాల్గొనిరి.

ఇఁక నేమియు తోచక ఒకమాట చెప్పుచున్నాను. ఇది యంతయు బ్రహ్మ నిర్మాణము.

నా దౌహిత్రుఁడు చి॥ చెరువు సత్యనారాయణశాస్త్రి పై సంఘము కోరకపై జీవితచరిత్రను వ్రాసియిచ్చినాడు. అదియును నిందు పొందు కూర్పబడినది.

దీనిలో పాల్గొనినవారినెల్ల పరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్య సంపన్నులుగా చేసి, నాకన్న నుత్తములైన పండితోత్తముల వాగ్ధోరణుల నెల్ల కాలము వినుచు, విన్నదాని ననుష్ఠించుచు నైహికాముష్మిక సౌఖ్య సంపన్ను లయ్యెదరుగాక ! అని దీవించుచు ఇంతతో ముగించుచున్నాను.

దోషజ్ఞులకు వందనములు.

చందోలు, ఇట్లు,
13-2-72 తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి.

# అభివందనము

ఆనాడొక పర్వదినము. ప్రతివారి హృదయము భక్తితరంగితమై పరవశించిన పవిత్రదినము. అంతియగాడు పునీతమై పులకించిన పుణ్య దినము. ఏ మహాత్ముని రాకకో, వేదగానములతో, పూర్ణకుంభముతో పురజను లెదురేగిన పవిత్ర పర్వదినము!

ఆనాడే బ్రహ్మశ్రీ వేదమూర్తులు తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు ధర్మపత్నీసమేతులై భావపురికి విచ్చేసిన భవ్యదినము. పార్వతీపర మేశ్వరులే సాక్షాత్కరించినట్లు సంతసించిన నాటిదినము పర్వదినమేగదా!

నేటి మానవలోకమునకు శ్రీ శాస్త్రిగారివంటి మహోదయులు మణిదీపములవంటివారని భావింపవలయును. ఇట్టివారు జూపు వెల్గుబాట లలో పయనించి తమ జీవితముల ధన్యము లొనర్చుకొనుట అత్యం తావశ్యకము.

శ్రీరామకథాऽమృతముచే సాహిత్యపిపాసువుల చిత్తము లలరిం చిన కీ. శే. తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారి కుమారులు శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు. వీరు సనాతన ధర్మపరాయణులు, సదాచార సంప న్నులు, తపోనిష్ఠాగరిష్ఠులు, పరమ నైష్ఠికులు, తేజశ్శాలులు, సాహిత్య వేత్తలు, సమస్త శాస్త్రపారంగతులు. మీదుమిక్కిలి సహృదయులు.

వీరు భక్తులకోరిక ననుసరించి భావపురి విచ్చేసిరి. ప్రతిదినము "నాకు తోచిన మాట" యని ఉపన్యసించుచు శ్రోతల హృదయముల నుత్తాతలూగించిరి. ఇక నీ యుపన్యాసము లన్నియు వినుటయేగాక, వీని కొక రూపముదెచ్చుట అవశ్యకమని సంకల్పమొకటి జనించినది. తదను గుణముగ వారు ప్రసంగించునపుడు శ్రీ ఇనుపకుతిక వీరరాఘవశాస్త్రిగారు శ్రీ కోటంరాజు సత్యనారాయణ శర్మగారు, నేనును ఆ యుపన్యాసకుసుమ ముల సేకరింప మొదలిడితిమి. పిమ్మట నా యోపినకొలంది, యివి యన్నియు నొకచోఁజేర్చి, ఒక రూపముదెచ్చి శ్రీ శాస్త్రిగారికి నివేదించి

తిని. వారును భారమనక వ్రాతప్రతిని ఆసాంతము చదివి, అచ్చటచ్చట మార్పులు, చేర్పులు కావించిరి. అంతియగాదు భారతవిషయమును గొంత వారే స్వయముగా వ్రాసియిచ్చిరి. దీనికంతయు మరల నొక శుద్ధప్రతిని తయారుచేయ నిట్టిరూపము ధరించినది.

ఇఁక స్వవిషయము, ఎందఱో వేదాంతతత్త్వమెఱిగిన విద్వాంసు లుండగ నాబోటి యల్పజ్ఞుడు ఇందులకు సాహసించుట హాస్యాస్పదమనక తప్పదు. ఈ విషయములలో నా యనుభవ మత్యల్పము. ఇక వయ స్సన్నచో నందుల కంగీకరింపనిది. అయినను అంతయో, ఇంతయో ఆ స్తికుడనుగాన ఇందులకు సాహసించితిని. కాని " ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహు రివ వామనః" అని కాళిదాసు డన్నట్లున్నది నా పని. బ్రహ్మదేవు డెవరినెట్లు ఏపనులయందు నియోగించునో యెవరికెఱుక? ఆ బ్రహ్మచేష్టితములు ఆశ్చర్యజనకములుగదా! ఏమైనను యేనాటి పురా కృత పుణ్యవిశేషలేశమో నన్నిట్లు ప్రేరేచినదని వినయముగా విన్న వించుచున్నాను.

"పితాపుత్ర కవి చరిత్రము" వ్రాసియిచ్చి పొత్తమునకు దీప్తి నింపిన శ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రిగారికి నమస్కృతులు.

ఈ గ్రంథప్రచురణలో నాతోగలసి ప్రూఫులు చూచియు, చక్కని సలహాలనిచ్చి సహకరించిన సహృదయులు ప్రియమిత్రులు శ్రీ బి. రాజేశ్వరరావుగారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథమున నెచ్చటేని దోషములున్న నవి నావిగా భావించి, మన్నించెదరని మనవి. ఇక ఒప్పులన్నియు శ్రీ శాస్త్రిగారికే చెందును.

ఇట్టిది వెలుగుచూచుటకు మాతో సహకరించిన మహానుభావు లెందరో, అందరికి వందనములు. ఇట్లు,

బాపట్ల,
16-2-72.

నెమ్మాని సీతారామయ్య. ఎం. ఏ.
ఆంధ్రోపన్యాసకులు - ఆర్ట్సు కళాశాల,



కీ॥ శే॥ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు



బ్ర॥ వే॥ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు
వారి ధర్మపత్ని శ్రీదేవిగారు

శ్రీ శివాయ గురవే నమః

# పితా పుత్ర కవి చరిత్రము

సీ॥ తనుఁ బరీక్షింపఁ బూనిన త్రిమూర్తుల నర్భ
కులఁ జేసె నెవ్వాని కులపురంధ్రి
శాపోక్తి శతఖైశ్వర్య గర్వస్ఫూర్తి
వనరాశిఁ గలిసె నెవ్వాని సుతుఁడు
నిఖిలజగత్ప్రీతి నెఱపు వెన్నెలఱేని
గనియె నెవ్వాని దృక్కంజ లక్ష్మి
స్వతపఃప్రభావ మోహితముక్తి కుచతటా
వరణోత్తరీయ మెవ్వాని సుయశ

గీ॥ మా సుగుణ రాజధాని మహావధాని
వేదవేద్యైక సన్మాని వినతమాని
హార్ష వేణీ స్నపితమాని యత్రిమాని
పొసఁగు కారుణ్యమున మమ్ముఁ బ్రోచు నెపుడు

ఆ॥ ఆ త్రిమూర్తి కీర్తు లడియాలములుగఁద
ద్దత్తమూర్తి యగుచు తాన తోఁచె
నత్రిమౌని కనఘ కనసూయ కమ్మహో
త్రేయ యోగివరు స్మరింతు నెపుడు.

ఆ॥ అమ్మునీంద్ర గోత్రమందు జన్మించి బ్ర
హ్మాత్మ కేవలత్వ మవధరించి
ప్రథితిఁ గన్న రామభట్టారకు మదన్వ
యప్రధాన పురుషు నభినుతింతు.

సీ॥ అఖిల వేదాంగ విద్యావదాన్యుఁడు సింగ
ధన్యుఁ డేకృతి ప్రపితామహుండు
శ్రుతి చయోచ్చారణారూఢతా బ్రహ్మ సు
బ్రహ్మణ్యుఁడే భవ్యభావు తాత
యాగమరత్న రత్నాకరుండల బుచ్చ
యార్యుఁడే సత్కలాధుర్యు తండ్రి
లలితలక్షణ యక్కలక్ష్మాంబ తులితాంబ
కడుపార నేయన్నఁ గన్నతల్లి

ఆ॥ (శ్రీ) పదాంతరోప జీవితా నారాయ
ణాహ్వుఁడేయుదారు నన్నగారు
హర్షమూర్తి నమ్మహామహు మాతండ్రి
హనుమదాఖ్యు సంస్తవన మొనర్తు!

ఆ॥ కన్నతండ్రియయ్యెఁ గరుణాబ్ధి నామన్నఁ
గలలఁ బెన్చె బోధ ఘటనఁ దేర్చె
నట్టె ప్రఃరు లక్ష్మనరాంబికేశ్వరు గురు
నలవి యగునె పొగడ హనుమదార్యు.

కం॥ తులనా విరహితు విద్యా
నిలయుం గారుణ్యమూర్తి నిర్మలు మన్నా
తులుంనిం బ్రథమాచార్యునిఁ
దలతున్ లక్ష్మీనృసింహుఁ దనరు బ్రవర్తిన్

....శ్రీరామకథాఽమృతము

ఈ మహాకవి యాత్రేయస గోత్రుఁడు. దత్తదేవుడు స్వీయుఁడు. ఆ వంశమున రామభట్టారకుడని చతుర్దశవిద్యా ప్రవీణుఁడు గోదావరీ తీరము నుండి కృష్ణాతీరమందలి మునిపల్లె యను గ్రామమునకు వచ్చెనని వాడుకకలదు. తరువాత సింగభట్టను మహితుడు ఆరుశాస్త్రములు, మూడు వేదములు చదివి, చదివించి కీర్తినొందెను. వారికి సుబ్రహ్మణ్యావధాని యన జనించెను. ఆయన కుమారుఁడు బుచ్చయాఖ్యుఁడన శాస్త్రజ్ఞుడు. వాని భార్య యక్కలక్ష్మాంబ. ఆ దంపతులకు హనుమదార్యుఁడన జనించెను. వాని యన్న లక్ష్మీనారాయణుఁడు. ఆ హనుమదార్యుని భార్య లక్ష్మాంబ. వారి కుమారు లిరువురు. శ్రీ వేంకటప్పయ్యశాస్త్రి, శ్రీ సీతారామావధాని యనువారు. బాలాత్రిపురసుందరి యను నొక పుత్రికయుఁ గలదు. ఈ సీతారామావధానిని పెదతండ్రి యగు లక్ష్మీనారాయణుడు పెంచుకొనెను. ఆయనకుఁ బుత్ర పుత్రికా సంతానము కలదు. అందు ప్రసిద్ధుడగు సాంబమూర్తిశాస్త్రి మహాపండితుడు, మహాకవి యని ప్రథితి నొంది ముందుగానే కీర్తిశేషుఁడయ్యెను. ఇఁకఁ బ్రస్తుతుఁడగు వేంకటప్పయ్యశాస్త్రికిఁ బత్నియగు హనుమాంబ యందు ముప్వురు పుత్రులు, పుత్రిక లైదుగురు వొడమిరి. 1. రాఘవనారాయణశాస్త్రి. ఈయన పత్ని శ్రీదేవి. పార్వతి యని తలిదండ్రులు పెట్టిన పేరు. వీరి పుత్రుడు లక్ష్మీనారాయణశాస్త్రి. పది పదారేండ్లలో విజ్ఞుడనిపించుకొని కీర్తి నిలుపుకొని చనియెను. కూతురు శ్రీలక్ష్మి యన చెరువు శేషయ్యశాస్త్రి పత్నియై సత్య

నారాయణశాస్త్రి యను కొడుకును గని గౌరి యయ్యెను. వాని భార్య లక్ష్మి. వారు పుత్రవంతులు,

ఇక రెండవవారు హనుమచ్ఛాస్త్రి. ఈయన చదువుసంధ్యలలో నారితేరి 20 సంవత్సరములకే స్వర్గతుడయ్యెను.

మూడవవారు బాలకోటీశ్వరశాస్త్రి. ఈయనకు ముగ్గురు కొడుకులు, నల్వురు కూతుండ్రు కలరు. 1. లక్ష్మీధరశాస్త్రి, పత్ని రుక్మిణి. పుత్రవంతులు. 2. హరదత్తశాస్త్రి, పత్ని ఆదిలక్ష్మి కామేశ్వరి. 3. గురుదత్తశాస్త్రి. పత్ని శారద. ఇఁక కూతులు 1. సుశీల, పతి జానకిరామశర్మ. 2. లలిత; పతి ధూళిపాళ రామరాయ. 3. అనసూయ; పతి మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి. 4. ప్రియంవద; పతి చెందుకూరి చినహనుమద్ఘనాపాఠి.

ఇది యోాన వంశము. ఇఁక విద్యావంశము.

ఈ వేంకటప్పయ్యశాస్త్రిగారు చిన్నతనమున నుపనీతుఁడై వ్రాయ చదువ నేర్చి యూరక తిరుగుచుండ నప్పటికాలమున చందోలులో పోష్టుమాష్టరుగా నున్న కొలచిన యజ్ఞనారాయణశాస్త్రిగారు దీక్షాపరులు; కల్యాణానంద నాథులని వారి దీక్షానామము. ఈ మహాసిద్ధ పురుషుఁడు వీరి తండ్రితో చెప్పి, తనవద్దకు రప్పించుకొని, ఒకనాడు శివపూజకుఁ దుమ్మిపూలు తెచ్చిపెట్టుమని చిన్నపూల పాత్రము నిచ్చి, ఒక్కొక్క పూవున కొక్కొక్కపరి ఓం నమశ్శివాయ యని యుచ్చరించుచు పూలు కోయుమని పంపిరి. అంతతో నాటలుమాని ప్రతిదినము పూలు తెచ్చి యిచ్చుటయేగాక ఆ మహాత్ముని వీడలేక వెంటనంటి యుండ నా మహాత్ముడు తన మంత్రగ్రంథములు శిథిలమైనవని, వీరిచేత తాను చెప్పుచు వ్రాయించుచు, ఒక్కొక్క మంత్రము, మహిమము చెప్పుచు, కాలామృతాది గ్రంథముల చెప్పుచు, నింతలో వారు చందోలునుండి బందరు పోవుచు

వెంటపంపవచ్చిన శిష్యునిఁగని, ఒకసారి బందరు రమ్ము, నీకు దీక్ష నిచ్చెదనని చెప్పి, యంతలో తమకు స్ఫురించిన భావిగతిఁ దలంచి, బిడ్డా! నేను నీకు దీక్ష నీనక్కఱలేదు. పరాశక్తి నిన్ను స్వయముగా ననుగ్రహించెద ననుచున్నది. నీవు కృతార్థుఁడవు. నన్ను మరువకుమని దీవించి పోయిరి.

అప్పుడు చదువుకొనవలెనని వీరికి బుద్ధి పుట్టినది. దూరదేశ మేగుటకు తలిదండ్రులు లొప్పలేదు. వివాహ మయినది. గృహిణి కాపురమునకు వచ్చు దినములు. ఈ పరిస్థితులలో చందవోలునకు పరిసరమందు నున్న పొన్నూరు గ్రామము నందున్న పాతూరి కోటయ్యశాస్త్రిగారి వద్దకుపోయి పరిస్థితులు చెప్పగా నిప్పుడింక నీకేమి చదువు వచ్చును అని వీరి తీవ్రత గుర్తించి, రఘువంశము చతుర్థసర్గము ప్రారంభించి చెప్పుచుండ నొక నాడు గురువుగారు బజారులో చెప్పవలసిన సంస్కృత కాశీఖండము పురాణము వారికి నాశౌచము వచ్చినదని చాలింపనెంచిన శ్రోతల నిర్బంధము ననుసరించి గురువుగారి సెలవు తీసికొని ఈ శిష్యుఁడు చెప్పెను. శ్రోతలట్లుండ శ్రీగురువే వారి మెచ్చుకొని వెంటనే కుమారసంభవము పంచమ సర్గము నారంభించిరి. అది పూర్తికాకమందే సంస్కృతమున కవిత్వము ప్రారంభించి గురుస్తుతి శతశ్లోకి వ్రాసిరి. గురుని సంతస మింతింత యన రాని దయ్యెను. అప్పుడా గురువు శిష్యునకు వైయాకరణసిద్ధాంత కౌముది నుపదేశించి నేను ప్రస్తుతము కాశీకి పోవుచున్నాను. నీ వెక్కడనైన చదివిన సరే, అట్టి సందర్భము కుదురకున్నను వ్యాకరణశాస్త్రమున నీకన్ని గ్రంథములు సమన్వయించు నన్ను తలఁచుకొని చదువుకొనుమని దీవించి పోయిరి. ఆ శాస్త్రమాయాచార్యు నాశీస్సుతోనే స్వాధీనమైనది.

తరువాత కృష్ణాతీరమున కశ్శేపల్లి యను గ్రామమున నున్న అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారికి తర్కము చదువుకొన మీవద్దకు వచ్చెదనని వీరు గీర్వాణభాషలో వ్రాసిన లేఖ వారి శిష్యుల కర్థము కాకపోయిన,

వారు పర్యాలోచించి చెప్పవలసివచ్చినది. తరువాత దర్శనము చేసికొనిన యీ శిష్యుని మెచ్చుకొని 45 రోజులు మాత్రమే వారు తర్కము పాఠము చెప్పి, భాష నీస్వాధీనములో నున్నది. నీవు తీవ్రప్రజ్ఞుఁడవు. ఈ శాస్త్రము నీకన్వయించును. చూచుకొనుమని చెప్పిపుచ్చిరి. ఆ శాస్త్ర మా విధమున కైవసమైనది.

పిదప శ్రీ కోట నరసింహశాస్త్రిగారు అను నాచార్యునివద్ద శాంకర శారీరక మీమాంసాభాష్యము శాంతిచేయుచుండ నా మహాత్ముడు-నాకన్న నీయందే శంకరానుగ్రహము కలదు. నేను దేశించితినను గౌరవముంచి, సంప్రదాయవిశేషము లున్న నేను చెప్పెదను, నీవే భాష్యము ననువదింపు మని సెలవిచ్చిరి.

ఇట్లు వారి విద్యాభ్యాస కాలము 11 మాసములు మాత్రమే యని వాడుక. కొలఁది దినములు తరగా వెంకంరాజుగారు అని అప్పటి కాలములో ప్రసిద్ధుఁడగు కవివరునితో గలసి సంచారము చేసిరి. వారితో కలి యుటవలన కవితాధార పరిశుద్ధమైనది కాన, యాయన కూడ నొక గురువే యని తమ పొత్తములయందు వర్ణించుచుందురు.

ఉభయశాస్త్రంబులని కాక యుపరిశాస్త్ర మింకొకఁడు గూడ నుప దేశమాత్రముననే గ్రహించు తెలివి గలిగియు, గురువుల ననాదరింపమని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగా రడుగ-నాకు ఓనమాలు చెప్పిన దండయ్య పంతులు వద్దనుంచి ఈనాటివరకు నొకయక్షరము చెప్పిన గురువైన వీడక కొలుచుచు వారికెల్ల నిత్యము తర్పణము చేయుచుందును, నా గురుభక్తియే నాకు సర్వము కరతలామలకము చేయగలదు, అని వ్రాక్రుచ్చిరి.

ఇక వీరి జన్మపత్రిక

స్వస్తిశ్రీ విభవనామ సంవత్సర ఆశ్వయుజ శు ౨ లు చిత్తా నక్షత్రయుక్త మకరలగ్నమున జననము. జననకాల కుజమహాదశ.

| | | | |
|---|---|---|---|
| గు | | | |
| కే | | | కుజ |
| ల | | | రా |
| | శ | | రచ బు |

భావనామసం॥ఆశ్వయుజ బ॥౩లు కైలాసము నలంకరించిరి.

వీరు వ్రాసిన గ్రంథములు

సంస్కృతము:- 1. శ్రీశైలతీర్థసారము. 2. హరిశ్చంద్ర సుకృత కావ్యము 3. గురుస్తుతి 4. అంబాసహస్రము.

తెనుఁగు :- 1. శ్రీరామకథామృతము 24 వేలు పద్దెములు. వాల్మీక కథావృత్తము అధ్యాత్మతత్వము విడువక వ్రాయబడెను.

2. శ్రీకృష్ణ విలాసము 3. శ్రీ కాకాని మల్లీశ్వర మాహాత్మ్యము 4. భద్రాయురుపాఖ్యానము (నాటకము) 5. త్రిశంకుస్వర్గము (నాటకము) 6. శ్రీ శంకరవిజయ కథాసార సంగ్రహ స్తోత్రము 7. చలపాదులత 8. మందగ్రహ నిగ్రహము 9. ప్రహ్లాదసుహ్లాదము 10. సీమంతినీ చరిత్రము 11. తుకారామ్ ప్రవృత్తి 12. సావిత్రీ చరిత్రము 13. పుష్ప మంజరి 14. వాస్తుసర్వస్వము* 15. స్మృతి సమాహృతి* 16. ప్రాస్తావిక పద్య గద్యాణములు. ఇంతవరకు నా యెరిఁగినవి. 17. బాలకోటీశ్వర

* ఇవి రెండును కనపించుటలేదు. 13, 14, 15, 16 ఇవి హరికథలు; గేయములు.

శతకము 18. హోమ దుర్గాంబశతకము 19. శ్రీ వేంకటేశ్వర త్రిశతి 20. కావ్యకన్యాతారావళి.

వీరు నలుబదిసంవత్సరములు సంస్కృతపాఠశాల సాగించిరి. పదిపదియేగురు విద్యార్థులకు నిత్యము తమ యింటిలో భోజనము పెట్టి చదువులు చెప్పుచు తమ జీవితమెల్ల సార్థకమొనరించుకొని, షుమారు 400 లకు తక్కువ లేకుండ వారివలనఁ గవితయందును, శాస్త్రముల యందును, పురాణ ధోరణుల యందును, పండితులైన విద్యార్థులే సచేతన ధ్వజములై వారి కీర్తి స్ఫూర్తికి నిమిత్తమైరి. వీరికిఁ బూర్వప్రారబ్ధమునఁ గడుపులో శూలనొప్పి కలదు. దానికి నోర్చుకొనుచు నొకచేతితోఁ గడుపుపట్టుకొని రేయుఁబవళులు విద్యార్థులకు విసువులేకుండ విద్యాదానము చేయుచుండెడివారు. మొదట శివాలయమున బాలురకు పాఠములు చెప్పుచుండెడివారు. తరువాత విడుప్రోలు వాస్తవ్యులు పాములపాటి సుబ్బారాయుడు చౌదరిగారి ప్రేరణతో నొక పాఠశాల కట్టించి యందు శంకర విద్యాశాల అను పేరితో కొంతకాలము ప్రచారము చేసిరి. దానితో గొన్ని అప్పులయి ఆస్తియంతయు బోయినను వారి యుద్యమము చాలింపక చుట్టుప్రక్కల రైతుల సహాయముతో వారి జీవితాంతము నా సంస్థనెర వేర్చుచుండిరి. సర్కారు వల్ల గ్రాంటు ఇప్పింబెదమని యా దినములలో శ్రీ చాపలి సూర్యప్రకాశరాయాదు లుద్యోగులు వారి వెంట తిరిగెడువారు. రికార్డు చంకన పెట్టుకొని మీ యందఱ చుట్టు త్రిప్పవలెననియా మీ కోరిక? నా కట్టి ధనములు, హోదాలు అక్కర లేదనెడివారు. ఒక పర్యాయము త్రోవన పోవుచు పెదపమిడి జమిందారు వారి పాఠము చెప్పు పద్ధతికి నావర్జితుఁడై ఒకనాడు పవలు రాత్రియు వారింట భోజనము చేసి, మరునాడు ప్రయాణమై పోవుచు వారితో— అయ్యా! నేను పెదపమడి జమిందారును. 60 ఊళ్లు నాక్రింద కలవు. నేను బంధుగులఁ జూడఁబోవుచు మీ పాఠకశక్తి నన్నాకర్షింప నిచ్చట నిన్న నుంటిని. నాకు చాల సంత

సముగా నున్నది. మీ రొకసారి మా సంస్థానమునకు వచ్చిన, మీ పాఠశాలకు కొంత సాయము చేసెదనని సవినయముగఁ జెప్పెను. దానికి వారు కినిసి ఈ దొంగధర్మము నిన్నెవరు చేయుమనిరి? అట్టి ధనము మాకక్కర లేదనిరి. జమీందారుగారు అయ్యా! నాది యెట్లు దొంగధర్మమో నాకు తెలియుటలేదు. మీరు చెప్పిన తెలిసికొని మార్చుకొందు ననిరి. అదివిని శాస్త్రిగారు- నీవు 60 ఊళ్ళు ఏలువాడవు. నీ గ్రామములో నాలుగుచోట్ల నాలుగు పాఠశాలలు పెట్టి నీ పరిసరముల బాలుర నిర్బంధించి చదివించి నచో నీ సంస్థానమెల్ల విద్యామయ మయ్యెడిది. చాలమంది పండితులకు వృత్తి కల్పిత మయ్యెడిది. అట్లు చేయక నాబోటి సామాన్యుఁ డెట్లో నిర్వహించు నీ పాఠశాల కేదియో యిచ్చి నేను చందోలు పాఠశాలకు ధర్మము చేసితినని చంకలు గొట్టుకొన నెంచితివి. ఇది మంచి ధర్మమెట్ల గును? అనిరి. జమిందారుగారు అయ్యా! నాది దొంగధర్మమని యిప్పుడు తెలిసినది. మీ హితోపదేశము ననుసరింప యత్నించెదను. అది యట్లు లుంచుడు. మీరు మాత్రము తప్పక మా సంస్థానమున కొకసారి రావలయు ననిరి. శాస్త్రిగారు- మీ పాఠశాలల వ్యాపృతినిబట్టి యట్టి సమయములో నది చూచి యానందించుటకు వచ్చెదను కాని మీ ధనముకోసము రానని వారిని పంపివైచిరి.

ఇట్లే వారు ధనమును లెక్కచేయక ధర్మప్రధానముగ నడిచెడి వారు. తమకు మిత్రులగు రైతుల వల్ల స్వతంత్రముగ నడిగి తెచ్చి విద్యార్థులఁ బోషించెడివారు. అవసరమని పిలిచిన సభలకు నరిగి సనాతన ధర్మవిషయమున నుపన్యసించుచుండెడివారు. అప్పటి కాలములో ప్రసిద్ధులవు తిరుపతి వేంకటేశ్వరకవులు మొదలవు వారు వారి నొక దైవతముగ జూచుచుండిరి. దీని కొక కథ—

నూజివీడు సంస్థానమున నొకప్పుడు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు వింక కొందరు ప్రముఖులుంఉ నా సభలో శ్రీ రాజాగారు ఇప్పుడు

మన యాంధ్రదేశములో నున్న కవులలో ప్రథమగణ్యు లెవరని ప్రశ్నించిరి. దానికి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు నా గొంతులో నూపిరియుండగా నాంధ్రదేశమున నాకన్న మిన్న కవి యనిన నేనెట్టు లొప్పుకొందును? నేనే ప్రప్రథమకవి ననిరి. అప్పుడు చందవోలు శాస్త్రిగారు వారి త్రిశంకు స్వర్గమను పొత్తము నాసభలో చదువుచుండిరి. వారి కవితా పరిపాటిని మెచ్చుచున్న రాజాగారు వెంకటప్పశాస్త్రిగారో? అని ప్రశ్నించిరి. చెళ్ళపిళ్ళ శాస్త్రిగారు తాదేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు మహర్షియని సమాధానము చెప్పిరి. దానికి నెల్లరు నామోదించి వేంకటశాస్త్రిగారి వివేకశక్తిని గొనియాడిరి.

ఒక సమయమున గుంటూరులో నొక సభలో వచ్చిన కవిత్వ ప్రసక్తిని గూర్చి వారి యభిప్రాయము —

చ॥ పొలుతులు శేవునీకు రసపుష్టి యెఱుఁగరు లోకులిమ్మోడం
గలిమికిఁ గాన్క వెట్టుదురు కాలము జూచ్చము
భోజరుద్ర కృ
ష్ణులు కలిధాకకుం దలఁగి చూపున కబ్బదు నీదు
ముద్దు మొ
లకలు వనిఁగాయు వెన్నెలలుగా నొగిలించెదుఁ
గావ్యకన్యకా!

ఉ॥ కొందఱు పిల్చియే ముదుకగుడ్డయొ కూడొ
యొసంగి ప్రోతుమం
చందురు వారి భాగ్యమది యట్టిద యేమనవచ్చు నింక నీ

యందము చందముం దఱచి పోవని శేషము
తీర్పరించి యే
లందగు నాథుఁడేర్పడుఁ? కలా లలితాత్మిక! కావ్యకన్యకా!

చం॥ శివునకొ? రామకృష్ణులకొ? శీలము నెక్కొన
నిన్ను భక్తి నీ
భవమున కెట్టులేనిడఁగ భారము వాయునటన్న నీ యెడన్
నవనవమౌ వికాసము గనంబడ నొందెడవార
లుండ మా
యపమతి యేమనంగ నగునమ్మ దయావతి!
కావ్య కన్యకా!

అని యిట్లే మఱికొన్ని పద్యము లాశుకవితలో నొడివిరి.

ఒకప్పు డొక క్రమపాఠిగారు వారి కవిత్వము నెఱుగక ఈ భట్రాజు కవిత్వముల కేమిలే యనిరి. దానికి వారు వెంటనే—

గీ॥ సర్వదోచ్ఛిష్ట పంకసంచయమన మైన
కూపమండూకమున కెట్లు కోరవచ్చు?
భట్టరాజాంక వేంకటప్పయ కవీంద్ర
వాగ్ఝరీ జృంభణ విలాసవైభవంబు.

ఉ॥ పంచిన వేడ్కనీ నొసటఁ
బాటయె వ్రాసె విరించియైన నీ
తింబురుడించి మూలమని
తీరుగఁ జూచినఁ జూడ నీకయు

ట్లంబరమూడ గంతులిడె
దంగములం గనశ్శే నీదు రా
స్యంబెవఁడింక గన్గొనున
శక్తత కూలెదు ఛాందసత్వమా!

మ॥ చయనంబుత్తది సోమమారడి విశిష్టంబైన యాధానమే
బయలెక్కెంగద వైశ్వదేవమయినం బాడాయె
నేనాఁడో సం
చయనం బీవొనరించి నంతటనె శిష్టత్వంబు చేకూరెనే!
పయినం గ్రేజొక డెక్కెడాయెనకటా! యోప్రాధ్యాయ
చాదస్తమా!

ఈ మూడు పద్దెములు నాటవులో చదివిరి. ఇట్టివియే అనేకములు వారి చరిత్రములు కలవు. వారివలన చరిత్రములలో పేరు నొందిన చందోలు పురము నేడు మిక్కిలి ఖ్యాతివహించినది. దినమునకు 12000 పంచాక్షరీజపము చేయకుండ పండుకొనెడివారుకారు. అఖండ శివపూజా దురంధరులు. జపమాల ఎల్లవేళ తిరుగుచు నుండెడిది. ఉపన్యాసమయమున మాత్రమది తూష్ణీంభావము వహించును. అది యాగగనే యిది సాగుచుండెడిది; విద్యార్థుల పాఠములో, పంచాక్షరజపమో, ఉపన్యాసములో, కవిత్వమో తప్ప మరియొక పనికి నవకాశము లేదు. వారిరోజులలో నెలకు పదిబస్తాల ధాన్యము దంపించుచుండెడివారు. విద్యార్థులు, ఇంటిలోవారు, వచ్చుచు పోవుచుండు నతిథులు, బంధుగులు గాక గ్రామములో నుద్యోగమునకు వచ్చినవారు కూడ వసతి కుదురువరకు నిక్కడనే యుండి వసతి కుదిరినప్పుడు చెప్పిపోవుచుండెడివారు. వారు సంచారము చేయు గ్రామములలో బీదవారలకు ధనసహాయము చేసెదనని తీసి

కొనివచ్చి వారలకెల్ల భోజనము పెట్టి వారిపని నెరవేర్చి ధర్మముగ పంపు చుండెడివారు. అట్టివార లేమైన నిచ్చెదమన్న ముట్టెడివారు కారు. అవసర మని వచ్చు శిష్యులకు వేదమంత్రములుగాని ఆగమమంత్రములుగాని పురాణమంత్రములుగాని వారివారి యధికారమునుబట్టి యుపదేశించుచుం దురు. కాని యొకకాసియు వారివల్ల గ్రహించువారు కారు. ఇంతకు మూల మాతల్లి హనుమాంబ. విసుకులేకుండ వండి వడ్డించెడిది. ఆమెకు కోడలు, ఆడుబిడ్డ తోడుగ నుండెడివారు. ఆమె చేయి యెప్పుడు నన్నములోనె యుండెడిది.

వీరు తిర్పతి వేంకటేశ్వరులకన్న ముందుగా నవధానము లొనర్చు టయు నదివిని వీరి గురువులగు శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారు నీ సరసకవిత్వము చెడునుగాన నాకెఱుగరాకుండ నీవెప్పుడు నవధానము చేయవలదని వారించిరి. ఈ విధమున నఱువది వత్సరములు విద్యార్థుల విద్వత్తములఁ జేయుచు, సంస్కృతాంధ్ర గ్రంథరచనల దేశమునలంక రించుచు, నుపన్యాసవిధి ధర్మ ప్రచారము సేయుచు, నఖండ దేవీదేవారాధ నములఁ బ్రొద్దుపుచ్చుచు గొన్ని సాంసారికములగు చిక్కులున్నను విద్యా నంద బ్రహ్మానందములతో దమ యాయువును సార్థకమొనర్చికొనిరి.

చివరిదినములలో తాము వ్రాసిన శ్రీరామకథాఽమృతము అను గ్రంథము నచ్చువేయింపఁబూని 20-00 లు చందా యిచ్చినవారికి అయిదు వాల్యూములు పొత్తము లిచ్చెదమని కొంత ద్రవ్యము సంపాదించి బాల కాండము 2000 ప్రతులు వేయించుట కదియెల్ల వ్యయముకాగా క్రొత్త చందాలతో మిగిలిన గ్రంథమును పూర్తిచేయనెంచి అయోధ్యాకాండము 17 ఫారములు ముద్రించుసరికి నతిసారరోగముతో బాధితులగుచు ముగ్గురు వైద్యులు వైద్యము చేయుచుండ వైద్యత్రయి యేమనుచున్నదని తమ కుమారు నడిగి వానివలన విధిప్రాతికూల్యము నెఱిఁగికొని సర్వజ్ఞులు గాన చింతించి యేమి ప్రయోజనమని పై గ్రంథము నచ్చువేయించి చందాదారు

లకు నీవు స్వయముగా నిమ్ము. అట్లయిన వారితో నా చెప్పిన మాట లసత్యము కాకుండును అని కొమరునకుఁ జెప్ప నతఁడు 12000లు ఋణ ములు కలవు, కుటుంబపోషణము చేయవలెఁ గదా! ద్రవ్యసాధ్యమవు నీపనిగూడ నేనెట్లు చేయగలనన నా తదనంతరము నాకు నీచేయు నౌర్ధ్వ దైహికము కొఱకైన వ్యయము చాలించి ఆ ధనము పెట్టి ప్రస్తుతము సాగుచున్న అయోధ్యాకాండ ముద్రణము నెరవేర్చి చందాదారుల కిమ్ము. నాకు కొంత బాకీ తీరగలదనిరి.

ఆ మహాగురుని మాటనుబట్టి కార్యము నావశ్యకత గమనించి కుమారుడు వారికి నమస్కరించి నాకు నప్పగించి పోవుచుంటిరి గాన మీకా ఋణము బాధకముగాదు. నేను రెండేండ్లు బ్రదికిన మీ శ్రీరామ కథాఽమృతము పట్టాభిషేకాంతము నచ్చొత్తించి చందాదారుల బాకీ తీర్చె దను, మీరు సంతసింపుడు అని చెప్ప నాయన సంతసించి ఉత్తరకాండ ములో షుమారు 1500 పద్యములు వ్రాసితిని. ఇక 6000 పద్యములు వ్రాయవలసియున్నది. అవికూడ నీవేవ్రాసి పూర్తిచేయుము అని వాక్రుచ్చి తరువాత రెండుదినములకే అనగా భావసంవత్సర ఆశ్వయుజ బ ౩ లు నాడు భౌతికశరీరము వదలి యుపాస్యస్వరూపులైరి. ఇది శ్రీ వేంక టప్పయ్యశాస్త్రిగారి సంగ్రహ చరిత్రము. విశేషించి వ్రాయవలెనన్న నెంతయేని కాలము పట్టును.

తదనంతరము వారి కుమారుడు శ్రీ రాఘవనారాయణశాస్త్రి వారితో చెప్పినట్లు చేయవలసిన భారముతో మొదల ముద్రాశాల కధిపతియవు మ. రా. శ్రీ పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరి, నిడుబ్రోలు గ్రామ వాస్తవ్యు నాదరము నెనసి ఎట్లెట్లో అయోధ్యాకాండము పూర్తిగా ముద్రిం పించి చందాదారుల కిచ్చెను.

సదరు చౌదరిగారు విశాలహృదయులు. తమ పితతండ్రికి వేంక

టప్పయశాస్త్రిగారికిగల స్నేహసంబంధమును, తమకు దగ్గర గ్రామమున నున్న కవికావ్యము ప్రసిద్ధికి వచ్చుట ముఖ్యమని సరసులగుట మొదటనే చాలతక్కువ రేటుతో నొప్పుకొని వారి తదనంతరము వీరు పూర్తిచేయ వలసినందులకు మిక్కిలి సహాయముచేసి కీర్తిని, పుణ్యమును సేక రించిరి.

గుంటూరు వాస్తవ్యులు శ్రీ మ. రా. శ్రీ గోవిందరాజుల సత్య నారాయణ, వీరు వకీలు, లక్ష్మీనరసింహారావుగారు డాక్టరు - వీరు సోద రులు, వీరి తల్లి శ్యామలాంబ యోగిని, తండ్రి భాగ్యవంతుడు. ఈ కుటుం బము శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారిపై భక్తితో వారి కుమారుని పిలిపించి వాని స్థితిగతుల విమర్శించి మూడేండ్లు గుంటూరులో తత్కుటుంబము నునిచి కోమటిబజారున నొక పురాణము కుదిర్చి, యీ పురాణముతో కుటుంబ పోషణము చేసికొనుమనియు మేము కొన్ని చందాలు వేయించె దము, వానితో తండ్రిగారి గ్రంథము పూర్తిగా నచ్చొత్తింపుమని మీ యాస్తితో వెనుకటి బాకీలు తీర్చుకొనుమనియు తగినంత సహాయము చేసిరి. వారి యండతో నీ పనులెల్ల నెరవేర్చుకొని మూడేండ్లు తెనాలిలో నుండి తరువాత మరల చందోలు చేరి యథాయథముగ నుండెను.

శ్రీ రాఘవనారాయణశాస్త్రి స్వస్తి శ్రీ దుర్ముఖినామ సం॥ర శ్రావణ బ ౨ లు మంగళవారము రాత్రి వృషభలగ్నమున జన్మించెను. జన్మస్థానము గుంటూరునకు మూడుమైళ్ళలో నున్న గోరంట్ల. అది మాతా మహస్థానము. మాతామహుఁడు అన్నంభొట్ల వేంకటప్పయ్యగారు. మాతా మహి వెంకటసుబ్బమ్మగారు. వీరికి పురుష సంతతిలేక మఱదలి కొడు కును బెంచుకొనిరి. ఆయన వేంకటరామయ్య మేనమామ. వాని భార్య ఈ శాస్త్రిగారి పినతల్లి కూతురు. త్రిపురసుందరి. వీరికి సంతానము కల్గి నష్టమౌటచే నతని యన్న మనుమని బెంచుకొనిరి.

### శాస్త్రిగారి జాతకచక్రము

| | | | |
|---|---|---|---|
| చ | | ల<br>కు | |
| రా | రాశి<br>ఉత్తరాభాద్ర | | గ |
| | | | ర బు<br>శు కే |
| | | శ | |

శని దశాశేషము షుమారు 10 సంవత్సరములు.

ఈ జాతకుడు 6 వ సంవత్సరమున బజారులో నొకడుపన్యసించు చుండుటను జూచి యింటికి వచ్చి దొడ్డిలో నున్న పేకుమాలముల మీద నెక్కి పై యుపన్యాసము ననుకరించుచు కాలుజారిపడి తద్వారముగ రుగ్ణుడై ఒక సంవత్సరము జీవిత సంశయమున నుండెను.

తరువాత మూడు సంవత్సరములు బడిచదువులో కాలము గడిచెను, నాల్గవ తరగతి చదువుచుండ నొక పరీక్షపంతులు తుందిలుఁడు వచ్చి, కుర్చీ వేయగా గబుక్కున కూర్చుండెను. వాని బరువును భరింపలేక అది విరిగెను. దానికి నీ జాతకుడు నవ్వెనని యాయన పరీక్షఁ దప్పించినాడు. తరువాత పదియవనేట నుపనయనము జరిగినది. అయిదుగు రాడుపిల్లలలో నొకఁడే పుంస్పుత్రు డగుటవలన తలిదండ్రులు గారాబముగఁ బెంచిరి. సంవత్సరము రుగ్ణుడని తండ్రిపై గౌరవమున మ. రా. శ్రీ మాచిరాజు దండయ్య పంతులుగారు గారాబముగా మిఠాయి కొనిపెట్టుచు చదువు చెప్పెను. ఉపనయనమైన తర్వాత ప్రైవేటుగా నాంగ్లభాష చదువుమని పై పంతులుగారి అన్నకొడుకు సాంబయ్యవద్ద నప్పగింపబడెను. కాని యా చదువుమీద నిష్టములేక సంవత్సరము వ్యర్థముగాఁ బుచ్చెను.

అప్పుడు యడ్వర్డు పట్టాభిషేకము. ఆ సమయమున వానలు మెండయి పంటలు పైరులు కొట్టుకొనిపోయెను. ఆ యుద్రేకముతో-యడ్వర్డు చక్రవర్తి ముండ చక్రవర్తి- అని కొన్ని పద్యములు వ్రాసెను. అది సహజమవు కవిత్వము.

ఉపనయనము నాటినుండి సంధ్య నేమరక రెండు పూటల నగ్ని కార్యము నొనర్చుచు నొంటినిండ రుద్రాక్షలపేరులు, నతిశయితమవు భస్మ ధారణము చూచువారలకు నడవిమానిసివలె బైరాగివలె కన్పట్టెడివాడు. తరువాత తండ్రి చదువుట లేదని శిక్షింప నానాదేశముల నుండి వచ్చిన విద్యార్థులు మీ వద్ద పండితులై పోయి గౌరవ మందుచుండ నాకీ యాంగ్ల విద్య యేల? ఇది నేను చదువను. వేదముగాని శాస్త్రముగాని చెప్పిన చదివెద ననెను. అప్పుడు తండ్రిగారు కావ్యారంభము చేసి చెప్పుచుండ కావ్యనాటకాలంకారము లభ్యసించుచుండెను. ఈ లో తాడికొండ కేదార లింగముగారు పై దండయ్యపంతులుగారి యల్లుడు ఉపాసకుండు తండ్రి గారి యనుమతితో పన్నెండవయేట బాలామంత్రము నితని కుపదేశించెను. అప్పటినుండి పదియారవ వర్షము దాక బ్రహ్మచర్య వ్రతముతో చదువును గూడ మెచ్చక అధికముగా నమ్మంత్రరాజము జపించుచుండెను. రఘు వంశము పాఠము మొదలు ములుగు వీరభద్రయ్యశాస్త్రి యను పితృసఖ పుత్రుడు సహపాఠిఅయ్యెను. ఆ ఘన చాల గురుభక్తుఁడు, మైత్రీపాత్రుఁడు. వాని ప్రేరణతో నప్పుడు దేశములో జరుగుచున్న తిరుపతి వేంకటేశ్వరుల యవధాన ప్రచారమును బట్టి మనము మాత్ర మవధాన మేల చేయరాదు అని విద్యార్థుల కూర్చుండబెట్టుకొని పదియేనవునేట చాటుగ నర్థశతావధాన మాచరించెను. అది వాటముగా కుదిరినది.

ఆ కాలమున నిజాంపట్నములో కోట రామకృష్ణశాస్త్రియను బంధువుడు లక్ష పత్రిపూజ చేయుచు నాహ్వానించిన సహపాఠులతో నచ్చ టికి పోయి వారి కోరికఁ దీర్ప నచ్చట అష్టావధానము నొనర్చెను.

అప్పుడు వేమవరాగ్రహారమునఁ దిర్పతి వేంకటేశ్వరులు శతావధానము చేయుచుండ, అవధానానంతరము కవులెల్ల పద్దెములు చదువుచుండ నీ బాలుండును —

శ్లో॥ విపధిస్సశేష ఉదితః పరస్మై
రభివాదితః కపటవాన్విషణః
కవిరస్త్వయం దనుజబంధు రహో
సకణాద ఏవ నుతిసూం స్తదపి॥

శ్లో॥ వ్యాకృతి ప్రముఖశాస్త్ర వినీతౌ
తౌ విషాద్రి రహితౌ కవిహీరా
శేడ పూర్వ్య విషపూర్వవతాం య
స్యాంశజౌ నహి మహిః పరమేతత్॥

అనిచదివెను. వెంటనే వేంకటశాస్త్రిగారు ఈభారవిభట్టెక్కడనుండి వచ్చెననిరి. వీరి తండ్రిగారు మా యబ్బాయి యని చెప్పగా నేమి చదువు చున్నాడనెను భారవి కావ్యమన, నట్లయిన నైషధ కావ్యము చెప్పుము శ్రీ హర్షభట్టగు నని దీవించిరి. తరువాత కొన్ని దినములకు కుమారు డవధానము లొనర్చుచున్నాడని విని వారివద్ద నొకసారి విద్యార్థులను పృచ్ఛకులుగా బెట్టి యష్టావధానము చేయించి, సంతసించి, యభ్యనుజ్ఞ యిచ్చుచుఁ జదరంగము, చీట్లాట స్వయముగ నేర్పిరి.

ఇంతలో పదియారవనేడు వచ్చినది. చిన్ననాటనుండియు పిల్లలతో నాటలాడుటకు నీయన పోయెడివాడు గాడు. ఎప్పుడు నొంటరిగ నుండుట. చదువో, సంధ్యయో, జపమో యభ్యసించుచుండువాడు. అప్పటికి కొంత వైరాగ్యము కుదిరి తల్లికి నమస్కరించి సన్యాసమున కనుజ్ఞ నిమ్మని వేడెను. ఆయమ చాల దుఃఖించెను. ఆ సందర్భము విని

తండ్రిగారు బొడ్డూడని వారికెల్ల వైరాగ్యము, సన్యాసము, అంత తేలికగా నున్నదియా! యని చీవాట్లుపెట్టిరి. ఒకప్పుడు ఊరిబయట నొక్కఁడు పొదలలో మధ్యఁ గూర్చుండియున్న కొడుకునుచూచి తండ్రిగారు నిశ్శబ్దముగా పోయి దగ్గఱకూర్చుండి వృత్తిలయమై లోకమెఱుఁగకున్న వాని విమర్శించి, ఒడలుతెలిసి లేచిపోవుచున్న వాని చేయిబట్టుకొని సన్యాసోద్యమమును సత్యమని నమ్మి, అది మొదలు నిత్యము ధర్మబోధ చేయ మొదలిడిరి.

తక్కినవార లాడుపిల్లలు. నీ వొక్కఁడవే మాకు మగపిల్లవాడవు. నీ వెట్లు సన్యసించిపోనగును! మాకు వంశము నిలువవలదా? నీకుమాత్ర మిది విధియా? ఋణత్రయము తీరినిదే సన్యసించిపోరాదుకదా! యని యనేకవిధముల ధర్మబోధ చేయుచుండెడివారు. ఇట్లుండ నొకనాడు రాత్రి స్వప్నములో పిన్నతల్లివలె నుపాస్యదేవత కనబడి, ఒక పటమునుజూపి దీని నాకిమ్మని యడుగ, నిచ్చుటకే తెచ్చితినని, నీకు గజాంతైశ్వర్యము నిచ్చెదను. త్యాగము నభ్యసింపుము. ప్రత్యక్షసన్యాస మిప్పుడు కాదులే యని యంతర్ధివహించెను.

ఆ మరునాడే బందరు పోవుచున్న తండ్రికి కృష్ణానది రేవులో కుంకుమ భరిణెయు, కాటుకకాయయు దొరకెను. వాని గ్రహించి యానాడు చల్లపల్లిలో నున్న శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిని స్వగురువరుఁ జూడ బోవుటయు నా గురుమూర్తి యీ శిష్యుని సంసారవిషయమై ప్రశ్నించి కొడుకునకు పెండ్లిచేయలేదేమని యడిగి, సంబంధములు వచ్చుచున్నవి ఇంటికి వెళ్ళగానే ఏదియో నొకటి నిశ్చయము చేయవలెనను శిష్యునితో నాకు చెప్పకుండ నీ వట్టి నిశ్చయము చేయకు మనెను. అది యేమన నా వద్ద నా తమ్మునికూతురు పెరుగుచున్నది. దానికి వివాహము చేయవలెను. ఆ సన్నాహమెల్ల నే నొనరించెదనన్న గురునిమాటకు నొడంబడి బందరు పోయివచ్చిరి. ఇంతలో వారి తరపువాడు వచ్చి చూచి నిశ్చయించుకొని

పోయిన తరువాత, కొందఱు విభూతి రుద్రాక్షలు ధరించును, ఈ కాలము వాడుకాదు, వాని కిచ్చుటకన్న ఈ పిల్లకు పెండ్లి చేయకుండుట మంచిది, అని శ్రీ శాస్త్రులవారికి చెప్పుటయు నాయోగి - నేను విభూతి పూసుకొనుట లేదా? నాకు రుద్రాక్షలు లేవా? నా యల్లుడు నాయట్టివా డగుట మరియు మంచిది యని వివాహప్రయత్న మొనరించెను. 19 వ యేట వివాహము జరిగినది. ఇక సన్యాసము పోయినది, సంసారము ప్రారంభ మయినది.

కాని యీ యాటకు తగినవేసము, బాస గ్రహింపవలెనని తండ్రి గారితో చెప్పకుండగనే తెనాలివెళ్ళి శాస్త్రాభ్యాసము చేయవలెనని ప్రయత్నింపగా నచ్చట పాఠశాలలలోఁ జేరియు ననువుపడక విచారించుచు, నీ లోపల శ్రీ పినపాటి మృత్యుంజయ అయ్యవార్ల కొడుకు వీరభద్ర శాస్త్రి తోడుగా నాయనవలన నేత్రావధాన మభ్యసించి అదివర కాయనతో నవధానముచేయు యేలేశ్వరపు పురుషోత్తమశాస్త్రి, రాఘవయ్య అను వారలతో సఖ్యముఁకుదిరి తన కవిత్వాదులు వారి కభ్యసింపఁజేయుచు, వారితో నభ్యసించిన నేత్రావధానమును నిత్యము సభలలో ప్రదర్శించుచు నుద్యోగి ప్రవరులతో పరిచయముకలిగి వారలవల్ల షుమారు 400 సర్టిఫికెట్టుల సంపాదించి అప్పటికి గవర్నరవు పెంట్లెండు అనువాని సఖ్యము సంపాదించి తిరుగుచు నిది శాశ్వతముకాదు. ఈనాటి గౌరవము రేపుండదు. శాస్త్రపఠనమే ముఖ్యమనితోచి వెంటనే తాడికొండ యనుగ్రామమునకుఁ బోయి తన గురువవు కేదారలింగముగారి యింటనుండి తత్పురవాస్తవ్యులవు శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రుల వారిని ప్రదోషానంతరముదర్శింపబోయెను. గురువర్యులకు నమస్కరించిన వెంటనే యాయన శిష్యుని యుదంతము నారసి చదువుకొన వచ్చితినన నిప్పుడే మొదలుపెట్టుమనెను. పుస్తకము కేదారలింగము వారింటివద్ద నున్నది. మీ దర్శనముచేసి యాజ్ఞ తీసికొనుటకు వచ్చితిని. రేపు పాఠము మొదలుపెట్టెదనన నా కారుణ్య

నిధి నా పుస్తకమిచ్చెదను, ఇప్పుడే మొదలుపెట్టుమని వైయాకరణ సిద్ధాన్తకౌముది నొసగి యప్పుడే పాఠము చెప్పిరి. అట్లు నాలుగువత్సరము లా గురుదేవు నాశ్రయించి తాడికొండ గ్రామమున విద్యాభ్యాసము చేయు చుండెను. ఈయన పితృసఖుడవు నాయూరి రెండవకరణము బ॥ వెంకట చలం పంతులుగారు అంతకుముందు శ్రీ శాస్త్రులవారివద్ద కావ్యపాఠ మొనర్చు వంగల వేంకటరామశాస్త్రి ద్వారా వాని తలిదండ్రులు, సుబ్బయ్య శాస్త్రిగారు మొదలైన గృహస్థులు పరిచయమై తమ బిడ్డకన్న నెక్కు-డుగా చూచుచుండ దివ్యముగా నచ్చట విద్యాభ్యాసము కుదిరినది.

శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. వీరు ఆరాధ్యులు. భార ద్వాజస గోత్రము. శ్రీ కుంభఘోరాం శ్రీనివాసశాస్త్రులవారి శిష్యులు. అనేక శాస్త్ర సంప్రదాయములు వారి వల్ల గడించినవారు. నైక గ్రంథ కర్తలు. ఇవియన్నియు నిట్లుండ శ్రీ నీలకంఠభాష్యానుసారం, వ్యాస పథము, బ్రహ్మపథము మొదలవు గ్రంథములు వ్రాసి శివ విశిష్టాద్వైత మును ప్రచారముచేసిన ప్రసిద్ధులు. చాలమంది వారివి ఋషి యని ప్రశం సింతురు. అట్టివారు వీరికి వ్యాకరణశాస్త్రము పాఠము చెప్పుటయకాక వేదాంతశాస్త్రమునఁగూడ పరిచయము కలిగించిరి. శాంకర రామానుజీయ మధ్వ భాష్యములలో నున్న విశేషములు చదివిచెప్పుచు వారి ఫక్కి- విని పించి వ్యాఖ్యానము చేయుచుండెడివారు. వారితో గొన్నిదినములు సంచా రముచేయుచు నెడనెడ శతావధానాష్టావధానములు చేయుచు కేవల విద్యా ప్రసంగముతో కాలము గడిపిరి. అచ్చట వీరికి శ్రీ గురువుగారి మేన యల్లుడు, అల్లుడు నవు శ్రీ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రి సహపాఠిగ నుండెను.

అప్పటి సమయమున వినుకొండ తాలూకాలో సంచారము చేయు చున్న శ్రీశ్రీశ్రీ పుష్పగిరి పీఠాధినాథ శ్రీ చంద్రశేఖర భారతీస్వామివారి

వద్ద నొకసారి యష్టావధానము కావించిరి. వీరిని చూడఁగనే వారు "అహ మేవా క్రమాంతరేణాగతః" అనిరట. అక్కడ విద్వాంసులుగా నున్న వారెల్ల చిన్నతనములోనున్న వీరిని గట్టిగఁ బరీక్షించిరి. అప్పుడు 20 వ సంవత్సరము. ఒక యుదాహరణము.

ఒక విద్వాంసుఁడు కంకంటి పాపరాజుగారి యుత్తరరామాయ ణముఁ బురాణముగా చదువుచు పది కాగితములుతీసి ఒక పద్దెము, మరి యొక బొత్తితీసి అక్కడ నొక పద్దెముగా చదువుచుండఁ బురాణమునకది పద్ధతిగాదని యవధానిగా రనిన నది లెక్కసేయకపోగా శ్రీ స్వామివారు చెప్పినను వినక అవధానమున నిట్లే పరీక్షచేయవలెనని చెప్పెను. దానికి నవధానిగారు చిన్నతనమగుటవలన నతిక్రమించి నీ వవధానముల మొగ మెపుడైన జూచితివా? యనెను. దానికి నా ప్రముఖుడు నే నీ పురాణము చదువనని పుస్తకము విసరిగొట్టెను. అప్పుడు ఇంద్రగంటి శ్రీరాములు గారు అనే ఫారెస్టు ఆఫీసరు, వృద్ధుడ నేను చదువవచ్చునా? యని యడి గెను. అక్షరములు వచ్చినవారెల్ల చదువవచ్చునని యవధాని యనెను. ఆఫీసరుగారు షష్ఠాశ్వాసమున సీతారామ వనవిహారమున వర్ణనము చదువ నారంభించెను. అవధానిగారి కీ తగాదాతో మనసు చికాకయి "వసుధా జంబు లగంబులొట" అను పద్దెము అర్థముకాలేదు. ఇంకొక పర్యాయము చదువుమన అవధానములో నట్లు చదువవచ్చునా? యనిరి. అంత నవధాని గారు తనకు తోచినమాట లర్థముగా నుడివిరి. ఆఫీసరుగారు దీని కిది యేనా యర్థమనిరి. ఇప్పుడు నీ కడుగు నధికారములేదు. అవధానానంతర మడుగుమని యవధానిగా రనిరి. ప్రత్యక్షర నిషేధాక్షరి — మల్లాది ఆంజ నేయశాస్త్రిగారు రెండుమూడక్షరములు నిషేధించుచు, నదియేమనిన నివి కాక మరియొక వర్ణము లేదా? యనిరి. వేదములో నొక ఋక్కు వ్యస్తా క్షరిగా బెట్టి దానిలో నక్కడక్కడ నక్కరముల లోపింపఁజేసి స్వర ములోఁ జెప్పు మనిరి. ఇవ్విధమున నవధానము నెరవేరినది. గంటలుకొట్టు

ఘనుడుగాక శ్రీ స్వామివారు నొక కాగితముమీద గూఢముగా లెక్కవేసి యుంచిరి. అది తెలియక పృచ్ఛకు డది తప్పె ననెను. స్వామివారిలెక్కకు సరిపోయినది. అప్పుడు అవధాని ఆరాగా మ్రోగిన గంటల చెప్పెదమని చెప్పఁ జొచ్చిన నది సరిపోయె ననెను. అది సరిపోతే నిదియు సరిపోవును కూడికరాని వాడవధానిని ప్రశ్నించిన నతడేమిచేయు ననెను.

ఈ విధమున నెనిమిదిరకముల పృచ్ఛకులును నిందేమియులోపము లేదనిరి. అనంతర మాఫీసరుగాడు నా పురాణము మాత్రమే అవధానిగారు చెరచిరనిరి. అవధాని మరల నాపద్దెము చదువు మని పదస్వారస్యములతో గూడ దాని యర్థము నొడివిరి. ఆఫీసరుగారు ఇందాక యిట్లు చెప్పలేదనిరి. అవధాని-ఇందాక చెప్పిన దేదియో మీరు చెప్పిన నిప్పుడు చెప్పినదానికి, దానికి భేదమేమో యాలోచింతు మనిరి. శ్రీ స్వామివారు మెచ్చుకొనుచు సభ ముగించిరి. ప్రొద్దుకుంకుసరికి వీరికి నపరిమితమవు జ్వరము వచ్చి ఒడలు తెలియకుండఁ బోయినది. శ్రీ మల్లాది ఆంజనేయశాస్త్రిగారు చెప్పగా శ్రీ స్వామివారు విభూతి మంత్రించి పంపిరి. అది ధరింపగానే తగ్గిపోయినది మరునాడు స్వామివారు నవ్వుచు దృష్టిమంత్రమైనను రానీ వాడవేమని యాస్థానులకు వచ్చితి వనిరి. గురుస్వామిని దర్శించుటకు మంత్రము లేల ? మందులేటికి నని వీరనిరి. ఇంతలో తొలినాడు పురాణము చాలించిన విద్వాంసుడు వచ్చి ఈయన మంచి సంప్రదాయమువాడని మీరు చాల అభిమానించుచుంటిరి. ఏమి సంప్రదాయము ? వీనికి మీస మేటికి యని యాక్షేపించెను. శ్రీవారు సమాధానింపు మనిరి. అప్పుడు శాస్త్రి :—

సీ॥ ఆపస్పళంబు దివ్యాకృతి వ్యాకృతి
వరియించి మించె సద్గురుని యుక్తి

కష్టభాషా కవితాంగనామణి తనం
తం చేరెం బూర్వజన్మంపుం జెలిమి
నష్టావధాన నేత్రావధాన శతావ
ధాన విధాతృత ధాత గూర్చె
వచ్చును ద్వ్యయః ప్రౌఢిం బాణిగృహీతి
కాపురం బొనరింప రేపొ, మాపొ,

గీ॥ తల్లి దండ్రి సజీవులై తనిలి తనదు
సేమ మారయుచుండి రాశీస్సు లిడుచు
నెన్న నగు ప్రాయమందుంటి నిపుడు గాక
మీాస ముంచెదు సమయంబుమీాద గలదె!

అని నొడువ శ్రీ స్వామివారు "శోభతే చాస్యైవ" అనిరి.

తరువాత ప్రసక్తాను ప్రసక్తంబుగా తామరయను పొదను గూర్చి ప్రసంగము రాగా

గీ॥ బొడ్డుతామరవానికిం బుట్టినాండు
ముడ్డితామరవాండు సహ్యద్వహించె
కేలి తామరదానిం దత్కృతి జగములం
దామరల కేమి! తామరతంపరయ్యె॥

అని శాస్త్రిగారు చెప్ప సదస్సు చమత్కృతమైనది. శ్రీ స్వామివారు ఉభయశ్లేషాలంకారమునకు లక్ష్యముగ నేవిషయమున నైన నొక శ్లోకము చెప్పుమనిరి.

శ్లో॥ యస్యాష్ట భాషా కవితా లతాంగీ
జాయేవ నీతా ప్రణయేన శయ్యాం
మనోహరంతీ ఖలు హావభావైః
కీర్తిం ప్రసూతే భువనాభి వంద్యాం!!

అని వీరు వచించిన స్వామివారు సెజ్జయందు పరివర్తన మొనర్చుచు — స్త్రీ సంతత్యై వాస్యప్రతి ష్ఠేతి స్ఫురతి—అనిరి. వారి సంస్థానమున నుండు మనిన చదువుకొను రోజులలో నిది కుదరదని వారి యాశీస్సులతో ఫల మంత్రాక్షతాదులఁ గొనివచ్చిరి

ఈ విధమున వెల్లటూరు, వేల్పూరు మొదలైన గ్రామముల యందు నవధానము లొనర్చుచు దిరిగిరి. ఇట్లు కాలము వుచ్చుచు నింటికి, జూచిపోరాగా సంసారము బహుఋణములతోఁ బైబడెను. అప్పుపుట్టదు. నిలవ ధాన్యము లేదు. అట్టితరి మూడుదినములు ఉపవసింపవలసివచ్చెను. మూడవ దినమున 27 పర్యాయములు సహస్రనామార్చనము చేసి దేవి మందిరము నొద్ద పండుకొన, కలలో గలగలమని వచ్చి పదియేండ్ల బాల ఓరీ ! ముష్టిపెట్టెదనని ఈయన పైకొంగు జాచఁగా దోసెడు బియ్యము తళుక్కుమనఁ బెట్టినది. బండి వచ్చును దానిపై నేగుము. మేలగుననెను. మెలకువ వచ్చినది. మరికొంతసేపునకు ఖాజీపాలెమునుండి బండి వచ్చి నది. దానిపై నేగ వారు పురాణము గోరిరి. అడుగకుండగనే రాత్రికి పుట్టెడు వడ్లు పంపిరి. అది మొదలు దారిద్ర్యము నెఱుగకుండ నెప్పుడు దైన్యములేని జీవనము నింతదనుక యాదేవి కనిపెట్టియే నడుపుచున్నది.

పై చిక్కుల దినములలో కలలో నొక యుత్తమర్ణుడు బాధింపగా విసువుతో

శా॥ కావ్యశ్రీ ! చనుమూ, త్వదేశరతునిం గామింతు వష్టాపథా
నావ్యాజ ప్రతిభా ! యొనర్తు వెది ? నిర్వ్యాపారుసిం గూడి ది
వ్యవ్యాహార సతీమణీ తొలఁగు మెందైన న్ఖలుండీ ఋణా
ర్ణ వ్యాపారధురీభ్రమిభ్రమరుఁడేనా మిమ్ముఁ బోషించుటల్ !

అను పద్యము చెప్పబడెను. ఆ సమయములో నొక యుద్యోగితో సంబంధము కలిగి ఆయన తన కవిత్వము వినిపించి యడుగగా మీ కవిత్వము చూచిన మీమీద కవిత్వము చెప్పవలె ననిపించుచున్నది, అన నైన చెప్పమని యాయన నొడువగా—

శ్లో॥ విద్యానందిత సత-వీశ హృదయా భోజాది భూమీ భుజః
ప్రాగాసన్నితి విశ్రుతిం కలియుగే శాబ్దాః ప్రతీమః కథం
అప్రామాణ్య మతిస్ఫుటం హ్యుపమితేః కృష్ణార్య ప్రత్యక్షత
స్త్వాం కృత్వాద్య సపక్ష మేతదఖిలం బుద్ధ్వాను మాయామహే !

అని చెప్పిన శ్లోకమును విని యా యుద్యోగి సంతసించి యారసముతో నొకఁడు ప్లయంటు చేయఁబోయిన చందోలు శాస్త్రులవారిమీద ప్లయంటు నీకోర్టులో పట్టము అనెను. ప్లీడరు-పార్టీ నష్టపడునన నా యధికారి అతరు

వాత నేను నష్టపడినను సరే అనెను. తరువాత దేవతానుగ్రహమున స్థిరాస్తి యెల్ల ఖర్చుపెట్టి బాకీలు తీర్చిరి.

తరువాత మనశాస్త్రిగారు తండ్రిగారి గ్రంథముద్రణమునకు పూను కొని యయోధ్య కాండములో గాయత్రి యందలి భవర్ణముతో పద్యము వ్రాయనెంచిన మూడురోజు లొక కందపద్యము కుదురలేదు. దానికి నాశ్చర్యపడి యుపాస్య దేవతా ప్రార్థన మొనర్చి నిద్రించుచుండఁ గలలో నొక బీబీ ఎఱ్ఱని గుడ్డకట్టి, కుంకుమాక్తమవు చొక్కాయి తొడిగి ఒక వేదికమీద పండుకొనెను. ఆమెవద్ద షుమారు ౬౦ ఏడుల యీడు గలిగి పెద్ద బొరయిన గడ్డముగల యొక పురుషుఁడు చొక్కాయి పైకెత్తి పాలు త్రాగుచుండెను. శ్రీ శాస్త్రిగారిది దారినబోవుచు జూచి నిలువనామె యర్ధ నిమీలితాక్షిసమీక్షణమున తృణీకృత బ్రహ్మపురందరాదికమవు విభవమున గాంచుచు నేల నిలచితి వనెను. శాస్త్రిగారు నాకుగూడ కొంచెము పాలిచ్చె దవేమో? అని యడిగెను. అప్పటి యనుభవము నీరీతిగా కలలోనే పద్దెము చెప్పిరి.

చ॥ ఎగఁబడి త్రాగు కావలసె
నేనని త్రాగుచుఁ బాలు లేవు పూఁ
ర్తిగ నొక గ్రుక్కకేనని స
ప్రీతి మొయింగని కందపద్దెము
ల్లగ నవి చాలుపొమ్మని యు
లక్ష్యత కై స్వకవిత్వధార సా
ధ్విఁగఁ బెనుపొందఁ జేసిన స
తిన్ యువనిం దలతుం దదాస్తికిన్॥

ఆ వెంటనే "కం॥ ఛర్మమయ రమ్య హర్మ్యము" లను పద్దెము కుదిరినది. అప్పటినుండి యుత్తరకాండమున రేపు అచ్చునకుఁ గావలసిన పందకుఁ బైగా పద్దెము లీరాత్రి వ్రాయుచు పవలెల్ల ప్రూపులు దిద్దుచు గ్రంథము పూర్తిచేసిరి.

ఒకనాడు వేకువజామున బెజవాడ రైలుదిగి కృష్ణాస్నానమున కేగుచున్న శాస్త్రిగారికి బందరుకాల్వ వంతెనమీద కూర్చున్న యనిరూపణీయమగు నొకవ్యక్తి రమ్మని పిలిచి ఆ వంతెనమీద తూర్పుగాఁ గూర్చుండుమని నేను మొగము కూడ కడుగుకొనలే దనుచున్నను నా మాటల లెక్క సేయక గణపతిమంత్ర ముపదేశించి జపించుచుఁ జూచుసరికి నదృశ్యమై చనెనట.

బ్ర. వే. పొదిలె సీతారామయజ్వశాస్త్రిగారు మహతియగు విద్దె నాదరమున నుపదేశించి శ్రీ విద్యారహస్యముల నిర్దేశించి శాస్త్రిగారి హృదయమున గురుపీఠ మధిష్ఠించిరి. మాచిరాజు దండయ్యపంతులుగారు వర్ణగురువులు. వారి యన్నకొడుకు సాంబయ్య చిన్ననాటి నుండి యాసనములు వేయించుచు చిన్నప్పుడు వ్రాయ, జదువ నేర్పి పెద్దయయు కవితాది రచనల నలంకరించు వీరినిఁ జూచి యనంతానందము నందువారిలో నతి ముఖ్యుడు. మరియు మాచిరాజు రామమూర్తి (కరణము) చిన్ననాటి సఖుడు. సర్వ వ్యవహారసహాయుడు. వేదాంతం కృష్ణమాచార్యులు అను వైఖానసులు, వైద్యులు నేతత్పిత్రు సఖులు. వారి వైద్యవిద్యా ప్రావీణ్యమున నే బ్రదికితినని శాస్త్రిగారు చెప్పుచుందురు. వీరి యన్నకొడుకు శ్రీ జగన్నాథాచార్యులు, నేడు పెద్ద పండితపదవి నుండుటవలన, వేంకటేశ్వరస్వామి వద్ద నధికారియగుట వలన, చిహ్నభేదములచే కొంచె మెడ పడినను, చిన్ననాటి మిత్రుఁడనక తప్పదు. చింతలపాటి వేంకటసుబ్బయ్య

గారు బ్రహ్మోపదేశ గురువు. పరిమి నరసింహావధాని యతిక్రించిద్వేద గురువు.

ఈయనకు 40 వ సంవత్సరమున తండ్రియు, 43 వ సంవత్సరమున తల్లియు కీర్తిశేషులైరి. తత్కర్మానుష్ఠానానంతరమున యథావకాశముగఁ గాశ్యాది క్షేత్రతీర్థమూర్తి రాజముల సేవించుకొని వచ్చి వైశ్వదేవమొనర్చి స్మార్తాగ్ని నుపాసించుచు చేతనయినంత వరకు స్నానసంధ్యాదుల ననుష్ఠించుచు చందోలు గ్రామములో తమ తండ్రిగారు కట్టిన పాతశాలలో రెండుగదులు గోడపెట్టి పరిమి రంగారాయునకు శాశ్వతముగ నిచ్చి మూడు గదులు తన తమ్ముని బిడ్డల స్వాధీనములో నుంచ, అల్లడాబామీద స్వంత ఖర్చుతో నొక పూరిల్లు వేసికొని యందు నివసించుచు భగవంతుడను గ్రహించిన మంచిది, లేకున్న నుపాదానమున కేగుదునని దీక్షవహించి విద్యావ్యాసంగముతో కాలము గడుపుచుండిరి. షుమారు 80 సంవత్సరముల నుండి యుపాదానమున కేగకుండనే దైవము కాలక్షేపము జరుపుచుండెను.

వీరు కొంచెము జ్యోతిషము, కొంచెము వాస్తువు తెలిసినను వానిని జీవికకు నుపయోగింపక యయాచితముగ లభ్యమవు ధనమున తృప్తి నొందుచు తనకు తెలిసిన విద్యాదులొరులకు ఫలాపేక్ష లేకుండ నుపయోగించుచు నుండిరి. వీరికి కాలమున నరసాపురము నుండి వచ్చుచుండ చోరప్రమాద మొకటి తటస్థించినట్లు పూర్వాశ్రమమున గట్టి నరసింహశాస్త్రి యను పండితకవి, అగ్నిపరీక్ష యని యొక పొత్తము వ్రాసినాడు. విశేష మా గ్రంథమువల్ల నెఱుఁగునది. ఈ శాస్త్రిగారు తండ్రిగారి శ్రీరామ కథామృతమందు 6000 పద్యములు వ్రాసిరి. అది ప్రసిద్ధమే. దత్తభాగవతము మొదలవు కొన్ని పొత్తములు వ్రాసిరి. యామావికలో—

సీ॥ మధురావిజయకృతి మాలిమి నొసఁగితి
గురుఁడైన నాగలింగునకుఁ గవికి
హానుమకిచ్చితిని సీతమ్మకోర్కెకి "సత్య
నారాయణ మహాత్మ్య" నామగాథ
కల్యాణ కైవర్తకము సతీర్థ్యుండని
శిశుపాటి కులున కర్పించితి రతి
"రామకథాఽమృతార్థము" పితృపాదుల
తోఁ బరతత్వమందు నిడఁగంటి

గీ॥ దత్తభాగవతమను గ్రంథంబు నిన్న
మొన్న లింగోద్భవస్వామి కెన్నఁగూర్చి
నేఁడు నీకిడుచుంటి ననింద్య! దీని
నాడ నున్నాడ వీవు నావాడవగుచు-॥

అని వ్రాసికొనిరి. ఇటీవల తిరుపతి వేంకటేశ్వరు నుద్దేశించి యుపశతకము మొదలగు చిన్నపొత్తముల వ్రాసిరి. అన్నియు పరమేశ్వరార్పితములే. తండ్రిగారివలెనే వీరును కైత నమ్ముకొనని దీక్ష సాగించిరి. కల్యాణకైవర్తకము కృతిపతిమాత్రము అప్పుడొక రు 116-00 లు బహుమతిగా వలదన్నకొలఁది నిచ్చిన, దానిఁ బదిలముగాఁ దాచి వారి వైశ్వదేవసమయమున బ్రాహ్మణ సత్కారము గావించిరి.

ప్రస్తుతము పూర్వాశ్రమమున మల్లాది దక్షిణామూర్తిశాస్త్రి యని ప్రసిద్ధులగు శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థ స్వామివారి ప్రేరణలో వ్రాయు

చున్న "దత్తభాగవతము" రెండవశాఖయందుఁ గృతిపతిని గూర్చి యిట్లు ముచ్చటించిరి.

సీ॥ అలకాపురరాజు లాశ్రయింత్రు నిను నా
కలకాపురపు రాజు లాశ్రయంబు
చందవోలు కుబేర సదృశార్యతతి వీడి
చనలేవు నీవు నా చనవు నదియె
పెట్టిపోయంగలేని పేదలకాదు నీ
వట్టి వారల నొకండైన వాఁడ
నాది భిక్షుఁడవని యందుకు నిన్ను నే
జ్ఞానభిక్షకుఁ జేయి సాచుచుంటి
గీ. సామ్యమటులుంచు మెంచి నీస్వామ్యముఁ గృతి
నొసగు నన్నృతిఁ జేయు మన్మనిగఁ గొనకు
మిందుపురనాథ ! లింగోద్భవేశ ! ప్రణతు
లందుకొను మభిముఖుఁడవై యాలకించి॥

మ॥ వ్యవసాయంబునగాదు లేదు భృతికిం బాటించు నుద్యోగము
న్వివిధంబౌ పనిలేదు వృత్తియును నన్యంబేదియు న్లేదు మా
ధవ! నీ సేవకునుక్తుఁడన్ గొనుము క్షుద్బాధా నివృత్త్యర్థమా!
యవలో ! వీహులో ! బాలముష్టియిడెఁ జాలాభూతి యీ జాతికిన్

దీనినిబట్టి వారి ప్రవృత్తియెల్ల విశదముగా దెలియుచున్నది. ఇప్పటికి వారికి డెబ్బదియారు వత్సరముల యీడు. దినచర్య యంతయు వ్రాయ వలెనన్న నెంతయో పట్టును. నా కవకాశములేక తోచినంతవరకు సంగ్ర హించితిని. వీరింకను గొన్ని వత్సరము లిమ్మెయి సమ్మతిఁ జననిచ్చిన ముందటి చరిత్రాంశ మవసరమైనప్పు డింకను విశేషించి వ్రాయఁదలఁచి యిప్పటి కింతటితో ముగించుచుంటిని.

పాఠకులు క్షమింతురుగాక.

శాస్త్రిగారి దౌహిత్రుఁడు,

చెఱువు సత్యనారాయణశాస్త్రి

శ్లో॥ మాత్రాపియు క్త శ్చతురబ్దమాత్రే
మాతామహాభ్యామవిము క్తసేవీ
గర్భాష్టమే ప్రాక్తన కర్మయోగా
దుద్బుద్ధ బుద్ధిః కవయామ్యహం త్వాం!!

అని మదీయ లింగోద్భవవృత్త మాలికా స్తవము.

శ్లో॥ నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయముదీరయేత్ !!



# నాకు తోచిన మాట

శ్లో॥ శివః శక్త్యా యుక్తో యదిభవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి,
అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి ?

"ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. మనము వేదములనుండియు, ఉపనిషత్తులనుండియు తత్త్వరహస్యమును గ్రహింపవలసియున్నది. కాని వేదవిద్యలు రానివారు పెద్దలనుండి ఆ రహస్యమును గ్రహింపవలయును. వేదములుకాని, పురాణములుకాని, పెద్దలుకాని చెప్పినది సత్యజ్ఞానలక్షణమే యని తెలిసికొనవలయును. లోకాతీతమైన వస్తువును సామాన్యమైన మాటలలో వర్ణింప శక్యముకాదు. కాని మహిమాన్వితులైన మహర్షులు బ్రహ్మోపదేశమును సామాన్యమైన మాటలలో కావించిరి. యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి సులభగ్రాహ్యమైన భాషలో బ్రహ్మోపదేశమును గావించినాడని వేదాంతమే చెప్పుచున్నది. ఈ అనంతమైన సృష్టికి బ్రహ్మవస్తువు సర్వాధారత్వము నొందియున్నది. ఈ బ్రహ్మవస్తువు నిత్యమైనది, గాన సత్యమైనది. ఈ సత్యమునకే సత్త అని పేరు. జ్ఞాన స్వరూపమైనది బ్రహ్మము. ఇది అనంతము.

దేశ కాలములచే పరిచ్ఛిన్నముకానిది ఆనందస్వరూపము. గౌత ముడు దుఃఖాభావమే మోక్షమని నుడివియున్నాడు. కనుక సత్యజ్ఞానానంద రూపమైనది బ్రహ్మవస్తువనియు, అది అంతట నిండియున్నదనియు తెలి యుట ఆవశ్యకమై యున్నది. బ్రహ్మవస్తువునకు లక్షణములుగ చెప్ప బడినవానిలో మొదటిది సత్యము. సత్యమనగా సర్వకాల సర్వావస్థలయం దుండునదని అర్థము. అట్టిది బ్రహ్మస్వరూపము. "యన్నిత్యం తత్ సత్యం" అనుటచే నెల్లప్పుడు నుండునదని భావము. ఇక లక్షణములలో రెండవది, జ్ఞానము ముఖ్యమైనది. అనగా ఇది సంవిద్రూపమైనది. నిత్యము చైతన్యమయమై ప్రకాశించుచు జడముగాక యుండు స్వభావమని తెలిసికొనవలయును. ఇక మూడవది ఆనందస్వరూపమై వెలయుచున్నది. పై చెప్పిన గౌతముని దుఃఖాభావమే మోక్షమనుమాట నిచ్చట సమన్వ యించుకొనవచ్చును. మొత్తముమీద పై చెప్పిన సత్య జ్ఞానానం రూపమగు బ్రహ్మవస్తువు సర్వాధారమై యున్నదని తెలిసికొంటిమి. అనంతమైన ఈ సృష్టియందు ఆకాశమే విశాలమైనదని చెప్పబడుచున్నది. కాబట్టి అన్నిటి కంటె ఆకాశము పెద్దదని తేలుచున్నది. మరియు అన్నిటికంటె చిన్న దైనది భూమియని తెలిసికొనవలసి యున్నది. తర్కము—"శబ్ద గుణక మాకాశమ్" అని ఆకాశ లక్షణమును తెల్పుచున్నది. అనగా శబ్దమే గుణ ముగా గలది యని భావము. కాని శ్రుతిమాత్రము ఎక్కడ సందున్నదో— అది ఆకాశమని చెప్పుచున్నది. భూమ్యాకాశములకన్నను బ్రహ్మవస్తువు పెద్దదని తెలియుచున్నది. ఏలన "బృహత్వాత్ బ్రహ్మ" అని ఆ శబ్ద లక్షణమే చెప్పుచున్నది. కనుక అన్నిటికన్న పెద్దదైనది బ్రహ్మస్వరూప మని తేలుచున్నది. ఈ బ్రహ్మస్వరూపమునకు రూపముగాని, గుణములు గాని లేవు. కావున నిర్గుణమైనది బ్రహ్మ కాని "యా మా సా మాయా" అనుటచే లేనిది ఉన్నట్లు కన్పట్టుటయే మాయాలక్షణము. అనగా ఇది భ్రాంతి. భ్రాంతి అనునది అధిష్ఠానపూర్వకమేగాని, నిరధిష్ఠానమైనది

కాదని శంకరులు చెప్పుచున్నారు. కావున మాయ కధిష్ఠానమైనది బ్రహ్మ మని తెలియవలెను. ఈ బ్రహ్మవస్తువే—జగత్తు అని భ్రమించుట జరుగుచున్నది. త్రాటిని చూచి పామనుకొనినట్లు బ్రహ్మమునుచూచి జగ మనుకొనుచున్నారు. పైచెప్పిన మాయలోనె ప్రపంచము ప్రారంభ మగు చున్నది. అనగా సృష్టికి మూలము బ్రహ్మము. దానినుండి మాయ స్ఫురించుచున్నది, దానినుండి సృష్టిధర్మములు ప్రారంభ మగుచున్నవని తెలియవలెను.

ఈ బ్రహ్మవస్తువునుగూర్చి చెప్పుచున్న శ్రుతులుగాని, స్మృతులు గాని అనేకములున్నవి. శ్రుతి యనగా వేదము. దాని యర్థ మెచ్చట స్మరింపబడునో దానికి స్మృతి యని పేరు. "శ్రుత్యర్థో యత్ర స్మర్యతే సా స్మృతి రిత్యర్థః" అని లక్షణము చెప్పబడినది. "శ్రుతిశ్చ భిన్నా స్మృత యశ్చ భిన్నాః" అన్నట్లు వీనియం దనేక భిన్న దృక్పథములు కన్నట్టు చున్నవి. అయినప్పటికి అన్ని మతములు ఇందే గలవు. ఇది విశాల మైనది. కావుననే శంకరులు శ్రుతి స్మృత్యాదులకు ఏక వాక్యత వాక్రు చ్చిరి. అది వాక్యావాంతరవాక్య భేదములచే సాధింపబడినది. ఎట్లన ఒకడు తన స్నేహితునిదగ్గఱకు కొంత ధనమును అప్పు అడుగుటకు వెళ్ళినాడు. వెళ్ళినవాడు మొదట అందఱు బాగుగనున్నారా అని యడుగును. పిమ్మట కొంత సంలాపములు జరిపి, ప్రసంగవశమున నతని నుపలక్షించి, నీవు విసుగుకొను చుంటివేమి? అని యడుగును. ఇట్టి యోగక్షేమపరామర్శతో— వాడు పరుల కప్పునిచ్చి బాధపడుచుండుట యెఱింగి యట్టివాని కేల అప్పు లిచ్చితివి? ఇంటనేదాచుకొనగాదా? అని విరుద్ధవాక్యములుపలికి, తన సంగతి చెప్పక బయలుదేఱును. పోవువాడు పోక అల్లంతదూరమునుండి వాని ప్రశ్నముమీద నాకొక పదిరూపాయ లీయగలవా? అని అడిగి అత డీయ తిరిగివచ్చి తీసికొని వెళ్ళినాడు. ఈ విధముగా వాడు అప్పు పుట్టించు కొనుటయందలి విరుద్ధవాక్యములకు స్వార్థమం దెట్లు సమన్వయమో, అట్లే

శ్రుతి స్మృతులయందలి అన్నివాక్యములకు నేకవాక్యత కుదిరియేయున్నది. కావున శ్రుతి స్మృతులలో భేదములు లేవని - అవాంతర వాక్యముల ద్వారమున ప్రధాన వాక్యాన్వయము చేసినను వానికి భేదముమాత్రము లోక దృష్టిచే గన్పట్టుచున్నదని తెలియవలెను. ఈ విధముగనె అద్వైతమును బోధింపదలచి ద్వైతమును, సృష్టిని, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలను, ఉపాధులయందు ప్రాణప్రవేశము, ప్రాణవిభాగము, ప్రాణోత్క్రాంతి,కర్మములు, ఉపాసనలు, పుణ్యపాపములు, స్వర్గనరకములు మొదలైనవన్నియు బోధించి ప్రస్తావన రూపముగ వేదములలో, ఉపనిషత్తులలో, పురాణములలో నిక్షిప్తములు చేయబడినవని సమన్వయపరచి యేక వాక్యతను జగద్గురువులు శ్రీ శంకరాచార్యస్వామివారు సమర్థించిరి.

ఇక మాయ కధిష్ఠానమైన బ్రహ్మమునుండి సర్వపదార్థములు ఆభాసించుచున్నవని తెలిసికొంటిమి. బ్రహ్మమునుండి మాయ, మాయనుండి మహత్తు, మహత్తునుండి అహంకారము, దానినుండి సూక్ష్మభూతములు, వానినుండి పంచభూతములు—ప్రపంచము సృజింపబడుచున్నవి. ప్రపంచ నిర్మాణమునుగూర్చి నేటి సైన్సు చెప్పు విషయమును, ఏనాడో తర్కశాస్త్రము విపులీకరించినది. మానవుడు నిద్రించునపుడు లేచునపుడు దైనందిన సృష్టియొక్క పర్యాలోకన చేయనగునని పెద్దలు సెలవిచ్చిరి. నిద్ర యనునది కన్నులను మూసివేయును. ఆ క్షణముననే క్రమముగ సర్వేంద్రియముల వృత్తులు ఆగిపోవును, అపుడు సూక్ష్మభూతములు అహంకారమున—మహత్తున లయమగును. అపుడు దాని మాయారూపమగు చీకటి ఆవరించును. నిద్రనుండి లేచునపుడు మాయనుండి వెల్తురు ప్రభవించును. దీనికే మహత్తత్త్వమని పేరు. దీనినే మెలకువ నొందుట అందురు. మెలకువ వచ్చిన తర్వాత అహంకారము ప్రారంభమగును. "నేను" అనబడునదే అహంకారము. దీనినుండియే తన్మాత్రల యనుభవము జరుగుచున్నది. కావున నిద్రపోవునపుడు, నిద్రలేచునపుడు, మాన

వుడు సృష్టిని, లయమును అనుభవరూపముగ తెలియవలయునని సారాంశము.

ఒకసారి శ్రీరాయడు శాస్త్రిగారికి మా తండ్రిగారు వ్రాసిన రామ కథామృతమును వినిపించుట జరిగినది. అపుడు, రాయడు శాస్త్రిగారు — మీ రామరావణులకు భేదమేమి ? అని నన్ను ప్రశ్నించిరి. అపుడు నేను మా రాముడు అటు ఇటు కానివాడు. కాని రావణుడు మాత్రము మూలము నందలి వాడేనని అంటిని. ఏలన సామాన్యముగ లోకమున రావణుడు పది తలలు, ఇరువది చేతులు కలిగియుండునను వాడుక ప్రబలమైయున్నది. రావణునకు దశగ్రీవుడని పేరుకదా ! ఇట్లుండ సుందరకాండమున — సీతను వెదుకబోయిన హనుమంతుడు అంతఃపురమున నిద్రించు రావణుని చూచి—"బాహూ" - అని (రెండు బాహువులుగల వాడని) వర్ణించి నట్లు కలదు. ఇది వాల్మీకి ప్రయోగము. అనగా రావణుడు కామరూపుడు గాన వ్యవహారమున నట్లున్నను నిద్రయందు తన ప్రకృతి రూపమున నున్నాడనియు, అదియే సత్యరూపమని యొప్పుకొనవలెననియు వారి యభిప్రాయము. ద్విత్వ విశిష్టజాతినిబట్టి ఈ ఒకచోటి ప్రయోగము లోకానుసారముగ సాధువుగ సమన్వయించుట సమంజసమని నేను చెప్పి తిని. కామరూపులు రతియందు, నిద్రయందు, మృతియందు తమ స్వ స్వరూపములతో నుందురని శాస్త్రము. ఈ రహస్యమెఱిగిన వ్యాస వాల్మీ కులు యథాతథముగా వారివారి నాయకులను, పాత్రలను తీర్చిదిద్దిరి. కాని సామాన్య కవులవలె కల్పనా భూయిష్ఠముగ రచింపలేదు. భారతమున యుధిష్ఠిరుడు— "అశ్వత్థామా హతః కుంజరః" అన్నమాటను పాత్ర పోషణమునకుగా దీసివేయకుండ ఉన్నది యున్నట్లు వ్రాసెను. కాబట్టి సామాన్య కావ్యములదృష్టిలో పై వ్యాసవాల్మీకుల కావ్యముల చేర్చరాదు. పై కవులు సృష్టించిన పాత్రలు మరే కావ్యమందున్నను, అందలి విష యమే ప్రామాణికమని భావించరాదు. అహల్యా సంక్రందనము, తారా

శశాంకము, పారిజాతాపహరణము మొదలగు కావ్యములలో పౌరాణిక పాత్రలున్నవి. అందలి కవివర్ణిత విషయమే ప్రమాణమని భావించరాదు. ముక్కు తిమ్మన సాక్షాత్తు శ్రీకృష్ణుడే కృష్ణదేవరాయలై సింహాసన మధిష్ఠించెనని—యాదవత్వమున సింహాసనస్థుడు గామి—అను పద్యమున వర్ణించినాడు. కృష్ణుని తర్వాత మఱొక యవతారము పురాణముల వర్ణితము కాదు. కవిత్వమున చమత్కారకారిత్వ మవసరము. ఆ ముక్కు తిమ్మనయే అస్తపర్వతమందు తిరుగు కామధేనువు పేడ వేయగా నది యెండి అందలి దావాగ్నితో తగులబడి చల్లారి గుండ్రముగా గన్పట్టుచున్నదని చంద్రమండలమును వర్ణించెను. కావున కవులు కాలానుగుణముగ చేసిన కల్పనలన్నియు ప్రమాణములని భావింపనక్కరలేదు. మనకు వేదములు పరమప్రమాణములు. పిమ్మట ధర్మశాస్త్రములు, ఇతిహాసములు గ్రహింపదగినవి. ఇందు ధర్మములు భిన్నభిన్నములుగా నుండును. ఆయా దేశములబట్టి అవి మారుచుండును. శాస్త్రము—మేనమామ కూతును వివాహమాడుట నిషేధించినది. కాని ఈ సంప్రదాయము ఆంధ్రులలో నున్నది. కావుననే — "ఆంధ్రాణామయ మాచారః" అనవలసి వచ్చినది. శంకరులు భారతములోలేని ధర్మ మితర గ్రంథములలోనున్న దాని నాచరించినను విడిచినను ప్రత్యవాయము లేదనియు, భారతమందలిధర్మము ఇతర గ్రంథములయందు లేకున్నను తప్పక యాచరింపవలెనని వ్రాక్రుచ్చిరి. భారతమున సుభద్ర అర్జునునకు మేనమామ కూతురు. బలరాముడు వారి వివాహము అంగీకరింపలేదు. అపుడు శ్రీకృష్ణుడు బలరామునకు నచ్చచెప్పి వారి వివాహము జరిపించుట జరిగినది ఈవిషయము వ్యాసుడు శ్రీకృష్ణుని ద్వారమున చెప్పించుట గమనింపదగినది. కాని ఈ యాచారము ద్రవిడులలో లేదు. కాని కృష్ణుడు చెప్పినదంతయు ప్రమాణమా? అనరాదు. కృష్ణుడుకూడ వేదచోదితమే చెప్పునుగాని వ్యతిరిక్తముచెప్పడు.

"మాతుల స్యేవయోషా" అన్న మంత్ర లింగమునుబట్టియే శ్రీకృష్ణ డా ధర్మమును జెప్పెనని గ్రహింపవలెను.

వేదమనునది వాగ్రూపమైనది. అది ముఖతః నేర్చుకొనదగినది కాని పుస్తకరూపమున చదువరానిది. అట్లు అభ్యసింపబడకున్న నది వేదమే కాదు. బ్రహ్మనుండి మాయ, దీనినుండి సగుణ బ్రహ్మ, దీని నుండి శ్రుత్యాది వాఙ్మయము భాసించును. ఈ సగుణబ్రహ్మ బహు రూపములతో నుండును. నిర్గుణ బ్రహ్మకు వృత్తిలేదు. సగుణ బ్రహ్మనుండి రూపధారణములతో బ్రహ్మ విష్ణు మహేశ్వరాదుల ఆవిర్భావము జరుగును. నేడు చాలమంది ఆ దేవతలు కన్పించుట లేదు గనుక వారు లేరనుట వినబడుచున్నది కాని వారి దర్శనమునకు ప్రయత్నముచేయు టుచితము. కర్తలేక కార్యము లేదన్నట్లు ఈ సృష్టికంతయు కారణభూతుడొక డున్నాడనుట యుక్తముగదా ! వాని పేరే బ్రహ్మ. వాడే దేవుడు. తిరుపతిలో దేవుడు జాతియందే యున్నాడు. కాని యందలి విశేషము దానిలోని దైవిక తేజస్సు లేక శక్తి అని భావించవలెను. "భక్తానాం ఆర్తి నాశనః" అయినట్టి భగవంతుడు సర్వవ్యాప్తి నొందినవాడుగదా ? నేను చెన్నపట్టణము చూడలేదు కాన నది లేదన జెల్లునా ? చూచినవారు చెప్పగా గమనించి యొప్పుకొనవలెనుగదా !

ఒకసారి ఒక కలెక్టరు మా యూరికి రాగా మా నాన్నగారు కరణముగారు తమకుచేసిన అపకారము చెప్పిరి. ఆ కలెక్టరు వినివిని చివరకు నాన్నగారిపై ఎదురుతిరిగి కళ్ళెఱ్ఱజేసినాడు. అపుడు మా నాన్నగారు "బాయీ ! కావుమటన్న కళ్ళెఱ్ఱం జేయదు....శ్రీబాలకోటేశ్వరా!" అని కలెక్టరుగారిని బాయికంటే బాయివని నీకు చెప్పుకొనుటకన్న జాతితో చెప్పుకొనుట మంచిది అని ఒక పద్యము చెప్పిరి. ఇంతకు కలెక్టరుగా వచ్చిన ఆ దొరపేరు రాయ్. ఒకసారి నాకు తిరుపతి స్వామి దర్శనము

దుర్లభమైనది. ధ్వజ స్తంభమువద్దనే మ్రొక్కు తీర్చుకొని వచ్చితిని పిమ్మట వైకుంఠపురము వెళ్లి అచటి స్వామిని దర్శించి సేవింప స్వామి కలలో కనుపించి తిరుపతిస్వామి రజోగుణ ప్రధానుడనియు, వైకుంఠ పురస్వామి సత్త్వగుణ ప్రధానుడు కనుక దర్శనము కలిగిన దనియు, తిరుపతి స్వామిపై కోపించుట తగదనియు చెప్పెను. ఈ భావోద్రేకముతో వేంకటేశ్వరస్వామిపై నొక శతకమును "నా యాత్ర" అని వ్రాసితిని. ఇదికాక బ్రహ్మము నుండి భిన్నరూపములు ధరించిన శివ కేశవాదులు చేయుపనులు శరీరాభిమానముతో కాదని తెలిసికొనవలయును. విష్ణునకు అచ్యుతుడని నామము. ఏ పనులు శరీరముతో చేయుచున్నను బ్రహ్మ భావమునుండి చ్యుతుడు కాడు గాన – తత్పదముసార్థకము. బ్రహ్మ రూపమునుండి యెకప్పుడు చలింపడు గాన శివునకు స్థాణువని పేరు. కావుననే శివాలయమున "హరోం హరోం హరోం" అని బిగ్గరగా పదు నొకండుమార్లు కేకలువేయుట గుణాతీతుడగు నా దేవుని ప్రపంచోన్ముఖు నొనర్చికొనుటకని పెద్దలు చెప్పుదురు. ఇట్లే ఇంద్ర కశ్యపాది శబ్దాల కర్థము. ఋష్యాదులు దివ్యదృష్టితో దేవతల కథల నర్థము చేసికొన గలరు. కాని సామాన్యుల కది అసాధ్యము. కావున పురాణ కావ్యములు చదివి మంచి గ్రహించి, చెడును వదలుట అభ్యాసము చేయవలెను. శాస్త్రములు కేవలము జ్ఞానికి, అజ్ఞానికి అక్కరలేదు. కావున మధ్యము డైన సామాన్యునికి కావలయును.

# 2

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అని పెద్దల అనుభవప్రోక్త మార్గము. బ్రహ్మ నిత్యమై వెలయుచున్నది. మనకు కనబడుచున్న చరాచర జగత్తు మిథ్యారూపమై భాసించుచున్నది. సగుణ బ్రహ్మమునకు మొదట ఇచ్ఛ ప్రారంభమై పిమ్మట సృష్టి జరుగుచున్నది. ఎవరికి తగిన బుద్ధి లేక ఇష్టమునే మతమని భావించవలెను. ఇది వాని మతము, అది వాని మతము అనునప్పుడు ఇష్టము అనియే భావము. అట్లే మునుల మతములు వేదము ననుభవింపగా వారివారికి తేలినభావములు. సృష్టియందు పంచభూతములు — వాని నిర్మాణము —

ఆకాశాత్ వాయుః! వాయో రగ్నిః!
అగ్నే రాపః అద్భ్యః పృథివీ!!
పృథివ్యా ఓషధయః! ఓషధీభ్యోఽన్నం!
అన్నా త్పురుషః!

అని శ్రుతిచే చెప్పబడినది. మరియు ఓషధులవలన పురుష దేహములు, అంతఃకరణములు జనించుచున్నవి. సగుణబ్రహ్మ కారణశరీరములోనికి వచ్చినపుడు ఆనందమయకోశ మనబడును. అన్నమయ కోశమున విశ్వుడు, సూక్ష్మశరీరమునందు తైజసుడు, కారణ శరీరములో ప్రాజ్ఞుడు నను పేర్లతో నుండు దేవుడే జీవుడు. విరాట్ స్వరూపము సహస్ర శీర్షాద్యవయవములతో వెలయుచుండును. ఋషీశ్వరులు, యోగులు దివ్యదృష్టితో విశ్వరూపమును, విరాట్టును చూడగలుగుచున్నారు. కాని యితరులకు చూడలేరు ఆ శక్తి శ్రీకృష్ణునకే కలదు. మంత్రద్రష్టలు

మంత్రముల మననము చేయుదురు. శిష్యులకు చెప్పుదురు. కాని వ్రాయరు. భారతమును లేఖ్యమగు నామ్నాయమని చెప్పుటచే, ఇతరామ్నాయము లలేఖ్యములు. లక్ష్మీధర పండితుడు సౌందర్యలహరి వ్యాఖ్యయందు మంత్రబీజమును పుస్తకమందు వ్రాయుచున్నాననియు, కలియుగమున సంప్రదాయము దొరకనివారలు తీవ్రభక్తులు దాని నుపయోగించుకొనుడని దానికిగా శ్రీ మంత్రమును వ్రాసెను. మంత్రమనునది యుపదేశింపవలయునే గాని వ్రాయరాదు. కాని పై వ్యాఖ్యాత సంప్రదాయము దొరకనివారు తన్ను గురువుగ నెంచుకొని పుస్తకమునుచూచి అభ్యసించుమనియు, అట్లు చేసినవారికి సిద్ధి సమకూరునట్లు తాను చేయుదునని వ్రాసియున్నాడు. దానిని బట్టి తాను ఈశ్వరుడననియు తలంచినట్లే, యోగమున మణిపూరకమునందు వాయువు అగ్నిరూపము నొందునని శంకరులు చెప్పిరి కాని స్వాధిష్ఠానమందే యిట్టిది జరుగునని లక్ష్మీధరుడు పల్కియున్నాడు. ఇట్లు ఎవరికైనను జరిగిన భయపడరాదని తన యనుభవమును చెప్పుట అతని ఆశయము. ఇట్టి సిద్ధపురుషు లెందఱో గ్రంథకర్తలయందు కలరు.

భారతమున బ్రాహ్మణగీత, సనత్సుజాతగీత, హంసగీత మొదలగు పేర్లతో నూరుగీతలు గలవు. ఏ గీతల నెవ రభ్యసించినను గమ్యము మాత్ర మొక్కటే యగుచున్నది. మార్గములు శబ్దార్థ వాక్యార్థభేదములతో నారబ్ధములగుచున్నవి. ఈశ్వరతత్త్వము నెన్నిమార్గములతో చెప్పినను పరమార్థమొక్కటి యని తెల్పుటకే, ఎవరి యనుభవము వారు చెప్పుట మూలముగా నిన్ని గీతలు పుట్టినవని భావించవలయును. "నమో వాఙ్మనసాతీత రూపా మానంత శక్తయే" అన్నచోట శబ్దశక్తులు పరమాత్మశక్తులవలె అనంతములు. ఒక్కొక్కచోట నొక్కొక్కశక్తి ప్రకాశించుచున్నది. ఈ శక్తులన్నింటికి అధికారి యుండితీరవలెనుగదా। అతదే యీశ్వరుడని విశ్వసింపవలెను. కాళిదాసు "ప్రత్యక్షోప్య పరిచ్ఛేద్యః మహ్యాది ర్మహిమాతవ" అని ప్రత్యక్ష శక్తులబట్టి అప్రత్యక్షు నీశ్వరు

నాధికారిక పురుషునిగా నెఱుగవలెనని చెప్పెను. ప్రత్యక్ష మెట్లపరిచ్ఛేద్య మన దక్షుడు మొదట అరువదివేలమంది కుమారుల గనెనట. వీరిని వివాహము చేసికొని సంతానముగనుమని తండ్రిచెప్ప, వారలు కన్యలకై వెదకుచుండిరట. ఆ సమయమున నారదుడువచ్చి వారిని మీ రెవరు ? ఎచ్చటనుండి వచ్చితిరి ? అను మొదలగు ప్రశ్నము లొనర్చి వీనికి సమాధానములు ముందు తెలిసికొమ్మని చెప్పెను; వారు ఆ తత్త్వము నెరుగను త్తరముగ పొమ్మనెను. వారట్లే నారదు వచనము తెలిసికొనుటకు ఉత్తరమునకు వెళ్లిరట. మరొక అరువదివేలమంది దక్షకుమారులకుకూడ నట్లే చెప్పి పంపెనట నారదుడు. తర్వాత ఆడుపిల్లలను కనగా వారివలన నీ ప్రపంచసృష్టి జరిగినది. అపుడు దక్షుడెఱిగి నారదుని ఎల్లప్పుడు దేశముమీద తిరుగుచుండుమని శాపమిచ్చెనట. ఇప్పటికిని దక్షకుమారులు భూమియొక్క అంతు తెలిసికొనుటకు తిరుగుచునే యున్నారు. కావుననే ఈ భూమి అపరిచ్ఛేద్యమైనది. ఈ భూభాగము సప్తద్వీపములతో కూడినది. అందు జంబూద్వీపమున తొమ్మిదిఖండములు గలవు. ఈ భరతఖండము జంబూద్వీపమునందలిది. ఈ భరతఖండమున నెన్నియో పర్వతములు తూర్పునుండి పడమటిపైపునకు కట్టలవలె వ్యాపించి యున్నవి. "పృథివ్యా ఇవ మాన దండః" అని కాళిదాసు వర్ణించిన దండులకే. "ఏడు కొండలవాడా వేంకటరమణా" అనినపుడు మేరు, నీల, శ్వేత, శృంగవంతాది పర్వతములన్నియు వచ్చుచున్నవి. అనగా సమస్త జగత్తునకు ప్రభువు అని అర్థమగుచున్నది. పై చెప్పిన తొమ్మిది ఖండముల లోను అర్జునుడు అయిదు ఖండముల జయించి, అచటి దివ్యవస్తువుల తెచ్చినట్లు గలదు. లోకాలోక పర్వతముచే చుట్టబడిన ఈ భూమి విశాలమైనది. కాని లోకాలోక పర్వతమున కావలిపైపున కూడ ప్రదేశము కలదనియే చెప్పుచున్నారు. అయినను దానిని చూచినవారు లేరు. ప్రత్యక్షమైన ఈ ప్రపంచమునే చూడజాలని మనము ప్రపంచాధినాధుడైన

ద్రష్టను – భగవంతుని చూచుటయెట్లు ? ఎట్లన ఆప్తవాక్య ప్రమాణముచే చూడవలయును. వెలుతురులేని సూర్యుడు లేనట్లు, నేనులేని ప్రపంచము లేదని భగవంతుని తలంపు. నేను అను అహంకారము సర్వప్రాణిగతమై యున్నది. కనుక నేనుకు ఆధారము నేనే అను వస్తువే యని భావించ వలసి యున్నది. అదియే సద్వస్తువు అది యొక్కటియే – "కాశ్యాంతు కాశతే కాశీ ! కాశీ సర్వప్రకాశికా !" సర్వమును ప్రకాశింపజేయు కాశి అనగా సంవిత్తు ప్రత్యక్షమగు వస్తువునం దెల్ల ప్రకాశించుచునేయున్నది– అని శంకరులు పల్కిరి. ప్రపంచమున భోగము, మోక్షము అను రెండు విషయములు కలవు. రాజులు భోగములకు పాటుబడుదురు. బ్రాహ్మణులు మోక్షమునకు పాటుపడుదురు. అట్టివారల చరిత్రము లాదర్శముగా గ్రహింపబడినవి. వైశ్య శూద్రాదులు వారిని కనుగొని భోగముగాని మోక్షముగాని సంపాదింపవలెను. పురాణములు, శాస్త్రగ్రంథములు మొద లైనవి నిమ్నజాత్యుద్ధరణమునకు ద్రోవసూపెడివి. కాశీలోని తులాధరుని ధర్మమునుగూర్చి చెప్పుకొనవలయును. అతడు సరకులను అందరు కొకే ధరకమ్ముచు, హెచ్చుతగ్గులు లేకుండ, వచ్చిన లాభమును ఆయాపనులకు సక్రమవినియోగము కావించుచుండెడివాడు. తినుటకు కొంత, గుమాస్తా లకు కొంత, మరికొంత మూలధనముగను, కొంత పెళ్ళిళ్ళకు, కొంత ధర్మమునకు కేటాయించి ధార్మికజీవనుడై యుండెను. అతనివద్దర కొక మునివచ్చి, అతని సక్రమవినియోగ ధర్మమున కాశ్చర్యమునొంది, మూడు రోజులుండి ధర్మములన్నియు నెఱింగి వెళ్ళెను. భారతమున అరణ్యపర్వ ములోని ధర్మవ్యాధోపాఖ్యాన మిట్టిసూత్రమునే తెలియచేయుచున్నదికదా ! కాన బ్రాహ్మణులు పురాణములలో తమ చరిత్రలు, రాజ చరిత్రలు మాత్రమే వ్రాసిరి. కాని యితరకులముల నెత్తుకొనలేదనువార్త మృగ్యము. అన్ని కులములకు తగిన గౌరవము శాస్త్రములలో శాసించబడినది. క్షౌర మునకు ముందు మంగలి మెడలో జందెమువేసి అది అయినతర్వాత దాని

తీసి పంపవలెను. "రజకస్య కరౌ శుద్ధౌ ఉత్తమౌ గోపనాపితౌ" అని యిట్లవసరములబట్టి అందఱకు గౌరవమిడిరి. మన ఋష్యాదులు దేవతల వంటివారు. వారు మంత్రద్రష్టలు. మనబోంట్లు మంత్రముల చదివికాని, విని కాని తెలిసికొనవలయును. మనోమయకోశము అందఱకు కలదుకాన, ప్రతి ప్రాణియందును వేదముగలదని వేదమునుబట్టియే తెలియనగును. ప్రాణి అంతఃకరణసహితమై యుండును. కులము అంతఃకరణమునగలదు. కులమన సమూహము, సత్వ రజ స్తమోగుణాదు లంతఃకరణమున నుండును. వానిబట్టి ప్రతివానిలో నింద్రియాది కులముగలదని శంకరులు చెప్పిరి. కర్మవలన ప్రతివాని హృదయమున ఉసిరిగపూతవలె సూక్ష్మముగ సంస్కారముగ అంతఃకరణములో నేర్పడును కర్మలనుబట్టి అంతఃకరణములో గుణములయొక్క హెచ్చు ఏర్పడును. దానిబట్టి కులమేర్పడినది. అది భ్రూమధ్యమునకు పైనలేదు. తల్లులు స్వీకరించు ఆహారములనుబట్టి గర్భమునందలి బిడ్డలయొక్క గుణగణాదులు మారుట సంభవించును. సాత్త్వికాహారమువలన బాధకలుగదు. కారము మొదలైనవానివలన గర్భమునకు బాధకలుగును. కాన రజస్వలలు, గర్భిణు లుండవలసిన తీరును వేదము చెప్పినది. మహమ్మదీయులకు మనకు కొన్నిటియందు భేదమున్నను, వారి వేదాంతము మన వేదాంతమునకు సమీపమందే యున్నది. వారు మన పునర్జన్మ సిద్ధాంతము నంగీకరింపగలరు. ఖురాన్‌లో చెప్పబడిన మోక్షమార్గము, వేదాంతసిద్ధాంతము మనవానితో సమానమైనవే. కాని కొన్ని ఆచారములలోమాత్రము భేదమున్నది. దేవాలయమునందలి విగ్రహములలో మూడురూపములున్నవని యాచార్యులు చెప్పిరి. 1. రాతియొక్క బాహ్యరూపము. 2. శిల్పిచే చిత్రితమైన జీవకళ. 3. వీని కాధారమైన సత్తారూపము. ఈశ్వరు డట్లు సత్తారూపముతో నిండియున్నాడు. సూర్యభగవానునియందు నల్లరంగు, ఎఱ్ఱరంగు కననగును, గాని పచ్చరంగు కనబడుటలేదు. "యచ్చంద్రమసి, యచ్చాగ్నౌ" అన్నచోట

చంద్రునిలోని, అగ్నిలోని తేజస్సు నాదియే యని శ్రీకృష్ణుడు చెప్పు చున్నాడు. సూర్యకాంతి నాయది యని చెప్పలేదు. ఏలన హృదయము నందలి కాంతియే సూర్యకాంతియని భావము. జాతియందే మూడురూపము లున్నపుడు శరీరములో నేల యుండవు! కావున ఉపనిషత్తుల ద్వారమున వానిని తెలిసికొనవలయును. "కర్తుం, అకర్తుం, అన్యథాకర్తుం,సమర్థః ఈశ్వరః" అని ఈశ్వరస్వరూపము భాష్యములయందు నిరూపింపబడినది. అదియే ఈశ్వరుని రూపము. శిరమున చంద్రమండలము, నాభికి దిగువ నగ్నిమండలమును గలవు. హృదయముననున్న నా తేజమే అగ్ని చంద్రమండలముల ద్వారమున సర్వకాల, సర్వదేశముల యందు వ్యాపించి యున్నదని దేవుని - "పరోక్షప్రియా ఇవ దేవాః" ఈ సూత్రము చాల చోట్ల చూడబడుచున్నది. ఇదియే అంతరర్థము బహిరర్థము నని చెప్ప బడుచున్నది. కొన్నిచోట్ల నీ యంతరర్థము చెప్పకున్న మామూలుగా నుండు కథలైతిహ్యముకొఱకెచ్చటనైన చెప్పినను చెప్పినదే చెప్పుట నిరర్థకము. అందు తారాశశాంకవిజయమును మామూలు దృష్టితో చదివిన బూతులేగదా! అవి మాటిమాటికి పురాణముల నావర్తింపనేల? అంతర దృష్టితో చూచిన అందు నీ విశేషము తోచెడు. ఆ కథయందు మనస్స్వా మీయుడు చంద్రుడు. తార అన పెద్దది. అనగా పెద్ద తత్త్వము. మహ త్తత్త్వము. బుద్ధి - జీవుడు బృహస్పతి. జీవకళ లేకున్న మనస్సు పని చేయదు కావున బుద్ధికళ మనస్సులోనికి వచ్చినది. తారయే చంద్రుని ముందు ప్రేమించినది. వీరికి వచ్చిన తగాదాలో చివరకు బ్రహ్మ రాజీ చేసెను. అనగా నిచ్చట బ్రహ్మోపదేశముచే రాగద్వేషములు పోయినట్లు భావించవలెను. కనుక బుద్ధి జీవునితో చేరిన మోక్షము, అదియే మన స్సుతో చేరిన సంసారము ఏర్పడును. తార జీవునితో కలసిన స్వభావస్థితి. మనస్సునకువచ్చి వృత్తిద్వారా విషయముల నావరించుట వ్యభిచారము.

తారకు బుట్టిన బుధుని చంద్రునకిప్పించి, తారను గురువున కిప్పించి బ్రహ్మ రాజీ చేసెను. చంద్రుడు మనస్సు. అందలి బోధలు జీవజ్ఞానము - తార వృత్తిరహితమైనచో జనకజ్ఞానము. అది బుద్ధ్యాదులకు విషయముగాదు. కాన ఆశ్రయాశ్రయీభావముతో బ్రహ్మైక్యమును భామతీకారుడు చెప్పెను. కాన మనోవృత్తిద్వారా లోకవ్యాప్తి కలిగినపుడు జీవుడు మనసుతో సంబంధింపక బుద్ధి వృత్తి ప్రత్యఙ్ముఖమైన బ్రహ్మము. ఇదియే ఆ కథకు సారాంశము.

నిర్గుణమైన బ్రహ్మవస్తువు మాయలో ప్రతిఫలించి సగుణ మగుచున్నది. పిమ్మట ఇచ్ఛానుసారము సృష్టి జరుగుచున్నది. ఈ సృష్టి రహస్యమును ఋష్యాదులు దివ్యదృష్టితో చెప్పగలరు. శాస్త్రాదులలో ఆకాశము తొమ్మిదిభాగములుగ విభాగింపబడినది. వీనిలో అన్నిటికంటె పైది చంద్రలోకమని తెలియుచున్నది. రావణుడు సూర్యమండలము లోనికి వెళ్ళెనట కాని, చంద్రలోకమునకు పోలేకపోయెనట. ఇకమొండి యగు రావణుడు 8 వ ఆకాశములోనుండి 9 వ ఆకాశమగు చంద్రమండలము పైకి బాణప్రయోగము చేసెనట. అపుడు బ్రహ్మ ఆ విషయమును గ్రహించి రావణునితో – చంద్రుడు శివుని నెత్తిపై నున్నాడు, కాన అట్టి వానిపై బాణప్రయోగముకావించిన లోకప్రళయము రాగలదు, మానుము – అనెనట. ఈ విధముగ వాల్మీకములో నున్నది. కాని నేటి మానవుడు చంద్రశిలలు తేగలుగుట చూడ ఆశ్చర్యవిషయము. పైవిషయము (వాల్మీకము) నమ్ముటయా, మానుటయా అన్న పెద్దల వాక్యమే ప్రమాణముగ చూడవలయును. పూర్వము భారతదేశస్థులు యోగాది అభ్యాసములచే సర్వవిషయములు గ్రహించెడివారు. శాస్త్రనిర్ణయము ప్రకారము పురుషునకు ఐదవయేట ఉపనయనము జరుగవలసియున్నది. పిమ్మట 12 ఏళ్ళు యోగాభ్యాసము చేయవలయును. ఈ పదునేడు సంవత్సరములు గడిచినపిమ్మట పదునెనిమిదవసంవత్సరమున పెండ్లి చేయవలయును. స్త్రీకి ఎనిమిదేండ్లలోపల పెండ్లిచేయుట శాస్త్రయుక్తము. "స్త్రీణా ముపనయనస్థానే వివాహః" అని ఆపస్తంబుని ప్రవచనమున్నది. స్త్రీకి ఉపనయనము వేరుగా లేదు అందుచే వివాహానంతరము భర్తయే దానికి చదువులు, సంపెలు,

యోగములు, ఉపాసనలుచెప్పి కృతార్థునుచేసి ఋతుమతియైన పిమ్మట గర్భాదానము మొదలగు తంత్రముల ప్రవర్తింపచేయవలయును. స్త్రీకి భర్తయే దైవము. గురువు. ఆమె గృహకృత్యములందేకాక, భర్తకు అన్నివిధముల తోడ్పడుటవలన కృతార్థురాలు కావలయును. భర్త నిర్వర్తించు అగ్ని కార్యములందలి అగ్నులు భార్యకొఱకే పుట్టినవి. స్త్రీ భోగ్య వస్తువుగా పరిగణింపబడుటచే దానిని బజారుకెక్కింపగూడదు. జ్ఞాన విజ్ఞానము లన్నియు సమకూర్చుటకే దానికి భర్త ప్రాపు. కావున మొత్తము మీద స్త్రీ రజస్వలకాకముందే యోగసిద్ధి నొందవలసియున్నది. స్త్రీకి వివాహము సత్కర్మలయందు అర్హురాలిని చేయుటకే యుద్దేశింపబడినది. "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని" అని ప్రధానముగా చెప్పి "ప్రజా చోత్పాదయితవ్యా" అని రెండవది ఆనుషంగికముగ చెప్పబడినది. అప్పుడే వరుడు వధువునకు నాది నుపదేశించుచున్నాడు. దాని కొఱకే 8 ఏండ్ల లోనె స్త్రీకి వివాహము విధింపబడినది. ఇప్పటికాలమువారు ఆనుషంగికమును ప్రధానముచేసికొని మగవారు ఆడవారుకూడ పెండ్లికి మా కప్పుడే ఏమి తొందర అనుచున్నారు. పెండ్లి అయినతర్వాత పిల్లలు పుట్టలేదని పుట్టలకు రాళ్ళకు మ్రొక్కుచు, ఒకరిద్దఱు పుట్టగనె, ఇక పుట్టకుండు పాట్లు పడుచున్నారు. వీరు చచ్చిన చీకుపడుచున్నారు. ఈ దృష్టితోనైన నెవ్వరికి తొందరలేదు ఈ పెండ్లి ఐయినను కాకపోయినను కూడ చింతలేదు "జ్ఞానేన హీనః పశుభిస్సమానః" ఈ లౌకికమార్గమునిటుంచి పురాణమార్గము ననుసరింపుదము.

లోపాముద్ర రాజకన్య. 8 ఏళ్ళకే అగస్త్యుని వివాహమాడినది. ఆమె పిమ్మట పర్ణశాలలో 10వేల యేండ్లు లలితోపాసనా సమాధిలోనుండి విడుదలనొంది ఋతుమతియైనది. అపుడు అగస్త్యుడు సంతానమునకై ఆమెయొద్దకు వెళ్ళినాడు. ఆమె వెంటనే - మిమ్మే భర్తగా గురువుగా భావించి మీ మంత్రోపదేశముచే దేవినైతిని, కావున మీరు సాక్షాత్తు శివ

స్వరూపులైనచో నన్ను ముట్టుకొనుడు. లేకున్న మీతల వ్రక్కలగునని పల్కినది. అప్పుడు అగస్త్యుడు హయగ్రీవు నాశ్రయించినాడు. ఆ సమయమున హయగ్రీవుడు అగస్త్యునకు శ్రీ విద్యాతంత్రమెల్ల నుపదేశమాత్రమున సిద్ధింపజేసి పంపెను. అపుడు శివుడనైన నేను ముట్టుకొనెదనని ఆమెతో అగస్త్యుడు పల్కెను. కాని రాజకన్యయగు నామె విలాసమునకు రాజభోగములు కావలయును, లేకున్న మీతో కలియుటచే నసత్సంతానము కలుగునుగాన కూడదని పల్కినది. కావున రాజవేషముతో నన్ను గవయుమనినది. అప్పు డాతడు నాదగ్గర భోగములకు ధనములేదనెను. లేకున్న సృష్టింపుమని యామె కోరినది. కాని అతడు తన తపశ్శక్తిచే ధనమును సృష్టించుట కిచ్చగింపలేదు. అయినచో మీ వీలునుబట్టి ధనార్జనము చేయుమని ఆమె బదులు పల్కినది.

అగస్త్యుడు ధర్మ్యమగు పత్నిసంహాకు చేయునదిలేక సమ్మతించి ఒక రాజుదగ్గరకుపోయి ఆయవ్యయపట్టిక చూపుమనగా, అందు ఆదాయమునకన్న వ్యయ మెక్కువయుండుటచే వాని నర్థించుట కూడదని మరియొక రాజును సమీపించెను. అతడును పైవానివలెనే యుండెను. చివరకు మూడవరాజుకూడ అట్లేయుండెను. ఇక చేయునదిలేక అగస్త్యుడు ముగ్గురు రాజులను వెంటనిడుకొని, ధన మిప్పించెద రండని, వాతాపి ఇల్వలులదగ్గరకు పోయెను. వాతాపి ఇల్వలులు బ్రాహ్మణ నాశనము చేయుటలో వాసిగాంచియుండిరి. ఇల్వలుడు వాతాపిని మేకనుచేసి, కోసి వండి భోజనము పెట్టుట, పిమ్మట వాతాపిని కేకవేయగనె, తిన్నవాని కడుపు చీల్చుకొని వాడు వెలువడుట జరుగుచుండెడిది. ఇట్టివారికి రాజులు వద్దన్నను, అగస్త్యుడు బ్రాహ్మణార్థము ఒప్పుకొని కూర్చుండెను. ఇక మామూలుగ వారి తంతువు ప్రారంభమైనది. వాడు తమ్ముని కేకవేయబోగా, అగస్త్యుడు - "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం" అని పల్కెను. ఈ విధముగ వాతాపి జీర్ణమైనపిమ్మట ఇల్వలుడు కాళ్ళపైబడి క్షమాపణ కోరెను. అపుడు అగ

స్త్యుడు తనకు, రాజులకు మూడుకోట్ల సువర్ణనాణెములు, రథము, కిరీటము భుజకీర్తులు ఒక్కొక్కరికి పై విధముగ ఇమ్మనెను. వానిని స్వీకరించి అగస్త్యుడు రాజవేషము కలవాడై నపిమ్మట లోపాముద్రను కలియుటకు పోయెను. అట్లు కలియగ నామెకు సద్యోగర్భమునందు దృఢస్యుడు అను కుమారుడు కల్గెను. ఇట్లు పూర్వము సంతానము ఆనుషంగికముగ నుండెడిదే కాని ప్రధానము కాదని తెలియవలయును.

కాబట్టి సంతాన మక్కరలేకున్నచో "వానప్రస్థో బ్రహ్మచారీ" అన్నట్లు వానప్రస్థమున బ్రహ్మచర్య మవలంబించుట యుచితము. కాని సంతాన నిరోధము భ్రూణహత్యవంటిది. భార్యాసహితముగకూడ వానప్రస్థాశ్రమము స్వీకరింప వీలున్నది. ఆయా యుగముల కనుగుణముగ ధర్మములుకూడ మారుచుండును. ఇవన్నియు వ్యవహారసంబంధమైనవి. ఈ వ్యవహారమనునది సృష్టినుండి అధికారిక పురుషుడుత్పన్నమైనపిమ్మట వచ్చినది. ఈ అధికారిక పురుషునకు లీలాస్వీకృత విగ్రహుడు అని పేరు. కాబట్టి లోకవ్యవహారమంతయు లీలాస్వీకృత విగ్రహునివలన జరుగుచున్నదని శంకరులు చెప్పగా, గౌడపాదులవారు పై మాట అనరాదని నిషేధించిరి. ఏలన, ఆకారము, శరీరము లేనివాడు నిర్గుణబ్రహ్మ యని చెప్పి అందునుండి అధికారిక పురుషు డుత్పన్నమగుట అసంభావ్యమని వారి అభిప్రాయము. అయినప్పటికి లోకవ్యాపారమునకు ఒక్కొక్క గుణముతో నొక్కొక్క రూపము శివకేశవాదులుగ ఆవిర్భవించినది. వీరితో ఈ ప్రపంచసృష్టి జరిగినది. ఈ చెప్పిన శివకేశవాది రూపములలో ఎక్కువ తక్కువలు లేవు. సీతారామాంజనేయమున "క్షణము సర్వజగద్విలక్షణత గాంచు వాని నెన్నంగ దరమె యెవ్వానికైన అని చెప్పబడినది. జగద్విలక్షణత యనగా వృత్తిలేకుండుటయే. వృత్తి పోవుట యనగాసంధ్యావందనమే. "సంధౌ భవా సంధ్యా" అని వృత్తికి వృత్తికి మధ్య నుండునది సంధ్య యనబడుచున్నది. కావున "అహరహః సంధ్యా ముపాసీత"

అనగా ఎల్లప్పుడు సంధ్యావందన మాచరించుటయే. అది మంచిది. సంధ్యా వందన మంత్రమున ప్రత్యక్షరము ప్రఖ్యాతి గలది. మన వర్ణసమామ్నాయ మందున్న 53 అక్షరములు దేవతారూపము.లు అ - అనగా అరుణాదేవి. ఈవిధముగ నాయా అకరములకు ఆయా దేవతలపేర్లు గలవు. కాబట్టి అక్షరోపాసనచే దేవతోపాసనకూడ జరుగుచున్నది. ఈ దేవతలందఱు ఆయా అక్షర జన్మస్థానముల యందావేశించి యుందురు. చక్రదళముల యందు 53 అక్షరములలో ఆ దేవతలు గలరు. కావున చిన్నపిల్లలకు అక్షరాభ్యాసము చేయునపుడు అ-ఆ లతో ప్రారంభము చేయవలయును గాని, "ఓం నమశ్శివాయ" అను మహామంత్రముతో గాదు. ఏలన సులభ ముగ దగ్గరలో పట్టువడు అక్షరములు ముందుండగా, మహామంత్రము లతో ప్రారంభించుట యేల ? ఇది యెట్లున్నదనగా, దగ్గరనున్న నదిలో అస్థికలు కలుపక, గంగకే పోవుటవంటిది. దీనివలన నష్టమేమనగా దారి లోని నదులన్నియు పోవువానిని నిందించుట జరుగును. దీనినే- "అత్యా సన్నం పరిత్యజ్య, మునేర్ద త్తంచ నిష్ఫలం," అని ధర్మశాస్త్రములు చెప్పు చున్నవి. దగ్గరివారిని వదలి దూరమువారికి ఏమిచేసిన నేమిప్రయోజనము?

ఇక షట్చక్రములలో కంఠస్థానమున 16 దళముల చక్రమున్నది. అనగా నిందు 16 అక్షరములు పుట్టుచున్నవి. ఈ చక్ర మధ్యస్థానమున జీవతత్త్వమైన ఈశ్వరుడు గలడు. ఇతనికి ప్రాణశక్తి భార్యారూపమున నున్నది. ఇక క్రింద హృదయమున అనాహత చక్రమున్నది. దీనికి 12 దళములు (12 అక్షరములు) ఉన్నవి. పిమ్మట బొడ్డుదగ్గర మణిపూరక మను చక్రమున్నది. దీనికి 10 దళములు (10 అక్షరములు) ఉన్నవి. దీని మధ్యస్థానమున విష్ణువు లక్ష్మితో నుండును. తర్వాత స్వాధిష్ఠానమందు 6 దళముల చక్రమున్నది. ఇచట బ్రహ్మ సరస్వతితో నుండును. ఇక పృష్ఠమునకు నాలుగు అంగుళములకుపైన మూలాధార చక్రమున్నది. ఇందు ప్రాణశక్తితో గణాధిపు డుండును. భ్రూమధ్యమందలి ఆజ్ఞాచక్రము

రెండుదళములు (రెండు అక్షరములు) గలది యున్నది. ఇట్లు అక్షరము లన్నియు దేవతలరూపమున ప్రతివానియందున్నవి. కాబట్టి యుపాసన అ-ఆలతో ప్రారంభమగుట మంచిది. శాస్త్రములలో చక్రవివరణ యున్నది. శ్రీశ్రీశ్రీ బకస్వామి చక్రము లాయాస్థానములలో మాంస రూపమున నుండునని చెప్పిరి. నరశింహయోగి అనునతడు వెన్నెముకలో చక్రములుండునని తెల్పెను. శ్రీ విద్యారణ్యస్వామి సూతసంహితాభాష్య ములో పారమార్థిక శరీరములో సుషుమ్నయందు ప్రవేశించి వాయువహ్ని రూపములనొంది పోవునపు డాయా ప్రదేశముల నాయాచక్రములు "నరేంద్ర మార్గాట ఇవప్రదీపః" అన్నట్లు లావిర్భవించుచుండునని, అది సుషుమ్న నడకయందలి స్వభావమని యనుగ్రహించిరి. ఇక శరీరమున వెనుక భాగము (వీపు) మఱ్ఱియాకువలె గన్పట్టుచుండును. మఱ్ఱిని తెల్పుశబ్దము వటమనియు, రావిని అశ్వత్థమనియు యుపయోగించుట గమనింపతగినది. వటమనగా సన్నగానుండి వ్యాప్తినొందునదని యర్థము. అశ్వత్థమనగా రేపుకూడ నుండనిదని భావము. కనుక వీపునందలి వెన్నెముక - దాని నుండి వ్యాపించిననాడులు మఱ్ఱియాకును బోలియుండుట తెలియదగినది. ఈ చెట్టు మూలభాగమున - దక్షిణామూర్తి యుండును. యోగి వాయు ధారణలో గాలి పీల్చునపుడు ఇడపింగళనాడులు గాలితో నిండును. బొడ్డు దగ్గర గుంటగా నున్ననాడి సుషుమ్న యనబడును. అపానమునుండి గాలి పోకుండ నిరోధించిన ఆ గాలి సుషుమ్ననాడియందు నిండియుండును. ఈ సుషుమ్నయందు 6 చక్రము లున్నవి. పారమార్థిక శరీరమునందు వాయువు అగ్నిరూపముననుండి, పోవునపుడు చుట్టునున్న దళముల ఆకార ములు కన్పట్టును. కావున వ్యావహారిక శరీరములో చక్రములు మాకు శవశరీరములయందు కన్పించుటలేదని డాక్టరు లనుచున్నారు. పారిమార్థి కమునందే చక్రములు భాసించును.

ప్రహ్లాదుని కథలో - ప్రహ్లాదుడు అనగా ప్రకృష్టమైన హ్లాదము, నిరుపాధికమైన ఆనందము అని అర్థము. చక్రి యనగా చక్రములయందు (షట్చక్రములు) అభిమానము కలవాడు. వీడే సగుణబ్రహ్మము. గిక్రి యనగా చక్రికి వ్యతిరేకి, అనగా అభిమానము లేనివాడు, అనగా సాక్షి, భగవంతుడు అని భావము. "హన హింసా గత్యోః" అనుటచే హింస- సింహ శబ్దము లొక్కటియే. ఇవి సగుణరూప మైనవి. నరీయత ఇతి నరః - నశింపనివాడు - నిర్గుణ బ్రహ్మరూపము. కావున నృశింహ అనగా సగము సగుణము, సగము నిర్గుణమునైన రూపముగలవాడు. అకారాది 16 అక్షరములు ప్రాణవర్ణములు. విశుద్ధస్థానమునుండి కకారాదులకు ప్రాణము రావలెను. ఈ స్థానము తామరమొగ్గవలె హృదయమున తల క్రిందులుగ నుండును. దీనిలోని సందు - ఆకాశము దహరాకాశ మనబడు చున్నది. చంద్రమండలము శిరస్సునందు గలదు. అగ్నిమండలము బొడ్డునందు గలదు. పైచెప్పిన దహరాకాశమే సూర్యమండలము. ఇందే బ్రహ్మమును తెలిసికొనవలెను. కనుక హృదయాకాశమున బ్రహ్మ తత్వము తేజస్సుతో వెలుగుచుండును. కృష్ణపరమాత్మ గీతలో చంద్రాగ్ని తేజస్సు తానేయని చెప్పుకొనెను. అనగా తాను దహరాకాశమందలి సూర్యరూపుడనని భావము. తనను కొల్చిన వానికే మోక్షమని చెప్పెను. కనుక ధూర్జటి "ఏ వేదమ్ము పఠించె లూత" అని చదువులలో మోక్షము లేదనెను. భగవత్పాదసేవతో మోక్షప్రాప్తి కలుగును. భగవంతుడు తేజోమయుడు, అందులో నాల్గవవంతు ప్రపంచరూపమైనది. ఆ పాద మును విమర్శించుటతో మోక్షమని, భగవత్పాదసేవ యన నర్థము. ఇట్లు కాక ఒక భగవంతుడు దొరకి ఆయన పాదము దొరకిన తర్వాత సేవ నాదేశింప నక్కరలేదు. సేవ చేసెదననువాని కది యెక్కడ దొరకును? కాన శ్రీకృష్ణుడు - శ్లో॥ : "యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత

మేవవా । తత్త్వదేవాఽవగచ్ఛత్వం; మమతేజోంశ సంభవం" - అని తన పాదభాగమగు నీ ప్రపంచముననే తనను తెలిసికొను ఉపాయము నుపదేశించెను. లోకమున విభూతికలదియు, అందముకలదియు నగు వస్తువుల నాయా విశేషములన్నియు భగవద్రూపముగ నిశ్చయించి యనుభవించుట పాదసేవయని తెలియవలెను. కావున లోకమును భగవంతునిగా సమన్వయము చేయుపద్ధతి యిది. ఇక ఇంతకుపై ఉపాయము శ్లో॥ ఉపాధివర్జం సకలం సోహం భావేన భావయేత్। తదాధారతయా ఉపాధీన్ బహుమన్యామహే వయం॥

ఉపాధుల హెచ్చుతగ్గులతో ఒకప్పుడు లెక్కచేయుట, చేయకుండుట జరుగును. అనగా శాస్త్రదృష్టిచే గణింపవలెను. అనుభవమున నది యుండదు. కనుక "మానవసేవయే మాధవసేవ" యన పాదరూపమయిన మానవసేవయే సర్వస్వరూప భూమానుభవమని యర్థము - కాని, మానవుల కాళ్ళుపిసుకుట కాదు. ఒకసారి శృంగేరీ స్వామివారు నాతో సంభాషించుచు బాలయోగి అన్నముపెట్టిన మీరు తినెదరా ? యని ప్రశ్నించెను. శాస్త్రమున తినుమని లేమకనుక తిననని చెప్పితిని.

గీతలో -

శ్లో॥ శునిచైవ శ్వపాకేచ । పండితాః సమదర్శినః -అన్నచోట ప్రతివానియందు బ్రహ్మవస్తు వేకరూపమున నున్నట్లు చూచుట మంచిదని భావము. అలంకారికు లొక్క శబ్దమున కొక యర్థము చెప్పవలెనన్న 14 ప్రమాణములకు సరిపుచ్చవలెననిరి. అద్దేళుని - శ్వపాకే అను సప్తముల కెల్ల వృత్తిత్వ మర్థము. అన్నిటియందు నున్న తత్త్వము సమమనగా బ్రహ్మమని తలపవలయునని కాని, అందఱను సమానముగా జూడుమని యర్థముకాదు. ఈ భాష స్వభావమెఱుగని పండితుల ఉపన్యాసము లిట్లే యుండును. ఈ శ్లోకమునకు శ్రీ తిక్కయజ్వ భారతమున నొక పద్యము

వ్రాసెను. అది గమనింపనగును. ఉపనిషత్తులలో 32 బ్రహ్మవిద్యలు గలవు. వారివారి శక్త్యానుసారము ఏదో ఒక విద్య నాశ్రయించుట మేలు. ఇవి అన్నియు నొక్కనికి నుపాస్యములు కావు. భిన్నభిన్న మార్గములు గల విద్య లొకరికి నెట్లు సాధ్యములగును, అని శంకరులు వ్రాసిచ్చిరి. మద్యమాంస నివేదనతో కూడిన శక్తి ఉపాసన ఎంతమాత్రము కూడదని ఆచార్యస్వామివారు వచించిరి. కాని విద్యారణ్యులు ఉపాసన ప్రధానముకాన శంకరులు చెప్పిన సమయాచారము దొరకనిచో కౌలాచారమైన నాశ్రయించి దేవిని భజించుట యవసర మనిరి.

# 4

శైవ వైష్ణవమతములలో క్రమముగ శివుడు, విష్ణువు ప్రాముఖ్యము వహించి యున్నారు. వారిని సేవింప కైలాసమునకుగాని వైకుంఠమునకుగాని పోవలెను. అద్వైతమునందు నీవే బ్రహ్మవు (తత్త్వమసి) అనుమాటతో బోధ పూర్తియగుచున్నది. కాబట్టి ఈ "నేను" అను వస్తువు అహంకారాశ్రితమై వెలయుచున్నదిగాన దీనిని బ్రహ్మస్వరూపముగా సులువుగా నిరూపణము చేయవచ్చును - అనుభవింపవచ్చును. సామాన్యముగ బ్రహ్మవస్తువును రెండువిధములుగ చెప్పుచుందురు. 1.నాద బ్రహ్మ 2. పరబ్రహ్మ. నాదబ్రహ్మోపాసన 6 నెలలుచేసిన పరబ్రహ్మ స్వరూపము సాక్షాత్కరింపనగును. నాదమనునది ప్రకృతి పురుషులమధ్య పుట్టుచున్నది. నాదోదయ, పూర్వ - నాద విరామాంతముల యందు బ్రహ్మము తోచుచున్నది. ఈ నాదమునకు అధిదేవత అగ్ని. ఇది లేకున్న నాదము పుట్టజాలదు అగ్న్యధిదేవతా కమనః ప్రేరిత ప్రాణాహత మూలాధారావిర్భూత పరాదివాగ్రూపమునాదము కనుక ప్రాణశక్తి దానిని ప్రేరేచి నపుడు నాదోత్పత్తి ప్రకృతి - పురుషులమధ్య పుట్టుచున్నది. ఈ నాదము నాల్గువిధము లగుచున్నది. 1. పరా ఇది సూక్ష్మరూపమైనది. ఇది మూలాధారమునుండి బొడ్డువఱకు నుండు రూపము. 2. పశ్యంతి. ఇది బొడ్డుదగ్గఱనుండి హృదయమువరకు నుండు రూపము. 3. మధ్యమ. ఇది హృదయమునుండి కంఠమువరకు వ్యాపించురూపము. ఇది శ్రుతిగోచరమైన వాక్కు. 4. వైఖరీ. ఇది కంఠమునుండి నోటివరకు వ్యాపించి శబ్దనిష్పత్తిని కలిగించునది. వైఖరీ వాక్కు షట్చక్రాది స్థానములందలి కోణముల నున్న సందులనుండి అక్షరముల స్వరూపనాదముతో చేరి మనః

ప్రేరణతో కంఠ్యాది శబ్దములన్నియు పుట్టుచున్నవి. కనుక నాదోత్పత్తికి అధిదేవతయగు అగ్నియొక్క ప్రాముఖ్యము గమనింపదగియున్నది. పశు పక్ష్యాది మనుష్యభాషలన్నియు నిట్లే బయలుదేరినవి. కాని ఇవి పలుకు నప్పుడు అపానమునుండి గాలి పోకుండుట అనుభవము. అట్లుపోయినచో నాదముండదు. అందులకే మనవారు మాటాడునప్పుడు - రెండు మూసికొని పొమ్మని - వ్యవహారము కల్పించిరి. అట్లు వాయు స్తంభనము సూచించు టకే మనవారు బిళ్ళగోచిపెట్టి పంచెకట్టుట. మొత్తముమీద వాయువు అపానమునుండి పోకున్నచో - నోటినుండి శబ్దరూపమున వెలువడుట గమనింపనగు. కాని ఋష్యాదులు మౌనవ్రతధారులై వాయుపూరకముచేసి గొప్ప మహత్తును సాధించుచున్నారు. "మౌనం సర్వార్థ సాధకం" అని కదా పెద్దలు చెప్పిరి. యజ్ఞముచేయునపుడు యజమానియు నోరుమూసి కొని మౌనవ్రతము పాటింపవలయును. ఒకసారి పిశుపాటి సీతారామశాస్త్రి అనునాతనికి యోగాభ్యాసమునందు శంకరాభరణరాగము తనంతట తాను మనోహరముగ జనించి యోగపర్యంత ముండెడిది. ఇందులకు కారణ మేమన అతడు యోగమునందున్న సమయమున నోరు తెరిచికొని యుండెను. కాని యోగమునం దిది పనికిరాదు. సర్వేంద్రియములు మూసియుండి వాయుపూరణము చేయుట మంచిది. మనము రోజు తిట్టు చున్న తిట్లయందును వేదాంతమున్నది. దుంపతెగ లేక త్రాడుతెగ అను చున్నారు. దుంప అనగా అజ్ఞానము. త్రాడు అనగాకర్మసూత్రము. ఇవి నశించుటయే వేదాంత పరమార్థము. కనుక నాదాభ్యాసమున నెన్నియో నియమము లుండుట గమనింపనగును.

భారతమున కృష్ణుని దగ్గఱకు సంజయునిరాక గమనించినచో ఆశ్చ ర్యము గొల్పును. సంజయుడు వచ్చినప్పుడు - కృష్ణునకు తెలియజేయ బడు సందర్భమున కృష్ణుడు పండుకొనియుండెను. అర్జునుడు పాదసేవ చేయుచుండెను. ద్రౌపది, సత్యభామ కూర్చుండియుండిరి. అపుడు సంజ

యుడు కృష్ణుడు అంతఃపురమున నుండుటగమనించి వేషము మార్చుకొని వెళ్ళినాడట. అపుడు కృష్ణుని కనుసంజ్ఞతో అర్జునుడు పాదపీఠినుండి కాళ్ళు తీయగ, ఆ పీఠమును దాసీలు సంజయునకు కూర్చుండుటకు ఉంచిరి. అప్పుడు సంజయుడు అ పీఠముపై చేతులుంచి నమస్కరించి తాను అను కొని క్రింద కూర్చుండెనట. ఆ భగవంతునంతవాని పాదపీఠమున తాను పృష్ఠము చేర్చరాదని భావము. ఎచట కెట్టి వేషముచితమో అది వేయ వలెను. అట్లుకాక ఒక్క లాగుతో చరించుట ధర్మమా ?

శిరస్సు పైభాగమునందు సహస్రారమను చక్రమున్నది. ఇదియే చంద్రమండలము. యోగులకు మాత్రమిది అమృతమును ప్రసవించును. లౌకికులకు వీర్యమును ప్రసాదించును. "అష్టాచక్రా నవద్వారా" అని వేదము చెప్పుచున్నది. బ్రహ్మరంధ్రమునకు పైన నాలుగంగుళములలో పీఠకచక్రమున్నది. ఇది బ్రహ్మస్థానము. కనుకనే వైదికులగువారు శిర స్సుపై చిన్నజుట్టు ముడినుంచి దానియందొక పుష్పము నుంచెదరు. అనగా బ్రహ్మస్థానమున కడి యొక పూజగ మనము గుర్తింపవలయును. మన అలంకారము లన్నియు పరమార్థసాధనకేగాని కేవలము భోగచిహ్నములు కావని గుర్తింపవలయును. శాస్త్రమున మానవులకు ఒకజడ మాత్రమే విహితము. ఇక మూడునుండి పైన రాక్షసులకు నిబంధింపబడినవి. కాబట్టి రెండు జడలవారు రాక్షసులయందుపైతము కానరారు. అందువలన మాన వులు రెండు జడలు వేయరాదు. అట్లు జడను రెండు పాయలుగ చీల్చుట యనునది తల్లిదండ్రులు పోయినప్పుడు మాత్రమె జరుగవలసిన క్రియ. కావున ఈ యాచారములన్నియు నశ్లీలములని గమనించి వర్తించుట ఆవశ్యకము. జుట్టు లేకున్నను నది ముడువకున్నను ఎనిమిదవ చక్ర మందలి తేజము క్షరించును. దానిచే వారు దుర్బలులగుదురు. ఏ మంచి వైదికకార్యములకు పనికిరారు అని ఆగమములు, సైన్సు చెప్పుచున్నవి. కాబట్టి భారతీయులు బ్రహ్మతేజస్సును క్షరింపనీరాదు వీడినచో దయ్య

ములు, భూతములు పట్టుటలో ఆశ్చర్యమేమున్నది? ప్రస్తుతము నాద బ్రహ్మోపాసనమనగ తారకమంత్రమగు ఓంకారము నుపాసించుట. ఇది అ+ఉ+మ ల కలయికవలన నేర్పడుచున్నది. ఈ నాదబ్రహ్మోపాసన వలన బ్రహ్మసాక్షాత్కారము కలుగగలదు కానియిది సంగీత సాహిత్య ముల వలనకూడ సాధ్య మగుచున్నది.

శ్లో॥ సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం।
ఏకమాపాత మధురం అన్యదాలోచనామృతం॥

అని పెద్దలు చెప్పిరి. ఈ నాదమునుగూర్చి తర్వాత చెప్పెదను.

నేను మొదట అప్పులబాధతో జీవితము గడుపుచుంటిని. ఒకరోజు నేను కలలో ఏదో పద్యముఁ వ్రాయుచుండగా—అప్పిచ్చినవాడు వచ్చి నా చేయిపట్టుకొని అప్పుచెల్లించుమని కోరెను. అప్పుడు నేను -

శా॥ కావ్యశ్రీ చనుమా త్వదేకరతునిం గామింతు వష్టాచ ధా
నావ్యాజ ప్రతిభా యొనర్తు నెది నిర్వ్యాపారునింగూడి ది
వ్యవ్యాహార సతీమణీ తొలగు మెంద్తైనష్టలండీ ఋణా
గ్ణవ్యాపార ఝరీభ్రమిభ్రమరుదేనా మిమ్ము పోషించుటల్॥

అను పద్యమును కావ్యలక్ష్మి నుద్దేశించి నిర్వ్యాపారునైన నావద్ద నుండక పొమ్మని విసువుతో వ్రాసితిని. మా తండ్రిగారు పోవునప్పటికి రామాయణమున 6 వేల పద్యములు వ్రాయవలసి యున్నది. గాయత్రీ మంత్ర బంధముతో పద్యరచన నీవే చేయవలసినదని తండ్రిగారు నన్ను ఆదేశించిరి. అట్లు నేను పూర్తిచేయనెంచి ఎప్పుడు పూనినను పద్యము తోచక కాలము వ్యర్థముగా గడచెడిది. ఒకరోజు కలవచ్చినది. నేను ఎచటనుండియో ఇంటికి వచ్చుచుండగా నొక తురకబూబు వాకిటి అరుగుపై

పరుండియున్నది. ఆమె చొక్కాయెత్తి ఒక తరుణవయస్కుడు పాలు ద్రావుచున్నాడు. నేనట్లే నిర్ఘాంతపోయి చూచుచుండగా నామె యేల అట్లు చూచెదవనినది. నాకు కూడ కొంచెము పాలిచ్చెదవేమో యని యంటిని. ఆమె వెంటనే కావలసినచో నెగబడి త్రాగుమన్నది. ఆ మరుసటిరోజునవే

కం॥ ధర్మమయ రమ్యహర్మ్యము
లర్మిలి ప్రియురాలిఁగూడి యలరించెడు నీ
శర్మద పదయుగ మస్మ
త్కర్మములు దొలంచు పనికిఁ గాననమెనసెన్॥

అని భకారముతో పద్యము ప్రారంభము చేయుచుండగనె ముగిసినది. తర్వాత రేపు అచ్చునకు గావలసిన పద్దెము లీరాత్రి వ్రాయుచు వారి కృతి పూర్తిచేయ బూనితిని. ఆ బాబురూప మిప్పటికిని కనుల గట్టినట్లు కన్పట్టెడిని.

చం॥ ఎగబడిత్రావు కావలసెనేనని చన్నిడి త్రావువేళఁ బూ
ర్తిగ నొక గ్రుక్కకేనియు భరింపగరావని లేదొ యన్న న
న్నెగదిగచూచి చిన్న నగవిమ్మగు సొమ్ముగఁ గందపద్దె మ
ల్లగ నవి చాలుఁబొమ్మని యలక్షితయౌ యవనిం దలంచెదన్॥

అని వినుతించి గ్రంథము వ్రాయుచుందును. కాబట్టి మనకు మోక్షము లేక స్వర్గము లేక వ్యావహారికమైన పనులు కావలసియున్నచో దేవతానుగ్రహమవసరమై యున్నది. అందులకు ముందు పారమార్థిక శరీరము నందలి దేవతలను గుర్తింపవలసియున్నది.

కర్మజ్ఞాన ఉపాసనాకాండలని మూడువిధములుగ వేదోదితము విభాగింపబడినది. "ఆచారహీనం నపునంతి వేదాః" అన్నట్లు కర్మకు

ఆచారము ప్రధానము. వేదోక్తమైనది ఆచారము. ఇట్టి ఆచారవంతుని ఏదియు ఏమియు చేయజాలదు. ఇందులకు నిదర్శనమైన కథ చూడుడు. ఒక ఋషికుమారుడు కృష్ణాజినము కప్పుకొని ఊయలనూగుచు చదువు కొనుచుండెను. అది గమనింపక వేటకువచ్చిన రాజకుమారుడు మృగ మనుకొని విషదిగ్ధబాణముతో కొట్టగా నాతడు క్రిందబడెను. అంత రాజ కుమారుడు భయపడి రాజధానిచేరి తన పెద్దలను కొందఱ గైకొని ఆ మునిపల్లెకుబోయి, ఆ కులపతి మర్యాదచేయ దానికి మే మనర్హులమని రాకుమారుడు బ్రహ్మహత్య చేసెనని దాని బోగొట్టుకొను నుపాయ మడుగ వచ్చితి మనిరి. ఇదియంతయువిని యా కులపతి మీ రెక్కడ బ్రహ్మ హత్యచేసితిరని అడిగెను. వారీ యాశ్రమముననే చదువుకొను కుఱ్ఱవానిని మావాడు మృగమను భ్రాంతితో గొట్టెననిరి. ఆ ముని తన విద్యార్థులనెల్ల జూపి వీరిలో మీవాడు చంపిన దెవరినని యడిగెను. ఆ కొట్టినవాడు గుర్తించి ఈ పిల్లవాని కొట్టితిని, పడిపోయెను, ఎట్లు బ్రతికెనని దిగ్భ్రాం తుడై యడుగ ఆ కులపతి చెప్పిన సమాధానము

శా॥ ఆలస్యం బొకయింతలేదు శుచి యాహారంబు ధర్మక్రియా.... (భార)

అను పద్యమున ఆ మునిబాలకుని శుచిత్వము నిరూపించెను. ఆచార మిట్టిది కావున ఇట్టివారిని ఎవ్వరు ఏమియు చేయజాలరు. దినమున కొక సారి సమృద్ధిగాగాని తేలికగా రెండుమార్లుగాని తినుమని ఆపస్తంబుల వారు చెప్పిరి. భారతమున భీష్ముడును - ఇరుమారు గుడుచుచు నెడనెడ గుడుపకయుండు నాతండు సదోపవాసి - అని చెప్పెను. ఆ పక్షములో కొంద ఱొకపర్యాయము నీరుత్రావుదురు. కొంద రదియు సమ్మతింపరు. అట్టి నియమముగలవారి తపము సాగును. మితిమీరి తిన్న వారి తిండి వైశ్వానరు డెంతయని జీర్ణము చేయగలడు? అనగా అగ్నిమాంద్యము కలిగి అజీర్ణరోగము పుట్టును. కాబట్టి వేళదాటక ఇట్టి సత్కార్యాచరణ

సంపన్నులు ఉత్తము లగుచున్నారు. నేడు ఇవన్నియు తారుమారైనవి. "ఆలస్యా దన్నదోషాచ్చ మృత్యు ర్విప్రాన్జిఘాంసతి" అని పరాశర మహా ముని చెప్పెను. ఈ అన్నియు దోషములు నేడు మనల హింసింప కలుగు చున్నవి. ఇట్లే ఈకాలమెల్ల చెడు ననరాదు. వ్యాసుడు ఆర్గురు శకపురు షుల పేర్కొనెను. అందు విజయాభినందనుడు అను వాని శకమున యంత్రముక్త ప్రేలదని పేర్కొనెను. అనగా గరిక మంత్రించివేసి శత్రువుల నాతడు జయించును. ఇతడు కలియుగమున కృతయుగ లక్ష ణము నడుపగలడని తెలియుచున్నది. కావున కుల మత భేదము లంత రించవు. వేదాదులు పోవు. కావున ఈశ్వరశక్తి మిక్కిలి ఉన్నతమైనది, చిత్రమైనదికదా ।

విద్యలన్నియు కాండత్రయరూపకముగ నున్నవి. కాని విమర్శించి చూచినచో రెండేకాండలు : కర్మ - జ్ఞానకాండలు తేలుచున్నవి. పూర్వ జన్మలో చేసిన కర్మనుబట్టి బోధప్రాప్తి కలుగుచుండును. జ్ఞానులకు కర్మ అక్కరలేదని లోకమున వాడుకకలదు. కాని యది యవిమృష్టము. "నిత్యాన్యధిగతాని కర్మాణి" అని ఉపనిషద్భాష్యములో శంకరులు నిత్యకర్మలు మా వారలు బాగుగ వ్రాసిరి కాన, అవి మేము వ్రాయుటలేదు, అవి తప్పక ఆచరింపదగినవని వాక్రుచ్చిరి "ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" అన్నట్లు ఫలము నపేక్షింపక ముందు అనుకొనక యెట్టి పనియు జరుగదుగదా ! "ఉపాత్త దురితక్షయార్థములు కర్మలు" అని శంకరులు నిత్యములకును ఫలమును జెప్పిరి. మరి కామ్యకర్మలు అవసరము వచ్చినపుడు చేయవలసియే యున్నది. "కామ్యాని చ ఫలార్థినాం" అని కామ్యకర్మలు చేయుటకూడ గృహస్థులకు నావశ్యకములని చెప్పిరి. నిత్యనైమిత్తిక కర్మవలన పాపక్షయము జరుగుచున్నది. శంకరుల భాష్యముతో కర్మ చేదని బ్రహ్మయేనని లోకము భావించి చెడుచున్నది. కాన నదియే పరమార్థమనరాదని రామానుజుడు సగుణబ్రహ్మోపాసనమైన విశిష్టాద్వైతమును నిరూపించెను.

"అద్వైత మాగమ శిరోభి రుపాసనాయముక్తం, తదేవ పరమార్థతయా న వాచ్యం" అని నీలకంఠు డనెను. అద్వైతోపాసనతో విశిష్టాద్వైతము ముక్తి యని వారి భావము. ఉపాసన సోఽహంభావములో నుండవలెనని శ్రుతి చెప్పుచున్నది. కాని అదియే పరమార్థముకాదని వారి అభిప్రాయము అందు నేనే దేవతనని యుపాసించిన దేవత పంటివాడగు

నని తేలుచున్నది. ఉపాసన యన సూరకుండుట అని యర్థము. సాక్షి రూపసంస్థానము. ఇదియే అద్వైతము. అద్వైతానుభవము లేక కర్మో పాస్తుల విడుచుటవలన కొందఱు చెడుచున్నారని వారి నుద్ధరింప విశిష్టా ద్వైతము బయలుదేరినది. నాల్గువేదములు చెప్పుచున్న మహావాక్యములు 1. ప్రజ్ఞానం బ్రహ్మ, 2. అహం బ్రహ్మాస్మి 3. తత్త్వమసి 4. అయ మాత్మా బ్రహ్మ. వీని కర్థమొక్కటియే అగుచున్నది. ప్రతివాక్యమునందు జీవ-బ్రహ్మల కేకత్వము బోధింపబడుచున్నది. పరోక్ష ప్రత్యక్షములగు బ్రహ్మ జీవులకు ఏకత్వ మెట్లు కుదురును ? అన్నచో అర్థము కుదరని చోట లక్షణావృత్తితో కుదుర్చుకొనవచ్చునని తర్కాదిశాస్త్రములు చెప్పు చున్నవి. ఆ శాస్త్రములలో జహల్లక్షణ యని, అజహల్లక్షణ యని రెంటి నొప్పుకొనిరి. మూడవదియగు జహదజహల్లక్షణ జీవబ్రహ్మైక్యమును చెప్పు వేదాంతుల మతమునందేగాని మా కవసరము లేదనిరి. ఏ శాస్త్రములు నొప్పుకొనని జహదజహల్లక్షణతో మీరెట్లు పక్షమును సాధించుకొనెద రన, వేదాంతులు ఈ మూడవ లక్షణము మీకును రావలసినదియే, అది ప్రత్యభిజ్ఞ యని పదాంతరముతో సాధించుకొని ఇది కలదనిరి. వారి ప్రత్య భిజ్ఞయే మాకు మూడవలక్షణమని వేదాంతు లనెదరు. సుబ్బయ్య అన బడు ఒక వ్యక్తిని ఒకచోట ఒకరకముగను, మరియొకచోట మరియొక రకముగను చూచినను కాలభేద, వేషభేదమేతప్ప అసలు సుబ్బయ్య మారుటలేదుకదా ! కనుక దీనికి జహదజహల్లక్షణలు పనికిరావు. కనుక దీనికి సమన్వయము కుదుర్చుటకు తార్కికులు "ప్రత్యభిజ్ఞ" అను దానిని కల్పించిరి. ఇది వేదాంతుల జహదజహల్లక్షణముతోనె చేరుచున్నది. దీనికి ఉదాహరణ ఒక కథ చూడుడు.

దేవతలు, రాక్షసులు కలసి ఇంద్రుని - విరోచనుని బ్రహ్మదగ్గర తత్త్వోపదేశమునకు పంపిరి. అంతబ్రహ్మ ఒక తొట్టిలో నీరుపోసి వారిని తొంగిచూడు మనెనట. వారికి వారి ప్రతిబింబమే కన్పించినదట. ఆ

పిమ్మట వారి నింకను బాగుగ అలంకరించి మరల చూడుమనెనట. ఇప్పుడింకను వారి ప్రతిబింబము బాగున్నదట. ఇదే తత్త్వము పొమ్మని బ్రహ్మ చెప్పెనట. అంత విరోచనుడు "అర్థకామౌ పురుషార్థౌ" — అని భావించి సొమ్ములతో, అలంకరణముతో భోగసాధనములతో నుత్తములుగ నుండుటయే తత్త్వార్థమని రాక్షసులకు బోధచేసెనట. కాని ఇంద్రుడు మాత్రము ఆలోచనలోపడెనట. పట్టిముఖము—అలంకరించిన ముఖము తేడా చూచి బ్రహ్మవస్తువు ఒకటేయనియు, ఉపాధియందు భేదమున్నదనియు గ్రహించి, అయినను బ్రహ్మనడుగుదమని పోయెనట "చతుర్వారం గురుర్వయౌ" అని నాలుగుసార్లు పోయి సందేహములన్నియు నివృత్తి చేసికొనెనట. కనుక నిట్టి అర్థముల మడివిప్పుటకే జహదజహల్లక్షణ మేర్పడినది.

భారతమున భీష్ముడు – 24 వది మాయ. 25 వది జీవుడు. 26 వది ఈశ్వరత్వము. ఇరువదియైదవతత్వము ఇరువది యారవతత్వము నెరిగిన నిరువదియేడవ తత్వమగును అని చెప్పెను. 25 వ తత్వము నల్పజ్ఞత్వాదులు, 26 వ తత్వము సర్వజ్ఞత్వాదులు వదలిన శుద్ధచైతన్యమున కాయన 27 వ తత్వమని పేరుపెట్టెను. ఆ స్థితి ననుభవించువరకు కర్మములు, ప్రారబ్ధములు విడనేరవు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అని పురాణములు చెప్పుచున్నవి. జ్ఞానియైనను శరీర ప్రారబ్ధము తప్పదని, అది మనకువలె జ్ఞానికి బాధకముకాదని ప్రాజ్ఞులు చెప్పుచున్నారు. యముని రావణు డొకసారి—"పురుషుడు కర్తయే దురితపుంజ మొనర్ప" అని ప్రశ్నించెనట. మరి దోషమునకు కర్తకాకున్న, పుణ్యమునకు కర్తయగుచున్నాడా ? అను ప్రశ్నములేదా ? పుణ్యమునకుకూడ కర్తకాదనియే సారాంశము. ఏలన—

శ్లో॥ జానామి ధర్మం నచ మే ప్రవృత్తిః
జానామ్యధర్మం నచ మే నివృత్తిః

కేనాఽపి దేవేన హృదిస్థితేన
యథా నియుక్తోఽస్మి తథా కరోమి॥

అని యభియుక్తులు భావింపమనుచున్నారు. సాంఖ్యమున 25 తత్వములు చెప్పబడినవి. అందు 24 వది మాయ. 25వది పురుషుడు. మాయతో కలసిన బంధము—సంసారమునకు దారితీయును. మాయతో కలియకున్న ముక్తి లభించును. ఈ సాంఖ్యమతము వారు సుఖదుఃఖములు అంతఃకరణ ధర్మములని నిరూపించగా శంకరులు వారిని "సాంఖ్యా వివేకినః" అని మెచ్చిరి. ఇవి జీవుని లక్షణములని తర్కాదుల మతము. కాబట్టి జీవుడు సాంఖ్యులప్రకారము జ్ఞానియై మాయను వదలుటయే మోక్షము. అనగా బౌద్ధాదులు. అంతకు మునుపును శుద్ధుడవు జీవుని మాయ యెట్లు సంసారమునకు దిగిచినదో - అట్లే ఇపుడును శుద్ధుడవు నా జీవుని మాయ సంసరణమున దిగిచిన జీవుడు మరల సాధనచేసి మోక్షము సంపాదింపవలసి వచ్చునుగదా! ఈ నిత్యముకాని మోక్షమునకు మాటిమాటి కాసించి శ్రమమేనయుటకన్న జీవు డిపుడున్నట్లే యుండుట మంచిది-అని పూర్వపక్షము చేసిరి. దీనికిపైన యోగమతమువారు 26 తత్వములని నిరూపించిరి. ఒకసారి ముక్తుడగు జీవుని మాయ లోబరచుకొనకుండ 26 వ తత్త్వమగు ఈశ్వరుడు నియమించునని వారి మతము. సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమైనది బ్రహ్మస్వరూపము. మరియు సచ్చిదానందరూపమైనది బ్రహ్మ స్వరూపము. మన మేదేని వస్తువు ననుభవించినపుడు వచ్చిన యానందము, మనోవృత్తి ఆగినపిమ్మట వచ్చిన ఆనందమని గ్రహింపవలెను. కాని ఆవస్తువునుండియే అట్టి యానందము లభ్యమగుటలేదు. కుక్క ఎముక కొరికి కొరికి చిగుళ్ళు నొప్పిపుట్టి అందునుండి స్రవించిన రక్తమునే బహురుచ్యముగానున్నది, ఎముక యని తినుట వంటిది. కనుక అంతఃకరణము మనస్సు మొదలైన వానివలన మనకు వస్తువిషయక జ్ఞానము కలుగును. ఇంద్రియముల ద్వారమున కలిగిన జన్యజ్ఞానమును

ఆపినపుడు ప్రజ్ఞానమాభాసించును. ఇది ఎట్లున్నదన పిల్లకాల్వల కట్టివేసి నపుడు ఆనకట్ట లోని నీరు భాసించినట్లు. ఇక యోగమతమే విశిష్టాద్వైత మని భావింపవచ్చును. "ఏతేన యోగః ప్రత్యాఖ్యాతః" అని వ్యాసులు నుడివిరి. అద్వైతమతమునుగూర్చి చెప్పునపుడు ఇతరులకు - గొంగళిలో వేసికట్టి ఏటిలో పడవేసినట్లుండునని గౌడపాదాచార్యులు సెలవిచ్చిరి. యోగులు అనుభవమునుగూర్చి - "ప్రకాశమానే పరమాత్మభానౌ । నశ్యత్య విద్యా తిమిరే సమస్తే । అహో బుధా నిర్మల దృష్టయోపి । కించిన్న పశ్యంతి జగత్సమగ్రం ।।" సమాధిలో సత్యదృష్టికి ననుభవములో లేని జగము లౌకికుల యజ్ఞానదృష్టిలో నున్న దాని వాదు చెప్ప నేల ? అని యాక్షేపించిరి. కాబట్టి యోగసమాధియందు తా ననుభవించు బ్రహ్మముతప్ప ఇతర ప్రపంచ మేమియు కానరాదు. "సత్యం తీర్థం, క్షమాతీర్థం, తీర్థ మింద్రియ నిగ్రహః"— అని వ్యాసభట్టారకు లంత స్తీర్థములను పురాణములందు గొనియాడిరి. దానివలన అంతఃకరణ శుద్ధి యగును. బహి స్తీర్థములవలన శరీరశుద్ధి కలుగుచున్నది. ఆ రెండుశుద్ధులు యోగికి యోగసాధనములు. అంత స్తీర్థముల గొప్పతనమును జెప్పుటకు నది యున్నవారికి బహి స్తీర్థము లక్కరలేదని కూడననిరి.

శ్రీ భగవద్గీత యందు చరమశ్లోకము ప్రధానమని - "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" - అని వైష్ణవులు భగవం తుడు చెప్పిన సూక్తిని ప్రధానముగ భావించుచున్నారు. "తదా స్తిమితం గంభీరం న తేజో న తమ స్తతం - అవాఖ్య మనభివ్యక్తం సత్కించి దవశిష్యతే"- అని భగవంతుడు స్వరూపస్థితిని వర్ణించెను. అట్టిదియే బ్రహ్మ మని అద్వైతులు. దీని యర్థమును స్వయముగ ననుభవింపనగును. కాని తాను పుణ్యముసేయక దేవుడు నా కీయలేదని దరిద్రుడై దేవుని నిందింప రాదు. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" మంచిగాని చెడుగాని చేసిన దనుభవింపక తీరదుగదా! భగవంతుడు వెలుతురు కాని వాడు, చీకటి కానివాడు. ప్రపంచమంతయు నిండియున్నాడు. అనభి ప్రఖ్యము అన స్పష్టముగ నిరూపించుటకు శక్యముకానివాడు. అనాఖ్యుడు, స్తిమితుడు, గంభీరుడు - ఇట్లు చెప్పుచున్న నాస్తికుల మతమే యన ఎలసి వచ్చుచున్నది అను శంక నిరాసించుచు "సత్కించ మవశిష్యతే" అని సిద్ధాంతమును చెప్పిరి. సత్ అనగా ఇట్లు విమర్శించి మీ రేమియు లేదను వస్తువు. అది లేనిదే లేనిదాని ననుభవించునది ఏది? అదియే బ్రహ్మమని స్వామి యభిప్రాయము. గీతయందు భగవంతుడు, జ్ఞాని నాయొక్క స్వరూపమే యనెను. అట్టి జ్ఞానికాని వానికి తన్ను గొల్చి కృతార్థుడగుటకు భగవంతుడు కొన్ని మతములు చెప్పెను. మొదటిది కైంకర్యమతము. ఇందు భక్తుడు భగవంతునికి జీతగానివంటి వాడు. తన కృత్యమంతయు భగవంతునికి చేయవలసిన దనియే భక్తుడు నిర్వర్తించిన, భక్తునకు కావలసిన వన్నియు భగవంతుడు ఇవ్వ

గలదు. ఇదియే - "యోగక్షేమం వహామ్యహం" అను భగవంతునిమాట కర్థము. ఒకరిపని యొకరు చేయుట కుదర దనువారు కర్మముల నుపాసనల తనపని యనియే చేసి-ఓం తత్సత్ అని బ్రహ్మార్పణము చేయవలెను. అట్లు చేయుట తన ధనమును బ్యాంకులో నుంచుకొన్నట్లు. భగవంతుని యధికారములోనుండు ధనాగారమునుండి ధనము స్వీకరించునట్లు మనకు కావలసినప్పుడు వానినుండి స్వీకరింపవచ్చును. ఆ నమ్మకము లేనివాడు తాను సత్కర్మము చేసి దాని ఫలము అని కర్మమతసిద్ధాంతము చేయును. అపాయములేని యుపాయముల నెఱిగిన జ్ఞాని యీ కర్మముల బెడబాచు కొను నుపాయమును దేవుడే చెప్పియున్నాడు.

శ్లో॥ అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధం
వివిధాచ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం॥

అని మంచిపనికాని, చెడుపనికాని చేయుటకు ఐదు కలపవలెను. కావున నేపనియైనను అయిదింటి కలయికవలననే జరుగుచున్నది. అధిష్ఠాన మనగా శరీరము. కర్త యనగా జీవుడు. కరణములు ఇంద్రియములు. ఇక చేష్టలు వేఱు. అవి వాయువీయములు కర్మేంద్రియ చేష్టలు. ఈ నాలుగు కాక దైవము మరొకటి యున్నది. మన సర్వేంద్రియములకు అధిదేవతలు గలరు. వీరి ప్రేరణచే పని జరుగుచున్నది. కంటికి సూర్యుడు, చేతికి ఇంద్రుడు, కాళ్ళకు విష్ణువు, ఇట్లు అధిపతులను చెప్పి యుండిరి. కనుక ఈ ఐదింటి కలయికవలన పనులు జరుగుచున్నవి. తప్పు కాని ఒప్పుకాని ఈ ఐదింటివలన జరిగినచో - ఆయా తప్పొప్పులు ఎవరి పని నిర్ణయింపనగును. ఇది జాయింటు వ్యాపారమువంటిది. జాయింటుదార్లెల్ల ఆస్తిలేనివారైనచో దండుగ కెవడు బాధ్యుడు ? కాన నేను చేసితినని ఒకరు ఒప్పుకొనుటయే తప్పు. ఈ యుపాయము గీతలో భగవంతుడు బోధించియే యున్నాడు. ఎవరు జీవుడు వేఱు, శరీరము వేఱు అని

భావించగలరో వారు యమునిదగ్గర తప్పులన్నింటికి తప్పించుకొనవచ్చు నట. అనగా జీవుడు జ్ఞానమున బ్రహ్మమయుడై యుండ అధిష్ఠానమను శరీరాదులు నశింప కర్మ మెవరిది ! అని అభిప్రాయము.

ఓంకారము ప్రకృతి పురుషులమధ్య ప్రారంభమై బ్రహ్మయందు లీనమగును. ఈ ఓంకారము పరాపరబ్రహ్మస్వరూపము. ఇది వ్యాకరణ ప్రకారము అవతి ధాతువుమీద ఔణాదిక ప్రత్యయము చేర్చగా నేర్పడును. సోఽహం అను పదమునందలి ము వదలి ఓకారము మొదలుకొని హకారముమీది మకారముతో ప్రత్యాహారముచేయ ఓమ్ అని యేర్పడుచున్నది యనియు పెద్దలు చెప్పుదురు. ఈ ఓంకారజపము సన్న్యాసులకే యుక్తము. గృహస్థులు దీని నేమంత్రమునకైనను చేర్చి జపించవలయును. సంసారులు గాయత్రిచేయుట యుక్తము. దానిచే వారు తరింపవలయును. "గాతారం త్రాయతే ఇతి గాయత్రి" కనుక వారిని తరింపచేయగలదు. ఈ గాయత్రి సూర్యుని చూచుచు చేయుటమంచిది. గాయత్రీమంత్రమునకు సూర్యపరముగా, శివపరముగా అర్థములుచెప్పుట గమనింపదగినది. పనులయందు ప్రబోధించువాడు సూర్యుడు అట్లే గాయత్రి కూడ అని సూర్యపరముగ అర్థము. "భర్గస్య దేవస్య ధీమహి" అని భర్గుడను పేరుగల శివుని - అని శివపరముగ అర్థముచెప్పుట కలదు. కాబట్టి అద్వైతులు శైవులు చెప్పుచున్న అర్థమునుబట్టి - బుద్ధిని ప్రేరేపించు ఒకడు - అనగానే ద్వైత మతము వచ్చుచున్నది. కాని ఈ మంత్రము అద్వైతులకే ముందు అన్వయించుచున్నది. కాని శాక్తేయులు గాయత్రీయని స్త్రీలింగముగ ఆ మంత్రమును భావించిరి. "ముక్తా విద్రుమ........"అని స్త్రీరూపముగ భావించుట జరిగినది. ఇచట శివస్వరూపమును ఆగమశాస్త్రము చెప్పుచున్నది. మా బుద్ధివృత్తులను ప్రేరణము చేయు దేవుడు అన్న దేవునకు కర్తృత్వము వచ్చునుగదా ! అద్వైతులకు ఈ మంత్ర సమన్వయ మెట్లని

ప్రశ్నింపవచ్చును? కర్తృత్వాదు లారోపితములు. దీనికి పురాణముల యందు వ్యాసులు—

"అనాపన్న వికారస్స న్నయస్కాంతవ దేవయః
బుద్ధ్యాదీం శ్చాలయే త్ప్రత్యక్సోహ మిత్యవధారయ"

అని చెప్పినచోట చాలయేత్తని కర్తృత్వ మారోపితము. ఇది అనాపన్న వికారుడు అను విశేషణముపలన ప్రాప్తమగుచున్న, అయస్కాంత దృష్టాంతము నట్టిదియే: ఈ బ్రహ్మవస్తువు అయస్కాంతముతో పోల్చి చెప్పబడినది. అయస్కాంతము వికారము లేనిది. చలనములేదు. కదలు వస్తువునకు దానిదగ్గర చలనము కలుగుచున్నది. అట్టి శక్తి నిర్వికారమగు అయస్కాంతమందు కల్పించుటకన్న తత్సమీపమున గదలు శక్తియందే కల్పించుట యుక్తము. అట్లే బ్రహ్మవస్తువు సర్వగతమై యున్నది. దాని సన్నిధానమున నితర తత్వములు చలించుచున్నవి. అవి—

"యస్య సన్నిధి మాత్రేణ
దేహేంద్రియ మనోధియః
విషయేషు చ ప్రవర్తంతే
తద్బ్రహ్మా స్మ్యవధారయ॥"

అని బ్రహ్మసాన్నిధ్యముచే అన్నియు ప్రవర్తించుచున్నవి. కాని బ్రహ్మము మాత్రము నిర్వికారమని భావింపవలయును.

ఇక గాయత్రి జపము తర్వాత ఆగమశాస్త్రము అనేక మంత్రములు చూపుచున్నది. నమశ్శివాయ మొదలగునవి చేయుమనుచున్నది. కాని విద్యారణ్యులు పంచాక్షరీమంత్రము నామమంత్రముకన్న వేదమంత్రము మంచిదని అభిప్రాయపడిరి. "త్రియంబకం యజామహే" అని నే జపిం

చెద ననిరి. "నమశ్ శివాయ ఓం" అనగా మశ్ శబ్దమునకు నాది అని అర్థము. శివాయ అనగా శివః అని విభక్తి పరిణామము, మశ్=నాది. న= ఏదియు లేదు. ఓం. ఆ నేను శివః శివుడనే అనుటయే నమశ్శివాయ మంత్రార్థమని శ్రీ పద్మపాదాచార్యులు నిరూపించుచున్నారు. నమోనారాయణాయ అన్నను నమశ్శివాయ అన్నను అట్లే సమన్వయించుకొన నగును. బ్రహ్మవస్తువు తాను ఒక్కటియే యని యనుభవింపవలెను. కొన్ని మంత్రములకు ఆగమశాస్త్రము ద్విముఖములు రెండేసి యర్థములు చెప్పినది. దుర్గను ధ్యానించునపుడు ఆమెను ఆకుపచ్చరంగుతోను బంగారు రంగుతోడను ఉపాసించవచ్చునని రెండు ధ్యానములున్నవి. "ఉత్తిష్ఠ పురుషి హోమప్రఖ్యాం" అని ఒక ధ్యానము' "నవ దూర్వా సదృశీ" అని మరియొక మంత్రముతో కుండలిని లేపి "భయం మే సముపస్థితం, యది శక్యం అశక్యం వా!" అని జపించినచో హోమరూప పరాశక్తి వలన సంసారభయము పోగొట్టుకొనవచ్చును దూర్వాసదృశియగు దుర్గవలన లౌకికభయము పోగొట్టుకొనవచ్చును. ఈ పరాశక్తివలన భుక్తి ముక్తి లభించునని శాక్త శాస్త్రము చెప్పుచున్నది. శంకరులు సౌందర్యలహరిలో—

శ్లో॥ వరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం
తవాపాంగా లోకే పతిత మనుధావంతి శతశః
గలద్వేణీబంధాః కుచకలశ విస్రస్త సిచయాః
హఠాత్త్రుట్యత్కాంచ్యో విగలిత దుకూలా యువతయః

అని వర్ణించెను. యోగమున భ్రూమధ్యమునకు దగ్గర వచ్చినపుడు సాధకునకు రుద్రకన్యలు కనబడుచున్నారు వారికి లొంగక సాధకుడున్నచో పరాశక్తి యనుగ్రహమున శివస్థానము నెనయగలడు. లేకున్న నెత్తి యడచుట సంభవించి చెడిపోగలడు. ఆ శక్తిని —

"తురీయా కాపి త్వం దురధిగమన నిస్సీమ మహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి"

అని వర్ణించుచున్నారు. ఇదియే పరాశక్తిగ భావింపబడుచున్నది. కామేశ్వరి యనియు శాక్తేయమున గలదు. ఇట్టి పరాశక్తివలన సాధకులు మోక్షమునొందుట గలదు. భగవంతుని ధ్యానముచేయువారు వారివారి ఆశయముల ననుసరించి ఆయా దేవతల నాయా రూపములలో ధ్యానింపలెను. అనగా ఐహిక, ఆముష్మిక లేక పరార్థ, అపరార్థములకు మంత్రములు వేర్వేరుగ నున్నవి. శివుని శాంతమూర్తి పార్వతీసహితునిగ "శాంతం పద్మాసనస్థం"- అను శ్లోకముతో ధ్యానింపవచ్చును. కైవల్యాపేక్షిప్రపంచ మంతయు నిండియున్న స్వరూపముగ "చైతన్యం పరిపూర్ణ మేక మనిశం"—అను శ్లోకముతో ధ్యానింపవలెను. లోకమున నెన్నియో మంత్రములున్నవి. ఏ ఒక్కదానితోడనైనను మోక్షము లభించగలదు. కాని బ్రహ్మచర్యమునందే ఆయా మంత్రోపాసన చేసి వివాహమాడుట మంచిది. ఏలన లౌకిక వ్యవహారములోబడి మంత్రోపాసన చేయుట కష్టమగుచున్నది. అందుకనియే బ్రహ్మచర్యమున తపము, జపము చేయుట మంచిది. మరియు 14 ఏళ్ళ లోపు పిల్లలు చేయు పాపమంతయు తల్లిదండ్రుల కంటుననిమాండవ్యుడు పేర్కొనెను. కాన చిన్నతనములో నుపనయనముచేసి ఆవటువు గాయత్రీసిద్ధుడగునట్లు,ఇతరమంత్రముల జపించునట్లు, యోగాభ్యాసము చేయునట్లు తల్లిదండ్రులుగాని, గురువుగానిశ్రద్ధ తీసికొనవలెను.ఏదియో ఒక చైతన్యమువలన శరీరము కదలుచున్నది.కాని శరీరము జడమని అందఱకు తెలియును. శరీరమున సంవిత్తు అనగా తెలివి, అనునది యున్నది. దాని సన్నిధితో లోకవ్యవహారమంతయు జరుగుచున్నది. మన సామెత లన్నియు వేదశాస్త్ర సారములని గ్రహింపవలయును." ఒళ్ల ఎరుగని శివం వస్తుందా" అని అనుచున్నాము. మనకు తెలియకుండ కామక్రోధములు జనింపవు. అంతఃకరణ మున్నపుడు కామక్రోధాది భావములు

పుట్టక మానవు. వీటిని పుట్టుచుండగనె తెలిసికొని నిరోధించుట పెద్దల గొప్పతనము. కాన నన్నయభట్టు—

కం. అవశగతి కామరోషా
దివికారము లొదవినను మదిం ధర్మగతి
ప్రవిహతి గానీక నడచు
దివిజేంద్ర తనూజు డద్వితీయుడు పేర్మిన్॥

అని పుట్టిన కామక్రోధాదులవలన ధర్మమును చెడకుండ కాపాడు కొను కర్తృత్వము అర్జునునియందు చిత్రించెనని గమనింపవలసియున్నది.

భారతమున కౌరవపాండవుల కథ యగుచుండగా నా గ్రంథము త్రిపురాసుర సంహారముతో నేల అంతమగుచున్నదని సందేహము రావచ్చును. అందులకు సమాధానముగ గచ్ఛద్వ్యాఖ్యాత అందలి ఆత్మార్థము గ్రహింపవలయునని నుడివెను. ఇచట త్రిపురములనగా స్థూల—సూక్ష్మ—కారణ శరీరములని అర్థము. శివుడు మూడుసార్లు త్రిపురాసుర సంహారము గావించినట్లు అచ్చట గలదు. మొదట శివానుగ్రహమువలన శారీరక రోగములు నశించి దేహశుద్ధి కావలయును. పిమ్మట కామక్రోధాదులు నశించి మానసశుద్ధి యగుట సూచింపబడినది. మూడవసారి కారణ శరీరము నావరించిన తమస్సు నాశనముచేయ బడుట వర్ణింపబడినది. ఇదియే త్రిపురాసుర సంహార రహస్యము.

ధర్మరాజు జూదమున నోడిపోవునపుడు దుర్యోధనుడు పైపుట్టముల పెట్టిపొమ్మన నట్లుచేసి కట్టుపుట్టములతో పోయినట్లు కలదుగదా! పాచికల నెట్లు కైకొని పోగలిగెను? పాచికల నిక్కడనే వైచిపోయిన విరాటునకు వెండిపాచికలు, రత్నమయములు బంగారుపాచికలు చూపించి నట్లు కలదుగదా! ఆ సందర్భమెట్లు కుదురునని సందేహము కల్గుచున్నది.

కాని వ్యాసుని బ్రహ్మసూత్రములయందలి భావమును చూచినచో జీవుడు శరీరమువదలి పోవునపుడు 17 తత్త్వముల మూట తీసికొని పోవునట. ఈ వేదాంత అర్థమే యిచ్చట నున్నది. 17 తత్త్వములనగా జ్ఞానేంద్రియ ములు, కర్మేంద్రియములు, ప్రాణపంచకములు,మనస్సు, బుద్ధులు.

ఒక బ్రాహ్మణుడు దారింబోవుచు మధ్యమందున్న ఒక గాడిద పిల్లను గొట్టగా, అది తల్లితో నీ బ్రాహ్మణుడు నన్ను కొట్టెనని చెప్పు కొన, ఆ తల్లి వాడు బ్రాహ్మణుడైన నిన్నేల కొట్టును ? వాడు చండాలుడు అనెను. అది విని సర్వభాషావిజ్ఞానముగల బ్రాహ్మణుడు అతని తండ్రి వద్దకుబోయి యా కథ చెప్పి నేనెట్లు చండాలుడ నైతినని అడుగ నాతడు నీ తల్లి నడుగుమనెను. వాడట్లుచేయ వానితల్లి ఒకప్పుడు తా నొక మంగ లితో కలిసినట్లు సూచించెను. దానివలన నతడు ఖిన్నుడై విలోమజాతి జాతుడగుటవలన చండాలత్వము నిర్ణయించుకొని తండ్రి నడుగగ, ఆత డొక శ్లోకము చెప్పి ఇంద్రు నుపాసింపుమనెను. ఆతడట్లు జపింపగా ఇంద్రుడువచ్చి ఏమికావలయునని యడుగ, వాడు నేను శుద్ధబ్రాహ్మణుడగు నట్లు వరమిమ్మనెను. అంత ఇంద్రుడు ఈ తపమునకు నూరురెట్లు తపము చేసిన శూద్రుడవయ్యెదవు. దానికి పదిరెట్లుచేసిన సచ్ఛూద్రుడ వగుదువు. దానికి పదిరెట్లుచేసిన వైశ్యుడ వయ్యెదవు. దానికి పదిరెట్లు తపించి క్షత్రి యుడవు కాగలవు. దానికి పదిరెట్లయిన దుర్బ్రాహ్మణుడ వయ్యెదవు. దానికి నూరురెట్లయిన సద్బ్రాహ్మణుడ వయ్యెదవు. అంతదాక శరీరమిది నిలువదు. ఏవియేని భోగ్యములు కోరుకొమ్ము, ఇచ్చెదననిన వా డందుల కొప్పక ఎన్నిమార్లు దేవేంద్రుడు వచ్చినను తక్కు వరముల నిరసించి చివరకు శరీరము నిలువక పడిపోవుచుండ, ఇంద్రుడువచ్చి దయతో నిడు వరప్రసాదము నంగీకరించి యిప్పటికి త్రిశంకు మండలమున చందదేవు డను పేరుతోనుండి భోగముల ననుభవించుచు పూర్ణిమనాడు చంద్రదర్శ నము చేయని స్త్రీల పున్నెముల ప్రోవుచేసికొనుచున్నాడని భారతమున

గలదు. కావున పంచాంగములలో "స్త్రీణాం చంద్రదర్శనమ్" అనివ్రాయు చున్నారు. అది యెవరు పరిగణించుటలేదు. అట్లు లుండనిండది. ఈ కథవలన బ్రాహ్మణత్వ మెంత కష్టపడిన వచ్చినదో తెలియుచున్నది. దాని మనము లెక్కచేయక పట్టి భోగభాగ్యములతో పోగొట్టుకొనుట చింత్యము. కావున భారతము సర్వము నొక అక్షరమైనను తీసివేయరాని సత్యేతిహాసము. ఈ భారతము వ్యాసుడు చెప్పుచుండగా వినాయకుడు వ్రాసినట్లు చెప్పుచుందురు. వినాయకుడు ఆపకుండ చెప్పిననె వ్రాయుదుననెనట. అంత వ్యాసుడు—అర్థముచేసికొని మాత్రమే వ్రాయవలెను గాని లేకున్న తలపగులునని శాపమిచ్చెనట. కావున వినాయకుడు అర్థముచేసికొని వ్రాయులోపల వ్యాసుడు తర్వాతి ఘట్టము నూహించుకొని యుంచుకొనెడివాడట. ఇట్టి ఘట్టములకే వ్యాసఘట్టములని పేరు. ఇది "లేఖ్యంబైన ఆమ్నాయము" అని తిక్కనగారు వచించిరి. ఆయా కవులు రచించిన గ్రంథములయందు రసానుసారముగ పాత్రపోషణము సేయబడును. పురాణములు, ఇతిహాసములు సత్యములు. ఆయా పాత్రల యందలి మంచితనమునే ఆదర్శముగ నుంచుకొని నడువవలసియున్నది. కవులలో కల్పన లుండును. పురాణములలోని వర్ణనములున్ను సత్యములని చెప్పనగును.

భారతములోని చివరికథ—సర్పయాగ మెందులకు ? అనుప్రశ్నకు సమాధానమందున్నది. సర్పయాగము చేయగా జనమేజయునకు శరీర మంతయు బొల్లిమచ్చలు ఏర్పడినవట. అవి భారతము విన్నచో పోవునని చెప్పగా వినుట ప్రారంభించెను. అన్ని మచ్చలు పోయినవిగాని మూడు మాత్రము మిగిలినవి. అందులకు కారణ మేమని జయమేజయుడువ్యాసుని అడుగగ—నీకు భారతమున మూడు సందేహములు మిగిలినట్లున్నవి. వానిని చెప్పుమనెను. అంత జనమేజయుడు తన మూడు సందేహములు వరుసగా నిట్లు చెప్పెను.

1. సైంధవవధ రోజున భీముడు పదివేల ఏనుగులను ఆకాశమున కెగురవేయుట అతిశయోక్తి అనుకొంటి ననెను. వ్యాసుడు వాని నన్నిటిని జనమేజయునకు ప్రత్యక్షముగ నేటికిని కలవని దివ్యదృష్టిచూపి యొప్పించెను. 2. ఆశ్రమవాసపర్వమున 18 ఏళ్ళకు మును చనిపోయిన వారిని అందఱికి చూపుట అసాధ్యమని సంశయము. వ్యాసుడు వారిని జనమేజయునకు మరల చూపి, వారి యింట నౌకరో జుండునట్లు చేసి యొప్పించెను. ఈ రెంటితో రెండు మచ్చలు పోయినవి. 3. కృష్ణరాయబారమున కౌరవులకు అందఱు చెప్పిచూచిరి కాని, వ్యాసుడు చెప్పిన వినకుందురా? అని సందేహము వచ్చినది. దానికి వ్యాసుడు నేను చెప్పినమాత్రము వినెదరా? అట్లు నీవు వినెదవా? అని ప్రశ్నించి, అందులకు కలియుగమున అశ్వమేధయాగము చేయరాదని నిషేధమున్నది అని జనమేజయునకు చెప్పెను. నామాట నీవు నమ్మినచో నీ వశ్వమేధము చేయవలదని చెప్పి పోయెను.

తర్వాత మూడేండ్లకు ఒక దివ్యాశ్వము లభింపగ జనమేజయుడు ఉత్సాహముకలవాడై దాని నారంభించెను. గాయత్రీమంత్ర మంత్రితమవు నశ్వమును వదలిరి. అది దిగ్విజయముగ తిరిగిరాగ దానిని శ్రపణము చేసిరి. అపుడు రాణిని దానివద్ద పండుకొనబెట్టుట ఆచారము. అంత అందలి గాయత్రిశక్తి రాణిలోనికి ప్రవేశించి వీర్యవంతులైన కుమారులు కల్గుదురు అని శాస్త్రము. కాని ప్రస్తుతము శ్రపణముచేసిన, ఆ మాంస ఖండములలో ఇంద్రుడు ఆవేశించి యుండెను. అవి కదలుట కదియే కారణమని బ్రాహ్మణులు చెప్పిరి. అంత జనమేజయుడు కోపోద్రిక్తుడై భార్యను, బ్రాహ్మణులను త్యజించెను. అపుడు వ్యాసుడువచ్చిచూచి, కారణమేమని అడిగెను. జరిగినది జనమేజయుడు చెప్పి వ్యాసునిమాట నమ్మితి ననగా ఆ మచ్చపోయినది. వ్యాసముని రాణిని పుట్టింటినుండి తిరిగిరప్పించి, బ్రాహ్మణుల బిలిపించి వారలనెల్ల సమాధానపరచి, పిమ్మట పిష్టపశువుతో

మరల యాగముచేయించి అశ్వమేధ ఫలమును జనమేజయుడు పొందునట్లు చేసెను, అని భారతమున నున్నది. కాబట్టి భారతమును ప్రత్యక్ష ప్రమాణముగ భావింపవలయును. అట్లు నమ్మినవారికే దానియందలి ఫల శ్రుతుల యుపయోగము కలుగును.

శ్లో॥ అకృశం కుచయోః, కృశ్నంవలగ్నే
విపులం చక్షుషి, విస్తృతం నితంబే
అధరేఽరుణ మావిరస్తు చిత్తే
కరుణాశాలి కపాలి భాగధేయం॥

అని పార్వతిని ఒక కవి వర్ణించెను. కవిత్వము వ్యంగ్యప్రధానముగ నుండును. వేదములు శబ్దప్రధానములు. అందు ఒక శబ్దమున కొకయర్థమే చెప్పవలెను. కవిత్వముననో? అనేకార్థములు వచ్చునట్లు చెప్పవచ్చును. ఇక శక్తిస్వరూపము భ్రూమధ్యమునఅర్ధనారీశ్వరత్వముతో నుండును. అనాహతమునందు శివపార్వతుల పర్ణనము జరుగును. సహస్రారముపైన దృశ్యాదృశ్యపీఠము కలదు. ఇది యోగిజనవేద్యమైనది. ఋషులుమాత్రమే చూడగలరు. మనలో అనేక మతములు పురుషప్రధానమైనవి కలవు. స్త్రీ ప్రధానమైన దొక్క శాక్తేయ మతము మాత్రమే కలదు. "ప్రకృతి అలింగ తజ్జనిత భంగులు లింగములు"—అన్నట్లు ప్రకృతికి లింగము లేదు. అట్లే బ్రహ్మస్వరూపమునకు కూడలేదు. అది అష్టమచక్రమందలి స్వరూపము. శివకేశవాభేదము ఇది. "తదభిన్నా భిన్నస్య తదభిన్నత్వం"— అను న్యాయము ననుసరించి ఇద్దఱు ఒక్కటియే, అని అప్పయ్యదీక్షితులు నుడివిరి. బ్రహ్మాండపురాణమున దేవి—భోగే భవానీ పురుషేషు విష్ణుః క్రోధే చ కాళీ సమరే చ దుర్గా—అని నాల్గుభాగములుగ చెప్పబడినది. శివునకు, శక్తికి భేదము లేదు. అందునుండి వచ్చినభాగము విష్ణువు. కావున శివకేశవా

భేదము సూచితమగుచునే యున్నది. త్రిమూర్తులలో నెక్కువ తక్కువలు లేవు. ఒకేమూర్తి మూడుభాగములుగ భాగింపబడినది. "ఏకైవ మూర్తి ర్బిభిదే త్రిధాసా" యని కాళిదాసు నుడివెను.

సూతసంహితయందు జగద్విలక్షణస్థితి చాల గొప్పది, అది కలవారు గొప్పవారని చెప్పబడినది. ఈ దృష్టితో ఋషులు గొప్పవా రగుచున్నారు వారికంటే దేవతలు, వీరిలో అష్టదిక్పాలకులు, వీరియందును ఇంద్రుడు, ఇంద్రునికంటెను బృహస్పతి, వీనికంటెను బ్రహ్మ, బ్రహ్మకంటెను విష్ణువు, విష్ణువుకంటె శివుడు గొప్పవాడుగ చెప్పబడుచున్నారు. కారణము పూర్వులకంటె ఉత్తరోత్తరులు ఎక్కువకాలము బ్రహ్మమయులుగ (జగద్విలక్షణస్థితి) నుండుటయే. శివుడు ఎల్లప్పుడు పార్వతిని తొడపై కూర్చుండబెట్టుకొని వేదాంతబోధ చేయుచుండును. అది లోకము బోధముకొఱకు తాను బ్రహ్మమయుడై బయట తద్వివరణ మొనర్చునని భావము. కనుకనే శివుడు బాహ్యాభ్యంతరములతో బ్రహ్మమయు డగుచున్నాడు. అందువలననే శివునకు స్థాణువని పేరు వచ్చినది. అందులకే శివుని "హరోం హరహర" అని కేకపెట్టవలసివచ్చినది. కావున సూతసంహిత శివప్రాముఖ్యము నుగ్గడించి చెప్పుచున్నది. మన సర్వశరీరమున ఇంద్రుడు బలాధికారి. ఆతని తిరస్కరించిన బలమంతరించును. నే నొకపరి ఇంద్రమంత్రమును జపించుచుండగ ఒకడు తిరస్కరించి జబ్బుపడి చివరకు ఇంద్రమంత్రోపాసనచే బలమునొంది బాగుపడెను. రాక్షసేంద్రుడైన బలి ఇంద్రుని జయించెను. కాని ఇంద్రాసనముపై కూర్చుండుటకు సంశయించియు రాక్షసప్రేరణచే నిది నాదికాదు, ఎప్పుడు దిగవలసి వచ్చిన నప్పుడే దిగిపోయెదనని దాని నెక్కెను. వామనుడు దానమడుగుటకు వచ్చినపుడు బలి—మీదైనా కరంబుంట మేల్గాదే—అని గర్వించెను. బలి కోరిక ననుసరించి శ్రీకృష్ణుడు వానికి ఇంద్రత్వము నొసగుటకుగా పాతాళమున కంపెను. కాని ఇంద్రుని బ్రహ్మజ్ఞానము బలికి లేదు.

అందుచే వామనుడు వానిని పాతాళమునకు త్రొక్కి తన గురుత్వముతో తత్త్వోపదేశము చేయ సమకట్టెను. కాని బలి ఒకప్పుడు భగవదాదేశమున గాడిదయై తిరుగుచుండెను. ఇంద్రుడు బలిని కనిపెట్టజాలకపోయెను. పాతాళమునన్లేడు. ఎక్కడచూచినను కన్పింపలేదు. ఇంద్రుడు బలివిష యమై కనబడలేదని బ్రహ్మ కెఱింగించెను. బ్రహ్మ ఈ విషయము నెఱిం గియు ఇంద్రునికి చెప్పక పొమ్మనగా ఇంద్రుడు ప్రార్థించి యడిగెను. అప్పుడు బ్రహ్మ ఫలానా చోటునం దున్నాడని చెప్పగా ఇంద్రుడు బలి దగ్గరకు పోయెను. ఇంద్రుడు బలిని గాడిదవై తివని అక్షేపించెను. అపుడు బలి నేను తెలిసిన గాడిదనే యనితన శాంతగుణ ప్రాధాన్యమును చాటెను. వారిద్దరికి పరస్పర వాగ్వివాదము రెచ్చిపోయినది. కాని బలి సత్త్వగుణ మున నున్నాడు కాబట్టి ఏమిచేయక మిన్నకుండెను. అపుడు ఇంద్రుడు వాని నేమి చేయక మూడుసార్లు ప్రదక్షిణించి తనదారిని తాను పోయెను. ఇట్లు బలికి నారాయణుడు జ్ఞాన మభ్యసింపచేయుట పురాణములలో నగ పడుచున్నది.

రామాయణమున అహల్యా వృత్తాంతము రెండుచోట్ల వచ్చు చున్నది. ఈ రెండింటిలో ఐక్యతలేదు. మొదట విశ్వామిత్రుడు రాము నికి చెప్పిన కథ లోకమున వాడుకలోనున్న కథ. అసలుకథ ఉత్తర కాండలో బ్రహ్మ చెప్పినది. గౌతముడు రాజస తపస్సు చేయుచుండగా ఒకసారి పితృలోకము లన్నియు మండిపోవొచ్చెను. అపుడు బ్రహ్మ అహల్యను సృష్టించి యుంచగా అందఱు ఆమెకై తహతహలాడిరి. కాని ఎవ్వరికిని బ్రహ్మ ఆ కన్య నివ్వలేదు. ఇంద్రుడు మాత్రము ఆ కన్నెను తనకిమ్మని అడుగడాయెను. గౌతముడును ఆ అతిలోకసుందరిని అడుగ లేదు. అపుడు బ్రహ్మ చేయునదిలేక అహల్యతో సంచారముగా వచ్చి ఆమెను కొన్నాళ్ళపాటు ఆశ్రమమున నుంచుకొనవలసినదిగా గౌతముని కోరి అచ్చటనుంచి పోయెను. కాని లోకోత్తర సౌందర్యవతి యగు

నామెను చూచినను గౌతమునకు కామాపేక్ష కలుగలేదు. బ్రహ్మ మిక్కిలి నిరాశుడై పోయెను. పితృలోకజ్వాలలు ఆరుటలేదు. గౌతముడు తపస్సును విడుచుటలేదు, కాని 1000 సంవత్సరములకు పిమ్మట గౌతముడే స్వయముగ అహల్యను బ్రహ్మ కర్పించుటకు తెచ్చెను. బ్రహ్మ గౌతముని ఆమెను వివాహము చేసికొమ్మని చెప్పెను. కాని గౌతముడు ఆమెను వివాహమాడియు తపస్సు మానలేదు. అపుడు ఇంద్రుడు ఒక పన్నాగము పన్నెను. స్త్రీ విషయకోపముగాని తపస్సు మాన్పలేదని భావించి, గౌతముడు స్నానమునకు పోవునట్లు కోడియై కూసెను. కాని గౌతముడు స్నానమునకు పోగా గంగ నిద్రలో నున్నది. కాబట్టి, ఇది వేళగాదని గౌతముడు తిరిగి రాబోవుచున్నాడు. ఈలోపల ఇంద్రుడు గౌతముడై అహల్యను తాకి నేను ఇంద్రుడననియు చెప్పెను. అపుడహల్య భర్తయొక్క కోపతాపము లసాధ్యమని హెచ్చరించినది. భర్తకు కోపము వచ్చిన నేమి చేసెదవని అడిగినది. అంతలో గౌతముడు వచ్చుచుండగా ఇంద్రుడై ఎదురు వచ్చెను. గౌతముని కోపము ఇంద్రుని శపించినది. ఈ కోపములో పితృలోకము చల్లారినది. అహల్యను రాయిగమ్మనియు శపించెను. అహల్య ఎంతయో తనతప్పులేదని ప్రాధేయపడినది. అపుడు గౌతముడు దివ్యదృష్టితో చూడగ ఇంద్రుడు కామముతోగాక, తనపై కోపముతో తపస్సు చెరచుటకు వచ్చినట్లు తెలిసికొనగల్గెను. మరియు అహల్యకు శాపవిమోచనము రామపాద రజస్పర్శమనియు వివరించెను.

పిమ్మట ఇంద్రుడు తానుచేసిన పనిని దేవసభకు తెలియబరచెను. తనపని లోకోపకారమునకేగాని, కామమునకు కాదని వివరించెను. పితృదేవతలును అట్లేయని తమకిడు పశువృషణభాగ మింద్రునకు సమర్పించెదమనిరి. "గౌరావస్కందిన్ అహల్యాయై జార" అను వేదమును, గౌ—గౌతమ, రా—దార యని గౌతమదార నవస్కందించిన వాడా!

అని ఇంద్రుని పిలుచునపుడు, అహల్యాయై జార అనుట పునరుక్తిగా నర్థము వోలుచుండగ, విద్యారణ్యస్వామి హల్య కానిది అహల్య అనగా బీటిభూమి. దానిని వర్షముచే మెత్తపఱచి సస్యయోగ్యముగ చేయువాడా అని వ్యాఖ్యానించిరి.

ఉత్తర రామాయణములో ఇంద్రజిత్తు ఇంద్రుని ధ్వజస్తంభమునకు కట్టి తీసికొనిపోవుచుండెను. అపుడు దేవతలు బ్రహ్మతో మొరబెట్టుకొనిరి. బ్రహ్మ ఇంద్రుని విడిపించుకొని వచ్చుచు గౌతమశాపము గుర్తుకు తెచ్చెను. బ్రహ్మ ఇంద్రునిచే మరల అశ్వమేధయాగము చేయించి యింద్రత్వ మిచ్చెను. కాబట్టి ఇంద్రుడు జ్ఞాని, బలాధిపతి. కామాపేక్ష లేనివాడు. అట్టి కథలలో వ్యభిచారియైన ఇంద్రున కాపదవి నిలుచునా ? బ్రహ్మాదులతని సామ్రాజ్య మప్రతిహతముగ సాగింతురా ? కాన ఇట్టి కథలనుబట్టి కూడ ఇంద్రాదుల నిందించిన పాపముల పాలగుదుము. కావున మానవులును "యాన్యస్మాకం సుచరితాని తానిత్వయోపాస్యాని" అని శిక్ష చెప్పినరీతిగా వారుచేసిన మంచిపనులే చేయవలయును. గాని చెడ్డపనుల వలె నున్న పనులు చేయరాదు. కృష్ణుడు పదియవనెలయందే వ్యభిచారము ప్రారంభించెనని గలదు. అది అందఱకు సాధ్యమా ? కాన వారిని మనకు సామ్యముగ తెచ్చుకొనరాదు.

ఒకసారి శంకరులు కాశ్మీరదేశముపోయి అచటి పండితుల గెల్చి శారదాపీఠము నెక్కబోయెనట. కాని వాణి శంకరుని ఆచారము చెడిపోయినది కనుక ఎక్కరాదని నిషేధించినది. అపుడు శంకరుడు "ముండా ! నీకు తత్త్వము తెలియ" దని ఆక్షేపించెనట. తాను పరకాయ ప్రవేశము చేసినను జీవుడు వేఱు, శరీరము వేఱు, ఆ శరీరము మున్ను వారల చేకొన్నది అనియు, తాను సర్వసాక్షియై యంతట నిండియున్నాననియు, శంకరులు చెప్పిరి. కావున తన ఆచారమేమియు చెడలేదనగా ఆమె "ఈశానః సర్వవిద్యానామ్" అని నమస్కరించినదట.

ఉ. శక్తివిహీనుడే పనికిజాలడు శక్తియ సర్వభూత సం
సక్తతగాంచి సర్వకృతి సాధనమై తనరారుచుండునా
శక్తియ ముక్తికారణము శక్తియ సర్వము శక్తిలేనిచో
శక్తులుగారు విష్ణుహర సారస సంభవ ముఖ్యనిర్జరుల్॥

ఇట్టి శక్తిని గూర్చి చెప్పుటకే దేవీభాగవతాది గ్రంథములు పుట్టినవి. శక్తివిహీను దేవనికి పనికిరాడు. శక్తిలేకున్న బ్రహ్మాదులు సైతము అశక్తులే యగుదురు – అని దేవీభాగవతము చెప్పినది. కాబట్టి శక్తి యనున దొకటి యున్నదనుట సత్యము. ఇది యెనిమిదవ చక్రమున నున్నది. ఇది పురుషుడన్నను, స్త్రీ యన్నను అనుకొనవచ్చును. దీని నుండి సహస్రారము ప్రారంభమగుచున్నది. ఊర్ధ్వమూలమాధశ్శాఖమ్– అన్నట్లు బ్రహ్మవస్తువు మూలమునందును, దానినుండి శాఖలు విస్తరించినవి. శంకరులు ఒకప్పుడు శక్తివాదమును నిరసించగా వారికి ఒకనాడు సమాధి కుదరకపోగా ఇందులకు కారణము శక్తివాద నిరసనయే యని భావించి, ఆ దేవిని ప్రార్థించి-సౌందర్యలహరి శ్లోకములను రచించిరి. అపుడాదేవి వారికి ప్రసన్నయై దారి సూపెనని ప్రవాదము కలదు.

పరమేశ్వరుడు 64 తంత్రములు వ్రాసి ఒక్కొక్కదాని వలన ఒక్కొక్కసిద్ధి సాధకులకు లభింపచేసెను. ఆ సిద్ధులన్నియు భక్తులకు రావలయునని లోకము కొఱకు దేవతంత్ర మేర్పడినదని శంకరులు కొనియాడిరి. శాక్తేయ ఉపాసన అందఱకు నున్నదని భావించవలయును. "అంతశ్శాక్తం బహిశ్శైవం సభామధ్యేచ వైష్ణవమ్" అని స్మార్తుల

వైష్ణవులు ఆక్షేపించుట కలదు. ఏది ఏమైనను దేవి అనుగ్రహము మాత్రము కావలసియున్నది.

కాశీఖండమున వ్యాసనిష్కాసఘట్ట మిందులకు నిదర్శనము. వ్యాసుడు కాశీయందు పండితుల వాదనలో—నదేవః కేశవాత్పరః— అని విష్ణువే దేవుడను సిద్ధాంతము చేసెను. అంత నందికి కోపము వచ్చి అతని చేతిని స్తంభింపచేసెను. దేవీ అనుగ్రహముతో వ్యాసుడు తన చేతిని స్వాధీనమునకు తెచ్చుకొని, కాశీని వదలిపోయి, మరియొక వ్యాస కాశీని నిర్మించెను. ఇది రెండవకాశి యన్నమాట. శివుడు ఈ విషయ మెరింగి విఘ్నేశ్వరుని ఆ పట్టణముసంగతి చూచిరమ్మనెను. ఇక వినాయకుడు చిన్నవేషమును ధరించివచ్చి వ్యాసునిదగ్గర శిష్యుడుగా చేరి విద్యాభ్యాసము చేయుచుండెను. వాని భక్తిశ్రద్ధలకు, తెలివికి వ్యాసుడు అభిమానించెను. ఒకనాడు శిష్యుని వెంటబెట్టుకొని తన కాశీయందలి విశేషముల చెప్పదొడంగెను. వినాయకుడు ఆయాస్థలముల చూచుచు విశేషముల నెఱుంగుచు, ఒకచో వ్యాసునకు ద్వారమువలన దెబ్బతగిలి రక్తము కారగా, నా ద్వారమువద్ద చచ్చినవా రేమగుదురని ప్రశ్నించెను. వ్యాసుడు కోపము, విసుగుకలిగి ఇక్కడ చచ్చినవారు గాడిదయై పుట్టుదురని చెప్పగా, వెంటనే వినాయకుడు-తథాస్తు-అని తాను వచ్చినపని అయినదికనుక వెళ్ళిపోయెను. అపుడు వ్యాసుడు తన గర్వమణచుటకు వినాయకుడు వచ్చెనని తెలిసికొని, ఎవ్వరును వ్యాసకాశీయందు చావరాదని శాసించెను. ఇక వ్యాసుడు కాశీకిపోయి బ్రతుకుచుండగా, శివుడు పార్వతిని, కాశీయందు వ్యాసునికి అన్నముపుట్టకుండ చేయుమని చెప్పెను. అట్లేయని అన్నపూర్ణ మాధుకరమును పుట్టకుండ చేయగ వ్యాసుడు శిష్యులతో 7 రోజులు అన్నములేక అలమటించి, ఆనాడు గంగలో మునిగివచ్చి కాశీపై కోపించి శాపమివ్వబోయెను.

మా భూత్ త్రైపూరుషీ విద్యా
మా భూత్ త్రైపూరుషం ధనం
మా భూత్ త్రైపూరుషీ భక్తిః
కాశ్యాం నివసతాం సదా !!

అని శపించబోగా ఇంతలో—వేద పురాణశాస్త్ర పదవీ నదవీయసి యైన పెద్దముత్తైదువ ఒకామె వ్యాసుని పిలిచి అన్నము పెట్టెదను, స్నానముచేసి రమ్మనినది. వారందఱు స్నానముచేసివచ్చి భోజనమునకు కూర్చుండిరి. వారందఱిని, సంధ్యావందనాది క్రియలు నిర్వర్తించుమని నది. వారు కన్నులుమూసి తెరచులోపల ఆమె వారిముందు షడ్రసోపేత భోజనము నుంచునట్లు రుద్రకన్యల నాహ్వానించి పెట్టించినది. . పిమ్మట గృహస్థువచ్చి కూర్చున్న తర్వాత వారు భోజనముచేసి లేచిరి. ఇక అన్న పూర్ణ వ్యాసుని కోపించుచున్న శివుని గుర్తెఱింగి, తాను వ్యాసుని పూర్తిగ కరుణించి శివుని ముందునకు పంపినది. ఇట్లు ముందుగా అమ్మవారి చంద్రదృష్టి ప్రసరించిన తర్వాత, శివునకు నమస్కారము చేయుమన్నది శివుడు కోపముతో మూడవకంటితో చూచినను వ్యాసుడు చెడిపోవలేదు. అపుడు శివుడు మరల కోపముతో వ్యాసుని కాలితోతన్ని కాశీనుండి పొమ్మ నెను. అమ్మవారును పొమ్మనగా వ్యాసుడు దక్షారామముపోయి, అగస్త్యుల వారిచేతను, సనత్కుమారునిచేతను తత్త్వోపదేశము నొందెను. తర్వాత కాశికి వచ్చెను. కాబట్టి మొత్తముమీద అద్వైతులేకాక అందఱు దేవీ ఉపాసకులు. అన్ని తంత్రములకన్నను దేవీతంత్రమే సర్వసిద్ధిప్రదమని సౌందర్యలహరిలో శ్రీశంకరులు చెప్పుచున్నారు.

ఇట్లే రామాయణమున - తతో రావణ నీతాయా స్సీతాయా శ్శత్రు కర్శనః - అని సుందరకాండమును ముని రావణుడు తీసికొనివెళ్ళిన సీత యొక్క అడుగుజాడను పాదచారులు నడువనిదారియందు శత్రుకర్శను

డవు వాయుపుత్రుడు వెదుకనెంచెనని మొదలిడెను. సుందరకాండను తత్త్వ దృష్టితో చూచిన వాయువహ్నిరూపమునొంది శరీరమందు తిరుగుటయును యోగముగా తోచుచున్నది. సీత అన నాగటిచాలు. "సీతా లాంగలిపద్ధతిః" అని నిఘంటువు చెప్పుచున్నది. రావణుడన రవణము పుట్టించువాడు. దశ విధ ధ్వానములతో మూడు వంకలతో సీతవలె నున్న కుండలిని వెంట పోవుసాధకుని వర్ణించినట్లున్నది. శత్రు కర్శనః అన్న విశేషణమున్ను అంతశ్శత్రువుల జయించిన సాధకునకే యది సాధ్యమనిసూచించుచున్నది. ఇట్లే సుందరకాండమెల్లను యోగమును వ్యక్తీకరించుచున్నదని పెద్దలు చెప్పుదురు. సహస్రారమునకు పైన పీఠికమను చక్రమున నఖండ బ్రహ్మ రూపమది శివశక్త్యైక రూప మనిపించుకొనును. సహస్రారమున విశ్వ రూపము, భ్రూమధ్యమున అర్ధనారీశ్వర స్వరూపము, హృదయమున నీశ్వ రాంక స్థితేశ్వరీ రూపము ఉండును. సహస్రారమునకు పై చక్రమునందే మహామాయారూపము.

శ్లో॥ సుధాసింధో ర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణిగృహే
శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయాం
భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానన్ద లహరీం॥

అని శంకరులు చెప్పుటగమనింపదగినది. పూర్వము భండాసురుడను రాక్షసుడు దేవతలవేధించుచుండెను. వానికి విశుక్రాసురుడు-అనగాలోకములో నెవ్వరికి వీర్యము లేకుండ జేయువాడు. విషంగుడు అనగా ఒకరొకరిని కలవకుండ చేయువాడు - ఇట్టివార లనేకులు మంత్రులుండిరి. వైకుంఠ మున కేగిన నేమియగునో యని విశుక్రుడును, వైకుంఠమును వదలి వచ్చిన నేమగునోయని విషంగుడును నున్నట్లు లుండిరి. అప్పుడు వాని యంతమునకు విష్ణువు నారదునితో దేవతలను హిమాలయమునందు

యజ్ఞముచేయుమని ఆదేశించి పంపెను. వారట్లు బహిర్యాగము చేయుచుండ విష్ణువు ఇద్దఱు సౌందర్యవతులైన స్త్రీలను సృష్టించి వారిని భండాసురుని తోటలో సంగీతము పాడుచుండుమనియు బెట్టుసరితో భండవిశుక్రాసురుల పెండ్లాడుమనిచెప్పి, తాము చెప్పినట్లు భర్తలు వినవలయుననియొప్పందము కుదుర్చుకొనుమనియు బోధించెను. సరేనని వారు నట్లే పెండ్లాడి మొద టనే వారిరువురిని స్త్రీ లిరువురు స్వాధీనము చేసికొనియుండిరి.

ఇట్లు ఐదువందల సంవత్సరములకాలము దేవతలు యజ్ఞముచేయుట జరిగినది. కొంతకాలముపోవ హోమధూమము లోకమంతయు వ్యాపించి భండాసురుని అంతఃపురమున ప్రవేశింపగా వాడు ఇదియేమని యదరిపడి దేవతలు యజ్ఞము చేయుచున్నారని తెలిసికొని కోపించి యుద్ధమునకు బయలుదేఱెను. భార్య వద్దన్నను వినలేదు. వీడు పోవుసరికి యజ్ఞ గుండము చుట్టు పెద్ద కంచుకోట బయలుదేఱి, నక్షత్రమండలము వఱకు వ్యాపించియున్నది. అంత భండాసురుడు కోపోద్రిక్తుడై దానిని విఱుగ దన్నెను. మరల మరియొకటి పుట్టినది. ఇట్లు 189 కోటలు విఱిగిపోయి నవి. చాల అలసిపోయి ఇప్పుడింత కష్టమేల? ఈ దేవతలు యజ్ఞముచేసి నామీదికి వచ్చినప్పుడే హింసింపవచ్చును, భార్య యెట్లుండెనో యని తిరిగి పోయెను. పోగా భార్యలిద్దఱిని చీవాట్లు పెట్టుట జరిగినది. దేవతలు వేయి సంవత్సరములు యజ్ఞముచేయగా అందునుండి బాలాత్రిపురసుందరి ఆవిర్భ వించినది. దుర్బలులైనవారిని యజ్ఞకుండమున దూకుమని ఆదేశించినది. కాని ఆమె ఆవిర్భావమువలన అందఱకు తేజస్సువచ్చి ప్రకాశించిరి. ఇచట బాల అనగా పరోక్షబ్రహ్మవిద్య. ఆమె అందఱిని తనవెంట తీసికొని చక్ర మార్గమున తాను దేవతలను గొనిపోయినది. బ్రహ్మరంధ్రము వఱకు పోయి బాల ఈశ్వరధ్యానము చేయగా ఈశ్వరుడు కనిపించెను. ఆమె ఆత నిని అంతర్యాగము చేయుమని ఆదేశింపగా ఈశ్వరుడు అంతర్యాగము చేయ మొదలుపెట్టెను. ఆ దేవుడు చిత్తి యను స్రుక్కుతో చిత్తాజ్య

జ్యమును చిదగ్నికుండమున హోమముచేయగా అమనస్కయై నిష్ప్ర పంచమైన తటి అరూపశక్తి సరూపయై సగుణయై చిదగ్నిగుండమునుండి లలితాత్రిపురసుందరి యని ఆవిర్భవించినది. అచటనున్న ఆ దేవతల నందఱిని ఆదేవి ఆ యగ్నిగుండమున వైచినది; అపుడు వారిచిత్తమాలిన్యము పోయినది. అపుడు దేవతలు చిద్భావభావితులు, జ్ఞానబల క్రియాన్వితులైరి. అపుడు దేవతలందఱు దేవిని ప్రార్థించి, ఆమెను నీ యిష్టమైనవాని వివాహము చేసికొనుమని యుభయులను సేవించుకొని మఱియు కృతార్థుల మగుదుమని స్త్రీ స్వాతంత్ర్యము లోకమున విరుద్ధమని ప్రార్థించిరి. దేవియు తన కట్టిస్థితి మంచిదనితోచి కడగంట నీక్షింప పరమేశ్వరుడు కామేశ్వరావతారము వహింప నా దేవి వానిని శాస్త్రోక్తముగా వివాహము చేసికొనెను.

శ్లో॥ ధ్యాయే త్కామేశ్వరాంకస్థాం కురువిందమణిప్రభాం।
శోణాంబరస్రగాలేపాం ! స్వర్వాంగీణ విభేచనాం !
సౌందర్య శేవధించేషు చాపపాశాంకుశోజ్జ్వలాం !
స్వభాభిరణి మాద్యాభిస్సేవ్యాం సర్వనియామికాం !
సచ్చిదానంద వపుషం। సదయాపాంగ విభ్రమాం
సర్వలోకైక జననీం స్మేరాస్యాం లలితాంబికాం॥

అని యామె స్వరూపస్థితిని వేల్పులు, మునులు గొనియాడిరి. త్వష్ట వారికై శ్రీపురమును నిర్మించెను. అందు చింతామణిమయ గృహమున శివాకారమగు రత్నపర్యంకముపై నున్న కామేశ్వరు నంకమునుండి కామేశ్వరి నానాశక్తిపరివార సహితయై వేల్పులతో కొలువుదీర్చి, దేవకార్యసమ ద్యత యయ్యెను. ఇక నామె భండాసురుని దగ్గఱకు శివుని దూతగా పంపెను. శివుడు పోయి దేవతలు జన్మముచేసిరి. కామేశ్వరి ఆవిర్భవించినది, ఇక నీకు సురలు, మునులు, అసాధ్యులు, ఆ దేవిని శరణని బ్రదికె

దవా? యుద్ధముచేసి చచ్చెదవా? అని చెప్పగా భండాసురుడు ఎగిరిపడెనట. యుద్ధమునకువచ్చి యెత్తులకు పై యెత్తులువేసి చివరకు విఘ్నయంత్రము ప్రయోగించెను.

ఆ యంత్రము ఎదుటివారిని స్తంభింపచేసినది. అపుడు దేవతలు కామేశ్వరిని ప్రార్థించగా ఆమె భర్తృముఖాలోకనము నుండి విఘ్నేశ్వరు బుట్టించెను. అతడు విఘ్నయంత్రమును తన్నగా భండాసురుడు రాక్షసులను సృష్టించి వారి ముందుంచెను. మరల దేవతలు కామేశ్వరితో మొర పెట్టుకొనిరి. ఆమె పదిగోరులనుండి పది విష్ణు అవతారములు సృజింపగా వారి నవి చంపినవి. ఇది దేవీ భండాసురుల యుద్ధము. శుక్రాసురుడు అనువాడు యుద్ధమునకు వచ్చెను కాని వానిని వారాహి అను శక్తి చంపివైచెను. మరల రక్తబీజాసురుడు రాగా, దుర్గ వానిని రక్తము క్రింద బడకుండ చంపినది. భండాసురుని కొడుకులు యుద్ధమునకు రాగా, బాల వారిని చంపెదని లలితాదేవి సెలవు గైకొని తన విక్రమమున వారిని చంపినది. చివరకు భండాసురుడు, వాని కొడుకు శూన్యకుడు మిగిలిరి. అపుడు కామేశ్వరి కామేశ్వరుని వారిపై త్రిప్పికొట్టగా వారు మరణించిరి. ఇక భండాసురుడు అనగా మనకున్న మోహము. శూన్యకాసురుడనగా శూన్యవాదము.

కనుక మోహము, శూన్యము, రెండును నశించినవి. కావున బహిర్యాగమున, అంతర్యాగమున దేవీ అనుగ్రహము పొందినవారు మోక్షమును పొందగలరు. లలిత అపరోక్ష బ్రహ్మవిద్య. బాల పరోక్షబ్రహ్మవిద్య. నానారూప సమష్టిరూపము దుర్గ. కాబట్టి వీరికి భేదములేదు. శక్తి సమష్టి రూపమే మహిషాసురుని చంపినది. సహస్రారముపైన శ్రీనగరమున కామేశ్వరి యుండును. బాల హృదయమున నుండును. ఐం - క్లీం సౌం బీజములు మూడును ఆమెకు ఒక మంత్రముగ ఉపాసన జరుగును

ఉమామహేశ్వరోపనిషత్తు ఉమయే లక్ష్మి, శివుడే విష్ణువు, ఇట్లే స్త్రీలెల్లరు శక్తిరూపములు, పురుషులెల్లరు శివులు కాన ఉమామహేశ్వర రూపులగు స్త్రీ పురుషజాతులకెల్ల నమస్కారమని ముగించినది. స్త్రీపురుషుల వివాహ సంగమాదులెల్ల విసదృశములగు శరీరమందలి ఏకాకారమగు బ్రహ్మము నెఱిగికొనుటకు, యోగమందలి పదారవు కళనెఱుగుటకు 15 కళల వాత్స్యాయనుడు కామశాస్త్రమున నిరూపించెనని పెద్దలు చెప్పుచున్నారు. స్త్రీ పురుషుల వివాహమందలి యపూర్వఫలము నాలోచించిన శాస్త్రోను సారముగ దాని ననుభవింపవలెను. కేవల కామమునకైన శాస్త్ర మక్కర లేదు. పశువులకు శునకములకు, వరాహములకు కామసుఖమునే శాస్త్రము చెప్పుచున్నది? అయినచో ఈ మంత్ర తంత్రముల యందు స్త్రీలకధికార మున్నదా లేదా? అను ప్రశ్నమొకటి లోకమును బీడించుచున్నది. వివాహ మంత్రసంస్కారముతో వధూవరు లేక రూపులగుచున్నారు. శరీరభేదము న్నను నవకోణాత్మక శ్రీచక్రము ఇరువురి యందు స్ఫురించుచున్నది. కాన పురుషుని బట్టి స్త్రీ యధికారము పురుషుడు సోమయాజి యయినచో స్త్రీ సోమిదమ్మయగును. పురుషు డుపాసకుడైన స్త్రీ యుపాసకురాలగును. కాన పురుషునకు స్త్రీ సాహచర్యమన్నిట నుండదగును. అది వదలిన సన్యాసమే – ఇది మరువరాదు.

బ్రహ్మములో మాయ స్ఫురించుచున్నది. అదియే పరాశక్తి. ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాని జీవుడుమాత్రము అల్పజ్ఞుడు. జీవుని ఆవరించి యున్న అవిద్య యను బురదను తొలగించినచో - ఆ జీవుడు ఈశ్వరుడగు చున్నాడు. ఈ అవిద్యను తొలగించుటకే విద్యలు, పురాణములు, కర్మలు, ఉపాసనలు, మొదలగునవి యేర్పడినవి. మాయాశక్తినుండి కామేశ్వరీ కామేశ్వరులు ఆవిర్భవించిరి. వీరే ప్రకృతి - పురుషులు. లోకమునందు వీరి యుపాసనయే పరాకాష్ఠ నొందినది. కాని నిర్గుణోపాసన కూడ ఒకటి యున్నది. శివుని 64 తంత్రముల ఫలము నిచ్చు శాక్తేయము ఉపాస్యము- అందు కామేశ్వరియే ప్రధానయగుచున్నది. దీనికి అధిష్ఠానము కామేశ్వరుడు. కామేశ్వరీ సంకల్పశక్తితో కామేశ్వరు డావిర్భవించెననియు,త్వష్టచే నిర్మాణము చేయబడిన శ్రీనగరమున నామె కామేశ్వరాంకస్థితయై యున్నదనియు ఇదివరకే చెప్పబడినది. ఆ స్థానము బ్రహ్మరంధ్రమునకు పైన నున్నది. శరీరమునకు తొమ్మిది రంధ్రములున్నవి. పదియవది బ్రహ్మరంధ్రము. ఆ దారిన బ్రహ్మమీ జీవరూపమున శరీరమున ప్రవేశించుట వలన దానికాపేరు వచ్చినది. అది మొదట పలుచగా నుండును. దాని నాముదముపెట్టి మెల్లమెల్లగా గట్టిపరచుచున్నారు. అది జీవుని రాజ ద్వారము. దానినుండి జీవుడు ఎప్పుడిష్టమైన నప్పుడు పోకుండ ఉపనయన వివాహదులందు జీలకఱ్ఱ బెల్లము పెట్టి ఆ రంధ్రమును పూడ్చుచున్నారు. ఆయుష్యమునందు నాల్గవవంతు బ్రహ్మచర్యములో వేదాధ్యయనము చేసి ఋషి ఋణము తీర్చుకొనవలయును. ఇంకను నాల్గవవంతు గృహస్థాశ్రమము స్వీకరించి పితృఋణము, దేవఋణము తీర్చుకొనవలయును,

మూడవ నాల్గవవంతు వానప్రస్థమున తపముచేసి, మిగిలిన నాల్గవవంతు సన్యాసాశ్రమమును స్వీకరించవలయును.

మొదట సృష్టికర్తయగు బ్రహ్మ సనకసనందనాదులను మనస్సుతో సృష్టించి, సంతానము కనుమని చెప్పగా వా రెందుకని? ప్రశ్నించిరి. వారికి బ్రహ్మ ముదుసలితనమున పిల్లలుపయోగించెదరు. తదనంతరము శ్రాద్ధాదులు జరిపి పరలోకముల సుఖమును సంపాదించెదరు. మరియు "పుత్త్రేణ లోకాన్జయతి" అని శ్రుతి చెప్పుచున్నదనియు చెప్పెను. దానికి వారు మాకిదియే ఆత్మ, ఇదియే లోకము, మా కీ ప్రజలతో చేయవలసిన పనిలేదు గాన నీ సృష్టితో నవసరములేదు- అని బ్రహ్మమయులై యుండిరి, తరువాత అస్రష్ట వశిష్టాదుల సృష్టించెను, వారలు నప్లే మాటలాడ బ్రహ్మ కోపించెను. విసుగుకొనెను. అంత వశిష్ఠాదులు తండ్రిమాట వినెదమనియు, పిల్లలను కన్నందువలన మన ఆత్మస్థితికి భంగము లేదనియు మిగిలినవారిని కలుపుకొని చెప్పగా, బ్రహ్మ ఇది లోకమున అందఱకు బోధచేయు మనెను. ఆవిధముగనే వశిష్ఠుడు చేయుచుండెను. కావుననే ఇప్పటి పురోహితులే వశిష్ఠులని భావింపవలయును. ఇప్పటికిని వశిష్ఠాంశగల యాజ్ఞికుడు వటువునకు బ్రహ్మోపదేశము చేయుచున్నాడు. దానిలో పిల్లలను గని సుప్రజుడ నయ్యెదననియు, సుమేధుడ నయ్యెదననియు వటువుచే ననిపించి ప్రతిజ్ఞ చేయించుచున్నాడు. అందులకే వారిచే విస్తళ్ళు కుట్టించుట, గంధము తీయుట మొదలగు పనులు చేయింపరాదు. ఇక స్త్రీకి వివాహము చేయుట ఎనిమిదవయేటనే జరుగవలయును. ఆనాడు శిరస్సుపై జీలకఱ్ఱ బెల్లముపెట్టి, తెల్లని వస్త్రములు దీక్షకుగానిచ్చి దర్భత్రాడుచుట్టి బ్రహ్మచారికివలె నుపాసనార్హత్వము సంపాదించుచున్నారు. "ఏతద్వైపత్న్యాః వ్రతోపనయనం"- అని ప్రమాణము చెప్పుచున్నది. గృహస్థధర్మమున భర్తసంపాదించినధనము భార్యకు ఇవ్వవలయును. భార్య గృహోపకరణము లన్నియు భర్తసలహాపై

అమర్చుచుండవలయును. ఈ కార్యనిర్వహణమున భార్య ఆయవ్యయ ములు భర్తకు నెఱిగింపవలయును.

పూర్వము ముద్గలు డనువానికి ఇద్దరు భార్యలుండిరి. భర్తకు చెప్పియే ఒక భార్య అన్నిపనులు చేయుచుండెను. కాని రెండవయామె జ్ఞానవతి యగుటచే ప్రతిపని భర్తకు చెప్పనక్కరలేదని తలంచెను. ముద్గలుడు బ్రహ్మలోకమునకు పోవుచుండ పెద్దభార్య వెంటనంటిపోయెను. రెండవ భార్య వచ్చులోపల తలుపువేసిరి. ఈమె నరకమునకు పోయినదట. పతివ్రతను, జ్ఞానవతిని యగు నాకిట్టి స్థితి యేల వచ్చెనని యేడ్చుచుండగా యముడు చూచి మరొకజన్మ నిచ్చి, భర్తకు చెప్పుచు, అన్నిపనులు చేయుచు, ఈ కొలది లోపము నందు తీర్చుకొనుమని చెప్పిపోయెను. ఆమె అట్లే చేసి ఆ జన్మయందు తరించెను- అని ఇతిహాసములందు భార్యా భర్తృధర్మములు అను శాసింపబడినవి. అట్టి స్త్రీపురుషులు కామే శ్వరీ కామేశ్వరుల నుపాసింప నర్హులు. కామేశ్వరీ కామేశ్వరులు స్త్రీపురుషరూపములో భావించి, పంచప్రేతమంచము మీద నున్నట్లుగా ధ్యానించుట ఒక పద్ధతి. కామేశ్వరీ కామేశ్వరుల అవయవములు వీరి అవయవములందే యున్నట్లు భావించుట మరియొక పద్ధతి. అరుణాది వాగ్దేవతా స్తోత్రమే మన లలితా సహస్రనామము. శ్రీమాతా శ్రీమహా రాజ్ఞీ శ్రీమత్ సింహాసనేశ్వరీ-అని ప్రారంభింపబడెను. మంగళప్రదమైన శ్రీయనునది శాక్తేయులబీజము. శ్రీబీజమునకు వాచ్యము లేక లక్ష్యమైన మాతా-తల్లి పెద్దరాణి. మామూలు తల్లులు మామూలు రాణులు కారని తెల్పుటకై శ్రీమాతా, శ్రీమహారాజ్ఞీ అని చెప్పబడెనని తెలియవలెను. హన హింసాగత్యోః అను ధాతువునుండి సింహశబ్దము పుట్టినది. శ్రీమంత మగు సింహాసనమున కధీశ్వరిగాన, శ్రీమత్సింహాసనేశ్వరి యనబడు చున్నది. అంతర్యాగమున చిదగ్నియందు చిత్తాజ్యమును హోమము

చేయగా అమనస్కదశయందు ఆవిర్భవించుటచే చిదగ్నిసంభూత యని పేరు.

దేవకార్య సముద్యతా
ఉద్యద్భాను సహస్రాభా
చతుర్బాహు సమన్వితా
రాగస్వరూప పాశాఢ్యా
క్రోధాకారాంకుశోజ్జ్వలా॥

అని ఇంద్రియముల పనులు చేయుటకై దేవకార్యమునకై ఆవిర్భవించినది. ఉదయించు సూర్యునివలె ఎఱ్ఱని శరీరతేజస్సు కలదియు, నాల్గు చేతులు కలదియు నగు దేవి, నాల్గు ఆయుధములు నాల్గుచేతుల యందు కలదియు నగు దేవి అనగా మనస్సును ఇక్షుకోదండ మొకచేత గలది, శబ్దస్పర్శ రూపరసగంధములను తన్మాత్రలైదు బాణముల నొక చేత ధరించినది. రాగమను పాశ మొకచేత ధరించినది. క్రోధమను నంకుశ మొకచేత దాల్చినది. విష్ణువు దేవీ ఉపాసన వలన మోహినియై శివుని మోహింపచేసెను.

స్మరోపిత్వాం నత్వారతి నయన లేహ్యేనవపుషా
మునీనామప్యంతః ప్రభవతిహి మోహాయమహితాం॥

అని శంకరులు ఆగమానుసారము గొనియాడిరి. మన్మధునకు - భక్తునకు దేవి తన బాణకోదండ పాశాంకుశముల నిచ్చి యంతవానిచేసెనని భావించవలయును. నిజారుణ ప్రభాపూరమజ్జ బ్రహ్మాండ కుండము మునిగి ఎఱ్ఱనగుచున్నదనగా రజోగుణములో నిండియున్నదని భావము. "అష్టమీచంద్ర విభ్రాజ దలికస్థల శోభితా" అన అష్టమినాటి చంద్రవంక వంటి ఫాలముకలదియు, "ముఖచంద్రకలంకాభ మృగనాభి విశేషణ" యన

చంద్రకళంకమువంటి కస్తూరిబొట్టు గలది, "వదనస్మర మాంగల్య గృహ తోరణచిల్లికా" యన వదనమను మన్మధుని యింటికి తోరణములవంటి కనుబొమ్మలు కలదియు నని భావము. ఈ బొట్టనగా ఇడ పింగలి నాడుల మధ్యనున్న సుషుమ్నవంటిది బొట్టు. ఇది వైష్ణవుల బొట్టు. గోపీచందన ముతో ఊర్ధ్వపుండ్రములు స్మార్తులను బెట్టెదరు. జలముతోనైన మృత్తికతోనైన నూర్ధ్వపుండ్రములుబెట్టి తర్వాత వానిపై బూడిద పూయు చుందురు. కొందఱు వైష్ణవులు పచ్చనిబొట్టు, మరికొందఱు ఎఱ్ఱనిబొట్టు ధరించుచున్నారు. వానికి వేరువేరు కారణములు గలవు. నాదబిందు కళా స్థానముల సూచించునట్లు మూడు తిర్యక్ పుండ్రములు ధరించి, బిందు స్థానమున గంధాక్షత లుంచి, బిందువునకు క్రిందిభాగమున త్రికోణస్థాన మున కుంకుమ అడ్డముగా బూయుచుందురు. ఇది అమ్మవారి స్థానము. ఇది ప్రాసంగికము. "వక్త్రలక్ష్మీపరీవాహచ్చలన్మీనాభ"—అను శ్లోకమున ముఖముమీద కాంతియొక్క తరంగములుగల చెఱువునుండి వచ్చు పరీ వాహములవంటి కన్నులు గలదియు, ఆ కనులగుంటలు అలుగులవంటి వనియు, అందలి మీనములవంటి కనుపాపలు చలించునవి కలదియు, సంపెంగవంటి నాసిక, ముక్కుకు బులాకి, దానికి ముత్యము ఉండు నట్లును, అది నక్షత్రకాంతిని తిరస్కరించునట్లును చెప్పబడినది.

పార్వతి యెప్పుడును కమ్మలు, బులాకి తీయకుండుటచేతనే శివునకు చావులేదు. కడిమిచెట్టు పూలగుత్తి యెడమచెవియందు నలంక రించుకొనియుండును. ఇది కర్ణపూరము. స్త్రీకి ఎడమ, పురుషునకు కుడి భాగములు ముఖ్యములు. ఇట్లు స్త్రీపురుషసంయోగమే అర్ధనారీశ్వరత్వము అగుచున్నది. కావున స్త్రీలు ఎప్పుడును ఎడమనుండి అలంకరించుట ప్రారంభించవలయును. దేవి సూర్యచంద్రులు కమ్మలుగా గలది. పద్మ రాగపు టద్దముల కాంతిని తిరస్కరించు బుగ్గలు కలది. పగడమువంటి దొండపండువంటి పెదవి కలిగి శుద్ధ విద్యాంకురములవంటి పలువరుస

గలది. ఆమె కప్పురపుతమ్మ పరిమళము దిగంతముల వ్యాప్తినొందునది. ఈమె పలుకుముందు సరస్వతి వీణెయు పనికిరాదు. చిరునవ్వు కాంతిపూర మున మునుగుచున్న కామేశ్వరు మనసు కలది. సాటిలేని చిబుకము కలది యామె. ఇక యజ్ఞోపవీత, మంగళసూత్రముల గుఱించి ఆపస్తంబుల వారేమియు చెప్పకుండుటవలన అవి అక్కరలేదని కొందఱనుచున్నారు. అనుక్తం అన్యతో గ్రాహ్యం-అన్నట్లు బోధాయన సూత్రమునుబట్టి యజ్ఞోపవీత మంగళసూత్రధారణ చేయవలయును. కామేశ్వరునిచే కట్ట బడిన మంగళసూత్రము కలది. రత్నకంఠాభరణము కలది. చింతామణి పతకముగల ముత్తెముల హారముల దాల్చినది. ఆమె స్తనములు కామే శ్వరస్వామి ప్రేమరత్నములచే గొనదగినవి. పొదువలెనున్న బొడ్డునుండి తీగవంటి నూగారు బయలుదేఱును. ఆ తీగకు ఫలించిన ఫలములే ఆ స్తనము లగుచున్నవి. అనూరువి కాంతిని తిరస్కరించు కౌశుంభవస్త్ర ధారిణి యగుచున్నది. కామేశ్వరునిచేతనే తెలియబడిన తొడలమార్దవము గలది. పిక్కలు మన్మథబాణముల సంచులవంటివి. శీలమండలు కనబడ నిది. ఏలన శీలమండలు కనబడుట దరిద్రహేతువు. తాబేటి బొచ్చెలవంటి పాదములు, తమోగుణమును హరించు ఎఱ్ఱనికాంతిగల గోళ్ళుకలది. మ్రోగుచున్న కాలియందెలు కలది. మరాళములవంటి మందగమనము కలది. లావణ్యమునకు నిక్షేపమగు మేను కలదియునగు స్త్రీరూపము కామే శ్వరి. కావున సాముద్రిక శాస్త్రానుసారమైన లక్షణములుగలస్త్రీ. సమస్తా భరణ భూషితయై, శివుడైన కామేశ్వరుని తొడపై నుండునది. స్వాధీన వల్లభా=స్వాధీనపతిక,-సుమేరుశృంగమధ్యస్థా - మేరువుమధ్య శృంగ మున నుండునది, సృష్టికర్త్రి - బ్రహ్మరూపా-బ్రహ్మరూపమున నుండి జగత్సృష్టి చేయునది. గోప్త్రి గోవిందరూపిణీ - గోవిందరూపమున పరి పాలనము చేయునది. సంహారిణీ రుద్రరూపా-రుద్రరూపమున సంహారము చేయునది. తిరోధానకరీ ఈశ్వరీ - తురీయమవు ఈశ్వరరూపమున

సంహృతజీవుల తిరోధానముచేసి దాచిపెట్టునది, సదాశివా అనుగ్రహదా-సదాశివరూపమున ననుగ్రహించునది. పంచకృత్య పరాయణా-ఈ ఐదు రూపములతో నైదుపనులు చేయునది. శ్రీశివా, శివశక్త్యైక్యరూపిణీ - లలితాంబికా అను నామమువరకు సహస్రనామములు వాణీశ్వరుల ముఖముల నుండి దేవియే వెలువరించినది. త్రిశతీ నామములు కామేశ్వరీ కామేశ్వరులు స్వయముగా వెలువరించిరనియు కలదు. ఈ శాక్తతంత్రముల కెల్ల సారాంశమద్వైతమే ! అద్వైతము శాక్తము కలసియే యున్నవి—

అస్యాం మునీనామపి మోహ మోహో
భృగుర్యదాస్వా స్తన శైలశీలీ
నానారదాహ్లాదముఖం
శ్రీతో రుర్వ్యాసో మహాభారత సర్గకర్తా॥

శ్రీ హర్ష నైషధమునందు దమయంతి=విద్యాశక్తి యగుచున్నది. నలుడు బ్రహ్మమూర్తి యగుచున్నాడు. దమయతీతి దమయంతి అని అన్నింటిని అణగద్రొక్కునది విద్య. ఈ విద్యాశక్తివిషయమై మునులకును మోహమే. అనగా పూర్తిగా తెలియదని భావము. భృగువు ఈమె స్తనశైలములను విడువక అభ్యసించువాడు. అనగా మధ్యఖండోపాసనలతో ఐశ్వర్యము సంపాదించినవాడు. తక్కిన రెండుఖండములయందంత విజ్ఞాని కాడు. గాన మోహము. నారదుడు ముఖోపాసనము వలన నాహ్లాదము కలవాడు. వాగ్భవఖండములను మాత్రమే యుపాసించినవాడు. వ్యాసుడు తా విద్యాశక్తి ఊరువుల నాశ్రయించి మోక్షద మవు శక్తి ఖండము నుపాసించినవాడు. ఇట్లే ఎవ్వరును పూర్తిగా నీవిద్య నెఱుగరు. మోక్షవిద్యయగు శక్తిని వ్యాసుడు త్రికూటోపాసనచే తరించెను. ఇట్లు కవులు వాక్యాతిశాయి వ్యంగ్యమున తమ భావముల వెల్లడింతురు. దేవుకు

సర్వవ్యాపియై యున్నాడు. వానిని ఎవ్వరును జూచి చెప్పజాలరు. శివోపాసన చేసినవాడే శక్తిని ఉపాసించగలడు. ఈ శక్తి ఉపాసనచే శివానుగ్రహమునొంది తరువాత మోక్షము నొందును. కనుక ఈశ్వరానుగ్రహముతో మోక్షము లోకమున సంభవించును. జ్ఞానస్వాతంత్ర్యము వలన జీవన్ముక్తి లభించును. కావున - పుంలింగం సర్వ మీశానాం స్త్రీలింగం చాపి విద్ధిమామ్ - అన్నట్లు శివుడు శక్తియే సర్వలోకము కనుక లోకమున స్త్రీపురుషుల నెల్ల శక్తి శివులనుగా భావింపవలెను.

# 10

కడచిన ప్రకరణములో దేవీతత్త్వమును గూర్చి తోచినంత చెప్ప బడినది. ఈ దేవీ స్వరూపమును శంకరులు తురీయమైన శక్తి అని కొని యాడిరి. త్రిమూర్తులలో హెచ్చుతగ్గులు లేవనియు, కాని సూతసంహిత మాత్రము శివుని గొప్పతనమును చాటుచున్నదనియు, అందరికన్నను శివుడు ఎక్కువకాలము బ్రహ్మమయుడుగ నుండుటవలన నట్లు చెప్పవల సిన దనియు నందుగలదు. శివుడు శక్తిని తొడపైనుంచుకొని తత్త్వోప దేశము చేయుచుండుననియు చెప్పియుంటిమి. పనులేమియు లేక బ్రహ్మ మనుభావముతోనుండి అదియే బయటికి చెప్పుచుండును. సగుణబ్రహ్మకు నవగా శివస్వరూపమున పార్వతిగను, విష్ణురూపమున లక్ష్మిగను, బ్రహ్మ రూపమున సరస్వతిగను, ఇంద్రరూపమున శచిగను వ్యవహరించుచున్నది, స్త్రీ పతివ్రత యగుచో పురుషుని అన్నిజన్మలయందును వెన్నంటివచ్చును. భార్యాభర్తలకుమాత్రమే శరీరైక్యమున్నది, కాని పరస్త్రీలను తల్లులవలెను, పురుషులను తండ్రులవలెను జూడవలయును. ప్రాసంగికము. అకృశం కుచయో, - అన్న శ్లోక మిదినలకే చెప్పబడినది. అందలి భావమేమన - బ్రహ్మరంధ్రమున నున్న తత్త్వమే కుచములయందు నకృశము, నడు మున కృశము, చక్షుస్థానమున విపులము, నితంబమున విస్తృతము, నధర మున నరుణమునై క్రిందకు వ్యాపించినది. ఒక్క తేజమే ఆయాయిభాగ ముల విభాగమునొంది ప్రకాశించుచున్నది. అదియే శక్తి. అది నా హృద యమున నావిర్భవించుగాక అని ధ్యానించెను. కపాలమునందలి పూర్ణ రూపమే ఆయా భాగములయందు భాగరూపముల నొందినదని కవిభావము.

ఇది —

ఊర్ధ్వమూల మథశ్శాఖమ్ !
అశ్వత్థం ప్రాహురవ్యయమ్ !
ఛన్దాంసి యస్యపర్ణాని
యస్తం వేద స వేదవిత్ !!

అని గీతలో చెప్పబడినది. గణాధిపతికి ఈ పేరు ఏలవచ్చినది? అనగా నాడు లన్నింటిలో 101 వ నాడి బ్రహ్మరంధ్రములోనికి పోవు చున్నది. రైలు ఇంజనులోని తీగల వలె నాడులన్నియు శరీరమంతట వ్యాపించి మూలాధారమున కేంద్రీకృతమై యుండును. ఇవన్నియు విఘ్న రాజు చేతిలోనుండి బ్రహ్మరంధ్రముదాక వ్యాపించుచున్నవి. కాబట్టి పుష్టి శక్తిసమేతుడైన గణపతిని పూజించవలెను. "ఆదౌ పూజ్యో గణాధిపః"- అని అందురనియే చెప్పిరి. పార్వతీపరమేశ్వరుల వివాహమునకు ముందు కూడ గణాధిపతి పూజ యున్నటుల బ్రహ్మపురాణమున గలదు. ఇచట మనకు ఒక సందేహము కలుగుచున్నది.

విఘ్నేశ్వరుడు పార్వతీ పరమేశ్వరుల కుమారుడు గదా? ఇతనికి పూజ వారి వివాహసమయమున నెట్లు కలిగినది? అని సంశయము. కాని ఈ గణపతిని భండాసురుని విఘ్నయంత్రనాశనమునకు కామేశ్వరి సృష్టించినదని చెప్పబడినది. మరియు శరీరనిర్మాణ మైనపుడే గణాధిపతి సృష్టి జరిగినదని తెలిసికొనవలయును, గాని పార్వతి నలుగుపిండి బొమ్మతో కాదు. కాబట్టి మనలో పుష్టిశక్తితో గణపతిలేకున్న ఏ పనులును సాగవు. కనుక ఇది చాల ప్రధానమని భావించవలయును. షట్చక్రాధారభూతమైన బ్రహ్మతేజము కాలమునుబట్టి అప్పు డాయా అవతారముల తాల్చుచున్నది.

అనాంతావై వేదాః — అన్నట్లు వేదములు అనంతము లగుచున్నవి. భరద్వాజుడు అను ఋషి మూడువందల సంవత్సరములు తన ఆయుర్దాయమున వేదాభ్యాసము చేసెనట. కాని పూర్తికాకుండుటచే తపస్సుచేసి మరి

యొక మూడువందల సంవత్సరములు ఆయుర్దాయము కోరి వేదాభ్యాసము సాగించెనట. అంతకు కాకుండుటవలన మరల పైవిధముగ బ్రహ్మను ప్రార్థించెనట. అంత బ్రహ్మవానిని పిలిచి బ్రహ్మలోకమునకు కొనిపోయి మూడు మహాపర్వతములజూపి వానిని వేదము లనెనట. అపుడు భరద్వాజుడు ఆ పర్వతములచుట్టు తిరిగి నమస్కరించెను. అంత బ్రహ్మ ఆ మూడుపర్వతములనుండి మూడు పిడికిళ్ళు తీసి వానికి ప్రసాదించెనట. ఇవియే మనకున్న మూడు వేదములని చెప్పబడుచున్నది. కాన వేదాభ్యాసము పూర్తియగుట చాలకష్టమైన కార్యమని తోచుచున్నది. అదియు గురుభక్తితోడనె విద్యలు ప్రాప్తించునుగాని చదివి వల్లించుటవలన వచ్చునవి కావు. ఇప్పటి విద్యావిధానము వేరు. అప్పటిది వేరు.

ముగ్గురు బాలురు ఒక ఋషిదగ్గరకు విద్యాభ్యాసమునకై పోయిరి. గురువుకు శుశ్రూష చేయుచు విద్యాభ్యాసము చేయసాగిరి. విద్యాభ్యాసమనునది - గురు శుశ్రూషచేతగాని, అత్యంత ధనముచేతగాని, లేక విద్య నిచ్చి విద్య గొనుటవలన గాని లభించును. బ్రాహ్మణ నియమము తప్పకుండ ఆ శిష్యులు శుశ్రూషచేయుచుండగ ఒకనాడు గురువుభార్య—శిష్యుల గూర్చి భర్తకు హెచ్చరికచేసినది. వారి విద్యాభ్యాసమునుగూర్చి యామె హెచ్చరించిన దన్నమాట. కాని గురువుమాత్రము ఏమియు పట్టనట్టు మిన్నకుండెను. మరియు వారి శుశ్రూష భార్యను మనసున కెక్కినదా? యని ప్రశ్నించెనట. అంత ఒకరోజు ఒక శిష్యునిపిలిచి నీవార ధాన్యపుపైరు చెఱువు గండిపడి యా నీట మునుగుచున్నది. కాన ప్రవాహము నిల్పుటకు కట్టవేసిరమ్మని ఆజ్ఞాపించెను. అంత శిష్యుడు బయలుదేటి ప్రవాహము ఆపుటకు ఎంతయో ప్రయత్నముచేసెను. కాని ప్రవాహము ఆగలేదు. ఇక చేయునదిలేక తానె ఆ ప్రవాహమునకు అడ్డుకట్టగా అడ్డము పండుకొనెను. అంత జలదేవత ఆతని గురుభక్తికి మెచ్చి ఆగిపోయినది. ఆ శిష్యుడు ఎంతకు రాకయుండుటజూచి గురువుభార్య హెచ్చరించగ, గురువు అంద

అను వెంటనిడికొని కొంతదూరమందుండి శిష్యుని కేకవేయగా —శిష్యుడు గురువుకు అచ్చటనుండియే నమస్కారనుని పల్కెను. మరియు జరిగినది చెప్పగా గురువు సంతసించి వాని గురుభక్తికి మెచ్చి లేచిరమ్మని పిలిచి, వరము కోరుకొనుమనెను. వెంటనే యాతడు జ్ఞానము ప్రసాదించు మని కోరెను అట్లేయని గురువు పల్కగనె అన్నివిద్యలు ఆతని హృదయమున ప్రకాశించినవి. ఆతడు సంతసించి వెళ్ళిపోయెను. ఇచట ముఖ్యముగ గ్రహింపదగినది యేమన దేవీ అనుగ్రహముతో (గురువుభార్య ప్రేరణవలన) ఈశ్వరునంతవాడగు గురుని యనుగ్రహమున శిష్యునకు తనలో నున్న విద్యలు ప్రకాశించినవి.

ఇక రెండవ శిష్యుడు కూడ ఇట్లే గురువుచే పరీక్షింపబడెను. ఈ శిష్యుడు ప్రతిదినము మాధుకరము తెచ్చి గురువు కర్పించుచుండెను. గురువు మాత్రము భోజనము చేసి శిష్యుని సంగతి పట్టించుకొనెడివాడు కాదు. శిష్యుడు ఆకలితో అలమటించి పోవుచుండెడివాడు. ఇతడు పశువులను మేపుటకు అరణ్యమునకు పోయి, అచట ఆకలికి బ్రతుకలేక ఆవు పాలను త్రాగి ఇంటికి వచ్చెను. గురువు శిష్యుని వాలకము విప్పారి యుండుట గమనించి అడుగ నాతడు చేసినపని చెప్పెను. వెంటనే గురువు తన యాజ్ఞ లేకట్లు చేసినందుకు కోపించెను, మరునాడును శిష్యుడు ఆకలి భరింపచాలక దూడనోటినుండి వచ్చు నురగను ఆస్వాదించెను. ఇందులకు నైతము గురువు కోపించెను. ఆ మరునటిరోజు ఆవులన్నియు వచ్చినవి, కాని తాను మాత్రము ఇంటికి రాలేదు. గురువు వానిని వెదకికొనుచు రాగ, పాడుబడిన బావిలోనుండి శిష్యుని కంఠస్వరము వినిపించినది. కారణమేమని అడుగ నాతడు ఆకలికి భరింపజాలక జిల్లేడు ఆకులు తింటిననియు, తన్మూలమున కన్నులు కనబడకుండ పోవుటచే బావిలో పడితిననియు చెప్పెను. అప్పుడు గురువు అశ్వనీదేవతల నుపాసింపుమని చెప్పి వానికి దృష్టి తెప్పించెను. ఈ శిష్యుడు మొత్తముమీద అన్నము

తినకుండ గురువు నుపాసించుట ఇందుగలదు. గురువు పెట్టిన పరీక్ష కాగినందున గురువు వానికి సర్వవిద్యలు ప్రకాశించునట్లు చేసెను. ఇట్టి కథలన్నియు గుర్వనుగ్రహమున్ననే సర్వవిద్యల జ్ఞానము కలుగుననుటకు చెప్పబడుచున్నవి.

మండన మిశ్రులు హంఫట్, హుంఫట్ అను మాటలకు అర్థము లేనట్లు, ఉపనిషత్తులనుగూడ కర్తకర్మను గొనియాడుట కన్న నర్థము లేదని పేర్కొనిరి. కాని ఈ వాదమును శంకరులు ఖండించిరి. వారు పై శబ్దముల కర్థము లేదనరాదనియు, ఏదియో అర్థముండుటవలననే దయ్యములు పారిపోవుచున్నవనియు సమాధానించిరి. మంత్రములకు నలుపు, తెలుపు, ఎఱుపు మొదలగు రంగులు కూడ కలవని మనవారు నిర్దేశించిరి. నేడీ మంత్రములపై నమ్మకము లేకుండుటవలన మనము తలచిన పనులు కూడ అగుటలేదు. రాను రాను మంత్ర సంప్రదాయముకూడ తెలియకుండ పోవుచున్నది. మానవులు పుట్టునప్పుడు అందఱు ఒక్కటిగనె యుందురు. కాని వారి వారి కర్మల ననుసరించి వారిలో నుత్తమత్త్వము ఏర్పడుచున్నది. ఈ భావమునే—

జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతే ద్విజః
వేదాభ్యాసేన విప్రోఽసౌ
బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః॥

అని చెప్పుచున్నది. కనుక విద్యాజ్ఞానము కావలయునన్నచో గుర్వనుగ్రహము కావలయును. శ్రీకృష్ణుడు చిన్నతనమందే శత్రుసంహారకుడయ్యు, జారుడయ్యు కంసవధానంతరము చదువుకై సాందీపని వద్ద విద్య లభ్యసించెను. సర్వమెఱింగిన పరమాత్మ గురువుదగ్గఱ చేరవల

యునా? అనిన ఇది సంప్రదాయమని చెప్పుటకే యని తెలియవలెను. అంతియ కాని ఆ పరమాత్మకు తెలియని విషయము లోకమున లేదు.

పూర్వము యవక్రీతు డనువాడు గురువుదగ్గర చదువకుండ విద్య రావలయునని తపస్సు చేసెను. వానికి ఇంద్రుడు ప్రత్యక్షమై, ఇది సంప్ర దాయ విరుద్ధముగా నున్నదని చివాట్లు పెట్టెను. కాని వాడు మానక తపస్సు చేయుచునే యుండెను. చేయునది లేక ఇంద్రుడు అట్లే పొమ్మని వరమిచ్చెను. ఇక యవక్రీతుని తండ్రి కుమారునకు గర్వము పెరిగి పోవునని భావించి వినయము నేర్చుకొనుమని బోధించెను. మరియు వారి ఆశ్రమమునకు సమీపమందున్న పరావసు, విశ్వావసు అను మునులజోలికి మాత్రము ఎట్టి పరిస్థితుల యందైన పోవద్దని, రైభ్యుని ఆశ్రమమునకే అసలు పోవద్దని కట్టడిచేసెను. కాని యవక్రీతుడు మాత్రము వాని కోడ లిని చూచి మోహించెను. ఈమె మామగారు రైభ్యుడు ఆభిచారిక హోమము గావించి కృత్యను బుట్టించి వానిపైకి సంపెను. అది పోయి యవక్రీతుని చంపివేసినది. వానివద్ద జలపాత్ర యున్న నేమియు చేయ జాలనని కృత్య వాని జల కమండలమును కాలితో తన్నెను. తర్వాత వానిని చంపెను. ఆ యవక్రీతుని తండ్రి భరద్వాజుడు దుఃఖించుచుండెను. ఇట్లుండ రైభ్యుని కొడుకులు విశ్వావసు పరావసు లొకరాజు యజ్ఞము చేయించుచుండిరి. చాలకాలమునకు తండ్రిని, యిల్లు, చూచిరావలయునని పరావసువు బయలుదేరెను. ఇతడు రాత్రివేళ ఒక అడవినబడి యింటి కేగుచుండెను. ఆ రాత్రియే తండ్రియగు రైభ్యుడును కొడుకుల జూచి రావలయునని యా దారినే పోవుచుండెను. ఇద్దరు మార్గమధ్యమున చీక టిలో కలియగా తెలిసికొనలేక కుమారుడు తండ్రిని దొంగయని భావించి చంపెను. తర్వాత తమ్మునియొద్దకు బోయి తానుచేసిన పితృహత్యను తమ్మునితో జెప్పి తనకు బదులు వానిని తత్ప్రాయశ్చిత్తము నడుపుమని పంపెను. ఆ తమ్ముడట్లే పోయి పన్నెండేళ్ళు చేయవలసిన ప్రాయశ్చిత్త

మును పన్నెండురోజులలో తీవ్రనియమమున పొపుకొని వచ్చెను. ఇక అన్నగారు ఇదే సమయమని భావించి రాజుగారితో తమ్ముడు వచ్చినచో యజ్ఞము నాశనమగునని యెక్కులు చెప్పెను. తమ్ముడు రాజువద్దకువచ్చి తండ్రిని చంపినది తాను కాదనియు, అన్నగారు చంపిరనియు, వాని పాపమునకు తాను ప్రాయశ్చిత్తము నాచరించితిననియు చెప్పెను. ఎంత చెప్పినను రాజు వినక వానిని వెడలగొట్టెను. ఇక అన్నగారు యజ్ఞమును జేయించి రాజువలన అనేక భూరిదక్షిణలు గైకొనిపోవుచుండెను. మార్గ మధ్యమున తమ్ముడు అన్నను జూచి జరిగినదానికి చింతిల్లుచుండగా, అన్న వానిని పాడుబావిలో పడద్రోసి పోయెను. కాని ఆతడు పాడుబావిలోనుండి మానసిక యజ్ఞము చేయ, సరస్వతినది యుద్భవించి వానిని పైకితెచ్చి యుంచెను. ఈతని గొప్పతనమునకు ఇంద్రాదులందఱు వరము లీయగా నితడు వారిని మూడు వరములు కోరెను. మొదట యవక్రీతుని బ్రతికించుట, రెండవది తండ్రిని బ్రతికించుట, మూడవది అన్నగారిపాపములు పరిహృతములగుట, కోరగా దేవత లాతని మంచితనమునకు ఆశ్చర్యపడి వరము లిచ్చుటయేగాక, అక్షయధనము నిచ్చియు పోయిరి. కాబట్టి గురు శుశ్రూషలేని విద్య గర్వకారణము కాగలదని తెలియవలెను. యవక్రీతుని గర్వము ఇంతపని చేసినదికదా ! గర్వకారణమైన విద్య దుష్ఫలితమే ఇవ్వగలదు. తన కపకారి యగు యవక్రీతుని తన తండ్రిని బ్రతికింప కోరుటయేగాక ధనాశతో తన్ను బావిలో త్రోసిన అన్నకు పాపములేకుండ చూచెను.

ఈ కథలో విశ్వావసుని ఎవ్వరైన గొనియాడవలెను. "గురువులేని విద్య కూడ దెవ్వరికైన"—అని పెద్దలు చెప్పిరి. ఈ విషయమునే శ్రీనాథుడు - శాస్త్ర మాచార్య సన్నిధిఁ జదువదేని-అను పద్యమున విశదీకరించెను. సకల జీవులకు మనోమయకోశము, వేదశాస్త్రాది విద్య లున్న వనియు నవి గురుప్రబోధమువలన భాసించుననియు సంప్రదాయము.

అట్టి సంప్రదాయమునకు మూలము వ్యాసభట్టారకుడు. వేదములనేకాండ మున కాకాండము విభాగము చేయుటవలన నాపేరాయనకు వచ్చినది. ఇతడు ద్వాపరమున నవతరించెగదా ? ఆది వరకీ విద్యావిభాగము లేవా యని ప్రశ్నింపరాదు. సృష్టికి ప్రారంభమందు విష్ణుదేవుడు తనయందలి సగముభాగముతో నొక పురుషు సృష్టించి, వానిచే వేదవిభాగము చేయించి వేదవ్యాసుడని, అపాంతరతముడని వానికి పేర్లు పెట్టెను. అపాంతరతము డనగా హృదయ తమస్సును వీఁగొట్టువాడని యర్థము. వ్యాసుడు తన పని కాగనె విష్ణువునందు లీనమగుదునని యనగా విష్ణువు ద్వాపరమున కృష్ణ ద్వైపాయనుడవై పుట్టుమనెను. వ్యాసుడు పురాణముల నన్నింటిని మనో మయకోశమునుండి వెల్వరించెను. కాని వ్రాయుటకాదని తెలియవలయును. ద్వాపరయుగమున వ్యాసుడు ఇతిహాసపురాణములు వెల్వరింపగా తత్పూర్వ మవి లేవనువారికి పైసమాధానము చెప్పవలసియున్నది. మనోమయ కోశమునకు యజుర్వేదము శిరస్సని ఋగ్వేదము కుడిరెక్కయని సామ వేదము ఎడమరెక్కయని, ఆదేశములు పురాణాదులు మాంసపిండమని బ్రహ్మపుచ్ఛమని పక్షిరూపముగ రూపించి వేదమే చెప్పుచున్నది. ఇతి హాస పురాణాదులన్నియు వేదములతోబాటు మనోమయకోశముననున్నవే కాని క్రొత్తగా పుట్టినవికావు. ఉన్నవానినే ప్రకాశింపచేయువారు వ్యాసాదు లగు మౌనివరేణ్యులు. అట్టి మహాత్ములకెల్ల నిత్యము ప్రణతులమైయుండి తదనుగ్రహముతో మనము విద్వాంసులము కావలయును.

# 11

సగుణబ్రహ్మమునుండి ఇచ్ఛామాత్రముతో శరీరమును ధరించి త్రిమూర్తులు శివ, బ్రహ్మ, కేశవులు వచ్చుచున్నారు. దేవతలు మానవుల కంటె గుణగరిష్ఠులై జ్ఞానులై సత్వగుణ ప్రధానులగుచున్నారు. మానవులు వారి వారి మన స్తత్వములనుబట్టి ఆయాదేవతలను పూజించుచుందురు. శాబర, ఆగమ, వైదికాది మంత్రము లెన్నియో గలవు. ఆయామంత్రము లచే నాయాదేవతలను ఆరాధించి యిష్టసిద్ధిని బడయవచ్చును. మంత్ర స్రష్ట స్వతంత్రుడై యుండును. వర్ణమాతృకోపాసన చేయువానికి మాట లన్నియు మంత్రములై వెలయును. రామాయణమునందలి ఇంద్రజిత్తునకు మంత్రనిర్మాణశక్తి యున్నదని తెలియుచున్నది. కాబట్టియే ఆతడు మంత్ర సమ్మేళన శక్తిచే అస్త్రనిర్మాణము గావించి రౌద్ర, బ్రహ్మ, నాగాస్త్రము లను మేళవించి ప్రయోగించినట్లు తెలియుచున్నది.

ఆగమశాస్త్రము ననుసరించి శివ విష్ణువులకు గుళ్ళు కలవు. కాని బ్రహ్మకు మాత్రము ఆలయము లేదు. అందులకు కారణముగా స్కాంద పురాణమున నొక కథ కలదు. ఒకప్పుడు బ్రహ్మ విష్ణువులకు కలహము వచ్చినది. వారిమధ్య శివుడు లింగరూపమున తుదిమొదలు తెలియకుండు నట్లు ఆవిర్భవించెను. అపుడు శివుడు వారిద్దరిని పిలిచి తనపాదముకాని, తలగాని ఎవరైనను ముందు తెలిసికొనిరమ్మనెను. ఈ కార్యక్రమము నందు హంసవాహన మెక్కి బ్రహ్మ ఊర్ధ్వభాగమున తల కనుగొనుటకు పోయెను. విష్ణువు పాదములు కనుగొన వరాహరూపమున భూమిత్రవ్వుచు క్రిందకు బోయెను. కాని విష్ణువు మాత్రము వెదకి వెదకి వేసారి శివుని పాదములు తెలియక తిరిగివచ్చి శివునికి తమ పాదములు తెలిసికొనలేక

పోయితినని చెప్పుకొనెను. ఇట్లే బ్రహ్మకు కూడ శివుని శిరస్సు అగపడ లేదు. అప్పుడు బ్రహ్మ అటుఇటు చూడగ ఒక ఆవు కన్పించినది. బ్రహ్మ ఆ ఆవును చూచి శివునితల నేను చూచివచ్చితినని సాక్ష్యము చెప్పుమని అడిగెను. ఇంతలో శివుని శిరస్సునుండి జారివచ్చిన మొగలిరేకును పట్టుకొని బ్రహ్మ దానినికూడ శివుని తల చూచెనని చెప్పుమని అడిగెను. వారిద్దరు తాను శివునితల చూచినట్లు సాక్ష్యముచెప్ప నొప్పించుకొని శివుని దగ్గరకు వెంటనిడుకొనిపోయెను. అపుడు శివుడు వారిని సాక్ష్యమడుగుచుండగా—ఆవు బ్రహ్మ శివుని చూచెనన్నట్లు తల ఆడించెను కాని చూడలేదన్నట్లు మరల తోకనాడించెను అప్పుడే శివుడు ఆవు అసత్యమాడుచున్నదని గ్రహించి—ఆవు ముఖము అసత్యమాడుటవలన ఉదయయే చూడరాదనియు, తోక సత్యము చెప్పుటవలన నది చూచినవారలకు పున్నెమబ్బుననియు చెప్పెను. ఇట్లే మొగలిరేకునుగూడ తనపూజకు పనికిరాకుండునట్లు శపించెను. ఇట్లే బ్రహ్మ సైతము శివుని చూడలేకయు చూచినట్లు అసత్యముపల్కెను. కాబట్టి వానికి గుడియు, పూజయు లేకుండునట్లు శపించెను.

సూతసంహిత సత్త్వగుణ ప్రధాన దేవతల పూజించుట యుక్తమని బోధించుచున్నది. శివకేశవులకు మాత్రము పూజ శాస్త్రాచారముల యందు నిర్ణయింపబడినది. శివుడు తెల్లనిరూపము గలవాడు. సత్త్వగుణ సంపన్నుడు. కాని ఆతడు లయకారుడు కాబట్టి తమోగుణ వ్యవహారము కలవాడగుచున్నాడు. విష్ణువు నల్లనిరూపము గలవాడు. కాబట్టి తమోగుణ ప్రధానుడు. కాని ఇతడు పాలనకర్త యగుటచే సత్త్వగుణమున వ్యవహారము కలవాడగుచున్నాడు. బ్రహ్మ ఎఱ్ఱనిశరీరము కలవాడు కాబట్టి రజోగుణ ప్రధానుడగుచున్నాడు. సృష్టి రజోగుణ ప్రధానమగుటచే బ్రహ్మకు సత్త్వ సంబంధము లేమి పూజ లేకుండపోయినదని తెలిసికొనవలెను. ఈ విషయము సూతసంహిత నొక్కివక్కాణించుచున్నది.

దేవతలకు చేయు పూజను మూడువిధములుగ చేయవచ్చును. దేవతను విగ్రహరూపముగ ఆరాధించుట-కాయికము, ఒక మార్గము. లేక మంత్రోచ్చారణముతో నమస్కరించుట వాచికము, మరియొక మార్గము. లేక మనస్సునందే ధ్యానించుట మానసికము మరియొక మార్గము. పూజాది కలాపమునందును, ధ్యానాది సమాధిస్థితియందు నున్నవారికి ఇతరులు నమస్కరింపరాదు. ఏలన, నమస్కారమునకు ప్రత్యభివాదనము చేయవలసి యున్నది. అట్లు చేసినచో వారి ధ్యానాదులకు విఘ్నము వాటిల్లచేసినవారగుదురు. ఎవరైనను నమస్కారముచేయునపుడు కుడిచెవి మూసికొని, ప్రవరచెప్పి—కులగోత్రాదుల నెఱింగించి నమస్కరింపవలసి యున్నది. అదియు తనకంటె గొప్పవాడైన శుచియగువానికి తానును శుచియైచేయుట శ్రేయస్కరము. ఇంటికి అతిథివచ్చినపుడు భోజనసమయమున మొదట యజమానునకు హస్తోదకము వేయవలెను తర్వాతనే అతిథికి వేయవలయును. కాని అతిథి స్వీకరించిన పిమ్మటనే యజమానుడు ఆ జలమును పుచ్చుకొనవలసియుండుట గమనింపవలయును. భర్త అనుజ్ఞపై భార్య అతిథిసేవ చేయవలసియున్నది. కేశవనామములు చెప్పునపుడు పుచ్చుకొను ఉదకము (మూడుసార్లు) ఒకదాని పిమ్మట మరియొకటి కలవకుండ పుచ్చుకొనవలయునే గాని, వెంట వెంటనే మూడు నేకమగునట్లు తీసికొనరాదు. అట్లే ప్రాణాహుతులు వేసికొనునపుడు విడివిడిగా స్వీకరించుట యుక్తము. 5—3 ఒకటైన బ్రాహ్మణుడు అని తెనాలి రామకృష్ణుడు ఆక్షేపించినాడు. స్త్రీ వాసస్సుతో సత్కర్మలేవియు చేయరాదు. ఆ వస్త్ర మాచమనమునకు పనికిరాదు. స్త్రీ వాసస్సు అనగా స్త్రీ కొఱకు కట్టిన వస్త్రము. అది ఉడికినను అందులకుదప్ప మఱి ఎందులకు నుపయోగింపదు. పైచెప్పిన విషయము లన్నియు ఆచారకాండకు సంబంధించినవి. ఇట్టి వనేకములుగలవు.

ఆచారహీనుడైన వాని వేదములుకూడ బాగుచేయచాలవు. పితృదేవతలు దేవతల కుమారులుగ గ్రహింపవలసి యున్నది. ఒకప్పుడు దేవ

తలు బ్రహ్మను తత్త్వము చెప్పుమనిరి. అపుడు బ్రహ్మ వారి కుమారుల నడిగి తెలిసికొమ్మనెనట. వారలట్లు పుత్రుల తత్త్వమడుగ వారు తండ్రు లను బిడ్డలారా! అని సంబోధించిరట. దానివలన వారలు పితృదేవతలైరి. పితృదేవతలు మూర్తులు, అమూర్తులు నని రెండువిధము లగుచున్నారు.

"సోమః పితృమాన్ యమోఽఙ్గిరస్వా నగ్నిష్వా
త్తోఽగ్నిః కవ్యవాహన ఇత్యాదయో యేపితరః"—

అని తర్పణ మొనర్చుచున్నారు. ఈ ఏడింటిలో మూడు మూర్తకులములు, నాలుగు అమూర్తకులములున్నవి. కాన ఈ ఏడుగురు దేవతలకు దేవతలగుచున్నారు. వీరు పితృలోక ప్రధానులు. వీరుకాక మన వంశమున పోయినవారు స్వపితరులు అనబడుచున్నారు. అమూర్తులకు, సూక్ష్మశరీరము మాత్రము కలదు. మూర్తులకు స్థూలశరీరము కూడ నుండును. పితృలోకము వేఱుగానుండి, వారు జ్ఞానులుగకూడ నుండెదరు వీరిని తృప్తిపరచుటకు శ్రాద్ధములు పెట్టవలయును. కాని నేడు చచ్చిన వారికి శ్రాద్ధములేల! ఈ బ్రాహ్మణులుతిన్న వారికి తృప్తి యెట్లుకలుగును? అని మనవారు శ్రాద్ధముల నిరసించుట మనము చూచుచునే యున్నాము. శ్రాద్ధము పెట్టనివానికి ఏ పుణ్యముచేసినను అక్కరకురాకుండ పోవును. కాబట్టి శ్రాద్ధనియమము లెట్టివో కొన్ని తెలిసికొనుట ఆవశ్యకమైయున్నవి.

"కర్తుం పూర్వేహ్ని నియమో!
భోక్తుశ్చైవ పరేహని"—

అని మొదటి నియమము శ్రాద్ధకర్తకు కలదు. రేపు శ్రాద్ధమన తొలినాడు బ్రహ్మచర్య - ఏకవార భోజనాది నియమము ఉండవలయును. శ్రాద్ధమునాడు కర్తకు భోక్తకు నియమము లుండుట చూచుచున్నాముగదా? అయినచో మనవారు శ్రాద్ధమునాడు మఱికొన్ని గారెలు వగైరా వండు

కొని రాత్రికూడా ఫలహారమని తినుచున్నారు. కొందఱు బుద్ధిమంతులు భోక్తనుగూడ బిలచి ఆ అల్పాహారము బెట్టుచున్నారు. ఇది యంతయు లౌకికము. శాస్త్ర మొప్పదు. భోక్తృశ్చైవ అను చకారమువలన తద్దినము రోజున, మరుసటిరోజున కర్త భోక్త ఇద్దరును నియమముగా నుండవలెను. ముందురోజుననే బ్రాహ్మణులకు నియామకము జరుగవలయును. శ్రాద్ధమునాడు కర్త శ్రాద్ధవిధి నిర్వర్తించినట్లు తెలియచేయుటకు విశ్వే దేవతలు ఏర్పడియున్నారు.

వీరు శ్రాద్ధవిధికి సాక్షులు. మంత్రమున — వసురుద్రాదిత్య రూపాణామ్ — అన్నపుడు తండ్రి - తాత - ముత్తాతలకు శ్రాద్ధవిధి గలదు. ఇందు తండ్రి వసురూపుడని, తాత రుద్రరూపుడని, ముత్తాత ఆదిత్యరూపుడని చెప్పబడుచున్నారు. వీరు క్రమముగ వసు - రుద్ర - ఆదిత్య లోకములం దుండెదరు. వారు లేకున్నను వారు ఎక్కడ నున్నది వారి రికార్డు ఆ లోకములం దుండును. శ్రాద్ధమునందు ఆరుగురు బ్రాహ్మణులకు తప్పక పెట్టవలయునని శాస్త్రము చెప్పుచున్నది. పితృస్థానమునందు ముగ్గురు, విశ్వేదేవతలస్థానమునందు ఇద్దరు, విష్ణుస్థానమున నొకడుగా బ్రాహ్మణు లుండవలయును. ఆరుగురకు పెట్టలేకున్న పక్షమున ముగ్గురికైనను పెట్టవలయును. ముగ్గురకు పెట్టలేకున్న ఇద్దరికి పెట్టవలయును. ఆ యిద్దరకు పెట్టలేకున్న ఒకరికైనను, ఆ ఒక్కరికి పెట్టలేకున్న ఆ కర్త అడవికేగి పితృదేవతలను గూర్చి పెద్దగ నేడ్వవలయునని కలదు. దానితో పితృదేవతలు దయదలచిపోదురు. ఇక శ్రాద్ధమునందు భోక్తలు కావలసినవెల్ల అడిగి పెట్టించుకొని తినవలయును. లేకున్న వారి నాలుక కోయబడును. ఇక పెట్టువారును చక్కగ వారికి కావలసినది పెట్టవలయును. లేకున్న వారి చేతులు కోయబడునని చెప్పబడియున్నది. చేయబడు పదార్థములు సైతము - "శ్రాద్ధే శాక చతుష్టయం" నాలుగు కూరలు, భక్ష్యభోజ్యములు మొదలైనవి చక్కగ చేయవలసి యున్నది. శ్రాద్ధకల్పమునందు విష్ణువు

పెత్తనదారుగ నుండును. శ్రాద్ధమునందు ఆయా బ్రాహ్మణుల నాయా దేవతలుగ భావించవలయును. ఆయా దేవతలను వారి రూపమున తృప్తి నొందించుచున్నాముకాబట్టి, ఆయా లోకములందలి పితృదేవతలుకూడ తృప్తి నొందుచున్నారు. విశ్వేదేవతలు ఆయా లోకములకు ఈ శ్రాద్ధ విషయమును తెలియజేయుచుందురు. ఆయా లోకములందలి అధికారులగు వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వేదేవతలుచెప్పగానే వారి పితృదేవత లెక్కడ నెట్లున్నది విచారించి వారికి దగిన యాహార మిచ్చుచుందురు. వారు దేవలోకమున నున్న అమృతాహారము, రాక్షసాది రూపముననున్న మాంసశోణితాదికము, పశువుగనున్న గడ్డి - ఇట్లు వారివారి ఆహారములుగ మార్చి చెందచేయుదురని శ్రాద్ధకల్పమున నున్నది. ఈ వ్యవహారము సరిగా జరుగుచున్నదా? లేదా? అని విష్ణుదేవు డేపేట విమర్శించుచుండును. కాన నిది తప్పింప నెవరి శక్యముకాదు. దీనికి మన మనియార్డరు వ్యవహారమే దృష్టాంతము.

పితృపూజలు చేయువారికి హరివంశము నందలి కథ మార్గదర్శకముగ నున్నది. భరద్వాజుని కొడుకులు ఏడ్వురు విద్యాభ్యాసమునకై గురుకులమున కేగిరి. ఈ ఏడుగురు గురుధనమైన ఆవును, దూడను, అడవికి మేపుటకు తోలుకొని పోయిరి. అక్కడ వారికి మిక్కుటముగ ఆకలి అయినది. వారిలో నల్వురు మాత్రము గోవును తిందమని పలికిరి, కాని వారిలో ముగ్గురు మాత్రము అందులకు ఒప్పుకొనలేదు. కాని పై నల్వురను తినుటకే నిశ్చయించిరి. వారిలో చివరివాడు మాత్రము మాంసము ఊరకతినుట ధర్మముగాదని చెప్పి మూడు మాంసపు పిండములను పితృదేవతల కర్పించునట్లు చేసెను. మిగిలినది వారు ఏడ్వురు ఆరగించిరి. ఇక సాయంకాలమున ఆ దూడను మాత్రమే ఆశ్రమమును చేర్చిరి. గురువు ధేనువును గూర్చి యడుగగా నా యందరు గోవును పులి చంపి తినెనని జవాబిచ్చిరి. గురువు నమ్మి ఆవు పోయినను శిష్యులింటికి

వచ్చిరని సంతసించెను. ఈ పాపమునకు గా ఏడ్వురును ఒక్కసారి చని పోయిరి. అదియుగాక వారిలో ఏది చేసినను అందరును కలసియే చేయ వలయునను నియమమున్నది. వీరు చనిపోయి మరుజన్మమందు దశార్ణ దేశము నందొక బోయవానికడుపునపుట్టిరి. వీరు పూర్వజన్మమందు గురుని ఆవు మాంసమైనను పితృదేవతలకు అర్పించి తినిరి గనుక తత్పుణ్య ఫల ముచే వారికి ఈ జన్మమందు పూర్వజన్మజ్ఞానమున్నది. కాన బోయలైనను హింసాదికము చేయక తల్లిదండ్రుల సేవించుకొనుచు జ్ఞానముతో కాలము గడుపుకొని, ఈ జన్మమంతరించిన పిమ్మట వారు కాలాంజనగిరియందు మృగములై జన్మించిరి. అపుడు కూడ వారికి పూర్వవృత్తాంత జ్ఞాన మున్నది. దానివలన నప్పుడును దపించిరి. మరల వారు చక్రవాకములై శరద్వీపమున బుట్టిరి. తర్వాత మానససరోవరమున ఏడు హంసములై జన్మించిరి. ఇపుడు కూడ వారికి పూర్వవృత్తాంత స్మృతి యున్నది. ఇన్ని జన్మములు చేసిన పాపమునకు పశ్చాత్తాపము నందుచు ధ్యానయోగముతో కాలము గడుపుచుండిరి.

ఇట్లుండగా భాభ్రవ్యుడు అను రాజు భార్యలతో జలక్రీడ లాడుటకు ఆ సరస్సునకు వచ్చెను. అందు విహరించుచున్న ఆ పక్షులలో ఏడవపక్షి రాజుతోకూడ జలక్రీడలాడు రాణిని చూచి – ఇట్టి భోగమింకొక జన్మ మున నుండదుగాన – పుట్టినచో రాజై పుట్టవలయునని పల్కెను. అంత మిగిలిన పక్షులన్నియు ఆ యేడవ పక్షిని అట్లే పుట్టుమని శాపమిచ్చినవి. అంత ఆ యేడవపక్షి వానిని విడచి యుండలేననియు, సామాన్యముగా నంటినిగాని ఈ భోగాపేక్షతో చెడిపోదునుగదా యని యేడ్చెను. అందు లకు మొదట నల్వురు – మిగిలిన ముగ్గురిలో ఇద్దరిని (రెండు పక్షులను) మంత్రిపురోహితుల కడుపున బుట్టి, ఏడవవానికి మంత్రి పురోహితులై యుండుడని శపించిరి. ఈ విషయమును ఆ నల్వురు వారిని అనుగ్రహించి చెప్పితిమనియు, భోగములనుభవించి సుఖమునొందుడనియు జెప్పిరి.

ఆ శాపముతో నా ముగ్గురకు పూర్వజన్మ జ్ఞానము కూడ పోయినది. ఇది కూడ గోవధము మాంసభక్షణము సమానమైనను - పితృాద్దేశముతో చేయుమని చెప్పిన విశేషమున నా ముప్వురు విశేషభోగము ననుభవింపనైరి.

జలక్రీడలాడుచున్న రాజదంపతులు ఏడవపక్షి అందమునకు అత్యాశ్చర్యము నొంది చూచుచుండగా, నది వారి కడుపున బిడ్డయై పుట్టినది. ఇట్లే ఆరవది పురోహితుని కడుపున, ఐదవది మంత్రి కడుపున బుట్టెను. మిగిలిన నాలుగు పక్షులు కురుక్షేత్రమున నొక బ్రాహ్మణుని కడుపున జన్మించినవి. వీరు పుట్టుటతోడనే పూర్వజన్మ జ్ఞానము కలిగి వేదవేదాంగముల కొలదికాలముననే చదివి సంసారమున విసుగుకలిగి తల్లిదండ్రులను మహాప్రస్థానమునకై సెలవిండని కోరిరి. వీరికి మాత్రము పూర్వజన్మ జ్ఞానమున్నది. వీరి తల్లిదండ్రులు మాత్రము పోషణ, శ్రాద్ధాదులు ఎట్లని? భావించి కుమారుల పోకకు సమ్మతింపరైరి. కాని వీరు మాత్రము మేము మామూలు కుమారులవంటివారము కామనియు, కుమారుల వలన సేవ మీకు జరుగదనియు, అందులకు ధనమవసరమై యున్నదనియు, కావలసినచో ధనమిప్పించెదమనియు పల్కిరి. అంత వారు—

శ్లో॥ సప్తవ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజనేగిరౌ
చక్రవాకాశ్శరద్వీపే హంసాస్సరసి మానసే
యేస్మజాతాః కురుక్షేత్రే బ్రాహ్మణా వేదపారగాః
ప్రస్థితా దూరమధ్వానం యూయం తేభ్యో ఒవసీదత॥

అను శ్లోకమును దల్లిదండ్రులకు వ్రాసియిచ్చి, ఆ శ్లోకమును రాజు దగ్గర చదివి వినిపించిన కావలసిన ధనము లభింపగలదని చెప్పి వారు మహాప్రస్థానమునకై సాగిపోయిరి. వీరిలో మిగిలిన ముప్వురు - రాజు మంత్రి పురోహితులై జన్మించి భోగము లనుభవించుచుండిరి. ఇక పై

చెప్పిన తల్లిదండ్రులు ఆ శ్లోకమును ఈ రాజు దగ్గరకు తీసికొని రాగా, ఆ సమయమున రాజుగారు వనవిహారము వెళ్ళియుండిరి. ఆతడు భార్యకు కోపము వచ్చినదని విహారమునకు పోయి రెండు రోజులుండి మూడవ నాడు నిద్రయందు కలలో గురువు కనబడి ఆకలియయి ఆవును తింటిరి, సరే! ఆ మాట సత్యము చెప్పక అబద్ధము కూడ నాడి పడరాని పాట్లు పడుచుంటిరి గదా! నాయనలారా! ఆ పాపము శమించినది అని చెప్పెను. దానికి నాశ్చర్యపడుచు తరువాత ఊరియందు ప్రవేశించు సందర్భమున పై బ్రాహ్మణుడు కనిపించి పై శ్లోకము చదువగనే, ఆతనికి పూర్వజన్మ జ్ఞానము కలిగినది. బ్రాహ్మణునకు కావలసినంత ధనమిచ్చి పంపి, బిడ్డలకు రాజ్యాదులర్పించి మహాప్రస్థాన మాచరించి, బ్రహ్మలోకమునకు పోయిరి.

కావున శ్రాద్ధవిధి నిర్వర్తించిన వారు జ్ఞానవంతులై తరించెదరు. అంతియగాదు. పూర్వజన్మ స్మృతియు వారికి లభించును. ఇక పితృదేవత లన్ననో దేవతలకు కూడ పూజ్యులగుచున్నారు. వారి లోకమునకు సంబంధము లేకున్న అలమటించి పోవుదురు. కావున మన పితరులు శ్రద్ధతో నెల్లవారు వారి వారి కులాచార ధర్మములను బట్టి తప్పక శ్రాద్ధ విధి నడుపవలెను. కావున మానవులు వేదవేదాంగాది విద్యాభ్యాస యుక్త బ్రహ్మచర్యముతో ఋషులను, యజ్ఞయాగాది క్రతువులతో దేవతలను, శ్రాద్ధములతో పితృదేవతలను ఉపాసింపవలయును. ఈ ఉపాసనతో ఋణత్రయము తీరిన తర్వాత యోగముతో గాని, సాంఖ్యముతోగాని ముక్తినొంద యత్నింపవలెను. ఈ యోగమున అష్టాంగము లున్నవి. అవి యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులు అనునవి. ఇచట చెప్పబడిన యమనియమాది ఆసనములు కార్మకాండ యందు చెప్పబడినవి. కాన యోగమునకు నైదు మాత్రమే యంగము లందురు. సమాధి ఫలముగాన యోగము చతురంగమే యందురు కొందరు.

ఉపాఙ్ పూర్వకమైన అస్ ధాతువునకు ఊరకుండుట యని యర్థము. వేమన చెప్పిన—

ఆ. వె. మాటలందుగాను మంత్రంబు నిలువను
మంత్రముదుగకున్న మనసు నిలదు
మనసు నిలువకున్న మరెముక్తి లేదయా
విశ్వదాభిరామ! వినుర వేమ॥

అను పద్యమున కదియే అర్థము. ఆస్థితి చేకూరుటకే సంధ్యావందనము ఏర్పడినది. అచట గోచరమగునది బ్రహ్మవస్తువు, దానిపై మనస్సు ఉండుట సంధ్య యగుచున్నది. ఒకప్పుడు పరశురాముని యజ్ఞము చేయించిన దత్తాత్రేయస్వామి యజ్ఞాంతమందు నీ పరశురాముని యాగముతో నా సంధ్య పోయినది అని విసుగుకొని సంధ్యావందనమును చేయబోవ సిద్ధసాధ్యాది దేవతలు దత్తదేవుని సంధ్యావందనము చూచుటకై పోగా, పరశురాముడు నదియొడ్డున నున్నవా డున్నట్లుండి యదృశ్యుడయ్యెను. చాలసేపటికి వారికి మామూలు శరీరముతో కనబడెను. ఇది యేమని ఆశ్చర్యపడుచుండగా నా దేవతల కాదత్తదేవుడు - సమష్ట్యభిమానిగ నుండుటయే సంధ్య. అట్టిస్థితి కుదిరినప్పు డీ తత్త్వములన్నియు స్థూలసూక్ష్మములతో నందుండి పోవును. మరల నిటుతిరిగిన నివియన్నియు భాసించును—అని చెప్పెను.

ఇట్టి స్థితికి మానవుడు వచ్చుటకే సంధ్యావందనము చేయుట. కావున వృత్తికి వృత్తికి మధ్యనున్న బ్రహ్మవస్తువును కనిపెట్టు తెలివియే, ఆసంవిత్తే సంధ్యాదేవి యనబడుచున్నది. అట్టిస్థితి కుదురుటకు బహిర్యాగమగు క్రియారూపమైన సంధ్యావందనము మూడువేళల తప్పక చేయవలసియున్నది. ఇందు సూర్యోపాసనము గాయత్రీ ఉపాసన, అర్ఘ్య ప్రదానము కలవు. ఇందును అర్ఘ్యప్రదానము ముఖ్యమని కొందఱు, గాయత్రి ముఖ్యమని కొందఱు, సూర్యోపాసన ముఖ్యమని మరికొందఱు

అనుచున్నారు. ఇచట అశౌచాదులు వచ్చినను విడువక నాచరించు నర్ఘ్య దానము ముఖ్యమని కొందఱు. గాయత్రీమంత్రము బ్రహ్మధ్యానము గాన నిదియే ముఖ్యమని కొందఱు, అన్నిటికి నుత్తమమైనది గాన సూర్యోప స్థానము ముఖ్యమని కొందఱు చెప్పెదరు. స్త్రీపురుష భేదము పాటింపక అందఱును సంధ్యావందనము చేయవలయును. సూర్యుని చూచుచు ప్రాతస్సాయం సమయముల నర్ఘ్యమీయవలెను. రామాయణమున హను మంతుడు లంకలో సీతను వెదకుచు విసిగి వేసారి చివరకాక సరస్సు సమీపమున వేచియుండెను. కారణమేమన సీత సంధ్యావందనము చేయు టకై సరస్సు దగ్గరకు వచ్చువేళ యిది యని ఆతడు భావించినట్లు వాల్మీకి వ్రాసిపెట్టెను. దీనినిబట్టి స్త్రీలు కూడ సంధ్యావందనము చేయుట ఆవశ్యకము. దానింబట్టి శూద్రాదులును సంధ్య నుపాసింపవలెను. ద్విజులు సమంత్రకముగ చేయు సంధ్యయన బహిర్యాగము ద్వారమున అంతర్యా గము సిద్ధికావలసియున్నది. అది కలుగుతఱి అందఱకు ననుభవము ఏక రూపమే. ఈ యంగత్రయముతో గూడిన సంధ్యోపాసనము తురీయము. అదియే యిందు ప్రధానమని కీ. శే. లగు మా తండ్రిగారు శ్రీరామ కథా మృత కవియగు తా. వెంకటప్పయ్యశాస్త్రిగారు తమ గురుపరంపరాప్రాప్త మను సిద్ధాంతమున నుడివిరి.

ఇక దీని కధికారు లెవరన? "యో దేవః సవితా అస్మాకమ్ ధియో ధర్మాది గోచరాః" అను గాయత్రీ పురాణ శ్లోకముతో అందఱును అర్ఘ్యప్రదానము చేయవచ్చును. మంత్రము మాత్రము స్వరప్రధానమై యుండును. గనుక ఉచ్చారణలోప ముండరాదు. పూర్వము వృత్రాసురుడు ఈ స్వరలోపముచే చచ్చెనను ఇతిహ్యమొకటి శ్రౌతమే కలదు. కావున నెల్లజీవులకు యథావిధిగ నాచరించు సంధ్యావందనమే ముక్తినిధానమని వేరుగా చెప్పనక్కరలేదు. కాన మనవారెల్ల సంధ్యోపాస్తిచే ముక్తు లయ్యెదరు గాక ! ! !

# 12

మానవుని మనస్సు నాదమునందు సులభముగ లయమగుచున్నది. అనగా వృత్తిరహితమైన బ్రహ్మానందమును పొందుచున్నదని యర్థము. పరమాత్మ స్వరూపము బ్రహ్మానంద పర్యవసాయి అయినను లీలాస్వీకృత విగ్రహుడైన విష్ణువు బ్రహ్మమయుడై యుండియు లోకవ్యవహారము సాగించుచు, తన వ్యవహార సమయమున బ్రహ్మరూపమునుండి చ్యుతుడు గాక అచ్యుతుడై వెలయుచున్నాడు. విష్ణువు సహజమైన బ్రహ్మభావము నుండి చ్యుతుడు కాడు కావుననే అచ్యుతుడని పిలువబడుచున్నాడు. శ్రీరామునకు 11 వేల సంవత్సరములలో ఒకేసారి దేహాభిమానము కలిగినదట. మారీచుని సంహరించివచ్చి పాడుబడిన పర్ణశాల జూచి శరీరాభిమానముతో ఓ కైక! ఓ తల్లి! నీ కోరిక నెరవేరినదని విలపించెను. ఇట్టి తిట్టు కైక నెప్పుడు తిట్టలేదు. కావున నిచ్చట రామునకు మానుషాభిమానము కలిగినదని వృద్ధసంవాదము కలదు. అగస్త్యుడు రాముని-రావణుడు సీతను తల్లివలె రక్షించె (మాతేవ పరిరక్షితా) నని యుండగా నేల సంహరించితివని ప్రశ్నించెనట. అసలు రావణుడు—రాముని చేతి యందు మరణము కోరియే సీతను దీసికొనిపోయెనుగాని కామముతో గాదని పెద్దల వాదము. కాన రావణుడు తెలిసినమూర్ఖు డనబడుచున్నాడు. దుర్యోధనుడు మాత్రము తెలియనిమూర్ఖు డగుచున్నాడు. రావణుడు సీత నపహరించు సందర్భము లోకమున పరిపరివిధములుగ నున్నది. అసలు సీతయే యని కొందరు, కొందరు అసలు సీత కాదనియు, మాయాసీత యనియు తెల్పుచున్నారు ఈ మాయాసీతయే అగ్నియందుండి ద్వాపర యుగమున ద్రౌపదియై అగ్నినుండి జన్మించెనని దేవిభాగవతమున గలదు.

వాల్మీకమున మాయాసీత యెక్కడ లేదని కొందరు పండితులు వాదించు చున్నారు. వాల్మీకము నాదికావ్యమని వ్యవహరింతురు. కావ్యము వ్యంగ్య ప్రధానమని లక్షణము గదా! "జీవితం వ్యంగ్యవైభవం" ఆ వ్యంగ్యము నెల్లరు కనుగొన లేరనియే దానిలోని వ్యంగ్యమంతయు అధ్యాత్మ రామా యణముగా వ్రాయబడినదని పెద్దలు అనుచున్నారు. అథవా వాల్మీకము వ్యంగ్యకావ్యము కాదనినను దానినిబట్టి మాయాసీత లేకున్నను, అధ్యాత్మ రామాయణమునుబట్టి, దేవీభాగవతాది గ్రంథములనుబట్టి, లౌకిక ప్రవాద మునుబట్టి మాయాసీత వ్యవహారములో లేకపోలేదు. అంతరర్థమును ఆలో చించినచో రావణాసురుడు దేవీఅనుగ్రహము కొఱకు సీత నెత్తుకొని పోయెనని చెప్పవలయును. దీనికి రామాయణములోనె సనత్కుమార రావణసంవాద, కపిలముని సందర్శనములు నిదర్శనములు. దహరాకా శములోని బ్రహ్మతో మాయలీనమై యున్నది. లంకయనగా శరీరము క్రిందిభాగము. అందునున్న తెలివియే మాయాసీత. అది నాగలిచాలువలె చక్రముద్వారా వ్యాపించియున్నదని యోగము. వాయుజుడు (హనుమం తుడు) దేవీతత్త్వమును వెదకుచున్నాడు. సీత హనుమంతునితో భాషిం చుచు రామునకు ఎక్కడ వలసిన నక్కడనే సీత యున్నదని పల్కెను. అనగా రావణుడు తెచ్చిన సీత మాయాసీత యని తెలియుచున్నది. రావ ణుడు తెచ్చునపుడు అసలుసీత అగ్నులయందు లీనమైయుండెనట. దీనిలో వాది దౌర్బల్యమేగాని వాదదౌర్బల్యము లేదు. ప్రాసంగిక మాకథ యిట్టు లుండ ప్రస్తుత మనుసరింతము.

---

మనస్సునకు వృత్తియందే ప్రపంచము వచ్చినది. వృత్తి లయ మైనచో ప్రపంచము లేదు. అది నాదమునందు సులభముగ లయము నొందును-అని శంకరులు భాషించిరి. కాని యేది యెట్లున్నను అవతార పురుషులకు కష్టసుఖము లనునవి లేవు. మనము గ్రంథములందు చదువు నది యెల్ల వ్యావహారికలోకమునకు మాత్రమే యగుచున్నది. కావ్యములు

వ్యంగ్యప్రధానముగ, కాంతాసమ్మితములై అలరారుచున్నవి. వేదములు ప్రభుసమ్మితములు. పురాణములు మిత్రసమ్మితములు. ఇక కావ్యము వ్యంగ్యప్రధానమంటిని గనుక ఇందు వాచ్యార్థముకాక వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. శ్రీహర్షుని నైషధమునకు వ్యంగ్య వైభవములో వేదాంతపరమైన అర్థము గ్రంథమంతట తోచుచున్నది. కాని మనవారు "కావ్యాలా పాంశ్చవర్జయేత్"-అను వాక్యప్రమాణమున కావ్యముల చదువ రాదని నిషేధించిరి. అయినను కావ్యములందు వర్ణించిన మంచి విషయమును గ్రహించి చెడును విసర్జించవలయుననియే పై వాక్యార్థముగ సమన్వయించి చూడవలయును. "సత్కార్యవ్యక్త్యాద్యపసే చరంచ సమీరసేకాదివదీరయంత్యేత్యాది వాక్యములును కావ్యములవలన కర్తవ్యత్వబుద్ధి నిశ్చయమగుచుండును. చమత్కారిత్వమందు నుండుటవలన మనము నాకర్షించునుగాన నిట్టి కావ్యములకా నిషేధము తగులదు. అట్లు తగిలిన వాల్మీకమును కావ్యమేగదా?

ఇక శ్రీహర్షుడు తన కావ్యమగు నైషధమును వ్యంగ్యవైభవ విలసితముగ వెలయించె నంటిమి. ఈ వ్యంగ్యమనునది పదైక దేశమని వర్ణగతమని అనేకవిధములుగ నుండును. అంతియగాక ప్రబంధగతమని వాక్యగతమని గలదు. శ్రీ హర్షుడు తన కావ్యమును ప్రబంధగత వ్యంగ్యముగా రచించెను. ఇందు ప్రతిశ్లోకము వేదాంతార్థమును స్ఫురింపజేయును. రలయో రభేదః — అను సూత్రప్రమాణముచే నల శబ్దమునకు నర అని అర్థము చెప్పవచ్చును. నరుడనగా నశింపనివాడని యర్థము. క్షయించు స్వభావముగల శరీరమును కాపాడువాడని భావము. కాబట్టి శరీరాధికారి నరుడు అగుచున్నాడు. ఈ భావము నాతడు మొదటి శ్లోకమునందే పొందుపరచెను. క్షితి రక్షిణః కథాః — క్షితి అన నశించునది శరీరము. దాని రక్షించువాడు నరుడు. అతడు మహోజ్జ్వలమగు తేజోరాశి. సితచ్ఛత్రిత కీర్తిమండలుడు అని మొదటి శ్లోకమున నామరూప రహితః పరమాత్మా—

అని వస్తునిర్దేశముచేసి రెండవశ్లోకమున దీనిని వివరించెను. శ్రీకృష్ణుడు గీతయందు – యశ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకం—అని చంద్రునియందలి అగ్నియందలి తేజము నాయదిగా తెలిసికొనుమని చెప్పెను, కాని సూర్యమండలము సంగతి చెప్పలేదు. దాని కర్థముచంద్ర మండలము సహస్రారము. అగ్నిమండలము నాభిస్థానము. ఈ రెంటి యందు వ్యాపించిన తేజము దహరాకాశగతమగు సూర్యతేజము తనదిగా నిశ్చయించి నుడివెను. నైషధమునందలి – రసైః కథామస్య సుధావధీరిణీ నలస్స భూజాని రభూత్ గుణాద్భుతః.... అను శ్లోకమున ఎవరికథ రసము లతో సుధను తిరస్కరించునదియో ఆ నలుడు భూమిజాయగా గలవాడై గుణాద్భుతు డాయెను అని నిర్గుణమును సగుణముచేసి వర్ణన మొదలిడెను. వేదాంతపరముగ పరమాత్ముని కథయని మరియొక అర్థము. మరియు—

సువర్ణ దండైక సితాత పత్రితజ్వల త్ప్రతాపావళి కీర్తి మండలః- మొదటి శ్లోకమున సితాతపత్రమును మాత్రమే చెప్పి రెండవ శ్లోకమున దానికి సువర్ణ దండత్వమునుకూడ సంపాదించెను. ఈ శ్లోకము వలన బంగారపు కఱ్ఱపై భాగమునగల తెల్లని గొడుగు కలవాడు నలుడని భావము. సహస్రారమునందలి పరమాత్మ స్ఫురణ మరియొక అర్థముగా తోచును. ఇట్లు ప్రతి శ్లోకమునకు వేదాంతార్థము చెప్పితీరవలయును. ఇందలి దమయంతి విద్యాశక్తి యని ఇదివరకే చెప్పబడినది,

ఒకనాడు నలుడు వనవిహారమునకై వెళ్ళెను. శరీరమే ఉద్యాన వనము. అందలి నాడులే వృక్షములు. ఆ ఉద్యానమునం దొక సరస్సు. అదియే ఐరంమదీయ సరస్సు. అందు బంగారు రెక్కలుగల హంస ఒంటి కాలిమీద నిలబడి నిద్రబోవుచున్నది. మన శరీరమునందలి హంస కూడ నిద్రించుచునే యుండును ఈ హంసను జాగ్రత్తగా పట్టుకొనవలసి యున్నది. నలు డా హంసను బట్టుకొనగా నది యాతని చాల బాధపెట్టెను.

తనను వదలుమని సామోక్తులతో పలికెను. చివరకు విడిపించుకొనలేక దుఃఖించెను.

"మదేకపుత్రా జననీ జరాతురా" ఇత్యాదిగా నెంతయో ప్రాధేయ పడినది. ఇదియంతయు మొదట హంసనిరోధము చేసినవాని సాంసారిక విచ్యుతివలని బాధ. పరమార్థమునకై పాటుపడుచుండగా సంసార తాప త్రయము హేచ్చినట్లు హంస యెంతయో బ్రతిమాలెను. కాని లాభములేక రాజుచేతిలో సొమ్మసిల్లెను, ఇట్లు ఆ హంస నలునకు స్వాధీనమైనది. రాజు తర్వాత దీనదయాళు డగుటవలన నిన్ను చంపుటకు బట్టలేదు. కాని నీ రూపము చూచి యానందించుటకే పట్టుకొంటిని. రూపము చూచు పని నెరవేరినది గాన నిక నీవు యథేచ్ఛగా బొమ్మని వదలెను. కాబట్టి బ్రహ్మ సాక్షాత్కారమైన పిమ్మట హంస (ఉచ్ఛ్వాస నిశ్వాసములు) ఎట్లు పోయిన నేమి? ప్రాణాయామాదిక మనవసరము. కాని రాజును వదలిపోయిన హంస మరలవచ్చి ఆతని భుజముపై వ్రాలినది. అనగా యోగాభ్యాసపరు లకు నిర్ణీతకాలమున యోగసమాధి దాని యంతతానె ఆవహింపగలదని భావము. వచ్చిన హంస రాజున కొక సందేశమిచ్చినది. ఇది హంస దౌత్యము. అనగా నీ హంసయే జ్ఞానమును, విద్యను, ప్రకాశింపచేయునదని భావము. కథయందు దమయంతి తండ్రి భీమరాజు. అనగా నియమమని భావము. వీనికే దమయంతీరూపమైన విద్యాశక్తి పుట్టినది. ఇక దమ యంతి స్వయంవరమునకు దేవతలుకూడ వచ్చినట్లు కలదు. దేవతలు కథలో కామముతో వచ్చినట్లుండిరి కాని ఆంతర్యమున—దేవతలు నల దమయంతులకు సంబంధము కలిగించుటకే వచ్చిరి. పైకి వారు స్వార్థ మును జూపుచున్నట్లున్నను ఆంతర్యమున పరోక్షప్రియులు దేవతలు. కాబట్టి నలుని ఇష్టాపూర్తములకు సంతసించి భూమియందే స్వర్గసౌఖ్యము నాతనికి కావించుటకే దేవతలు వచ్చినట్లు ఊహింపవలయును. కావున దమయంతిని వివాహమాడుటకు దేవతలు రాలేదు, అదియునుగాక వారు

దమయంతి నలుని గుణగణములను విని చూచి వరింపకున్న వట్టి మొద్దు కనుక, అట్టి అవివేకి మనకు వద్దనియు భావించిరట. మరియు దమయంతి నలునే వరించినచో పరదారపై ప్రణయము మనకేల ? అని భావించిరట. కావున దేవతలకు దమయంతిపై నిజమైన ప్రేమలేదనుట తెలియవలెను, మొత్తముమీద స్వయంవరము నాడు నల్వురు దేవతలు నలరూపధారులై రాగా భీమరాజు ప్రార్థనపై సరస్వతియే స్వయముగా వచ్చి దమయంతికి నలుని చూపి చెప్పినది. ఇందు సరస్వతి ఆయా దేవతలగూర్చి చెప్పుచు సర్వదేవతారూపుడు నలుడని ప్రశంసించి బహు చాకచక్యముగా నిరూపించి చూపినది. అయినను దమయంతి నలుని నిజరూపమెఱుగక ఒప్పుకొన లేదు. చివరకు దేవతలను ప్రార్థించి వారు ప్రసన్నులుకాగా నిజమైన నలుని వరించినది.

ఈవిధముగా విద్యాశక్తికి ఆత్మతో సంబంధము వర్ణింపబడినది. వచ్చిన దేవతలు నలదమయంతులకు వరములిచ్చి పోయిరి. ఇంద్రాగ్ని యమవరుణులచే నలుడు గొప్ప వరముల నొందెను. కావున శ్రీహర్షుని నైషధము ప్రబంధగత వ్యంగ్యమునకు చక్కని యుదాహరణముగ గైకొన వచ్చును.

శ్రీహర్షుడు తర్కమున గొప్పవాడు. ఒకప్పుడు శంకరులతో వాదించి చార్వాక మతమును స్థాపించెను. అట్టియెడ శంకరులు వానియుక్తి చాతుర్యమునకు మెచ్చుకొని మాటాడక మిన్నకుండెను. కాని శ్రీహర్షుడు భోజనమునకు కూర్చుండగా అన్నము పురుగులవలె కన్పింపసాగెను. అపుడు శ్రీహర్షుడు తల్లితో శంరులతోడి తన వాదమును, తత్ఫలితమును గూర్చి చెప్పెను. ఆమె వెంటనే శంకరుల పాదములపైబడి పుత్రభిక్ష నర్థింపగా శంకరులు నేనేమియు ప్రయోగము చేయలేదని సమాధానమి చ్చెను. మరియు శ్రీహర్షుని వాదమునకు మాత్రము తన మనస్సు బాధ

నొందినదనియు చెప్పెను. బ్రహ్మజ్ఞానియై, ఆస్తికుడైన వాని మనస్సుకు బాధ నొందించిన వాదు ఏడురోజులలో స్వయముగా నశించునని శాస్త్రము నందు గలదు. ఇట్లే రావణయుద్ధము ఏడురోజులతోనె ముగిసినదికదా! శ్రీహర్షుడు మరునాడుదయమున స్నానముచేసి, విభూతిపూసికొని శంకరుల దగ్గరకు వెళ్ళి మరల దేవుడు కలడని వాదించెను. ఇట్లు తన తర్కవాదముతో వేదముల కన్యార్థము కల్పించి శంకరుల వాదమును శ్రీహర్షుడు పరాస్తము కావించి పలుబాధలకు గురియయ్యెను. కాన పరిహాసమునకైనను నాస్తికవాదము గ్రహింపరాదు.

ఇట్లే రామాయణమునకు కూడ వ్యంగ్యార్థము గ్రహింపవచ్చును. ఉత్తరకాండయందు అగస్త్యుడు రాముని - సీతను తల్లివలె చూచిన రావణు నేల చంపితివని ప్రశ్నించెను. ఇచట ఒక సందేహము పొడగట్టుచున్నది. నలకూబరుని వలన రావణునకు ఇష్టము కాని స్త్రీని ముట్టరాదని, ముట్టినచో తల పగులుననియు శాపము గలదు. ఈ విషయమును నారదుడు బ్రహ్మతో చెప్పగా బ్రహ్మయు తథాస్తని దీవించెను. కాని రావణుడు సీతను మెడను తొడనుబట్టి తీసికొని వెళ్ళినట్లు రామాయణమున గలదు. కాని ఆతని తల పగులలేదు. కారణ మాతడు సీతను మాతృభావముతో ముట్టుకొనెను గాన అని తెలియవలెను. ఒకానొకప్పుడు రావణుడు సనత్కుమారుని దగ్గరకు పోయి విష్ణువు యొక్క గొప్పతనమును గూర్చి చెప్పుమనెను. అంత సనత్కుమారుడు ఆతని గౌరవించి విష్ణువుయొక్క గొప్పతనమును గూర్చి, ఆతని చేతిలో చచ్చుట పుణ్యమని బోధించెను. అంత రావణుడు అట్లు విష్ణువుచేత చచ్చు పుణ్యము నాకు గలదా? అని మనసు లోపల దలచెను. సనత్కుమారుడు విష్ణువు రాముడై దశరథుని గర్భమున జన్మించి నిన్ను చంపుననెను. నాటినుండి రావణుడు రాముని రాకకు నిరీక్షించుచుండెను. అంతియగాదు. ఇక్ష్వాకు వంశీయుల నందఱను సంతానవంతుల మాత్రమే యుద్ధమున నిహతుల కావించుచుండెను. ఇక్ష్వాకు

వంశ నాశనము చేయుటకు ఇష్టపడలేదు, మరియు దశరథ కౌసల్యలకు రాముడు పుట్టునని తెలిసి వారిని రావణుడు పెట్టెయందు బంధించి యుంచెను. కాని ఆ పెట్టెను మునలి ఎత్తుకొనిపోయెను- అని యేదో ఒక గాధ అన్యపురాణాంతర్గతము కలదు. ఆ కౌసల్యా దశరథులు మరొకరు అని తెలిసికొనవలెను. తర్వాతనే ఈ దశరథునకు కౌసల్యకు రాముడు జన్మించెను, దశరథుని పరాక్రమమును రావణుడు మొదటినుండియు పరీక్షించుచుండెను. 12 ఏళ్ళకే దశరథుడు రాజర్షియై సింహాసనమెక్కెను నాడు లోకమున నొక నియమము గలదు. 12 పర్యాయముల కొక్కసారి శనైశ్చరుడు రోహిణిని భేదించును. అప్పుడు కటపుకాటకములు లోకమున నేర్పడును. దశరథుడు అది తప్పించుటకై ప్రయత్నము చేయనెంచెను. కాని వశిష్టుడు లాభము లేదనెను. అయినను దశథుడు ఖగోళమున యుద్ధము చేయుటకు నిశ్చయించి సుమంత్రుని రథమాయితము చేయుమని ఆజ్ఞాపించెను. 400 గుఱ్ఱములు పూన్చిన నూరు రథములపై యుద్ధమునకు తరలెను. కాన శతరథుడు వాడు. యుద్ధమునకు పోవుచు వశిష్ఠుని సెలవడుగగా నాతడు విజయమగునని తమంపులాడకము రథముపై జల్లి దీవించెను. యుద్ధమున శనికి ఎదురుగా రథము నిల్పి రోహిణిపైకి పోకుండ నిరోధించెను. శని దశరథుని నూరు రథములలో 90 రథముల నిఱుగగొట్టెను. పది రథములు మాత్రము మిగులుటచే దశరథుడని పేరు వచ్చెను. అపుడు దశరథుడు బ్రహ్మచర్యమున నున్నాడు గాన దీక్షతో బ్రహ్మశిరోనామ కాస్త్రమును లోకోపకారమునకై శనిపై ప్రయోగించెను. అంత శని శరణువేడెను.

అంతియగాక దశరథుని రాజ్యపాలన పర్యంతము రోహిణిని భేదింపనని పల్కెను. ఇట్లు దశరథుడు అజేయుడై ఖగోళముతో యుద్ధ మొనరించెను. అరువదివేల యేండ్లు రాజ్యము నేలెను. ఇట్టి దశరథ పరాక్రమము చూచి, వీనికి తప్పక రాముడు పుట్టగలడని భావించి, ఆతనితో

యుద్ధము చేయక, రాముని రాకకై రావణుడు నిరంతరము నిరీక్షించు చుండెను. కానిచో రామజన్మమునకుగా దశరథు డొనర్చిన అశ్వమేధము నందలి గుఱ్ఱమును రావణుడుగాని వాని తరఫున మరొక్కడుగాని పట్టు కొనకుండ నేల వదలిరి? పిలువని పేరంటమునకు పోవు రావణుడు పిలుపుగల మేధ్యాశ్వ విషయమగు యుద్ధమును వదలుట ఆలోచింపదగిన విషయము గాదా। ఇదంతయు ధ్వని వైభవము.

# 13

రామాయణమునందలి రావణుడు తెలిసిన మూర్ఖుడని తెలిపి యుంటిని. ఏలన విష్ణ్వంశ సంభూతుడైన రాముని చేతిలో చావు కోరి, వాని రాకకు వేచియుండెను. మొదట సనత్కుమారుడె రాముని చేతిలో రావణునకు చావుకలదని చెప్పెను. తరువాత కపిలముని నిన్ను చంపుటకు మానుషదేహముతో వచ్చెదనని చెప్పెను. అదియుగాక ఇక్ష్వాకువంశ సంజాతుడైన అనరణ్య మహారాజు తన వంశమునందు బుట్టినవారిచే రావణునకు చావు గలదని శపించెను. కాబట్టి ఈ మూడు కారణములచే రావణుడు రామునిచేత చావవలసియున్నది. ఇది తెలిసియే రావణుడు రాముని రాకకు వేచియుండెను. ఇట్టి రాము డెవరి గర్భవాసమున జన్మించునాయని ఇక్ష్వాకువంశరాజుల నందఱను విమర్శించి చూచుచునే యుండును. కుమారులులేని రాజును ఇక్ష్వాకువంశమున చనింపడు. చివరకు దశరధుడు 12 వ యేట రాజర్షియై, ఖగోళములో శనితో యుద్ధము నొనరించి గెలుపొందుట చూడ రావణునకు ఆశ్చర్యము గొల్పెను. కావున తప్పక రాముడు దశరధునికే జన్మించునని ఆశపడియుండెను. దశరధునకు 360 మంది భార్యలు, ముగ్గురు రాణులు గలరు. వారందరిలో నందగత్తెయును, చివరిదియును నగు రాణి కైక. ఈమె కేకయరాజు కుమార్తె. దశరధున కంతమంది భార్యలున్నను నాతడు—సమాధి జితేంద్రియః— అని జితేంద్రియుడుగా పొగడ్త నందియుండెను. కైకను చేసికొనిన రాజు సార్వభౌముడగునని ఆమె జాతకమునం దుండుటచే రాజామెను చేసికొనెనుగాని, కేవలము అందమునకు మాత్రమె వశుడైగాదని తెలియవలెను. కేకయరాజు మాత్రము తనకూతు నిచ్చునపుడు ఆమెకు పుట్టు

బిడ్డకు రాజ్యమిచ్చునట్లు కట్టడిచేసికొనెను. దశరథు డట్లేయని అంగీకరించి తనకిష్టమైన పని నెరవేర్చుకొనుట కిది మంచిదని భావించెను. దశరథుడు అరువదివేల యేండ్లు రాజ్యము చేసెను కాని సంతానము లేకపోవుటచే పుత్రకామేష్టి చేయ మొదలిడెను.

ఈ యజ్ఞము ఋశ్యశృంగుని బ్రహ్మత్వమున వశిష్ఠుడు నిర్వర్తించెను. ఇందు అశ్వమును గాయత్రీమంత్ర మంత్రితముచేసి వదలుట శాస్త్ర సమ్మతము. ఈ గుఱ్ఱమునేరాజు పట్టినను వానిని జయించివచ్చుట, ఆ గుఱ్ఱముతోడ వెళ్ళినవారికి పనియైయున్నది. ఆ గుఱ్ఱము మొగమున నొక ఫలకముకట్టి దానిపై మేము లోకైకవీరులమై ఈ యశ్వమేధము జేయుచుంటిమి. ఎవరైన పరాక్రమశాలురున్న దీనిని బట్టుకొనుడు. మేము జయించి విడిపించుకొని పోదుము అని వ్రాయుదురట. ఇట్లు ఎవ్వరికి ఓడిపోకుండ దిగ్విజయముచేసి వచ్చిననే యజ్ఞము సాగగలదు. లేకున్న లేదు. కాని దశరథుని గుఱ్ఱము మాత్రము రావణుడు పట్టుకొనక యుపేక్షించి యుండెనుగదా! అందులకు కారణము యజ్ఞవిఘ్నము వాటిల్లినచో తా నారంభించిన పని కాజాలదు. ఇది విఘ్నమైనచో రాముడు జన్మించడు గదా! అందులకే యుపేక్షించెనేమొ! అంతియగాదు. అజేయపరాక్రముడైన రావణుడు దశరథునిపై గూడ దండెత్తి చంపకున్నది రామావతారము కొఱకే యని తోచుచున్నది.

యజ్ఞమున యజ్ఞపురుషుడు పాయసముతెచ్చి యివ్వగా రాజు రాణులకు పంచియీయగా గర్భవతులై నల్వుర కుమారులగనిరి. రాముడు జన్మించెనన్న వార్త తెలియగనె రావణు డెంతయో పరమానందభరితుడై యుండెను. ఇక రాముని బలపరాక్రమము లెట్టివో పరీక్షించి చూచుటకు సంసిద్ధుడయ్యెను. మొదట ఋషుల యజ్ఞము నాశనముచేయ సంకల్పించెను. విశ్వామిత్రుని యజ్ఞమును మారీచాదులచే ధ్వంసముచేసెను. ఇక అయోధ్యకు

విశ్వామిత్రుడు రామలక్ష్మణుల గొనిపోవుటకై వచ్చెను. ఒకప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠుని నిర్మూలించుటకు తపస్సు చేసెనట. శివుడు ప్రత్యక్షమై విశ్వామిత్రునకు పాశుపతమును, మహితాస్త్రముల నెన్నింటినో యొసంగెనట. ఆ యిచ్చునపుడు శివుడు ఈ అస్త్రవేదము నీకుగాకున్న నీ శిష్యులకు తప్పక పనిచేయునని శాసించెను. కాని వశిష్ఠుని బ్రహ్మదండము పాశుపతమును యుద్ధమున మ్రింగివేసినది. అపుడు విశ్వామిత్రుడు వశిష్ఠుని ప్రభావమునకు చలితుడై మరల తపమొనరించి తాను బ్రహ్మర్షియై రాణించెను. ఇట్టి విశ్వామిత్రుడు రాజుకడ కరుదెంచి రాజకుమారుల పంపుమని యర్థించెను. మొదట రాజు బిడ్డల విడువజాలకున్నను, వశిష్ఠ ననుమతితో యాగరక్షణకు అంగీకరించి పంపెను. మార్గమధ్యమున విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు బల, అతిబల విద్యలను, అస్త్రమంత్రోపదేశమును గావించెను. ఈ మంత్రోపదేశములచే రామునకు అస్త్రదేవతలన్నియు స్వాధీనములైనవి. రాముడు యాగరక్షణమునకుగా రాక్షససంహారము గావింపగా రావణునకు రాముని బలము కొంత కొంత తెలిసివచ్చినది. కాని రాముని మహిమ ఎట్టిదో తెలిసికొనుటకు రావణుడెంతయో ఉబలాటపడుచుండెను. రామలక్ష్మణులు యజ్ఞరక్షణగావించి మిథిలకు పోవుచుండగా మార్గమధ్యమున జాతిని నాతిగా చేసెను.

ఈ విచిత్రమును విని రావణుడు—రాముడు తప్పక విష్ణువే యని భావించెను. మరియు మిథిలలోని శివధనుస్సు విరుచుటకు రావణుడు కూడ వెళ్ళెనుగాని, దానిని తనచేతితో నెత్తజాలక మెత్తబడెను. ఇక దీనిని యెత్తగలిగినవాడు దేవుడేయని భావించియుండెను. దీనినిబట్టి తన బలమెంతయో రావణుడు నిశ్చయించుకొనినట్లే యున్నది. ఇక రాముడన్ననో ప్రదక్షిణించి ధనుస్సును కుడిచేతితో నెత్తి, యెడమచేత బట్టి నారిగూర్చి లాగబోవ నది బెండువలె విరిగిపోయినది. ఈ విచిత్రము చూచిన రావణుడు అత్యాశ్చర్యచకితు డగుటయేగాక, తన కోరిక ఈడేరి

నందులకు ఇంతింతయనరాని సంతసము నొందెను. శివధనుర్భంగముతో రామునకు సీతతో వివాహము జరిగినది. లోకకల్యాణప్రదమైన వీరి వివాహము సీతాకల్యాణ మనుపేర పాటగా ప్రసిద్ధినొందినది. ఇంతకుమున్ను మరియొకపాట గౌరీకల్యాణమనియే కలదు,

సీతాకల్యాణానంతరము మార్గమధ్యమున రామునకు పరశురాముని దర్శనమైనది. పరశురాముడు మహాబలవంతుడు. అంతియగాక శివుని శిష్యుడు. ఈ పరశురాముడు క్షత్రియసంహారము గావించుచు దశరథ - జనకుల మాత్రము విడచిపుచ్చెను. కారణమేమన జనకుడు గొప్పవేదాంతి. అట్టివాని చంపరాదు. ఇక దశరథుడు పరశురాముడు వచ్చినప్పుడెల్ల అంతఃపురమున నుండెడివాడు. అట్టివానిని గూడ చంపరాదు. కావున వీరిద్దఱిని విడిచిపెట్టెను. దశరథుని విషయమున మాత్రము చాలమంది అంతఃపురమున నుండుట పిరికితనమని భావించుచున్నారు. కాని అదిమాత్రముకాదు. కారణమేమన పరశురాముడు బ్రాహ్మణుడగుటచే నట్టివానితో యుద్ధము కూడదు కావున దశరథు డట్లు చేసెను. రామునిమీదికి పరశురాముడు వచ్చినపు డెంతయో ప్రాధేయపడెను. చివరకు రాముడు వైష్ణవాస్త్రముతో పరశురాముని కొట్టబోవ వేదననొంది పరశురాముడు కాలుమాత్రము నరికివేయుమని ప్రార్థించెను. తన ఊర్ధ్వలోకములకైన పున్నెపుమెట్టులమీద నా యస్త్రమును వదలుమని పరశురాముడు రాముని వేనోళ్ళ గొనియాడి వెళ్ళెను. ఈ సంఘటనలన్నియు రావణున కెంతయో బలము నిచ్చినవి. తర్వాత దశరథుడు పన్నెండేండ్లు కుమారులతో సర్వసౌఖ్యము లనుభవించెను. పరశురాముని గెల్చి, యాగరక్షణ గావించినవారికి, వివాహమైన పిమ్మట యువరాజ పట్టాభిషేకము చేయవలసియున్నది. కాని దశరథుడు మాత్రము ఆపని చేయక మిన్నకుండెను. అందులకు కారణము కేకయ రాజువలన తనకు మాటరాగలదని భావించెను. కాని ప్రజలు మాత్రము రాముని పట్టాభిషేకము చూడవలయునని తొందరపెట్టిరి. అపుడు దశ

రధుడు మాత్రము వలదని ప్రౌఢముగమాటాడెను. అరువదివేల సంవత్స రములనుండి రాజ్యము చేయుచున్న నన్ను వదలిపొమ్మని మీ భావనయా యని గద్దించెను. కాని ప్రజలు పట్టుపట్టుటతో ఊరకుండజాలక తనకు నది యిష్టముగాన రామపట్టాభిషేకమునకు లగ్నము పెట్టుమనెను.

చిన్నతనమునుండియు రామునిపై కైకకు ప్రేమ అధికము. దశ రథు డెప్పుడైనను ముద్దుకు భరతుని యెత్తుకొన్నను, కైక భర్తను నిందించి రాముని యెత్తుకొనుమని రాపిడి పెట్టెడిది. దశరథు డట్లే యని భరతుని దించి రాముని యెత్తుకొనెడివాడు. ఈ యెత్తు దశరథుడు కైకచే రాముని పట్టాభిషిక్తుని గావింపుమని పల్కించుటకు వేసినదియేగాని, రామునిపై ప్రేమలేక కాదు. కాని యెట్టకేలకు మంథర వారిమధ్య ప్రవే శించి రామపట్టాభిషేకము చెడగొట్టినది. అంతియగాక రాముని పదునాలు గేండ్లు అరణ్యవాసము గావింపుమని కోరినది. ఇక దశరథుడు చేయునది లేక రాముని పిలచి నా ధర్మము నేను నిర్వర్తించితి, ఇక నీ ధర్మము ప్రకారము నీవు చేయుమని చెప్పెను. రాముడు మాత్రము తండ్రియాజ్ఞకు లోబడి అరణ్యవాసమునకు పోయెను. పోవునపుడు తల్లియగు కౌసల్యా కుమారుని యుండుమని కోరినది. కాని లాభములేకపోయినది. రాముని వెంట సీతయు పోబోవగా రాముడు వద్దని నివారించెను. అపు డామె రాముని—రామజామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్-అని పరిహ సించినది. (రాముడు పురుషరూపముగ నున్న స్త్రీయని భావము). అపుడు రామునకు సీత వాక్యమునకు కించిత్కోపము, సంతసము, ఆశ్చర్యము కలిగినవట. బ్రహ్మాండ పురాణమున—

శ్లో॥ ద్విధాకృత్వాత్మనో దేహ
మర్ధేన పురుషోఽభవత్
అర్ధేన నారీ తస్యాంతు
విరాజ మసృజత్ప్రభుః

అని ప్రారంభించి-ఆద్యశక్తిర్మహేశస్య చతుర్ధా భిన్న విగ్రహా - అని విభాగమున జెప్పి- భోగేభవానీ పురుషేషు విష్ణుః క్రోధేచ కాళీ సమరేచ దుర్గా అని వర్ణింపబడినది. ద్విధాకృత్వా అను శ్లోకమున పురుష-స్త్రీలు రెండు భాగములు అని చెప్పబడినది. వారే శివశక్తులని తెలియవలెను. కనుక ఇవి రెండు భాగములుగ గన్పట్టుచున్నవి. అందు ఆదిశక్తి (ఈశ్వరశక్తి) స్వరూపము నాలుగు భాగములై, ఒక భాగము పార్వతి, రెండవది విష్ణువు, మూడవది కాళి, నాల్గవది దుర్గగా నైనవని చెప్పబడుచున్నది. కావున రాముడు పురుష రూపముగనున్న శక్తిస్వరూపమని సీత గ్రహించి యున్నదనియు కాబట్టి తన సతి తత్త్వవేత్తయని భావించి రాముడు సంతసించెనట. భర్త నట్లు పలుకరాదని కోపముకూడ వచ్చెనట. ఆశ్చర్యమెందుకన నింత రహస్యము నెట్లు తెలిసికొనినది? అని. ఉన్న ఉనికిని చెప్పుటచే నామె పాతివ్రత్యమునకు లోపము లేదనియు తోచుచున్నది.

ఇక తప్పనిసరిగ రాముడు సీతాలక్ష్మణులతో అరణ్యమునకు పోవలసివచ్చినది. ఈ జంజాటకముతో వచ్చిన రామునకు విశ్వామిత్రుడిచ్చిన అస్త్రములను పురశ్చరణము చేయుటకు సమయము చిక్కుటలేదు. ఈ అస్త్రములు రావణునిపై పనిచేయుటకు తపస్సు చేయవలసియున్నది. కాని సంసార బంధమైన సీతతో కూడ వచ్చుటచే నది సాధ్యముకాదుగదా! కాబట్టి కఠోర బ్రహ్మచర్యము అవలంబించి యుండవలెను. అయినను నిత్యము సీతారాముల వనవిహారములు, జలక్రీడలు, విలాసాదు లెన్నియో జరుగుచునే యున్నవి, ఈరీతిగా అరణ్యవాసము చేయుచున్న రాముని చూచిన దేవతలకు నిట్టి విలాసపురుషు డెట్లు రావణవధ చేయగలడను ననుమానము వచ్చినది. అపుడు దేవతలు రాముని పరీక్షించుటకు కాకాసురుని పంపిరి. ఈ కాకి వచ్చి సీత ముఖముపై తిరుగుచుండగా, సీత విసిగిపోవుచుండగా రాముడు చూచి నవ్వెను. అది కొంతసేపటికి చెట్టుపై వ్రాలినది. సీతారాముల జలక్రీడానంతరము, రాముడు నిద్ర నందెను,

అపుడు కాకి సీత స్తనాంతరము గీరిపోవుచుండెను. రాముడు నిద్ర మేల్కొని చూచి, జరిగినది విని, కోపించెను. కాని సీత మాత్రము తనకు తాను రక్షించుకొనగలదు. కామశాస్త్ర ప్రకారము మొదట స్త్రీ ముఖము చూచి సంతసించువాడు తండ్రియని, వక్షస్థలముగని సంతసించువాడు బిడ్డ యని, నాభిక్రింద చూచువాడు భర్తయని నిబంధింపబడినది. ఈ శాస్త్రాను సారము కాకి ముక్కుతో సీత స్తనాంతరము స్పృశించెను గాన బిడ్డతో సమానమగుచున్నది. కాని రాముడు దానిపై బ్రహ్మాస్త్ర ప్రయోగము గావించెను. ఈ కాకి దేవతలచే పంపబడి రాముని బ్రహ్మచర్యమును పరీక్షించుటకు వచ్చినది. అదియునుగాక రాముడుసైతము దానిని పరీక్షించుటకే బ్రహ్మాస్త్ర ప్రయోగము చేసెనుగాన నది కాకి వెన్నంటి ముల్లోకముల చుట్టినది. కాని దాని సంహరింపలేదు. దివ్యాస్త్రములు అప్పుడే నిద్రలేచినవారికి, ఉపస్పర్శనాదులులేకుండ నశుచులుగాన పలుకవు. రాముడు నిద్రలేచిన వెంటనే బ్రహ్మాస్త్రము ప్రయోగించెనన నది నిద్ర కాదని, ఆత డశుచికాడని తెలియుచున్నది. ఆ కాకి తన బాధ నందర కెఱింగించినది. కాని రామునిది నిజమైన నిద్ర కాదు, అది సమాధిస్థితి యని అందఱచే తెలిసికొనబడినది. ఇక దేవతాధిపతియగు ఇంద్రుడు కాకిని రామునే శరణువేడుమనెను. ఇదియొక పరీక్ష. ఇక కాకి రాముని శరణుజొచ్చినది. కాని రాముడు నా అస్త్రము ఊరకపోవునది కాదు కనుక కాకిని ఏదేని బలియివ్వవలయునని కోరెను.

అపుడా కాకి ఒక కంటిని మాత్రము బలి యిచ్చెదనని యిచ్చినది. నిద్రలేచినప్పుడు అస్త్రప్రయోగోప సంహారములు మామూలుగ నడచుచున్న ఈ విచిత్రమును చూచుచున్న దేవతలు రాముడు అసిధారా వ్రతముగా బ్రహ్మచర్య మాచరించుచున్నాడని, ఆతని నిద్ర సమాధి యని సంతసించిరి. పదమూడు వత్సరము లట్లు అరణ్యవాసము సాగినది. పదునాలుగవయేడు వచ్చినపిమ్మట రాముడుసీతతో ఆశ్రమ

దర్శనము చేయుచు వచ్చుచుండెను. అగస్త్యాశ్రమము దర్శించి, ఆ మహా ముని వలన ఇంద్రధనుస్సు సంగ్రహించెను. అత్రిమహాముని ఆశ్రమమునకేగి ఆ మునిదంపతులకు సీతారాములు నమస్కరించిరి. అంత రాముడు సీతను అనసూయ దగ్గరచేరి నీతులు నేర్చుకొనుమని చెప్పెను. అపు డనసూయ సీతను తన వృత్తాంతమంతయు చెప్పుమని కోరగా సీత కల్యాణపర్యంతము తన గాథనంతయు వివరించినది. కాని కైకనుగూర్చి పల్లెత్తుమాటనక, ఆమె వరములు మామగారి శ్రేయస్సునకే యని పల్కినది. ఆరాత్రి అనసూయ సీతను చక్కగా అలంకరించి రామునిదగ్గరకు పంపినది. ఆమె సీతకు చేసిన అలంకారము సంవత్సరమంతయు చెరిగిపోకయుండునట్టిది. మరియు నా రాత్రి మునులందరు ఖరదూషణాదులను రాముడు చంపునట్లుగా కోర నిశ్చయించిరి. వారికి నభయమిచ్చి రాముడు ఖరదూషణాదుల నిహతులగావించెను. అంతియగాక శూర్పణఖ ముక్కుచెవులు గోసిరి. ఈమె రావణునితో తన దైన్యమును చెప్పుకొని చింతించెను. రాముడు పదునాల్గువేలమంది రాక్షసులను రెండు గడియలలో సంహరించెను. అపుడు రావణుడు మారీచునిసహాయము కోరగా నాతడు మాయలేడియై వచ్చెను. సీత ఆ లేడిని కోరగా రాముడు దాని వెన్నంటిపోవుట, తదనంతరము లక్ష్మణుడు పోవుట జరిగినది. ఇపుడు సీత పర్ణశాలయందు ఒంటరిగా నుంట చూచి రావణుడు వచ్చి, ఆమెను మాతృభావముతో స్పృశించి తీసికొని పోయెను. అంతఃపురమున సీతను గడియసేపుంచి, పిమ్మట ఉద్యానవనమునందు చెట్టుక్రింద నుంచెను. ఆమెకు నాడువారి కాపలాపెట్టెను. దేవీ అనుగ్రహము లంకపై కల్గునట్లు, పవిత్రతకొఱకు సీతను ఊరంతయుత్రిప్పి చెట్టుక్రింద నుంచెను. ఇక తానుకూడ సీతను చూడవచ్చినప్పుడు పరిశుద్ధుడై, చక్కని వేషము ధరించి వచ్చెడివాడు. అట్లు వచ్చిన రావణుడు సీతతో తన్ననుగ్రహింపుమని కోరుచు, కోడివలె రమించెదనని పల్కెను. కోడికి క్షణక్షణము రమించు

శక్తి కలదు. ఇచట ఈ రమించుశబ్దమునకు అప్పయ్యదీక్షితులు చక్కని వ్యాఖ్యానము చెప్పిరి. రమించుట యన ధ్యానమని భావము కాబట్టి వెంట వెంటనే ధ్యానింపగలనని రావణుని భావమని తెలుచున్నది. కాబట్టి రావణుడు తెలిసిన మూర్ఖుడనుటకు సందేహింప నక్కరలేదు.

ఇక రామరావణ యుద్ధము వచ్చినప్పుడు ముందుగ రావణుని తమ్ముడగు విభీషణుని పోనడిచినాడు. విభీషణుడు చావని వరము కలవాడు. ధర్మపరుడని పేర్పడినవాడు. ఇతడు సీతను రామున కర్పింపుమని చెప్పిన కొలదినేరమునకు నీవున్న నన్ను లక్ష్మివరింపదు లేచపొమ్మని చెప్పి సభలో పరాభవముచేసి వెడలనడచెను. సీతను రామున కిమ్మని మాల్యవంతుడు మున్నగువార లనేకులు చెప్పలేదా! వారినెల్ల నిట్లు పోనడచెనా! వానికి నీతి తెలియదా! తనవాడు బలవంతుడు తనకు వ్యతిరేకముగానున్న, ప్రభువు వాని బందీకృతు నొనర్చి, కార్యానంతరము విడిచిపెట్టవలెను. తనయంత బలముగల సజ్జనుడగు తమ్ముని బలము తనకుకాకున్న పోనీ యది పరులపాలు చేయునంతటి యజ్ఞుడా! కాకూడదు. నీతిజ్ఞుల కిట్టి సందేహ మా చరిత్రమున కలుగకమానదు. అట్లు పుచ్చుచో నీ వే మనుజుని గొప్పచేయుచున్నావో వాని బంటువై బ్రదుకు మనెనట! తర్వాత యుద్ధములో నైనను తక్కినవారి గొట్టెనేగాని తన తమ్మునిమీదికి పోయినట్లు లేదు. మయశక్తి వానిపై వైచుటయందును దూరాలోచనముగలదు. రామలక్ష్మణుల సన్నిధానమున నాశక్తి తమ్మునిమీద వేయుటకు నాలోచనమున్నది. విభీషణుడు ప్రత్యస్త్రమేమియు వేయకున్నను అమోఘాయుధము వానిమీదికి వచ్చినపుడు బ్రహ్మాస్త్రము స్వయముగావచ్చి వానిని కాపాడునట్లు వరమిచ్చెను. కాన తన శక్తితో వాడు చావడు. ఇట్లుండ శరణాగతత్రాణవ్రతముగల రాము డేమిచేయునో చూతమని వాని యాలోచనము. దానికి లక్ష్మణు డడ్డమువొచ్చెను. రాము డాశక్తికి శాపమిచ్చెను.

ఇదియంతయు పర్యాలోచింపగా విభీషణుడు చావనివాడైనను తన వద్దనుండి రామునెదిర్చినవాని చేతులో, కాళ్లో నఱికి కుంఠితుని చేసి తన పని రాముడు నెరవేర్చుకొనవచ్చును రావణసంహార మైనతర్వాత లంకకు రాముడు తన తమ్ములలో నెవరినైన నుంచి పరిపాలింపచేయవచ్చును. వాలినిజంపి రాముడు సుగ్రీవునకు నారాజ్య మీయలేదా? అట్లే తన్నుజంపి తనరాజ్యము శరణుచెందిన తన తమ్మునకిచ్చిన, రాజ్యము తనవంశమందే స్థిరముగా నుండగలదు. వంశకర్త లేనిచో తనవంశము నిర్వంశమగును. కావుననే రావణుడు విభీషణుని తనపక్షమందు లేకుండ వెడల నడచెను. రావణుని ఆశయ మిట్లు ధ్వనించుచున్నది. "అంగుళ్యగ్రేన తాన్హన్మి" అని రాముడు విభీషణునకు శరణమీయవలదని సుగ్రీవునితో చెప్పెను. రావణునకు సురాసురులెల్ల సహాయులై వచ్చినను అంగుళ్యగ్రముతో వారినెల్ల సంహరించుటయేకాక మరల సృజింపగలను. హంగుకొఱకు మిమ్మును దెచ్చుకొంటిని కాని రావణునకు వెఱచికాదు-అని చెప్పి నేను శరణాగత రక్షణము మరలనని చెప్పి సుగ్రీవునిచేతనే వాని బిలిపించి రాముడు రాక్షస సంహారము కాకముందే విభీషణుని లంకకు రాజుగా పట్టాభిషేకముచేసెను. రావణుని యూహ అప్పటికప్పుడే ఫలవంతమైనవి.

# 14

సంస్కృత నాటకకర్తలలో వాసికెక్కిన మురారి అనర్ఘరాఘవ మను నాటకమున రామాయణసారము ప్రస్తావనయందే చెప్పెను.—

శ్లో॥ యాన్తిన్యాయ ప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం
అపంథానంతు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి ॥

అని న్యాయముగా నడచు నాయకునకు తిర్యగ్జంతువులు సహాయ మగును. అన్యాయపరుని వాని తమ్ముడే విడిచిపోవును — అని ఆ శ్లోకార్థము. ఇతడు రామాయణసారమును రెండు మాటలతో రమణీయముగ చెప్పెను.

శ్లో॥ యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితం
గుణైరేతావద్భి ర్జగతి పునరన్యోజయతి కః
స్వమాత్మానం తత్తద్గుణగరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మణః కిథ ముపకరిష్యంతి కవయః॥

అని చెప్పెను. పూర్వకవు లందఱచేత పరిపరివిధముల వర్ణింప బడినదియే రామకథ యని దాని వదలిన వట్టి గొనములతో పుడమిమీద మరల నంతవాడెవ డవతరింపగలడు? అందుకని యూరకున్న రామాయణ మందలి ఆయా గుణాతిశయముల దలచి గంభీరముగా, మధురముగా స్ఫురించు వాగ్బ్రహ్మగల కవులు తమ హృదయముల కెట్టు తృప్తి కలి గించుగొనగలరు? అని శ్లోకాభిప్రాయము.

ఇట్లే కీ. శే. మా తండ్రిగారు తా. వేంకటప్పయ్యశాస్త్రిగారు వారి శ్రీరామకథామృతమను గ్రంథమున నిట్లు వ్రాసిరి.

ఆ. వె. ....................

చేనికాపు చెఱకుచెట్లుపెట్టి
పాకవిదులు దాని బహుభక్ష్య భేదా ప్తి
ననుభవింప చేయుటపను పనియె.

వాల్మీకి మహాముని చెఱకుతోటవేసి దానిరసము పాకముచేసి బెల్లపు అచ్చు పోసి సర్వమధురముగపెట్టినను, ఇతర కవులు తమతమ నానావిధము లగు పిండిరలిపి చిత్రవిచిత్రములగు రుచులూరు భక్ష్యములబోలె ప్రతిభా ప్రభావానుసారముగ కృతులు రచించుట సామాన్యపు పనియా? అదియు విశేషమేయని భావము.

రామాదులు పుట్టిన పిమ్మట నొకనాడు దశరథుడు రాముని జాతక చక్ర విశేషముల తెలియగోరి వశిష్ఠాశ్రమమునకు బోయెను. అపుడా యాశ్రమమునందు దుర్వాసమహర్షి చాతుర్మాస్యదీక్షయందుండెను. వశిష్ఠుడు ఇది గమనించి తనకంటె పెద్దయగు దుర్వాసుని రామునిగూర్చి యడుగుమని దశరథునికి ప్రబోధించెను. అట్లేయని దశరథుడు దుర్వాసుని రామునిగూర్చి ప్రశ్నించెను. అందులకు వెంటనే దుర్వాసుడు రాముడు దరిద్రుడగునని దశరథునకు చెప్పగా నాతడు కొందలమంది వానిగూర్చి మరల ప్రశ్నించెను. దుర్వాసుడు రాముని జీవితమున జరుగబోవు విషయములన్నియు వివరించి రామునికథ చదివిన నెంత జడులకును దుఃఖము రాకుండను అయిన రామకథనుజదివి దుఃఖించినవారికెల్ల మోక్షములభించు నని రూఢిగ చెప్పెను. కాబట్టి మొత్తముమీద రాముడు—సాక్షా ద్విష్ణోః చతుర్థాంశః—అని వాల్మీకి వచించెను. భగవదవతారమే యగుచున్నాడు. ఆతనికి దుఃఖమెక్కడిది? వైకుంఠమునుండి యెట్లు ప్లానువేసికొనివచ్చెనో అట్లు నడిచెను. అచ్యుతుడగు దేవునకు లోకముకొరకు చూపు సుఖదుఃఖ ములు సత్యములు కావుగాన, అతడు దుఃఖమయుడు గాడు, రాజవంశ

మున రావణసంహారార్థము అవతరించిన రాముడు రావణునిక్కడకు పిలిచి గాని, తాను తమ్ములతో, తంత్రితో, మంత్రులతో, సామంతులతో దర్జాగా నక్కడకు పోయిగాని శత్రుసంహారము చేయక, ఒక తమ్మునిమాత్రము చేకొనిపోయి నారలుగట్టి ఫలరలుదినుచు భార్యతో బీదవానివలె సంచరించుచు కోతులను, కొండముచ్చులను ప్రోవుచేసికొని యిట్టినడక నడువనేల యనియు నొక సందేహము విమర్శకులకు తోచకమానదు.

అనేక వీరహోమాదుల చేసి అస్త్రశస్త్రులు సంపాదించి దేవతల గెలిచియున్న రావణుమీద తాను దేవుడైనను, విశ్వామిత్రు డస్త్రవేదము నుపదేశించినను, పురశ్చరణము చేయక ఆయుధములు వీర్యవత్తమములు కానేరవని లోకమున విద్యాసంప్రదాయము నెలకొల్పుటకు నట్లు ప్రవర్తించెనని సమాధానించుకొనవలయును.

కాననే మనమిదివరకు చెప్పుకొన్న కాకాసుర వృత్తాంతము సార్థకమగుచున్నది. కాకున్న రామబాణ మమోఘమన్న పేరు చెడ రాముడు కాకిమీద బ్రహ్మాస్త్రము వేసిన నది దానినప్పుడే కాల్పక మూడులోకములు కాకి తిరిగివచ్చినదాక యోర్చుకొని తిరుగుచున్నదన, ఈ ప్రకారికా కథను బట్టి ఆతనికేమి గొప్పతనము వచ్చినది? నాయకుని గొప్పతనము చెడ గొట్టి పతాకాప్రకరుల కవులు కావ్యముల నిబంధింపవచ్చునా?

సుందరకాండమున హనుమంతుడు లంకకు పోవుటంతయు యోగానుగుణముగ చెప్పబడుచున్నది. హనుమంతుడు లంకకు పోవునపుడు సముద్ర లంఘనమునకు విహాయసమున కెగిరెను. విహాయసమనగా యోగమార్గము. "తతో రావణ నీతాయాః సీతాయాః— అని సీత అడుగుజాడ బట్టుటకు చక్రభేదము చేసి బ్రహ్మపదము ద్వారమున ప్రవేశించెను. కొబట్టి హనుమంతుని లంకాప్రవేశము సీతాన్వేషణము యోగమార్గమునకు సంబంధించినదై యున్నది. ప్రశస్తమైన

హనువు (బుగ్గ) గలవాడగుటచే హనుమంతుడయ్యెను. దీనికి లోకమున ఇంద్రుని వజ్రమునకు బ్రద్దలు కాలేదుగాన ప్రశస్తములని అర్థము. అంత రార్థమున యోగధారణవలన ప్రశస్తములైన హనువులు కలవాడని భావము. తాలువుకూడ దశవిధ ధారణస్థానములలో నొకటిగా లెక్కింపబడినది కాబట్టి హనుమంతునకు హనువులలో ధారణ జరుగుచున్నది. "శత్రు సైన్యానాం నిహంతా"— అన్నచోట అంతరశత్రుసైన్య వినాశకుడు హనుమంతుడు. శత్రుసైన్యము లాతని యేమియు చేయజాలవు. "అపిమర్ద్య పురీం లంకాం; అభివాద్యచ మైథిలీం; సమృద్ధార్థో గమిష్యామి-మిషతాం సర్వరాక్షసాం—"అన్నట్లు రాక్షసుల విఘ్నములు హనుమంతుని యేమియు చేయజాలవు. రాక్షసులు గ్రుడ్లు తెరచిపైకిచూచి చూచుచుండగనె తాను బ్రహ్మమయుడై పోగలడు. పై శ్లోకముల వలననే సుందరకాండ పారాయణ ఫలము లభింపగలదు. హనుమంతుడు అక్షుని చంపగా ఇంద్రజిత్తు వానిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. కాని అది హనుమంతుని యేమి చేయజాలకుండెను. అయినను హనుమంతుడు ఇంద్రజిత్తుని మోసము చేయుటకు బ్రహ్మాస్త్రమునకు కట్టుబడినట్లు నటించెను. రాక్షసులు వానిని బంధించిరే కాని ఇంద్రజిత్తు మాత్రము తనకు, తమకులమునకు చావు తప్పదని - సంశయితాస్మ సర్వే - అని భావించెను. అయినను హనుమంతుని బంధించి తండ్రిదగ్గర అప్పగించెను. రావణుడు హనుమంతుని ప్రశ్నలు వేయగా నాతడు తోకచుట్టపై కూర్చుండి సమాధానములిచ్చెను. అప్పుడు హనుమంతుడు రావణుని—

గీ. వాలిసందిట నొక్కింత వగరుదక్కి
కార్తవీర్యుని కొట్టున కందువాడె
నన్నుగటిమికి తెలిసీపి యున్నులిడ్డ
పుడుతుపై నేను పోలేరు బొబ్బవోడవె.

అని యెత్తిపొడిచెను.

వాలి ఒకప్పుడు రావణుని ఆటబొమ్మగ చేసి అంగదుని ఉయ్యెల తొట్టికి కట్టెనట. అట్లే బొమ్మవలె మూడేండ్లుండెనట. మరియు ఒకప్పుడు కార్తవీర్యునిచే పట్టుబడగా రెండువేల వత్సరములకు పులస్త్యబ్రహ్మ పోయి కార్తవీర్యుని బ్రతిమాలి తీసికొని వచ్చెనట. మరియొకసారి నారదోపదేశముచే శ్వేతద్వీపము జయింపబోయెను. అచట నున్న వంద లను స్త్రీరూపులే. వారంతయు రావణుని చూచి పురుగని భావించిరి. వారిలో నొకతె పట్టుకొనగా దాని చేయి కొఱికెనట. అది విసరికొట్టగా లవణసముద్రమున బడెనట. ఇట్టి పరాక్రమవంతుడు రావణుడు. అంతియ గాక శివధనుస్సు నెత్తజాలని వేలపని కూడ హనుమంతు డాక్షేపించెను. రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పంటింపగా లంకాదహనముజరిగినది. వలదని మండోదరి వాదించుచున్నను వినక రావణుడు చావు రావలయు నని కోరి తెచ్చుకొనెను.

ఒకనాడు రావణుడు పశ్చిమసముద్రముపైకి విహారమునకై పోయెను దారిలో నాతనికి ఆయుధముల దగ్గరనుంచుకొని తపస్సు చేయు చున్న కపిలమహాముని కనిపించెను. రావణుడా కపిలుని యుద్ధమున కాహ్వానించెను. కపిలుడా రావణు లెక్కచేయక చేయెత్తియు నంతగా నడిచిన చచ్చునేమో యని చేయియూపు తగ్గించి కొట్టెను. ఆ దెబ్బకే రావణుడు దద్దరిల్లి మూర్ఛనొందెను. మూర్ఛదేరి లేచి చూచుసరికి కపిలు డొక రంధ్రమును జొచ్చి యొకగుహయందు ప్రవేశించెను. ఈ విషయము ప్రహస్తుని వలన తెలిసికొని, కపిలుడు భగవంతుడని భావించి రావణుడు తానును తన ఆయుధముతో నాకన్నమున దూరిపోయెను. పోవుచుండగా నాతనికొక చక్కని సౌధము కన్పించెను. అది సమస్త రాజభోగములతో నలరారుచుండెను. దాని చుట్టును మూడుకోట్లమంది విశిష్టాద్వైత భక్తులు బరాబరులు చేయుచుండిరి. రావణుడెట్లో మెల్లగా ఆ భవనమునందు ప్రవే శించి చూచెను. అందొక హంసతూలికా తల్పమున్నది. దానిపై నొక

మహాపురుషుడు సన్ననివస్త్రమును గప్పుకొని శయనించి యుండెను. ఆతని పాదములచెంత లక్ష్మీదేవి కూర్చుండి పాదసేవ చేయుచుండెను. ఆ లక్ష్మి సౌందర్యము చూచి రావణుడు ముగ్ధుడై ఆమెను గైకొని పోవుటకు చేయిచాచెను. అంత శయనించియున్న మహాపురుషుడు ముఖముపై వస్త్రము తొలగించి రావణునిచూచి ఒక్కసారి హుమ్మని కోపించెను. ఆ కోపముతో ముక్కునుండి వచ్చిన గాలికి రావణుడు అల్లంతదూరమున పడెను. ఈ మహాపురుషుని అద్భుతచర్యకు ఆశ్చర్యచకితుడై అతనిని ఎవరని ప్రశ్నించెను. అపుడాతడు నిన్ను చంపెడువాడ లెమ్మని వేషము వేసికొని వచ్చెదనని మాయమైపోయెను. ఇట్లు కపిలముని ప్రవచనమువలనను, సనత్కుమారుని మాటవలనను రావణుడు తాను భగవంతుని చేతియందు చచ్చుట నిక్కమని భావించెను. రావణుడు దుర్మార్గుడైనను చాల గొప్పవాడు. తన నిర్వాణమునకే నీతివిరహితమైన పనులనెన్నింటినో చేసెను. కాబట్టి సీతను దీసికొనిపోవుట కామముకొఱకు గాక మోక్షము నొందుటకే యని తెలియవలెను. కావుననే నలకూబరు శాపమాతని నేమియు చేయలేదు.

యుద్ధప్రారంభమునకు ముందు హనుమంతుడు చూచి వచ్చిన తర్వాత అంగద రాయబారము జరిగినది. రావణుడు హనుమంతుని,అంగదుని కూడ అక్షేపించెను. రావణునకు స్వర్గజయము నాటికి నాలుగువేల అక్షౌహిణుల సేనకలదు. రామయుద్ధము నాటికి ఇంకను పెరిగినదని విభీషణుడు చెప్పెను. విభీషణుని సాయముతో రావణుని రాముడు నిశ్శేషముగా వధింపతగ్గెను. కాని యుద్ధమున కుంభకర్ణునికి విభీషణుడు నమస్కరింపగా కుంభకర్ణుడు విభీషణుని తన యెదుట పడకుండ తప్పించుకొని యుండుమనెను. రావణుడు రామునిశక్తి పరీక్షించుటకు విభీషణునిపై శక్తిప్రయోగము చేసెను. ఆ సమయమున లక్ష్మణుడు వానిని వెనుకకు నెట్టి తాను ముందుండి శక్తిచే మూర్ఛనొందెను. రాముడు కోపించి రావణుశక్తిని

హతాశాభవ దుర్బుద్ధే- అని శపించెను. ఈ శాపముతో శక్తికి తేజస్సు తగ్గిపోయినది కాని లక్ష్మణమూర్ఛ తప్పలేదు. ఇక రాముడు ఆ శక్తిని లక్ష్మణు హృదయమునుండి పీకి విరువబోవ రావణుడు వానిపై కుప్పున గూరలుగ బాణములు గురిసెను. రాముడు వాని లెక్కచేయక ఆ శక్తిని పీకి విరిచి పారవైచి లక్ష్మణు శరీరము గాపాడ హనుమంతు నప్పగించి రావణుని శరీరము జల్లెడవలె బాణములచే తూట్లు గావించెను. ఇప్పుడు రావణునకు భయమువేయగా పారిపోదలచిన, రాముడు వానిని యుద్ధము మాని పొమ్మనెను. తనవంటివానికి భయపడినవానితో యుద్ధము చేయుట న్యాయముకాదనికాక యుద్ధములో రావణుని లెక్కచేయక విడిచివేసెను. ఇది రామునకే చెల్లునుగాని చేతికి చిక్కిన శత్రువు నే యోద్ధయు విడిచి పుచ్చడు. రావణుని విడిచిన నాతడింకను రాక్షసబలము తేగలడు. వాని చంపిన దుష్టులగు రాక్షసు లింకను మిగిలిపోవుదురని రాముని అభిప్రాయము. ఇట్లు గాలించి గాలించి రావణుడు పంపుచుండ క్రోతులవలన రాక్షసబలము లెల్ల నిహతము లగుచుండెను. సర్వరాక్షసహననమైన పై మూలబలము నెల్ల జక్కాడి రాముడు తుదకు రావణు జంపెను. రావణ మరణానంతరము రాముడు విభీషణుని శాస్త్రప్రకారము రావణునకు ఉత్తరక్రియలు జరుపుమని ఆజ్ఞాపించెను. "మరణాంతాని వైరాణి"— అని చెప్పి మరణముతో వైర మంతరించిపోయినదని అంత వానికి చక్కగా శ్రాద్ధాదులు జరిపించెను.

ఇక రావణ వధతో విభీషణుడు సీతను రామున కప్పగించెను. అపుడు సీతను చూచినంత రాముని ప్రకృతి మారెను. "రావణాంక పరిభ్రష్టా నమా మర్షసి మానిని" — అనుచు రావణాంక పరిభ్రష్టయని నిందించెను. అంతియగాక భరత సుగ్రీవ లక్ష్మణులలో నెవరి యొద్దనైనను కాలము గడుపుమనియు ఆజ్ఞాపించెను. ఇచట వాల్మీకి

చెప్పిన మాట అనౌచిత్యముగా నున్నదని కొంద అనుచున్నారు. ఇంతియ గాదు. మరొకడు రామాయణము నాటికే విడాకులున్నవని భావించెను. మూలమున-భరతే లక్ష్మణే వాపి-అని స ప్తమి యున్నది కాబట్టి, దానికి వృత్తిత్వ మర్థము చెప్పవలసియున్నది. అందుచే బిడ్డలవంటి భరత లక్ష్మ ణుల దగ్గఱనుండి గాని, సామంతులైన సుగ్రీవాదుల యొద్దనుండి గాని తపోవ్రతము సాధింపుమని యర్థము గాని, ఇందు విపరీతార్థము, అనౌ చిత్యము ఏమియూ లేవని భావించవలయును. రాముడు అక్కరలేదని నిందించిన సీత మాయాసీత. అసలు సీత అగ్నులయందు దాగియున్నదని చెప్పియుంటిని. మరియు రామాయణమున "ప్రియాతు సీతా రామస్య" రామునకు సీత ప్రియమైనది, అని యున్నది గనుక తు అన్న శబ్దము వలన రామునకు చాలమంది భార్యలుండిరని భావించుచున్నారు. కాని ఇది సమంజసము కాదు. సీతను రావణుడు తీసికొనిపోయినపుడు రాముడు సీతకై మిక్కిలి విలపించెను. తర్వాత సాయములేక ఏటుగడపినను సుగ్రీ వుడు తోడైన తర్వాత వెంటనే సీతను వెదకు పని బూనక రెండు నెలలు నీ యింటికిబోయి రాజ్యసుఖము లనుభవించి రమ్మనెను. సుగ్రీవుని పిలుచు కొనిరమ్మని లక్ష్మణు నంపెను. 40 దినములు లక్ష్మణుడు లేకుండ ప్రస్ర వణాద్రియందు నొంటరిగ రాముడు తపించినట్లు కనబడుచున్నది. ఇపుడు సీత కన్పింపగా అగ్నిప్రవేశము చేసిరమ్మనెను. అట్లే సీత పరిశుద్ధయై రాగా ఇంద్రాది దేవతలు-దశరథుడు కూడ ఆతనిని చూచి ప్రశంసించుటకు వచ్చిరి. రాముడపుడు తండ్రిని చూచి కైకను దిట్టిన విషయము స్మృతికి దెచ్చి శాపము తొలగింపుమని ప్రార్థించెను. అట్లే యని దశరథుడు తొల గించెను. రాముడు సీతతో అయోధ్యకు వచ్చుచు మార్గమధ్యమున భర ద్వాజాశ్రమమున విందారగించెను. అక్కడనుండియే భరతునకు తమ రాకను గూర్చి హనుమతో సందేశమంపెను. సీత కెట్టి లోకాపవాదము రారాదని రాముని అభిప్రాయము. ఇక అయోధ్యకు రాగనె మరల రాముడే

రాజు కావలసివచ్చినది. కాని రాముడు లేనియప్పుడు భరతుడే రామపాదుకల బెట్టుకొని పాలన సాగించెను. రాముడు వచ్చినపుడు ఆ భరతుడు దాని నంగీకరింపకపోయెను. కాని రాముడిపుడును రాజగుట కంగీకరింపలేదు. తర్వాత భక్తివశ్యుడై భరతుని పేరుమీద రాముడు పదివేలయేండ్లు పరిపాలించెను. అందువలననే లోకమున-రాముని రాజ్యం భరతుని పట్టం-అను సామెత పుట్టినది.

# 15

ఇక ఉత్తరరామాయణము దగ్గరకు వచ్చితిమి. శ్రీరాముడు సీతను దెచ్చిన పిమ్మట పదివేల వత్సరము లరిగిన పైపాలనను గురించి ప్రజ లేమనుకొనుచున్నారో తెలిసికొనవలయునని గూఢచారుల నియమించెను. గూఢచారు లందఱు రాముని పాలనకు ప్రజలు రంజిల్లుచున్నారని చెప్పిరి కాని రాముడు తననుగూర్చి నిందించువారిని తెలుపుడని కోరెను. వారిలో భద్రుడనువా డొకనాడు రావణుడు కొనిపోయిన సీతతో రాముడు కాపురము చేయుచున్నాడని ప్రజలు నిందించుచున్నారని రామునకు తెల్పెను. అంతకుముందురోజే రాముడు సీత చెవిలో నొక విషయమును గుసగుసలాడెను. అందలి రహస్య మేమన సీత నిక దేవతలు దేవలోకమునకు రమ్మని ఆహ్వానించిరట. అంతియేగాదు. సీతకు పిమ్మట రాముని కూడ రమ్మనిరి. ఈ విషయ మిట్లుండగా మరునాడే లోకాపవాదము వచ్చినది. రాము డిదే సమయమని తన తమ్ముల రావించి లోకాపవాదము తెలియజేసెను. ఈ తమ్ములు వచ్చునపుడు భరతుడు కాలినడకతో బయలుదేరెనట. లక్ష్మణుడు రథమున, శత్రుఘ్నుడు అశ్వముపై బయలుదేరిరి. కాని అందఱకంటె భరతుడె ముందుచేరెనని లక్ష్మణుడు చెప్పుచున్నాడు. కాబట్టి రామునిపై భరతునకుగల ప్రీతి యెట్టిదో వ్యక్తమగుచున్నది.

రాముడు సీతనుగూర్చి దుఃఖించుచు, చేయవలసినదేమి యని తమ్ముల ప్రశ్నించెను. భరతుడు మరల తన తల్లిపై ననుమానముపడెను. లక్ష్మణుడు రామునిది స్త్రీదుఃఖమే యని భావించి, ఈసారి సీతపని నేమియు చేయనని మదిలో దలచెను. ఇక రాముడు తమ్ములు ప్రత్యు

త్తరమీయకుండుట గమనించి, తానై లక్ష్మణునితో సీతను గంగ కావలి యొడ్డున విడచిరమ్మని చెప్పెను. అంతియగాక సీత తాను గంగాతీరము చూడవలయునని కోరిన కోరిక ఈరీతిగా తీర్చుమని లక్ష్మణున కాదేశించెను. సీత పోబోవునపుడు చెల్లెండ్రు అందఱు చూడవచ్చిరి. వారందఱకు పారితోషికము లర్పించి సీత తాను రేపే ఋష్యాశ్రమాదుల చూడబోవుచున్నానని పల్కెను. ఇక తప్పదనుకొని వేకువనే లక్ష్మణుడు రథముపై సీతను గంగాతీరమున దించి, అపుడు లోకోపవాదమును గూర్చి విన్నవించెను. అందులకు సీత తల్లడిల్లి లక్ష్మణునకు మరియొక జన్మలో రామునే భర్తనుగా చేసికొందునని చెప్పుమని కోరినది. మరియు లక్ష్మణుడు పోబోవునపుడు సీత ముసుగు తొలగించి తనను ఒకసారి తిలకించుమని కోరినది. అందులకు కారణము తాను ఇపుడు గర్భవతిననియు దీనికై మరొక లోకాపవాదము రాకుండుటకై యని పల్కినది. అందులకు లక్ష్మణుడు మిక్కిలి దుఃఖించి, రాముడులేని సమయమున తానిట్లు చూడజాలనని పల్కి నమస్కరించెను. ఎట్టకేలకు ఆమెను వదలి రథముపై నెక్కి మూర్ఛనొందెను. కొంతసేపటికి సేదదేఱి దుఃఖించెను. సుమంత్రుడు మాత్రము లక్ష్మణుని ఆర్తి చూచి బాధపడెనే గాని తనకుమాత్రము ఇట్లు జరిగినందుకు దుఃఖములే దనెను. అందులకు కారణము సుమంత్రుడు రామునిగూర్చి దుర్వాసుడు చెప్పినదంతయు తెలిసియుండుటయే కారణము. దుర్వాసుడు రామునిగూర్చి చెప్పిన కథయంతయు ఎవ్వరికి చెప్పక రహస్యముగా నుంచవలయునని దశరథుడు సుమంత్రునితో చేతిలో చేయి వేయించుకొనెను. ఈ విషయము కూడ లక్ష్మణునితో సుమంత్రుడు చెప్పెను. కాబట్టి జరుగనున్నది జరుగక మానదని సుమంత్రుడు లక్ష్మణుని దుఃఖించక ఊరకుండుమనెను. అంతియగాక సీత కెట్టి లోపమును రాదనియు ఇరువురు కొడుకులు పుట్టెదరనియు వారు రాముని తర్వాత నయోధ్య నేలుదురనియు

పల్కెను. లక్ష్మణుడు కొంత తృప్తిపడి ఇంటికి పోయి రామునితో సీత విషయము నివేదించెను. అరణ్యమునందు సీత లక్ష్మణుడు పోగనె బిట్టు విలపించు చుండెను. ఈ రోదనధ్వనిని వినిన మునికుమారులు పోయి వాల్మీకికి చెప్పగా నాతడు వచ్చి సీతను తన ఆశ్రమమునకు తోడ్కొని పోయెను. ఈమె ఎవరని మునిపత్నులందఱు ఆశ్చర్యము నొందగా వాల్మీకి తాను ప్రతిదినము సీతను సమాధిస్థితి యందు చూచుచుందుననియు ఈమె శ్రీరాము పత్ని సీతయనియు పల్కెను. ఇక సీత మున్యాశ్రమము అందు వారిచ్చిన కందమూల ఫలాదులతో తృప్తినొంది దుఃఖము కొంత మరచి పోయినదట.

ఇదివిని అధ్యాత్మ రామాయణమున పార్వతి శివుని రామకథ అవకతవకలని ఆక్షేపించినదట. ఏలన ఒక మహారాణిపై అపవాదురాగా విచారింపక అడవులకంపుట అన్యాయము కాదా యని ఆక్షేపించెను, అంతియగాక రాముడు అవతారము చాలింపదలచిన చెప్పి పోవచ్చును గదా ఈ వాదులు, ముందొకరు వెనుక ఒకరు పోనేలః అని ఆక్షేపించినది. అపుడు శివుడు పార్వతికి - రాముని ప్రారబ్ధములు చాల కలవనియు, అవి విష్ణ్వవతారమున ప్రాప్తించిన వనియు వాని పాపఫలిత మిప్పుడు అనుభవింపక తప్పదనియు నిరూపించెను.

ఒకప్పుడు దేవదానవులకు యుద్ధము కల్గినది. దానవులు పరుగెత్తు కొని వచ్చి భృగుమహర్షి ఆశ్రమమున దాగియుండిరి. వీరిని బట్టుకొనుటకు ఇంద్రుడు- విష్ణువు వెన్నంటిరి. రాక్షసులంతలో భృగ్వాశ్రమమున బ్రవేశించి, భృగుపత్నిని శరణుజుడిగిరి. వీరిద్దఱు భృగ్వాశ్రమమున ప్రవేశించి యడుగగా భృగుపత్ని వారిపై కోపించినది. దానికి భయమంది ఇంద్రుడు మొదటనే వెనుకకు తగ్గియుండెను. కాని విష్ణువు మాత్రము అడ్డువచ్చిన భృగుపత్నిని చక్రముచే ఖండించి రాక్షసుల నంతమొందించెను. పత్ని విరహితుడైన భృగువు విష్ణువుపై గోపించి ఆవేశముతో-

నీవు నీ భార్య చావగా నిల్లే యేడ్చెదవని - శపించెను. కాని విష్ణువు నీ శాప శక్తి నన్నేమియు చేయజాలదని త్రోసిపుచ్చి వైకుంఠమునకు బోయెను. అట్టియెడ నా శక్తి భృగువునే బాధింప మొదలుపెట్టెను. అందులకు విష్ణువు దయామయుడు గాన భృగుశాపమును రామావతారమున ననుభ వించెదనని పల్కెను. ఈ శాపఫలితము వేయివత్సరము లనుభవింపవలసి యున్నది కావుననే రాముడు ఇన్ని వత్సరములు సీతను వదలియుండవలసి వచ్చినదని పార్వతికి శివుడు బదులు పల్కెను.

వాల్మీక్యాశ్రమమున సీతకు ఇద్దరు మగబిడ్డలు జన్మించిరి. ఆ బిడ్డ లలో నొకనిని కుశము (దర్భ)తోను, మరియొకనిని లవము (ఆవుతోక వెంట్రుక)తోను అభిమంత్రించుటచే వారు కుశలవులైరి. ఒకప్పుడు శత్రు ఘ్నుడు లవణాసురుని చంపుటకు పోవునపుడు అప్పుడే పుట్టిన కుశలవు లను చూచెను. అతడు తిరిగి వచ్చునపుడు వాల్మీక్యాశ్రమమున విడిది చేసెను. ఆ సమయమున శత్రుఘ్నుడు కుశలవుల రామాయణ గానమును వీనులవిందుగా వినగా, సామంతులు వానినిగూర్చి వాల్మీకిని అడుగుమనిరి. కాని శత్రుఘ్నుడందుల కంగీకరింపక మిన్నకుండెను. మరునాడు శత్రు ఘ్నుడు అయోధ్యకు పోయెను. కొంతకాలమునకు రాముని అశ్వమేధము నకు వాల్మీకి కుశలవులతో పోవోయెను. కాని కుశుడు తమ జీవితము పూర్తిగా మారబోవుచున్నదని యూహించి వాల్మీకిని తత్త్వోపదేశము చేయుమని కోరెను. అపుడు వాల్మీకి సంకల్పము నాపిన నున్న తత్త్వ ముండునని చెప్పెను. ఇదియే చరమవృత్తి, తుది బ్రహ్మలో లయమగు నని పల్కెను. ఇక వారు బయలుదేఱి అయోధ్య చేరిరి. అచట వాల్మీకి కుశలవులను కూరలు, దుంపలు తిని రామాయణగానము రాజవీధులందు చేయుచుండుడని ఆజ్ఞాపించెను.

శ్లో. కర్షయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాంచైవాన్త శ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్॥

అని యుపదేశము శరీరమును శుష్కింపచేయరాదని పల్కుచున్నది. ఉప వాస మనునది ఆరణ్యకులకు, విధవలకు, సన్యాసులకు తప్ప పేరెవ్వరికి అక్కరలేదు. కావున గృహస్థుడు-అతిధిభ్యో అన్నంపచామి అని వంట తయారు చేయవలసినదిగా గ్రహింపవలయును. అతిథులకు పెట్టి మిగిలి నది భుజించియుండుట వీరి ధర్మము.

కుశలవులగానము రామునకు వీనులవిందుకాగా వారిని పిలిపించి సవనశాలయందు పాడుమని కోరెను. వారు రామాయణగానము చేయగా విని తన కథయే యని భావించి వాల్మీకిని ఈ విషయమై అడిగిరమ్మని తనవారి నంపెను. అంతియగాక సీతనుకూడ అడుగుమని చెప్పెను. వాల్మీకి అనతపై సీత ప్రతిజ్ఞను అందరు వినవలయుననిరాముని కోరికయై యున్నది. మరునాడు రాముడు సీత పాతివ్రత్యము కూర్చి అందరిని విన వలసినదిగా కోరి సమావేశపరచెను ఋష్యాదులు అందరు ఆ విశేషము చూడవచ్చిరి. వాల్మీకి, అతనివెంట సీత దోసిలియొగ్గి మూర్తీభవించిన పాతివ్రత్యమువలె వచ్చినది. వాల్మీకి జరిగినదంతయు చెప్పగా రాముడు సాంతము వినెను. ఇక సీత పాతివ్రత్యమునకు శపథము చేయుచు భూదేవిని ప్రార్థించి ఆమెయందు ప్రవేశించినది. అందులకు రాముడు కోపించి నారాయణాస్త్రమును ప్రయోగించెను. అప్పుడు బ్రహ్మాది దేవతలు ఉన్న సంగతి వివరించి రాముని శాంతపరచిరి. పిమ్మట రాముడు శాంతించి కుశ లవులతో కాలముగడపుచు రాజ్యము చేయుచుండెను. ఇట్లు వెయ్యేండ్లు రాజ్యపాలనము సాగినది. ఇట్లు విష్ణుని భృగుశాపము తీరినది.

ఒకనాడు యముడు బ్రాహ్మణుని వేషముున వచ్చి రామునితో నేకాంత ముగ సంభాషించుచు, ఎవ్వరు లోనికి రారాదనియు అట్లు వచ్చినవానిని

చంపవలసినదిగా రామునివద్ద మాట తీసికొనెను. ద్వారమునొద్ద లక్ష్మ ణుడు రామాజ్ఞచే కావలికాయుచుండెను. రాము డట్లేయన సంభాషణ సాగు చుండెను. ఇంతలో దుర్వాసుడు రామదర్శనార్థము విచ్చేసెను. కాని లక్ష్మ ణుడు అంగీకరింపకయున్న, దుర్వాసుడు శాపమివ్వ నుంకించెను. అట్టి యెడ చేయునదిలేక లక్ష్మణుడు లోనికేగి దుర్వాస ఆగమనవార్త తెలియ బరచెను. అంతలో యముడు తనసంగతి చెప్పుచు, రాముని స్వర్గమునకు రమ్మని జ్ఞాపకముచేయుటకు బ్రహ్మ తనను బంపె ననెను. అంత రాముడు తానువచ్చిన చోటునకు పోగలనని పల్కెను. ఇక తనకిచ్చినమాట వమ్ము కారాదు అని యముడు లక్ష్మణుని విషయమై అనిపోయెను. వచ్చినదుర్వా సుడు చక్కగా భోజనముచేసి పోయెను. సంధిగ్ధావస్థయందున్న రాముడు లక్ష్మణుని చంపలేక, ఊరకుండలేక దుఃఖించెను. మరునాడు వశిష్ఠాదుల రావించి సభలో వివరించెను. ఋష్యాదులు నాగరులు లక్ష్మణుని చంపరా దని పలికిరి. చివరకు వశిష్ఠుడు ఇక్ష్వాకుల సత్యసంధత్వమును వివరించి, లక్ష్మణుని చంపుమనియే అభిప్రాయమిచ్చెను. కాని రామునకు చేయాడ లేదు. కావున తమ్ముని పరిత్యజించెను. పరిత్యజించుట చంపుటతో సమా నమే యగునుగదా! కాన లక్ష్మణుడు మహాప్రస్థానముపోయి సరయునందు ప్రవేశించి అవతారము చాలించి ముందుగా స్వర్గమున కేగెను.

ఇక రాముడు భరతశత్రుఘ్నుల రావించి భరతుని రాజ్యముగైకొను మని పల్కగా భరతుడు నీయదికాని రాజ్యమునాది కాదని యుగ్గడించెను. ముఖ్యముగ రాముడు రాజ్యము తనదికాదని కేకయుని వాక్యప్రకారముతండ్రి భరతుని కీయవలసినది గాన ఇచ్చెదనని గట్టిగా చెప్పెను. కాని రాముని బలవంతముపై భరతుడు రాజ్యమును అన్నగారిపైనున్న భక్త్యనురాగ సూచకముగ కుశునకు పట్టాభిషేకము చేసెను. అపుడు రాముడు స్వార్జిత మని కుశునకొక యుంగరము మాత్రమే ఇచ్చెను. ఈ ఉంగరము అగ స్త్యునిచే దానమివ్వబడినది గాన తనకు స్వార్జితమైన దదియే యనిభావించి

దానిని కుశునకు అప్పగించెను. ఈ ఉంగరము అగస్త్యున కెట్లు లభ్యమైన దనగా నొక యైతిహ్య మున్నది. శ్వేతుడనువాడు రాజర్షి.మూడువేల వత్స రములు తపమాచరించి శరీరపతనమై బ్రహ్మలోకమున కేగెను. కాని ఆత నికి ఆకలిదప్పులు పోలేదు. అట్లుండుటకు కారణమేమని బ్రహ్మనుప్రశ్నిం చెను. బ్రహ్మ శ్వేతుని తపస్సునుగూర్చి వర్ణించి, తపమువలన బ్రహ్మ లోకము వచ్చినది, అతిథిపూజలేని మహారణ్యమున వసించుటచే నాకలి దప్పులు పోలేదనెను. కావున శ్వేతుని తన పూర్వ శవ శరీరమాంసమును తినుచుండుమనెను. అట్లే ప్రతిదినము శ్వేతుడు తన శవశరీరభాగములను కోసి తినిపోవుచుండెను. కాని మరునాటికి ఆ శరీరభాగము లన్నియు చక్కగా పూడియుండును. ఇట్లు జరుగుచుండగా నొకరోజు అగస్త్యముని ఆ అరణ్యమున చెఱువుగట్టుపై తపస్సుచేసికొన ప్రయత్నించి ఆ రాత్రి యక్కడ పండుకొనెను. మరునాడు శ్వేతుని విమానమువచ్చినది. శ్వేతుడు తన అలవాటు ప్రకారము పీనుగును కోసికొని తినుచుండెను. ఇది చూచిన అగస్త్యుడు అందులకు కారణమేమని ప్రశ్నించెను. శ్వేతుడు తన వృత్తాంతమెల్ల వానికిచెప్పి, బ్రహ్మ అగస్త్యుని చేతనేమైన బెట్టిన నీ అ దత్తదోషము పోవుననని చెప్పెను; గాన మహానుభావా! యీ యుంగరము నిచ్చెదను గొనుమని ప్రార్థించెను. కాని అగస్త్యుడు తన కక్కరలేదనెను. ఎట్టకేలకు వానిని యుద్ధరించుటకు ఆ యుంగరము గైకొనగా నా శవము మాయమైనది. వాడును విమానమున నాకలిదప్పులు లేనిస్థితినొంది దివ్య లోకమున కేగెను. ఇట్లు అగస్త్యునకు లభించిన మణిమయమగు నుంగ రము రామున కివ్వబడినది. దీనిని రాముని ఇంద్రాంశము నీయందుగలదు గాన గ్రహింపుమని అగస్త్యుడు ప్రబోధించి ఇచ్చెను. ఈ యుంగరమునే రాముడు కుశునకు ఇచ్చెను.

మరియు రాముడు పితృవాక్యపరిపాలనయందు తనకంటె పరశు రాముడు మిన్నయని పల్కెను. కారణమేమన తండ్రి యాజ్ఞాపింపగనే

తల్లిగొంతు కోసివేసెను. ఇట్టిపని మిగిలిన నల్వురు కుమారులు చేయజాల రైరి. అపుడు జమదగ్ని కుమారుని భక్తికిమెచ్చి వరమడుగుమనగా తల్లిని బ్రదికించుమనియు, అన్నల శాపము తొలగించుమనియూ ఈ ఘోరకృత్యము తల్లి మరచియుండునట్లును చేయుమని కోరెను. కాబట్టి పరశురాముడు తనకంటె మిన్నయని రాముడు పలికెను. కాని యింత కంటెను పితృవాక్యపాలనయందు పూరుమహారాజు గొప్పవాడగుచున్నాడు. ఏలన తండ్రి వార్ధక్యమునుబాపి, తాను స్వీకరించిన యుత్తముడు. కాబట్టి పరశురామునికన్న పూరుడే గొప్పవాడని రాముడు చెప్పెను.

రాముడు తాను అవతారమును జాలించునపుడు తనతో రాదలచిన వారి నందఱను రమ్మనెను. అపుడు మానవులేగాక వృక్షాదులుకూడ బయలుదేఱినవి. అందఱు సరయువువద్ద శరీరములు వదలి దివ్యవిమాన ములలో పోగా ఇంద్రు డాహ్వానించి ప్రశంసించెను. ఇక తనతో వచ్చిన వారల నందఱను బ్రహ్మకు నప్పగించి గోలోకమున నుండుడని పంచి తాను వైకుంఠమునకు వేంచేసెను. ఇక రాజ్యపాలన చేయుమన్న కుశుడు ఎవరునులేని యయోధ్యయందలి రాజ్యము నాకేలయని మరియొకచో రాజ్య పాలన సాగించెను. అంత అయోధ్యలోని కోటశక్తి కలలోనికివచ్చి విల పించి తన దురవస్థ విన్పించినది. ఆ శక్తి అయోధ్యను పాలింపుమనగా మరల కుశుడువచ్చి పాలించుచుండగా, అందలిప్రజలు రామునే మరచి పోయిరి. ఒకరోజు కుశుని ఉంగరము సరయూనదియందు జారిపడినది. ఈవిషయము మంత్రి కెఱింగించగా, నతడు వెదికించి విసిగివేసారి దొరక లేదని విన్నవించెను. ఇక చేయునదిలేక కుశుడు తన తండ్రి యిచ్చిన ఉంగరములేనందున దుఃఖించి, కోపించి ముల్లోకములు దహించెదనని నారాయణాస్త్రమును ప్రయోగింపనెంచెను. ఆ అస్త్రప్రభావమున లోక మంతయు పొగలుక్రమ్మినవి. పాతాళమున వాసుకి ఇదిచూచి, ఆశ్చర్య చకితుడై, జరిగినది తెలిసికొని, ఆ యుంగరము పాతాళమున నుండి

యుండునని భావించి తీసినవారిని తెచ్చియిమ్మనెను. ఆ యుంగరము కుముద్వతి యను నాగకన్యకు దొరికినది. ఈ విషయము వాసుకికి నివేదింపగా, దాని తండ్రితో నుంగరము కుశున కిచ్చివేయవలసినదిగా ఆజ్ఞాపించెను. వారి ప్రార్థనతో వాసుకి వారితో భూలోకమునకువచ్చి ఆ యుంగరమును కుశునకు సమర్పించెను. అపుడు కుశుడు నారాయణాస్త్రము నుపసంహరించుకొనెను. మరియు సర్పరాజుల అభ్యర్థనతో కుశుడా కుముద్వతిని పెండ్లియాడెను. వివాహానంతరము నాగులందఱు కుశునకు బంధువులైతిమి గనుక, కుశుడు మాకు వరమీవలెనని కోరిరి. కుశుని రాజ్యపాలన పర్యంతము గరుత్మంతునిబాధ లేకుండునట్లు నాగకులము వరము నొందెను. మరియు మానవుల అభ్యర్థనతో తన రాజ్యపాలనయందు మానవులు పాము కాటునకు గురికారాదనియు శాసించెను.

ఇట్లు ఇక్ష్వాకురాజులు ఉత్తమోత్తములై మానవులకు మార్గదర్శకులై వెలయుచున్నారు. తరువాత కుముద్వతీకుశుల వంశవృక్షము నలుబది తరములదాక యితర పురాణములంబట్టి కాళిదాసుడు కీర్తించెను ఇట్టి రామాయణ గేయకావ్య రూపమగు నితిహాసమున లోకవ్యవహారములు, ధర్మకర్మములు, నివృత్తిమార్గములు, తత్త్వానుభవములు మున్నగునవి యెన్నియో పాఠకులు గ్రహింపవలసియున్నది. ముందు ప్రకృత గాథ యందలి పూర్వాపర విరోధము లేకుండ సమన్వయము కుదురుట కష్టము. తరువాత తక్కినవన్నియు గ్రహించుట అంతకన్న కష్టము. కాన ఈ గ్రంథము లేకపోయిన నేమి అనకూడదు. "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిర్నహి సందేహాదలక్షణం" అని పరిభాష. వ్యాఖ్యానములవలన పెద్దల వాగ్ధోరణుల వలన గురువుల సంప్రదాయముల వలన రహస్యముల నెఱుంగవలయును. నాకు తెలియుననువాని కేమియు దెలియదని యుపనిషత్తు తెలుపుచున్నది.

# 16

శ్లో॥ అవతారాస్సంత్యన్యే సరసిజనయనస్య సర్వతో
కృష్ణాదన్యః కోవా ప్రభవతిగో గోపగోపికా ముక్త్యైభద్రాః।

మనకు భగవదవతారములు అనేకము లున్నవి. వానిలో కృష్ణావతారము చాల విశిష్టమైనదిగ వర్ణింపబడెను. ఏలన ఈ అవతారమున భగవంతుడు పెక్కుమందికి మోక్షప్రాప్తిని కల్గించుటవలన నని శ్లోక భావము. కాబట్టి కృష్ణావతారము తనంతట తాను లోకమున ప్రభవించుటచే లీలావతారమై వైశిష్ట్యము నొందుచున్నది. ఇక రామాది అవతారములు శాపగతావతారములుగా పురాణములు పేర్కొనుచున్నవి. ఇప్పుడీ కృష్ణపరమాత్మను మనము రెండు విధములుగ చూడవలయును. భాగవత కృష్ణుడని భారతకృష్ణుడని ఇరుతెఱంగుల చూడనగును. భాగవత కృష్ణునిలో వ్యభిచారము, అలౌకిక శక్తుల ప్రదర్శనము మొదలగునవి అన్నియు గలవు. ఇక భారతకృష్ణుడన్ననో మర్యాదల దొలగనీని పెద్ద మనిషిగా కన్పట్టును. శ్రీకృష్ణుడు పదియవమాసమందే వ్యభిచారము చేసినట్లు—మేఘైర్మే దురమంబరమ్—అను శ్లోకము తెల్పుచున్నది. ఈ కృష్ణ పరమాత్మయందలి మణికాంతివంటి భగవత్తత్త్వము తెలిసికొని ఆనందించుటవలననే గోగోపికాముక్తి లభించినది. ఈ కృష్ణదేవుని చరితములు — పురిటిలోపలనే పూతనను జంపుట, ఆరునెలలవాడై శకటాసురుని, ఏడాది బాలుడై తృణావర్తుని జంపిన యిట్టి అనేకాద్భుతములబట్టి వాని స్వరూప మిట్టిది యని చిత్రింపరాకున్నది. కాన నీకథయే అసత్యమన్న ఇక మన పంట పండినట్లే. సత్యపక్షమున సమన్వయము చేయవలయునుగదా! ఆ

ప్రకరణములోని వర్ణనమునుబట్టి శరీరాతీతమైన అఖండతేజమా కృష్ణపర మాత్మ. శరీరమునకు తానువేరుగానుండి శరీరకృతము తనదికాదని వ్యవహ రించినట్లు కనబడుచున్నది. అత్రి మొదలగు మహర్షులకే అట్టి శక్తి యుండ భగవంతుని విషయ మేమనవలెను ? అందువలననే శంకరులు- ఈ శరీరముతో వ్యభిచరించినను దోషము తనకంటదని లోకము కొఱకు పరకాయ ప్రవేశముచేసి కామశాస్త్రము నెల్ల నెఱింగితి ననెను. కాబట్టి శరీ రము వేఱు, ఆత్మ వేఱు, అను భావముతో ననుభవించి సంచరించినవారికి పుణ్యపాపములు ఏవియును అంటవు. అట్లని అందఱు వ్యభిచార మొక పనిగా సాగింపరాదు. యోగులు వీర్యమును ఊర్ధ్వముఖము చేసి గొప్ప శక్తుల సంపాదించుచున్నారు. శ్రీకృష్ణుడు తన రూపమును రాజకన్యల యందును, గోపికలయందును విస్తరించి నారాయణాది కుమారులను యాదవులను సృష్టించెను. కురుక్షేత్ర యుద్ధము రానున్న దనుచప్పుడు తన గోపికా కుమారాముఖను పంద్రెండువేలమందిని ఒకవైపునుంచి, తానొక్క వైపుననుండి యుద్ధములో ఎవరు ఎవరికి కావలయునో కోరుకొనుమని ముందుగా అర్జునునికి అవకాశ మొసంగెను. అప్పుడర్జునుడు శ్రీకృష్ణునే కోరుకొనెను. దుర్యోధనుడు నారాయణాది గోపాలబలమును తీసికొని హృష్టుడై పోయెను.

భారత పాత్రలలో శ్రీకృష్ణ ద్రౌపదులు మిక్కిలి రాజకీయ చాతు ర్యము గలవారు. వీరిని మించినది కుంతి. కుంతి యెల్లప్పుడు కుమారు లను రాజకార్యములందు ద్రౌపది సలహాను పాటించుమని చెప్పుచుండెడిది. అనగా ద్రౌపదిమాట కెంతవిలువ నిచ్చినదో కుంతి మనస్సు గుర్తింప వచ్చును.

పూర్వ మొక నవాబు తనకు తాంబూల మిచ్చుచున్న ఒక బ్రాహ్మ ణుని సలహాను రాచకార్యములందు పాటించుచుండెడివాడు. అతడు చని

పోవుచు తన కుమారుని నిందించెను. అందులకా నవాబు కుమారుడు నీవు నాకేమియు ఉపదేశింపకయే నన్ను నిందించు కారణమేమని తండ్రిని ప్రశ్నించెను. అపుడా నవాబు తనకు నిత్యము తాంబూల మిచ్చు బ్రాహ్మ ణుని సలహాను తనపలెనే పాటించుమండుమని కుమారుని కోరెను. ఇట్లుండగా నొకనాడు ఒక జమీందారు నవాబు కుమారుని తన సంస్థానమునకు వచ్చినచో నేబదిలక్షల ధనమిచ్చి సత్కరించెదనని చెప్పెను. అట్లేయని నవాబు కుమారుడు తగుపరివారముతో బయలుదేరెను. కాని తండ్రి చెప్పిన మాట మరచిపోయెను. కొంతమార్గము పోయిన పిమ్మట తండ్రిమాట జ్ఞప్తికివచ్చి ఆ బ్రాహ్మణుని పిలిపించి పోవుటయా ? మానుటయా ? అని సలహా నడిగెను. అంత నా బ్రాహ్మణుకు ఇట్లు సమ్రాట్టు ఒక సామంతుని దగ్గరకుపోయి ధనము తానుగా స్వీకరించుట రాజవృత్తి కాదు, భోగినివృత్తి కాబట్టి తాము తిరిగిపోయి, రాజధానినుండి వానినే ధనముతెచ్చి అర్పించునట్లు వార్తనంపుమని సలహాను చెప్పెను. అంత నా నవాబుకుమారుడట్లే యని వెనుదిరిగిపోయి జమీందారునకు కబురుపెట్టెను. ఆతడును చేయునదిలేక చక్రవర్తికి ధనముతెచ్చి సమర్పించిపోయెను. కాబట్టి స్త్రీపురుష భేదమును పాటింపక వారి యుత్తమత్వమునుబట్టి వారివారి సలహాను పాటించుట యుక్తమని తోచుచున్నది. అందువలననే కుంతి ద్రౌపది సలహాను పాటించుమని కుమారుల కోరినది.

ద్రౌపది పూర్వజన్మ వృత్తాంత మతివిచిత్రమైనది. పాండవు లైదుగురు పంచేంద్రులు. ద్రౌపది పూర్వజన్మయందు కుష్ఠురోగముతో బాధపడు నొక ఋషిభార్య. ఆమె భర్తను పతియే దైవమని సేవించుచుండెను. ఒక నాడు అన్నమునందు భర్తవ్రేలు ఒకటి ఊడిపడినది. దానినొక ప్రేప నుంచి అన్నము దినెను. అట్టి పతిసేవాపరాయణ యగు నామెను జూచి ఆతడు వరమేదియేని కోరుమని అడిగెను. అంతట నామె తనకుగల మన్మ థాతురత తీర్పుమని కోరెనది. అందుల కాతడు నాకుష్ఠు ఇక ఐదురోజు

లలో పోమన్నది. అ పిమ్మట నేను నీయిష్టము తీర్చెదనని, అట్లుచేసి కొన్ని వేల సంవత్సరములు తన తపశ్శక్తితో నొక విమానము సంపాదించి దానిపై పత్నినిడుకొని తానన్నిలోకముల తిరుగుచు నాయమ నన్ని విషయముల సుఖముల మాన్పించి ఇక నేను బ్రహ్మలోకమున కేగెదను. నీవు తపముచేసి నీ యభీష్టము నెరవేర్చుకొనుము అనిచెప్పి ఆ ముని బ్రహ్మలోకమున కేగెను. అంత ద్రౌపది తపస్సుచేసి శివుడు ప్రత్యక్షమై యేమికావలెనని యడుగ పతి-పతి యని ఐదుసార్లు అనెను. శివుడు ఆమె నోరుమూసెను, మరియు నీకు ఐదుగురు పతులు లభించెదరనియు పల్కెను. అందులకామె ఐదుగురువలన పతివ్రతా ధర్మము చెడునని వద్దని పల్కినది. కాని శివుడు ఐదుగురు భర్తలు లభించినను, ఆ ఐదుగురు ఒక్క ఇంద్రాంశకల వారలగుటచే పాతివ్రత్యము చెడదు అని ఆమె కన్యాత్వము చెడకుండునట్లు వరమిచ్చెను. మరియు ఇంద్రుని పిలుచుకొని వచ్చినచో తనకు కాబోవు భర్తలను చూపించెదనని ఇంద్రుని గైకొని వచ్చు నుపాయమును చెప్పెను. ఇంద్రుడు రాబోవుచుండగా ఆమె ఆకాశగంగలో శివాజ్ఞచే నేడ్చుచు కూర్చుండెను. ఆమె కన్నీటి చుక్కలన్నియు బంగారు కమలము లగుచుండెను. ఇంతలో శివుడు వరుణదేవుడై హిమాలయముపై భార్యతో జూదమాడుచుండెను. అపుడు ఇంద్రుడు తన సామంతుడగు వరుణుడు తన రాక కెదుర్కొనక యుపేక్షించుచున్నాడని భావించి వానిని కోపించెను. వెంటనే వరుణరూపమున నున్న శివుడు ఇంద్రుని బట్టి తెమ్మని యాజ్ఞాపింప నా తపస్విని వానిచేయి పట్టుకొనెను ఆ సమయమున ఇంద్రుని చింతించుచుండగనె చేయి వదలించుకొనుమాత్రము శక్తియులేక తగ్గిపోయెను. అపుడు వరుణుడై యున్న శివుడు ఇంద్రుని ఈ కొండశిఖర మెత్తుమని ఆజ్ఞాపించెను. ఇంద్రుడట్లే యొనర్ప ఆ కొండశిఖరము అడుగు భాగమునుండి నల్వురు ఇంద్రులు బయలువెడలిరి. అపుడు శివుడు ఆ ఐదుగురు ఇంద్రులను

లోకోపకారము కొఱకు భూలోకమున బుట్టుదని శాసించెను. వారు నీకు భర్తలయ్యెదరని యామెకు చెప్పెను. కాబట్టి పాండవులందఱు ఇంద్రాంశ సమానముగ గలవారె యగుచున్నారు. అయినను ఇంద్రాంశ యమాంశ లతో ధర్మరాజు మొదలగువారు ఆయాదేవతల వరములతో పుట్టిరి. ఆ పత్యర్థిని యగు సతి రామాయణమున అగ్ని నెనసిన మాయాసీత తన్ను జేర ద్రౌపదియై జన్మించెను.

వివాహానంతరము నారదోపదేశముతో ఒక్కొక్కరు ఒక్కొక్క సంవత్సరము ద్రౌపదితో నుండునట్లు ఒడంబడిక జరిగినది. "ద్రౌపద్యాః పాండుతనయాః పతిదేవర భావుకాః న దేవరో ధర్మరాజ స్సహదేవో న భావుకః" అని కాళిదాసు చమత్కరించెను. అనగా ద్రౌపది ధర్మరాజుతో నుండగా మిగిలినవారు మరదులు. భీమునితో నుండగా ధర్మరాజు బావ గారు మిగిలినవారు మరదులు. ఇట్లు చమత్కారముగ చెప్పబడినది. సహదేవుడెప్పుడును బావకానేరడని చకారము లేకుండ నిన్నిపదుసలోక శ్లోకమున వర్ణించెను.

ద్రౌపది వివాహసమయమున అర్జునుడే మత్స్యయంత్రమును కొట్టి నందున ద్రుపదుడు అర్జునునకే ద్రౌపది నిచ్చెదనని పల్కెను, అపుడు ధర్మ రాజు పెద్దవానికి వివాహము కాకుండ చిన్నవాడు పెండ్లాడుట నిషేధమని, కూడదని వచించెను. కాబట్టి తల్లి యనుమతిని ఐదుగురు ద్రౌపదిని వివా హమాడ నిశ్చయించితిమనెను. ఇట్లు ఒకస్త్రీ ఐదుగురుని వివాహమాడుట ఆర్యమతమందు నెందును గన్పట్టుట లేదని ద్రుపదుడన ధర్మరాజు ప్రచేతసులు పదిమంది ఒకస్త్రీని శాస్త్రవిధి వివాహమాడి నట్లును, అట్లే ఏడుగురు ఒకదానిని వివాహమాడినట్లును వేదములయందు గలదని చెప్పెను. కాబట్టి ద్రౌపది పాండవులను వివాహమాడుట తప్పులేదు. అయినను పెద్దల సలహా ననుసరించి చేయుదమని భావించుచుండగా వ్యాసు డచ్చోటికి విజయము చేసెను. ఆ మహాత్ముని సలహా ననుసరించి

వారి వివాహము జరిగినది. ఆ వ్యాసమహర్షి ఈ పంచేంద్రోపాఖ్యానము చెప్పి వారి పూర్వజన్మపు శరీరములను శివుని వరమున నా కన్నె కన్యాత్వ మెప్పుడు భగ్నము గామియు వివరించి దివ్యదృష్టితో జూపించి ద్రుపదు నొప్పించెననియు నందు గలదు.

దేవీ భాగవతమున కృష్ణునకు పాండవులు సాయము చేసిరా? లేక పాండవులకు కృష్ణుడు సహాయము చేసెనా? యను జనమేజయు ప్రశ్నము కలదు. వ్యాసుడు పాండవులే కృష్ణునకు సహాయము చేసిరని తేల్చెను. కురుక్షేత్రయుద్ధమున పదునెనిమిది యక్షౌహిణుల నూటదెబ్బది యారుకోట్ల మంది రాజులు నిహతులైరి. అంతకుమున్ను జరాసంధుని కృష్ణుడెదుర్కొనునప్పుడు మాటిమాటికి ఇరువదినాల్గు అక్షౌహిణుల సైన్యము అంతరించినది. ఇట్లు శ్రీకృష్ణుడు దుష్టసంహారము గావించుచు చివరకు భారతయుద్ధమున మెరికలవంటి మహావీరులను గూడ అంత మొందించెను. పాండవులు కృష్ణసహాయముతో అందఱిని అంతమొం దించిరి. ఆకాలము కామప్రధానము కాక ధర్మప్రధానమై వెలసినది. దీనికి దృష్టాంతము యయాతిమహారాజుకు మాధవి అను కుమార్తె గలదు. విశ్వామిత్ర మహర్షివద్ద గాలవుడు అనునతడు విద్యాభ్యాసము గావించి గురుదక్షిణ నిచ్చుటకేమి కావలయునో కోరుకొనుమని గురువు నర్థించెను. కాని గురువు నీ శుశ్రూషకు మెచ్చితిని వేరే గురుదక్షిణ ఏమియూ వద్ద నెను, కాని గాలవుడు తప్పక ఏమికోరినను ఇవ్వగలనని పల్కెను. అపుడు కోపముతో విశ్వామిత్రుడు నల్లని ఒక చెవిగల తెల్లని గుఱ్ఱములను ఎనిమిదివందలు తెమ్మని కోరెను. ఇక గాలవుడు అశ్వాన్వేషణమునకు ప్రారంభించెను, బాల్యస్నేహితుడగు గరుత్మంతుని సహాయముతో ఇంద్ర లోకమునకు కూడ పోనెంచెను. కాని మార్గమధ్యమున వారు మేరుపర్వత ముపై పోవుచుండగా నొక ఋషి తపస్సు చేసికొనుచుండెను. ఆతనిపైగ నెగసిపోవు గరుడుని ఱెక్కలు విఱుగునట్లుగా నా ఋషి శపింపగా వారు

క్రిందబడిరి. గరుత్మంతునకు ఱెక్కలు పోయినవి. వారి పయనము అసాధ్యమైనది. అపుడు గాలవుడు తాను పోవుచున్నపని వివరించగా నాముని ప్రసన్నుడై గురుదక్షిణార్థము పోవుచున్న ధర్మము నెంచి ఱెక్కలు వచ్చుననెను. మరుక్షణముననే గరుత్మంతునకు ఱెక్కలు వచ్చినవి. మరల వారి ప్రయాణము సాగినది. ఇక నూర్ధ్వలోకములకు బోక భూలోకమున సంచరించుటకు వచ్చిరి. అపుడు అచటిరాజు యయాతి పరిపాలించు చుండెను. గాలవ గరుత్మంతులు పోయి రాజును అట్టి అశ్వముల నర్థించిరి. కాని యయాతి అట్టి గుఱ్ఱములు తనవద్ద లేవని పల్కి గురుదక్షిణార్థియగు యాచకుని ఊరకపంపరాదు గాన తన కుమార్తెయగు మాధవిని వారికి ఇచ్చిపంపెను. మరియు తన కూతునెవరికైన నిచ్చి గుఱ్ఱముల సంపాదించుకొనుమని చెప్పి పంపెను. తర్వాత గరుత్మంత గాలవులు కాశీకి పోయిరి. అచట దివోదాసు అనునతడు రాజ్యము చేయు చుండెను. ఆతని దగ్గర నున్న రెండువందల గుఱ్ఱములను, మాధవినిచ్చి గ్రహించినపుడు, వారు మాధవిని ఒక కొడుకు గనినపిమ్మట తమకు మరల ఇవ్వవలసినదిగా సమయము చేసికొనిరి. ఆ రాజట్లే యని గుఱ్ఱము లిచ్చి పంపెను. ఈ దివోదాసు మాధవి అనువారలకే ప్రతర్దనుడు అను వాడు జన్మించెను. పిమ్మట రాజు అనుకొనిన మాట ప్రకారము మాధవిని గాలవాదుల కర్పించెను. వీరు మరల మాధవిని తోడ్కొని సేనజిత్తు అనువాని తండ్రికిచ్చి పై వలెనె రెండువందల గుఱ్ఱములను గ్రహించి, సేనజిత్తు జన్మింపగనే మరల మాధవిని స్వీకరించిరి. పిమ్మట శైబ్యుని నుండి మరి రెండువందల గుఱ్ఱముల స్వీకరించి శిబిచక్రవర్తి జన్మింపగనె మాధవిని మరల గ్రహించిరి. ఇట్లు గాలవునకు ఆరువందల గుఱ్ఱములు లభించినవి. మాధవి మాత్రము కన్యగానే యున్నది. కాని మిగిలిన రెండు వందల గుఱ్ఱములు లభించుట దుర్లభమైనది. అందుల కాతడు ముందు లభించిన ఆరువందల గుఱ్ఱములను విశ్వామిత్రునకు సమర్పించి, మిగిలిన

రెండువందలకు గాను మాధవిని స్వీకరించి పైవానివలె నీవు నొక కొడుకును గనుమని సమర్పించెను. అపుడు విశ్వామిత్రునకు మాధవి యందు అష్టకుడు అనువాడు జన్మించెను. మొత్తముమీద మాధవికి నలుగురు ధర్మ సంతానము గలిగినది. పిమ్మట మాధవి తనకు వివాహము అక్కరలేదని పల్కి తపస్సు చేసి బ్రహ్మలోకమునకు పోయినదని భారతమున గలదు.

పిమ్మట కొంతకాలమునకు అష్టకు డశ్వమేధయాగము ప్రారంభింపగా అన్నలు అందఱు విచ్చేసిరి. యాగాంతమున అవభృథస్నానముచేసి అష్టకుడు అన్నలతో వాహ్యాళి వెడలెను. త్రోవలో నారదమహర్షి కనబడిన వారి రథ మెక్కించుకొనిరి. ఈ మన ఐదుగురిలో ఆకాశయానమున బ్రహ్మలోకమున కేగుచో యోగశక్తిచాలక ముందెవరు భ్రష్టులగుదురని నారదుని ప్రశ్నించిరి. నారదుడు అష్టకుడే ముందు యోగభ్రష్టుడు కాగలడని పల్కెను. కారణ మేమని నారదుని ప్రశ్నించగా ఆతడు క్రిందివిధముగా సమాధానము చెప్పెను. ఒకసారి నారదుడు అష్టకునియింట ఒక సంవత్సరము చాతుర్మాస్యదీక్ష నిర్వర్తించెను. అనంతరము నారదుడు అష్టకునితో కలసి విహారముపోగా ఆలమందలు కన్పించినవి. వానినిగాంచి నారదుడు ఈ ఆలమంద లెవరివని ప్రశ్నింపగా అష్టకుడు నేను బ్రాహ్మణుల కిచ్చినవనిఅడుగనిదే తన దానమును, తన అహమును ప్రకటించుచు పల్కెనుగాని, బ్రాహ్మణుల గోవులని పల్కలేదు. కాబట్టి అష్టకునకు అహంకారము నశింపలేదు కనుక ఆతడే ముందు యోగభ్రష్టుడు కాగలడని పల్కెనట.

పిమ్మట ఆతనివదలి మన నలుగురమేగుచో యోగభ్రష్టు లెవరనగా కాశీరాజు కుమారుడగు ప్రతర్దనుడని నారదుడు బదులుపల్కెను. అందులకు కారణముకూడ నారదు డెఱింగించెను, ఒకసారి నారదుడు

ప్రతర్దనుని యింట చాతుర్మాస్యదీక్ష నిర్వర్తించెను. ఒకనాడు వారు గుఱ్ఱ ములు పూన్చిన రథముపై విహారముచేయుచుండగా బ్రాహ్మణు డొకడు వచ్చి రథాశ్వమొకటి యిమ్మని యాచించెను. అపుడు రాజు కాదనలేక ఒక గుఱ్ఱమునిచ్చి మూడింటితో విహారము చేయుచుండెను. ఇట్లు కొంత దూరముపోగా మరొకబ్రాహ్మణు డట్లే యాచించిన వానికి ఒక గుఱ్ఱము నిచ్చి పంపెను. అట్లే మరియొక గుఱ్ఱమునుగూడ యాచకునకు ఇచ్చి ఒక గుఱ్ఱముతో రథము తోలుకొనుచు నింటికి వచ్చుచుండ నాయొక్కటియు బ్రాహ్మణయాచకునకు ఇచ్చి పంపవలసివచ్చెను. చివరకు నాల్గుగుఱ్ఱములు పోగా ప్రయాణము దుర్లభముకాగా రాజే రథము దిగి ఆ కాడిని తన మెడపై బెట్టుకొని రథములాగ నారంభించెను. లాగుచు నూరకుండక బ్రాహ్మణులకు యుక్తాయుక్తములు లేవని (విప్రాణాం సాంప్రతం నాస్తి) పల్కెను. అందువలన ప్రతర్దనుడు దానమిచ్చియు యుక్తాయుక్తములు లేవని విప్రనిందను జేసెను. అంతచేసినవా డింత యోర్చుకొనలేక పోయెను. గాన యోగభ్రష్టుడగునని పల్కెను.

తరువాతనున్న మువ్వురిలో నెవడు వెనుకబడునని ప్రశ్నము పుట్టెను. దానికి నారదుడు సేనజిత్తు యోగమునుండి పతితుడగునని, కారణ మిట్లు తెల్పెను. నారదుడు సేనజిత్తునింట చాతుర్మాస్యము నిర్వర్తించి, ఆతడు చేయించుకొనిన అందమైన బండిని బాగుగ నున్నదని మెచ్చ నాత డివ్వగా నీతడు స్వీకరించెను. మరల నాతడు మరియొకబండిని చేయించు కొనగా, మరల నారదుడు సన్నిహితుడై ఈ శకటము నాకిచ్చినదానికన్న బాగుగనున్నదని, అదియు నాతడిడ స్వీకరించెను. పిమ్మట మరల రాజు పైవానికంటె అందముగ నుండునట్లు మరియొకబండిని చేయించుకొని దానిపై నాసీనుడగుటకు బ్రాహ్మణులచే స్వస్తివాచనము చేయించుచుండగా నారదుడు ఎప్పటివలెవచ్చెను. నారదుడు వచ్చుచున్నాడు ఇదియు నివ్వ వలసి వచ్చునేమోయని, నారదాగమనముచూచి తత్తరపడి బ్రాహ్మణుల

స్వస్తివాచనము లొందరగా గానిమ్మనెను. గాన నితడు యోగమునుండి పతితుడు కాగలడు. శరీరముతో నెగిరిపోవు నాకు బండి ఎందులకు? అటు గని నాకు నిదనేల? రొందరపడనేల? అని పల్కెను.

ఇక మిగిలినది నారదుడు శిబిమాత్రమే. మీ యిద్దఱిలో నెవరు పతితులగుదురని ప్రశ్నింపగా నారదుడు సంతుష్టుడై నా తప్పు నాకు తెలియదు కాన అట్టి తిప్పేదియేమున్న నేనే పడుదునేమోగాని శిబిమాత్రము పతితుడు కాడని నిశ్చయముగ చెప్పెను. అనగా నారదునికన్న శిబి చాల గొప్పవాడని భావముకదా! అందులకు కారణమేమనగా ఒకసారి నారదుడు శిబియింట చాతుర్మాస్యముచేయుచుండెనట. ఆ సమయమున శిబి యింటికి నల్లనివాడొకడు వచ్చి అన్నము పెట్టుమని యడిగెను. అందులకు శిబి సరే యని పల్కగా యాచకుడు నీ యిష్టమైన భోజనముగాక నాకిష్టమైనతిండి కావలెననెను. అది శిబి కుమారుని ఖండించి వండిపెట్టుట. నల్లని బ్రాహ్మణుడు దానిని గోరెను. ఆ మాటచెప్పి తా నెచటికో పోవుచుండ రాజు మీ యిష్టమైన భోజనము పెట్టెదనుండు డనగా, నేనిక్కడనేయున్న నాపనులు చెడవా? నీవా భోజనము నావద్దకు తెమ్మనెను. శిబిచక్రవర్తి ఆ మాటల నంగీకరించి తన కుమారుని ఖండించి వంటకముగావించి దాని పళ్ళెరము నెత్తిన పెట్టుకొని బ్రాహ్మణుని కొఱకు ఊరంతయు గాలించెను. ఈ వింతనుగాంచిన యూరిప్రజ ఈ బ్రాహ్మణుడు నీ కెక్కడ దొరకెను? దుర్మార్గుడని బ్రాహ్మణుని అనేకవిధముల నిందించిరి. కాని శిబిమాత్రము వల్లెత్తుమాట అనలేదు. మరియు నా బ్రాహ్మణుడు శిబిచక్రవర్తియొక్క అశ్వశాలలను, గజశాలలను తగులబెట్టుచున్నాడని ప్రజలవలన నెఱింగి అచటకు బోయెను. అంత శిబి తానుతెచ్చిన వంటకమునుగూర్చి నివేదించెను. అందులకా బ్రాహ్మణుడు మరి నాలుగు కొంపలు తగులబెట్టివచ్చెదనని పల్కెను. అంతియగాక తెచ్చినమాంసము కుమారునిది యగునా కాదా? అనియు దుఃఖించుచు పెట్టిన తాను భుజింపననియు పల్కెను.

మరియు శిబిని అందలి మాంసఖండము నొకదానిని ముందు తినుమని బ్రాహ్మణుడు కోరగా శిబి యట్లేయని నోటనుంచుకొనబోయెను. వెంటనే బ్రాహ్మణుడు ఆతనిచేతి నెగురగొట్ట నా ముక్క పళ్ళెరముతోసహా క్రింద పడినది. మరుక్షణముననే ఆ మాంసమంతయు కుమారుడై నిల్చినది.

అపుడా బ్రాహ్మణుడు శిబి ప్రార్థనముతో యథావిధి భోజనము రాజు సరసన కూర్చుండి చేసి వెడలిపోయెను. మరునాడు రాజు కచేరీకి పోగా ప్రజలు తండోపతండములుగా వచ్చిరి. వారందఱు మిన్నకుండక రాజు గావించిన పనికి ధర్మాధర్మ విచారమును గూర్చి ప్రశ్నించిరి. అందులకు రాజు అతిథికోరికను పాపపుణ్యముల నిమిత్తములేకుండ నిర్వర్తించుట గృహస్థుని ధర్మమని తనకిం దేమాత్రము కోరిక లేదని పల్కెను. ఆ మరునాడే బ్రాహ్మణుడు కాల్చిపోయిన అశ్వశాలలన్నియు బంగారుకట్టడములచే మిలమిల మెఱయుచు ప్రకాశించినవి. కాబట్టి శిబి అతిథికొఱకు తన కుమారుని సైతము అహంకారమును బోనాడి, రాజసమును విడనాడి కుమారు వధించి భోజనము నిర్వర్తింపజేసెను. ఇట్టివానికి యోగమేల చెడును? మోక్షమునుబొందుట కాత డర్హుడయ్యెడివాడా? వాని ప్రశ్నమున నారదుడు దిమ్మరపోయెను. ఇక నారదుడు ఇట్టి వన్నియు సమయానుకూలముగ బయటపెట్టి లోపములున్న వారాచరితము మార్చుకొనునట్లు చేయుటకు లోకోపకారముననకే యుదయించెనని తలంపవలయును. మాధవి కుమారులు నల్వురు రత్నములవంటివారు. మరణానంతరము నక్షత్రరూపమున ఆకాశమున మెఱయుచున్నారు. యయాతి కామ్యలోకము లన్నియు తిరుగుచు ఇంద్రలోకమునకు పోయెను. అంత ఇంద్రుడు యయాతి గొప్పతనమునుగూర్చి ప్రశ్నించగా, యయాతి తాను గొప్పవాడననియు, తనకంటె తన కుమారుడు గొప్పవాడనియు సమాధానము చెప్పెను. అపుడు వెంటనే ఇంద్రుడు యయాతిని స్వర్గలోక భ్రష్టుని గావించెను. యయాతి పతనమందుచుండగా దౌహిత్రు లాతనిగాంచి ఆగుమనియు, ఎవ

రనియు ప్రశ్నించిరి. యయాతి ఉన్నసంగతి వివరింపగా వారు యయాతి తమ తాతయని తెలిసి, ఆ నల్వురు తమపుణ్యమున నాల్గవవంతు యయాతి కిచ్చి మరల పైకిపొమ్మనిరి. అప్పుడు యయాతి తేజశ్శాలియై ఊర్ధ్వలోక మునకు పోయెను. కాబట్టి మాధవికుమారులు ధర్మసంతాన మందమా? అధర్మసంతాన మందమా? అధర్మసంతానము కాకపోవుటవలననే అట్లు చేయగల్గిరి. కావున ద్రౌపదియు భర్తలు ధర్మనిర్మితులేకాని అధర్మ మేమాత్రము వారియందు లేదు.

భారతమున రాజ్య మెవరిది? అను ప్రశ్నవచ్చినపుడు నన్నయ భారతమున నున్న ప్రక్షిప్తమో విక్షిప్తమో యగు—

ఉ. ఆయము గర్వమున్ విడిచి యన్యపతుల్ పనిసేయ నిట్లు గాం
గేయ భుజాబలంబున నిరృత్త విరోధిసమాజుడై కుమా
రాయిత శక్తిశాలి ధృతరాష్ట్రుడు రాజ్యముసేయుచుండె న
త్యాయతకీర్తితో తనకు హస్తిపురం బది రాజధానిగాన్॥

అను పద్యమునుబట్టి ధృతరాష్ట్రునిదే యని నిర్ణయింపవలెను. కనుక సంస్కృత భారతమున మాత్రము ధృతరాష్ట్రుడు అంధుడగుటచే రాజ్యార్హత లేదనియు, విదురుడు దాసీపుత్రు డగుటచే నాతడును రాజ్యార్హుడు కాడనియు నిర్ణయమైనది. కనుక పాండురాజే రాజని నిశ్చయమైనది.

శ్లో॥ ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం నప్రత్యపద్యత
పారశవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవహ॥

ఏవార్థముగల హ అను నవ్యయముతో వ్యాసర్షి పాండురాజే ఆ కులమున రాజని నిర్ధారణ చేసెను. మనుస్మృతిలో చిన్నవాని కుమారుల కన్న పెద్దవాని కుమారుడు సమర్థుడైనచో రాజ్యార్హతను నిర్ణయించినది.

ఇక కౌరవ పాండవులలో సమర్థు లెవరను ప్రశ్న యుద్ధమునందే తేల్చ వలసి యున్నది. అదియునుగాక కృష్ణరాయబార సందర్భమున గాంధారి –

శ్లో॥ రాజ్యంతు పాండోరిదమప్రధృష్యం: తస్యాద్యపుత్రాః ప్రభవంతినాన్యే
న్యాయాగతం రాజ్యమిదం చ కృత్స్నం యుధిష్ఠిరశ్శాస్తువై ధర్మపుత్రః॥

అని పాండురాజు కొడుకు యుధిష్ఠిరుడే రాజు కావలయునని పల్కినది. దీనినిబట్టి యుధిష్ఠిరుడే రాజు అగునని భావము. ఆమెయే అరణ్య పర్వమున కౌరవులది అధర్మద్యూతమని పల్కినది. పాండురాజు యమ లోకమున సభాస్తారుడుగ నున్నాడనియు ధర్మరాజుతో రాజసూయము చేయుమని చెప్పవలసినదిగా తన్ను బంపెననియు - అట్లయిన దాను మహేంద్రసభకేగెదనని, నారదు డీవిషయము ధర్మరాజుతో చెప్పగా నాలో చించి అజాతశత్రుడు కృష్ణసహాయముతో దానిని నిర్వర్తించి తన తండ్రి నింద్రలోకమున ఇంద్రునితో సమానముగ నుండబంచెను. ధీరశాంతో యుధిష్ఠిర ఏకఏవ—అని ధర్మరాజు ధీరశాంతుడైన నాయకుడుగా నలం కార శాస్త్రములు నొక్కి వక్కాణించుచున్నవి. రామాదులు ధీరోదాత్త నాయకులు. భీమ లక్ష్మణులు ధీరోద్ధత నాయకులు. కృష్ణుడు మొదలైన వారు ధీరలలితులైన నాయకులు. తక్కిన మూడువిధములైన నాయకు లింక ననేకు లున్నను మొత్తముమీద అలంకారశాస్త్రములు ధర్మరాజువంటి ధీరశాంతనాయకుడు మఱొకడు లేడని చెప్పుచున్నవి. ధర్మరాజు ధర్మవర్త నుడేగాక యుధిష్ఠిరుడు. ఇతడు జూదమున ఎనిమిది పందెములలో సర్వ స్వము నోడిపోయెను. తరువాత నింకను ధనకనక వస్తువాహనాదు లను, తమ్ములను, ఎట్టకేలకు భార్యనుగూడ నొడ్డి ఓడిపోయెను. మహా లక్ష్మివంటి ద్రౌపదిని దక్కించుకొనలేక పోయితినని ధర్మపాశబద్ధుడనై జూదమున పణముగా పెట్టుచుంటినని ధర్మజుడు చివరకు విసువుతో పాచి కలను పారవెచెను.

ఆ ధర్మరాజు ఏ ధర్మపాశమునకు బద్ధుడై భార్యనొడ్డెనో అది

భీష్మాదుల బుద్ధుల కందలేదు. ద్రౌపదిని సభకు దెచ్చుటకు ప్రాతిగామిని పంపగా నామె ఎవరెవరెట్లు ఓడిరని ప్రశ్నించినది. అంతియగాక నీకుదెలి యనిచో సభికుల నా విషయము అడిగిరమ్మని వెనుకకు పంపినది.ఇంతలో ధర్మరాజు చక్కని తంత్రము నొకదానిని పన్నెను. క్రొవ్వియున్నవారు దుష్టులు చాటున పరాభవించిన లోకవాద మనేకవిధముల వర్వగలదని దుశ్శాసనాదులు వచ్చులోపల ద్రౌపది రజస్వలావేషధారిణియై వచ్చి అత్త మామల మధ్య సభలో నిలువబడియుండునట్లు చాటుగా కబురంపెను.ఆమె యట్లే ఏకవస్త్రయై వచ్చినిల్చినదేగాని వాస్తవమునకు ద్రౌపది రజస్వల కాదు. ఏలన ద్రౌపదివంటి రాజకన్య రజస్వల అయియున్నచో సభామధ్య మునకు వచ్చుట సాధారణమైన విషయముగాదు. వాస్తవమునకు రజస్వల యగు స్త్రీ చిన్నచెంబుతో నీరు త్రాగరాదు. పుడకతో పండ్లు తోమరాదు. పర్ణమునందు నీరు త్రాగకూడదు. పురుషదర్శనము చేయరాదు. ఇట్టి వ్రతముతోనుండి స్నానముతర్వాత మొదట భర్తనుచూచినపిమ్మట ఇతరు లను చూడనగును. ఇట్లున్నవారికి భర్తవంటి కుమారుడు పుట్టగలడు కాని యితరులనుజూచిన అట్టివారే పుట్టుట శాస్త్రవిహితము. ద్రౌపది సభలో నెన్నియో ప్రశ్నలువేసినది. కాని పాండవ వనవాసము, యుద్ధము జరు గక తప్పలేదు. కురుక్షేత్ర సంగ్రామము రాక తప్పదను విషయము ముందే నిర్ణయింపబడినది. ధర్మరాజు రాజసూయము పూర్తియైనపిదప పదమూడవరోజు వ్యాసభగవానుడువచ్చి ధర్మరాజుతో నీ వన్నివిధముల ఉత్తముడవైనను నీకు బంధువిరోధమను ప్రారబ్ధము కలదు. శివునితో నీ విషయము ముచ్చటింప కైలాసమున కేగుచుంటినని వెళ్ళిపోయెను. ఆనాడు రాత్రి శివుడు మిక్కిలి క్రుద్ధుడై ధర్మరాజుకు కలలోకన్పించి పదమూడేండ్లు గడచిన పిమ్మట, పదునాలుగవయేడు నీ నిమిత్తముగ ప్రజాక్షయము చేయుదునని పల్కెను.

కాబట్టి ప్రజాక్షయ మను విషయ మేనాడో నిర్ణయింపబడినది.

అంతియగాక తన నిమిత్తత్వము తీసివేయుమని ధర్మజు డడుగగా శివుడు ఈ ప్రజాక్షయమను విషయ మెప్పుడో వ్యాసకృష్ణులచే నీ నిమిత్తముగా నిశ్చయింపబడినది. ఇప్పుడు నేనెట్లు తీసివేయుదునని సూచించెను. ద్రౌపది వివాహానంతరము ద్రుపదునియింట పాండవు లొక సంవత్సరముండిరి. వారితో కృష్ణుడుకూడ నుండెను. ఈ సంగతి ధృతరాష్ట్రునకు తెలిసినది. ఇపుడే పాండవులమీద నెత్తిపోయి బలములేని సమయమున చంపవలెనని కర్ణుడన, భీష్మాదులు పాండవులను హింసించవద్దని సలహాచెప్పి, వారిని పిలిపించుమని సూచించిరి. అది దుర్యోధనుడుకూడ తాను రాజ్యము చేయుచు వారికి ఊరక సువారులో భోజనముమాత్రము పెట్టనెంచి వారి రావించుట కొప్పుకొనెను. అట్లేయని విదురునిపంపి వారిని పిలిపించిరి. విదురునిమీద భారముతో ద్రుపదుడు తన యల్లండ్రను, కూతును పంపుటకు నిశ్చయించెను. అట్లు బయలుదేరి పాండవులు నవోఢతో తల్లితో హస్తిపురి కేగునపుడు మొదటినుండి కౌరవుల దురాగతము నెఱింగిన శ్రీకృష్ణుడు మాత్రము శంకించి ధృష్టద్యుమ్నుని పిలిచి, పాంచాలసైన్యమొక అక్షౌహిణినిగొని వారికి బాసటగా పొమ్మని, తానుకూడ నొక అక్షౌహిణి యాదవసైన్యమును గొని వెంటపోయెను. వీరి రాకనుచూచిన దుర్యోధనుడు సింహాసనమునుండి దిగరాదనుకొని భావించియు, కృష్ణపరమాత్మను తక్కుంగల పాండవులను జూడగనే వెంటనే దిగిపోయెను.

అపుడు శ్రీకృష్ణుడు ధర్మరాజును సింహాసనముపై ఆసీనుడవు కమ్మని సన్నచేసెను. ధర్మరాజు కూర్చుండగనే కృష్ణుడు, ధృష్టద్యుమ్నుడు వేత్రహస్తులై బరాబరులు చేయుచుండిరి. ఈ విధముగ ధర్మరాజు ఐదేళ్ళు రాజ్యపాలన అత్యంత వైభవముగ సాగించెను. పిమ్మట నొకనాడు భీష్మాదులు తమ్మునాశ్రయించి అడుగు ధృతరాష్ట్రుని రాజ్యవిషయమై ధర్మరాజును అడుగుమని ప్రబోధించిరి. అట్లేయని ధృతరాష్ట్రు డడుగగ ధర్మరాజు పెత్తండ్రితో నీ యిష్టమువచ్చినంత తీసికొని మిగిలినది నాకు ఇవ్వ

మని సమాధానము చెప్పెను. ఈ మాట అనగనె ధృతరాష్ట్రునకు ప్రాణము మరల వచ్చినట్లైనది. దిమ్మరపోయి మరల తెలివి తెచ్చుకొని ధృతరాష్ట్రుడు తనకు హస్తినాపుర మిమ్మని, రాజ్యము రెండుభాగములు చేసితినని, అర్థరాజ్యము నాకిచ్చి అర్ధరాజ్యములో మీరుపోయి తెలివిగల వారు గాన నింకొకచోట రాజధాని నమర్చుకొనుమని పంపెను. అపుడు ధర్మరాజు తమ్ములతో, ధృష్టద్యుమ్నునితో, శ్రీకృష్ణునితో అర్థరాజ్య పరివారముతో ఖాండవప్రస్థమునకు పోయి అచట నగర నిర్మాణమునకు పూనుకొనెను. శ్రీకృష్ణ వ్యాసులు వాస్తుశాస్త్రము నిర్ణయింపగా తదనుగుణముగా నగరనిర్మాణము జరిగినది. విశ్వకర్మవచ్చి ఈ లోకమున ఇంద్రప్రస్థమును నిర్మించెను. ఇందొక చిత్రము గమనింపవలసి యున్నది.

ఈ నగరనిర్మాణమునకు వ్యాసకృష్ణులు కొలతకు దారమును బట్టుకొనిరి. ఆ కొలత ప్రకారము కట్టినచో తప్పక యజమానికి యుద్ధము సంభవించునని విశ్వకర్మ నొక్కి వక్కాణించెను. అపుడు వ్యాసకృష్ణులు యుద్ధము వచ్చుట సరేకాని, జయమెవరిది? అని ప్రశ్నించిరి. అందులకు విశ్వకర్మ జయము ఈ నగరనాయకునకే అని నిర్ణయించెను. అట్లయినచో శీఘ్రముగ నగర నిర్మాణము ప్రారంభింపుము. యుద్ధములులేకుండ చేతులు ముడుచుకొని కూర్చున్న కీర్తివైభవము లెట్లు వచ్చును? అని విశ్వకర్మకు ఆదేశించి తన్నిర్మాణము పూర్తిగావించిరి. అట్లు నిర్మించి ఇంద్రప్రస్థమున నుండి పాండవులు ఇరువదినాలుగు సంవత్సరములు మహాకీర్తితో మహావైభవముతో దేవతలకన్న మిన్నయగు సౌఖ్యము లనుభవించిరి. ఈ రాజ్యవిభాగము రాబోవు యుద్ధమునకై శ్రీకృష్ణుడొప్పినది. పిమ్మట రాజసూయము తర్వాత ధర్మరాజు కలలో నీశుడు చెప్పుట అంత ధర్మజుడు తమ్ములతో నాలోచించి తన మూలముగ ప్రజాక్షయమగునని శివుడు చెప్పెను గనుక అరణ్యమునకు పోయెదనని పల్కగా అర్జునుడు పోవుట కంగీకరింపక, అన్నను రాజ్యపాలన చేయవలసినదిగ ప్రార్థించెను.

అంతియగాక శాంతముగ, ధర్మవర్తనుడై రాజ్యమనుభవించునట్లు తమ్ము
లందఱు ప్రార్థించిరి. అపుడే ధర్మరాజు తమ్ములతో పదుమూడు
లైన ఒడంబడికలు చేసికొనెను. అవి యేవనగా పదునాల్గు సంవత్సర
పర్యంతము ఎవ్వరేమి చెప్పినను తాను చేసెదననియు, మానాభిమాన
వదలి వర్తింతుననియు అనగా భార్యను సభలో అవమానించినను
కుందుననియు మొదలగు ప్రతిజ్ఞలు చేసెను. అప్పుడే తమ్ములం
ధర్మరాజు అడుగుజాడలలో పదునాలుగేండ్లు నడచుటకు ప్రతినచేసిరి

ఇట్టి ప్రతినలన్నియు జరిగిన తర్వాతనే కౌరవ పాండవుల జూ
ఓడిపోవుట జరిగినది. ధర్మరాజు తాను ఓడిపోవుట గూడ ధర్మ
బద్ధుడనై యని చెప్పి మిన్నకుండెను. సభలో న్యాయా న్యాయ
ధర్మరాజే చెప్పవలయునని భీష్ముడంతటివాడు పల్కెను. అంతియ
ధర్మరాజు శాంతికి ముగ్ధుడై పరశురాముడు అరణ్యపర్వమునకై వా
చేసెను. భీముడు, ధర్మరాజు జూదమాడి ఓడినందకు ఆతని చే
తగులబెట్టెదనని పల్కగా అర్జునుడు తాము చేసిన ప్రతినలగూర్చి
రించి, ఆతని కోపమునుండి విరమింప చేసెను. ఇట్టియెడ గూడ
రాజు చలింపక మిన్నకుండుట జూడ నాతని శాంతగుణ మెట్టిది
వ్యక్తమగుచున్నది.

# 17

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

అను ప్రార్థనతో భారతపఠనము ప్రారంభింపవలయును. క్రిందటి ప్రకరణమున ద్రౌపది రజస్వలా వేషముతో సభకు వచ్చినదని భారతకథను చెప్పియుంటిని అట్లు వచ్చిన ద్రౌపది వలువలూడ్చుమని దుర్యోధనుడు ప్రాతిగామిని పురికొల్పెను. కాని ప్రాతిగామి సందేహించుచుండగా దుశ్శాసనుడు ఆ పనిని నిర్వర్తింప నాయెను. అట్టియెడ ధర్మరాజు సత్యమునకు బద్ధుడై మిన్నకుండెను. పరశురాముని యంతటివాడు వచ్చుటయే మానుకొనినాడు. కురువృద్ధులందరు లోలోన కుందిరేగాని పైకి మాటాడక ఘోరకృత్యమును గాంచుచుండిరి. అయ్యెడ ద్రౌపది మాత్రము తన అభిమాన సంరక్షణకై శ్రీకృష్ణ పరమాత్మను— హా నాథ! హా రమానాథ! వ్రజనాథార్తినాశన! కౌరవార్ణవమగ్నాం మాం ఉద్ధరస్వ జనార్దన - అని ప్రార్థించినది. కాని ద్రౌపది ప్రార్థించిన సమయమున కృష్ణుడు సౌంభకాసురునితో పోరుచుండెను. ఆ యుద్ధమున నా రాక్షసుడు మాయా వసుదేవుని సృష్టించి కృష్ణుడు చూచుచుండగ ఆతని తండ్రిని సంహరించుచున్నట్లు నటించెను. మరియు కృష్ణుని చేతనయినచో తండ్రిని రక్షించుకొనుమని సవాలుకూడ చేసెను. అంతియగాక ఆ మాయావసుదేవుడు చేతగాని కొడుకును కంటిననియు విలపించు చుండెను. అపుడా సౌంభకాసురుడు మాయావసుదేవుని రక్తము చిందునట్లు కత్తివ్రేటు వేసెను. ఆ రక్తము చూచి భగవంతుడగు కృష్ణునకు మానుషభావము వచ్చి

మూర్ఛ నొందుచుండెను. ఆ సమయమున ద్రౌపది మొరవిని, మూర్ఛ పోకుండనే ప్రపంచమున ఆపన్ను లెవరని తాను దివ్యదృష్టితో పరికించెను. మరియు ప్రస్తుతమగు ద్రౌపది వస్త్రములు అక్షయమగునట్లు వరమిచ్చెను. ఉగ్రసేనుని సభలో చెక్కుచెదరకున్న తన తండ్రిని జూచి రక్కసు జంపెను. అంత దుశ్శాసనుదు వలువలూడ్వజాలక అలసి యూరకుండెను.

పాండవుల కపుడు కొంచెము ప్రాణము వచ్చినట్లు అయినది. ధృతరాష్ట్ర గాంధారులు మాటాడక మిన్నకుండిరి. అయ్యవసరమున అంతఃపురదాసీలు వచ్చి దుర్యోధనుని శయ్యాగారము తగులబడుట, అంతఃపురమున నక్కలు కూయుట మొదలుగాగల దుర్నిమిత్తముల నెల్ల నెఱింగించిరి. అందులకు ధర్మాత్ములగు పాండవులకు పతివ్రతయగు ద్రౌపదికి పరాభవము చేయుటవలన నేమి యగునోయని ధృతరాష్ట్రుడు భయభ్రాంతుడై కోడలిని దగ్గరకు పిలిచి - నీవు మహాసాధ్వివి. నీకు జరిగిన పరాభవమునకు మమ్ము క్షమించుము. మరియు నేదేని వరము కోరుకొనుము - అని చెప్పెను. ద్రౌపది అందుల కియ్యకొని మొదటి వరముగా ధర్మరాజు వారికి దాసుడు కాకుండ శస్త్రాస్త్రములతో సర్వ తంత్ర స్వతంత్రుడై యుండునట్లు కోరినది. అందులకు కారణము ధర్మ రాజును దాసత్వమునుండి విముక్తి నొందించుటకు మరియు ధర్మరాజు యొక్క కుమారుని ప్రతివింధ్యుని యువరాజని ప్రజలనుటచే జీతగాని కొడుకు అని ప్రజలనకుండుటకు అట్టి వరము కోరితి ననెను. యాదవ పాంచాలాదులు యువరాజని వాని గౌరవించు భాగ్యమంతరింపకుండుటకు అట్లు కోరినది. ఇక రెండవవరము కోరుకొమ్మనెను. దానికి ద్రౌపది పాండవులందఱు స్వేచ్ఛాచారులై వారి వారి ఆయుధములతో కౌరవులకు దాసులు కాకుండ అలరారుట. పిమ్మట నాతడు మూడవవరము కోరు కొమ్మనెను. కాని ద్రౌపది, రాజకాంత మూడవది కోరరాదని మిన్నకుండి నది. ద్రౌపదియొక్క ధర్మప్రవర్తనకు మిక్కిలి చకితుడై ధృతరాష్ట్ర

డిల్లడిగెను. ఒకే వరముగా అడుగవలసిన విషయమును రెండుగ అడిగి తివే కాని మూడవ వరము అడుగని దానవు రెండు వరములలో రాజ్య విషయ మెత్తవేతి వేల? అని ద్రౌపది నడిగెను. అందులకామె సమాధాన ముగ - పాండవాశ్శస్త్రసంపన్నాస్స్వాని భాగ్యాని భుంజతే - అని పాండవులు వారి బలపరాక్రమములతో స్వతంత్రముగా నున్న వారి భాగ్యముల ననుభవింపగలరని, ఆడుది సంపాదించి పెట్టు రాజ్యమేలువారు కారని ధీరస్వాంతయై పల్కినది. అపుడు ధర్మరాజు లేచి ధృతరాష్ట్రునకు నమస్కరించి - అన్నిటికి నీవే పెద్దవాడవున్నావు. మమ్మిక నేమి సేయుమని యెదవని ప్రశ్నించెను. అందులకు ధృతరాష్ట్రుడు కొడుకుల తప్పులు క్షమించుమనియు, కొడుకులను కనిపెట్టి చూడుమని అర్థించెను. పాండవులను ఇంద్రప్రస్థమున నుండి మీ రాజ్యము మీరు చేసికొనుడని చెప్పెను. దానికి సమ్మతించి తమ రాజ్యముతో తాము పాండవులు ఇంద్రప్రస్థమున కరిగిరి. ధృతరాష్ట్రుడు చేసిన ఈ పనికి దుర్యోధనుడు తండ్రిని అనేక విధముల నిందించి మరల వారిని జూదమునకు పిలుపించుమని ప్రేరేపించెను.

ఈసారి రాజ్యసంబంధము లేకుండ, ఓడినవారు పన్నెండేండ్లు అరణ్యవాసము, ఒకయేడజ్ఞాతవాసము చేయునట్లు నిర్ణయించుకొనిరి. ఈ విధముగనైన దుర్యోధనుడు కొంతకాలము రాజ్యమనుభవించవచ్చు నని అభిప్రాయపడెను. మరల జూదమునందు శకుని కనుకట్టు విద్యచే కౌరవులే గెల్చిరి. పాండవులే ఓటమినొంది అడవుల పాలైరి. ధర్మజుడు వారికి సంబంధములేని రాజ్యము వారికయుంచి తానరణ్యమున కేగెను. పాండవులు అరణ్యమునకు పోవునపుడు వారితో లక్షయేబదివేల బ్రాహ్మణులు, ఇరువదినాల్గువేల రథములు, ఐదువందల మంది దాసీలు కూడ వెళ్ళిరి. మరియు పరాభవమప్పుడు సభలో కర్ణుడు ద్రౌపదిని—

కం. లేరిచట మగలు నీకును
పేరలు జూదమున నోడి విడిచిరి నిన్నన్
వారిజలోచన! నీపై
కూరిమిగల మగని వెదకికొను మొరునపడే!!

ఇట్లు ఆక్షేపించెను. దానికి దుర్యోధనుడు తనతొడ జూపెను. భీము డీ మాటవిని యుద్ధమున దుర్యోధనుని - చండగదాభిఘాత భగ్నో రుతరోరుజేయుదునని - పల్కెను. ఈ ప్రతిజ్ఞను అందఱు వినియు యున్న కుండిరి. ఉగ్రరణాంతరమున గదతో రొడగొట్టుట ధర్మము కాదని ఎవ రైనా అనిరా? మరియు దుశ్శాసనుని రక్తము త్రావెదననియు పల్కెను. ధర్మజాదులు అరణ్యవాసమునకు పోవునప్పుడొక్కరు ఒక్కొక్క విధ ముగ పోయిరి. ధర్మజుడు ధర్మాత్ముడు గనుక దీనమగు తనమొగము చూచినవారు నష్టులగుదురేమో యని ముఖము వస్త్రముచే కప్పుకొని పోయెను.

భీముడు కౌరవుల యుద్ధమున చంపెదనన్నట్లు భుజబలము ప్రవ ర్శించుచు పోయెను. అర్జునుడు యుద్ధమున బాణవర్షము నింతకన్న తఱుచుగా కురిపించెదనన్నట్లు ఇసుక చల్లుకొనుచు పోయెను. నకులుడు అందగాడగుటచే తననెవ్వరు చూడరాదని దుమ్ము పూసికొని పోయెను. ఇట్లే సహదేవుడు తలవంచుకొని పోయెను. ద్రౌపది జుట్టువిరియబోసికొని కౌరవకాంతలును ఇట్లు పోవలయునని సూచించుచు నేడ్చుచు పోయెను. ధౌమ్యుడు రౌద్రయామ్యసామగానము చేయుచు పోయెను. అది పదుమూడు సంవత్సరముల తర్వాత ఈ మంత్రముల దుర్యోధనాదుల కర్మాంతరము లకు ఉపయోగింతునని భావము. ఇట్లు పాండవులందఱు అరణ్యవాసము నకు పోవుచు భావికార్యమును సూచించుచు పోయిరి. కృష్ణుడు కూడ పాండవులు అడవులకు పోయినగాని తన పనిగాదని యూరకుండెను.

ఏలన పాండవులు అరణ్యవాసము చేయుచు ఆయుధసంపాదనము చేయ వలసియున్నది అని కృష్ణుని మెత్తుగడ. కావున రామాయణమునందలి రామునివలె పాండవులను పదునాలుగేండ్లు అరణ్యముల పాలై ఆయుధ ముల నార్జించిరి. పాండవులకు తీర్థయాత్రలు చేయించుమని ఇంద్రుదు లోమశుని కూడ పంపెను. పాండవులు లోమశుని సాయమున తీర్థయా త్రలు చేయుచుండగా అంతర్వేది దగ్గర సముద్రమున నొక వేదిక కన్పించినది. లోమశుడా వేదికను జూచి ధర్మరాజును దానిపై కూర్చుండు మని నిర్దేశించెను. అట్లేయని ధర్మరాజు దానిపై అధిష్ఠింపగనే సమాధి గతుడై వాలఖిల్యాదుల వేదగానమును వినుచుండెను. ఈ సంగతి లోమశు నకు తెలియజేయగా ఆతడెంతయో ధర్మజుని కొనియాడెను. కారణము అది ధర్మవేదిక. ఇతరు లెవ్వరెక్కినను అది నీట మునిగిపోవును.

రాజసూయసందర్భమున ధర్మజునకు తమ్ములందఱును దిక్కుల జయించి ధనకనకవస్తువాహనాదుల తెచ్చి అర్పించిరి. వీరిలో సహదేవు డనువాడు దక్షిణ దిగ్విజయమునకై పోయెను. అచట నీలుడను రాజుతో ఖండన మొనర్చుచుండెను. అయ్యెడ సహదేవసైన్యము అగ్నికాహుతి కాబోయినది. అపుడు సహదేవుడు అగ్నిసూక్తము జపించి అగ్నిదేవుని శాంతింపచేసెను. అట్టియెడ అగ్నిదేవుడు నీలునితో సహదేవుని సైన్య మును దహింపజాలనని చెప్పగా నీలుడు చేయునదిలేక సహదేవునితో రాజీ కుదుర్చుకొనెను. ఇట్లే మైంద ద్వివిదుల గెల్చి సహదేవుడు ధనరాసుల దెచ్చి అర్పించెను. మఱియు సముద్రపుటొడ్డుచేరి లంకకు ఘటోత్కచుని ద్వారమున తనసంగతి చెప్పిపంపెను. ఈ సంగతి వినగనె విభీషణుడు ఐదువందలమంది జనముతో బంగారము, రత్నరాసులను కానుకగా పంపెను. ఇట్లే నకులుడు హూణాదులచే పన్నుకట్టించెను. అర్జునుడు గంధర్వులచే పన్నుకట్టించెను. ఈ విధముగ రాజులందఱును ధర్మజునకు వశమైరి. రాజసూయము దిగ్విజయముగ నెరవేరనున్నది. కాని జరా

సంధుడు అను చక్రవర్తిని గెల్చినగాని రాజసూయము చేయుటకు వీలు లేకున్నది. జరాసంధుడు అజేయపరాక్రముడు. వానికి హంసడిభకులు సేనాపతులు. ఆయుధములతో చావని వరముకలవారు. ఇట్టి హంసడిభకులకు తమ తండ్రిచే రాజసూయము చేయించవలయునని కోరికపుట్టినది. వారు తమచక్రవర్తియగు జరాసంధుని రాజసూయమునకు ఒప్పించిరే కాని వారికి కృష్ణునిగూర్చి సందేహముపచ్చినది. అందులకు వారు వెనుకాడక జనార్దనుడను బ్రాహ్మణుని పిలిచి కృష్ణుని రాజసూయమునకు రమ్మని, వచ్చునపుడు కొంత యుప్పు తెమ్మని చెప్పిపంపిరి. జనార్దనుడు భక్తుడగుటచే అందులకు లోలోన కుంది చేయునదిలేక పోయి చెప్పెను. ఆ మాటలకు కృష్ణుడు ఆగ్రహోదగ్రుడై సాత్యకితో తాము తలపెట్టిన రాజసూయముగూర్చి చెప్పుమనియు కాబట్టి తాను రాననియు కబురుపంపెను.

ఇక సాత్యకి పోయి వారితో మిమ్ముచంపి కృష్ణుడు రాజసూయము చేయనున్నాడని పల్కగనే వారు తమ ఉప్పుసంగతి నడిగిరి. అందులకాతడు సమాధానముగ—యాదవు లుప్పుమోసిన మురారికి సోలలుమోయ కింక పోవచ్చునె – అని పరిహసించి యుద్ధములో మీ యొడళులకైన గాయముల పూడ్చుటకుగా యాదవులు నూరినఉప్పు తెచ్చెదరని కోపముగ బల్కెను. అందులకు వారు కృద్ధులై సాత్యకిని పట్టుకొనబోగా తప్పించుకొనిపోయి కృష్ణున కున్నసంగతి నెఱింగించెను. పిమ్మట జరాసంధునకు కృష్ణాదులకు యుద్ధముజరిగినది. హంసడిభకులు ఆయుధములతో చావనివారగుటచే వారి చావునకు కృష్ణుడొక యెత్తుగడ నెత్తెను. డిభకుని దగ్గరకు వారి స్నేహితునొకని పంపి హంసుడు యుద్ధమున చచ్చినట్టు వార్త పెట్టెను. ఆమాట విని డిభకుడు చనిపోయెను. వానిని సముద్రమున బడద్రోచి, సముద్రమున బడిచచ్చెనని హంసునకు వార్త చెప్పగా వాడును అందుబడి మరణించెను. ఇట్లు కృష్ణుడు తన మాయోపాయముచే హంసడిభకుల ముందు పరిమార్చెను. ఇక మిగిలినది జరాసంధుడు. శ్రీకృష్ణుడు

భీమార్జునులను తీసికొని బ్రాహ్మణవేషధారులై జరాసంధుని నగరమున ప్రవేశించి రాజప్రాసాదమున దొడ్డిదారిగుండ ప్రవేశించిరి. జరాసంధుడు వారు అతిథులని భావించి అర్ఘ్యపాద్యాదు లొసంగి సత్కరించెను. పిమ్మట వారు శత్రువులని భావించి, భీమునితో మల్లయుద్ధమునకు కడంగి వానిచే నిహతుడయ్యెను. ఆ ఉదయముననే జరాసంధుడు తన కుమారుడగు సహ దేవునికి పట్టముకట్టియుండెను. కనుక కృష్ణుడు నీ తండ్రిచేసిన పట్టాభి షేకము చెల్లదని భీమార్జునుల గలుపుకొని వాని నభిషేకించెను. అంతనాతడు కృష్ణభీమార్జునులకు పన్నుకట్టి స్వాధీనమయ్యెను. ఇపుడు ధర్మరాజు యొక్క రాజసూయమునకు అడ్డువచ్చువా రెవ్వరు లేరు. నిర్విఘ్నముగ సాగిపోయినది.

కుంతి సంతానప్రాప్తి చూచిన ఆమె పతివ్రతయేనా? అను ప్రశ్నము కొందఱకు పొడముచుండును. సామాన్యముగ నేస్త్రీకైనను సంతానము లేకున్నచో దేవరన్యాయముతో సంతానము మునుపటికాలమున పొందవచ్చును. అట్లు స్త్రీ ధర్మసంతానము పొందగోరినప్పుడు విరూప ముతో పురుషుని పొందవలయును. మరియు నా పురుషుడు ఒక్కసారి మాత్రమే స్త్రీయందు వీర్యమునుంచిన మాత్రమున సంతానమిచ్చు శక్తిగల వాడుగ నుండవలెను. కాని మాటిమాటికి సంతానము కలిగినదాక వారికి సంసారబంధము ఉండరాదు. కలియుగమున నిట్టి సంప్రదాయములు, శక్తులు, తగ్గిపోయినవి. కాబట్టి సంతానహీనులు దత్తత చేసికొనవల యును, అని శాస్త్రములు విధించుచున్నవి. అస్యాం జాయేత పుత్ర పుత్ర స్సమే పుత్రో భవిష్యతి — అని కన్యాదాన సమయమున మంత్రముపఠించి నచో పుత్రికా పుత్రుడు వంశకర్త కాగలడు. అట్లు కాకున్న ఆ బిడ్డ దౌహి త్రుడే యగును. ప్రస్తుతము పాండురాజునకు క్షేత్రజ సంతానము కావలసి యున్నది. ఏలయన అడవియందు పాండురాజు వేటాడుచుండగ ముని దంపతులు మృగములై విహరించుచుండిరి.

ఈ రహస్యమెఱుగని పాండురాజు బాణముతోకొట్టగా అందు మగ జింక చనిపోయినది. అంత ఆతని భార్యయగు ఆడుజింక—వేటన్యాయము తప్పి క్రీడించు మమ్ము బాణముతో కొట్టితివి గాన, నీవును భార్యనంటినచో నీతల శతధా భిన్నమగునని—పాండురాజును శపించినది. ఈ కారణముచే నాతడు భార్యల తాకరాదు. ఇట్టి శాపోపహతుడైన పాండురాజు తిరిగి నివాసమునకు వచ్చి అందఱను ఇంటికి పొమ్మనియు, తాను తపస్సు చేసి కొనెదననియు పల్కెను. ఈ మాటలకు కుంతియు పాండురాజుతోతపస్సు చేసి తరించెదనని పల్కినది. మాద్రియు నామెతోపాటైనది. ఇక తప్ప దని పాండురాజు తన భార్యలతో కలసి తపస్సు ప్రారంభించెను. రాజ్యము వానిపేరనే విదురాదులు నిర్వర్తించుచున్నారు. ఆతని తపస్సు గట్టిపడి - ఆకాశగమనమున బ్రహ్మలోకమునకు పోవుటకు సంతన కట్టునంతటి మహత్తు కలదియైయున్నది. ఒకప్పుడు బ్రహ్మలోకమునకేగు మునులతో, ఇరువురు రాణులతో అట్లుపోవుచు శతశృంగ పర్వతమువరకు ప్రయాణముసాగించెను. తదుపరి గమనశక్తి తగ్గుచున్నట్లు తోచెను. అందులకు కారణమేమని యడుగ అపుత్రకుడు బ్రహ్మలోకమునకు పోలేడని ఋషులు చెప్పిరి. అపుడు పాండురాజు చింతాక్రాంతుడుకాగా ఋషులు ఆతనిని నీకు దివ్యమగు క్షేత్రజసంతానము కలుగగలదు. దాని ప్రయత్నము చేసికొను మని వచించిరి. పాండురాజు భార్యతో నాలోచింప అయ్యెడ కుంతి పాండుని మరణానంతరము సన్నిహితుడవై తపశ్శక్తితో సంతానమిమ్మని కోరినది. కాని పాండురాజు సంతాన మిప్పుడే కావలయునని కోరగ ఆమె తన చిన్నతనమున దుర్వాసుడిచ్చిన మంత్రప్రభావమునుగూర్చి చెప్పినది. అపుడు పాండురాజు నాజ్ఞచే కుంతి ధర్మజ భీమార్జునుల ఇంద్రతేజుల యమవాయు ఇంద్రులవలన కనినది. నకుల సహదేవులు మాద్రి అశ్వినుల వలన కన్న అమరసంతానము.

ఇచట ముగ్గురకంటె నెక్కువగ కుంతి సంతానము కోరలేదు,

ఏలయన దేవరన్యాయముతో సంతానమునొందు స్త్రీ ముగ్గురకంటె నెక్కువ పొందినచో ఆ స్త్రీ పాతివ్రత్యము భంగమగునని వలదని పల్కినది. కాని తన సవతియగు మాద్రికి సంతానములేకున్న బాగుండదని, మరియు నామె పోరుపడజాలక ఆమెకును సంతాన మివ్వవలసి వచ్చినది. ఇయ్యెడ కుంతి తంత్రము గమనింపవలసి యున్నది. ఆమెకు మంత్రోపదేశము చేసినచో తనకంటె నెక్కువమంది పుత్రులను గనునేమో యని భావించినది. అందుల కామె తానె మంత్రోచ్చారణము చేయుదుననియు, ఏదేని దేవతను మనస్సున ధ్యానించుమనియు, మాద్రికి సలహా నిచ్చినది. అ మాద్రియు కొంచెము తెలివికలది యగుటచే నొక్కసారి యిద్దఱు దేవతల ధ్యానించినది. కాబట్టియే ఆమెకు నకుల సహదేవులు ఇద్దఱు జన్మించిరి. పిమ్మట నొకనాడు మాద్రి సర్వాంగసుందరముగ నలంకరించుకొని యుండగా నామెనుజూచిన పాండురాజు మన్మథపీడితుడై సంగతుడయ్యెను. మరు క్షణముననే ఆతడు శాపవశమున మరణించెను. మాద్రియు తన కారణమున భర్త మరణించెనని సహగమనముచేసినది. కుంతిమాత్రము ఋషులు పిల్లల పోషింపకుండ నీకది కూడదని నివారించుటచే జీవించి యుండినది.

# 18

పాండవులను సుహృద్ద్యూతమని పిలిచి దుర్ద్యూతమాడి కౌరవులు ఓడించి వెడలనడచిరి. పాండవు లరణ్యవాసమునకు పోవునపుడు చాల మంది బ్రాహ్మణులు వారిని వెంబడించిరి. ధర్మరాజు వారిని వలదన్నచో శాపమిచ్చెదమని పల్కగా భయపడి ధర్మజుడు ఊరకుండెను. ఆ బ్రాహ్మణులందఱు తమ ఆహారమును తామె సంపాదించుకొని ధర్మజునకు జయము చేకూరునట్లు దీవించెదమని వెన్నంటివచ్చిరి. కాని ధర్మరాజు మాత్రము తన కారణముగ వచ్చిన బ్రాహ్మణుల కాహారమెట్లని చింతిల్లు చుండెను. వెళ్ళినరోజు ఉపవాసముండి గంగలో కంఠదఘ్నముగ నీట నిల్చి బ్రాహ్మణుల తిండికై బిట్టు విలపించెను. పిమ్మట ధౌమ్యుని సలహా ననుసరించి సూర్యోపాసన చేసి సూర్యానుగ్రహముచే అక్షయపాత్రను వర ముగ నొందెను. ఆ పాత్రమూలమున ద్రౌపది అతిథులకు, అభ్యాగతులకు బ్రాహ్మణులకు, తన భర్తలకు, ఆహారమును సయర్పించి, తాను భుజించి పాత్రము పరిశుభ్రముచేసిన నిక నానాటికి అందు ఆహార ముత్పత్తి కాదు ధర్మరాజు ఇట్లు యజ్ఞయాగాదులుచేయుచు నిరతాన్నదానశీలుడై పన్నెండేండ్లు కాలము గడపెను. రాక్షసు లెందరో మాయోపాయములతో పూర్వవైరముల సాధింపదలపడిరి. కాని పాండవులు దుష్టశిక్షణకే అవత రించుటచేసి రాక్షసుల చాలమందిని చంపుచుండిరి. ఇట్లు కొంతకాలము గడువగా శ్రీకృష్ణుడు, సాత్యకి, బలరాముడు వీరిని జూచుటకు వచ్చిరి. కృష్ణుడును పాండవుల శాంతగుణమును జూచి కౌరవులపై మిక్కిలికోపిం చెను. ధర్మరాజు మాత్రము కౌరవులను జంపరాదని పల్కుచు వారి చేతులు పట్టుకొనెను. అంతియగాక పదమూడేండ్ల తర్వాత తామే యుద్ధ

మున కౌరవుల నిహతుల గావించెదమని పల్కెను. కాని ద్రౌపదికి జరిగిన పరాభవము మాత్రము సహింపరానిదై సమస్త రాజలోకమునకు తల వంపులుగ నుండెను. దుష్ట చతుష్టయము బలమును జూచుకొని దుర్యో ధనుడు కుడిచి కూర్చుండజాలక పాండవ పరాభవమునకు తలపెట్టెను.

కాని యిందులకు ప్రత్యక్షముగ ధృతరాష్ట్రి భీష్మాదులు ఒప్పు కొనరు. కావున కర్ణశకునుల సాయముచే ఘోషయాత్ర నెపమున పాండ వులున్న అరణ్యప్రాంతమునకు సమస్త పరివారముతో, భార్యాసహి తుడై విలాసముగ దుర్యోధనుడు పోవ బయలుదేరెను. కాని ధృత రాష్ట్రుడు ఘోషయాత్రకే వలదని వారించెను. ఎట్టకేలకు అంగీకరించెను. పాండవుల పరిహసించుటకు కౌరవులు వచ్చిరని తెలిసిన దేవేంద్రుడు చిత్రరథుడను గంధర్వరాజును బంపి దుర్యోధనుని బంధించి తెమ్మని పంపెను. అంత నా గంధర్వరాజు దుర్యోధనుని సైన్యసహితముగ యుద్ధ మున నోడించి, కర్ణుని రథము విరుగగొట్టెను. తరువాత చిత్రరథుడు దుర్యోధనుని బంధుమిత్ర పరివార సమేతముగ ఖైదీలచేసి కట్టికొని పోవు చుండెను. ఇక చేయునదిలేక మిగిలిన సైన్యము ధర్మరాజును సమీపించి నీ యనుజభ్రాతము గావవే కరుణ నిండారంగ రాజోత్తమా! అని ప్రార్థించిరి. కాని భీముడు మాత్రము తమ శత్రువులైన కౌరవులకు పరా భవము జరుగుచున్నదని సంతసించి-బాగలపని గంధర్వులే తీర్చుచున్నా రని గంభీరముగ పల్కెను. అంత ధర్మరాజు భీముని శాంతింపచేసి దుర్యో ధనాదుల విడిపింప నాజ్ఞాపించెను. ధర్మరాజ ప్పుడు సద్యస్కందమను యజ్ఞము చేయుచుండుటవలన తాను పోవుటకు వీలులేదనియెను. ధర్మ రాజు శాసనము ననుసరించి భీమార్జున నకుల సహదేవులు గంధర్వులతో పోరుటకై పోయిరి.

అర్జునుడు చిత్రరథుని దుర్యోధనాదుల విడుపుమని కోరెను. కాని

లాభము లేకపోవుటచే వారి దారిని బాణములచే నడ్డగించెను. అపుడు చిత్రరథుడు అర్జునునికి ఇంద్రుని పంపున తాము వచ్చుట నెఱింగించి, అర్జునుని యిష్టానుసారము దుర్యోధనుని ధర్మరాజుకడకు కొంపోయెను. అపుడు ధర్మరాజు వాని బంధముల తొలగించి పొమ్మని చెప్పెను. కాని దుర్యోధనుడు ధర్మరాజుచే రక్షింపబడినందులకు చింతిల్లి ప్రాయోపవేశము నకు పూనుకొన నిశ్చయించెను. ఇంతలో కర్ణుడు వచ్చి దుర్యోధనుడు గెలిచివచ్చెనని భావించి పొగడుచుండెను. అందులకు దుర్యోధను డింకను విచారగ్రస్తుడై యుద్ధమున తానుపొందిన పరాభవమును గూర్చి కర్ణునకు చెప్పుచు-కం॥ పుడమి విపరంబు లేదే। అడగెద నన్నట్టిదయ్యె నప్పుడు కర్ణా। అని విలపించెను. ప్రాయోపవేశ సమయమున కర్ణుడు, శకుని యెంతయో చెప్పి చూచిరి కాని లాభము లేకపోయినది. అపుడు పాతాళ వాసులైన రాక్షసులు తమ అంశావతారుడైన దుర్యోధనుడు నశింపరాదని భావించి, ఒక హోమమును గావించిరి. అందు కృత్య యను రాక్షసి జన్మించి, దుర్యోధనుని పాతాళమునకు తెచ్చిపెట్టినది. అంత రాక్షసులు యుద్ధమున భీష్మాదులు రాక్షసావేశ పూరితులై పాండవుల నిహతుల గావించెదరనియు, తప్పక జయము చేకూరగలదనియు పల్కిరి, ఈ మాటలు వినిన దుర్యోధనుడు సంతసించి కర్ణుని ప్రతినకు ఉత్సాహ పూరితుడై ప్రాయోపవేశమును విరమించి గృహగమనోన్ముఖు డయ్యెను. కాని దుర్యోధనుని పరాభవము సంగతి ఉదయమే ఊరంతయు ప్రాకినది. మొట్టమొదట దుర్యోధనుడు రాజధానియందు అడుగుపెట్టగనె భీష్ముడు జరిగిన సంగతిని గూర్చి ప్రశ్నించెను. జరిగిన సంగతి నెరింగినవాడై పాండవుల మంచితనమును వేనోళ్ళ పొగడెను.

అరణ్యవాసము పదుమూడునెలలు గడచిన పిమ్మట ద్రౌపది ఆవేశ పూరితురాలై కౌరవులను జంపుమని భర్తల కోరినది. కాని ధర్మరాజు తేనెపూసిన కత్తివంటివాడు. కావుననే సమయభంగ మొనర్పరాదనియు,

పదుమూడేండ్లకు పిమ్మటనే కౌరవుల యుద్ధమున చంపవలయుననియు చెప్పెను. మొత్తముమీద ధర్మరాజు అసత్యదోషమునకు పాల్పడలేదు. ద్రౌపది మాత్రము తాను చెప్పినమాట అసత్యదోషపూరితము కానేరదనియు, ఒక సంవత్సరమునకు ఒకనెల ప్రతిప్రసవము చాలుననియు కాబట్టి సమంజసమే యని పల్కినది. ధర్మరాజు అపుడు కౌరవుల చంపుటకు నెలలక్కరలేదనియు, పదుమూడు ఘడియలే చాలుననియు ధీరముగ పల్కెను. అందులకు ద్రౌపది కాలవిలంబన మోర్వలేనిదై ఆవేశముతో దైవమును దూషించెను. అందులకు ధర్మరాజు దైవనింద చేసిన భార్యను లెక్కసేయక-మేము ధర్మమున నడచుచుండియు నిన్నిపాట్లల పడవలసి వచ్చెనా? అని ఎప్పుడు విమర్శించుచుండియు కారణము కనుగొనలేకపోయితిని. ఇప్పుడు విస్పష్టమైనది. ధర్మదూషణ, దైవదూషణము చేయు భార్యవు దొరకుటవలన మా ధర్మమంతయు నిష్ఫలమైపోయినది అని యెత్తిపొడుపుగమాటాడెను. అపుడు ద్రౌపది భర్తచుట్టు ప్రదక్షిణించి క్షమాభిక్ష నర్థించినది. ధర్మరాజు ద్రౌపదిని పశ్చాత్తప్తవై పొరబాటున పల్కితినంటివి. అది యిదియే మొదటి తప్పిదమగుటచే క్షమించితి ననెను. ఆ సమయమున వ్యాసుడు వచ్చి ధర్మరాజును బొగడి శైవయోగముతో పాశుపతాస్త్రము సంపాదింపుమని చెప్పిపోయెను. పిమ్మట ధర్మరాజు నాజ్ఞచే అర్జును డందులకు పూనుకొని తపస్సు నారంభించెను.

ఇట్లు అర్జునుడు సంసిద్ధుడగుట కొక కారణమున్నది. ధర్మరాజు రక్తము చూచువరకే శాంతచిత్తుడు కాని, రక్తము కంటబడినచో వీరవిహారము చేయగలవాడు. కాని అర్జునుడు అస్త్రప్రయోగమునందు శాంత స్వభావము, విమర్శము కలవాడగుటచే అతడే ఆయుధ సంపాదనమున కర్హుడని వ్యాసుడు చెప్పిపోయెను. అర్జునుని తపస్సమయమున ఇంద్రుడు పరీక్షింపనెంచి అప్సరసల నంపెను. వారి అల్లరికి అర్జునుడు అటు ఇటు కదలలేదు. అందులకు వారి అశక్తతను ఇంద్రునితో చెప్పగా ఇంద్రుడు

అర్జునుని తపశ్శక్తికి మెచ్చి వచ్చి శైవయోగము చెప్పిపోయెను. శైవ యోగముతో శివోపాసన ప్రారంభమైనది. శివుని మాయవలన అర్జునుని అక్షయతూణీరములు, బాణములు పట్టిపోయినవి. అపుడు అర్జునుడు గాండీవముతో శివుని నెత్తిపై మొత్తగా అదియు శివుడు మాయముచేసెను. అపుడు అర్జునుడు శివునితో కలియబడి పిడికిలితో నెత్తిన మొత్తగా మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యెను. పాశుపతమిచ్చి, మంత్రోపదేశము చేసిపోయెను. ఇంద్రుడు అర్జునుని బలపరాక్రమమునకు మెచ్చి, ఆహ్వానించి అర్ధసింహాసనముపై కూర్చుండబెట్టుకొనెను. తనవద్దనున్న విశేషాయుధముల నిచ్చి వేల్పులందఱచేత సర్వాస్త్రము లిప్పించెను. అర్జునుడు దేవలోకమునందున్నప్పుడే ఊర్వశి ఇంద్రునాజ్ఞతో ఆతనిపై కోరికతోవచ్చి నిరాశయై అర్జునుని నపుంసకుడవగుమని శపించినది. అందులకు ఇంద్రుడు ఆతనిని నీ ఇంద్రియజయము కీర్తనీయము తండ్రీ-అని పొగడి, ఈ శాపము అజ్ఞాతవాసము సంవత్సరము మాత్రము అనుభవించిన తీరునని శాపవిమోచనమును ప్రసాదించెను. మరియు దేవతలకోరికపై నివాతకవచులను కాలకేయులను రాక్షసులను విజయుడు సంహరించెను.

ఇట్లు దేవలోకమున ఐదురోజులుండి (భూమిపై ఐదేండ్లు) సంగీతాది విద్యలన్నియు విజయుడు గడించెను. తిరిగి వచ్చిన పిమ్మట ధర్మరాజు అస్త్రముల ప్రదర్శింపుమని యడుగ అర్జునుడు అన్నగారికి ప్రయోగోప సంహారములు జూప, నారదుడు అస్త్రప్రయోగము ఎదురు శాత్రవులు లేకుండ కూడదని చెప్పెను. ధర్మరాజునకు ఈలోపల శివునివలన శక్తిఆయుధము లభించినది. ఒకరోజున పాండవులు వేటకు పోగా ద్రౌపది యొంటరిగా నుండగ సైంధవుడామెను కామించెను. ద్రౌపది అందులకు గినిసి తన భర్తలు అగ్నులవంటివారనియు, చిక్కినచో దహింపగలరనియు బెదరించినది. కాని లాభము లేకపోవుటచే వానిచే బలాత్కారముగ రథమెక్కింపబడక తానె రథమెక్కి కూర్చుండి వానిని

అనేకవిధముల నిందించినది. ఈ సమయముననే వేటకు వెళ్ళిన ధర్మ రాజునకు అపశకునములు పొడగట్టుటచే తమ్ములందఱతో తిరిగివచ్చి ద్రౌపదికి జరిగిన పరాభవము తెలిసికొనెను. వెంటనే పాండవులు వాని వెన్నంటి పర్విటుచు ద్రౌపది రథము వెంట కాపలాగా దుష్టుని నిందించుచు పోవుచున్న ధౌమ్యులను ఆపి సైంధవునితో తలపడిరి. అప్పుడు పాండవు లకు వాని సామంతులతో సేనలతో మహాయుద్ధము జరిగినది. చాలమంది నశించిరి. అంత సైంధవుడు భయపడి ద్రౌపదిని దించి తాను రథముపై శరవేగమున బోవుచుండెను. ద్రౌపదిని గైకొని ధర్మజుడు నకులసహదేవు లతో వెనుకకు తిరిగెను. కాని భీమార్జునులంతటితో తృప్తినొందక వాని వెంటనంటిరి. ధర్మరాజు వారితో దుస్సల తలచి వాని నొక్క తప్పునకు గావుడని నుడివెను. సైంధవుడు రథముదిగి పలాయనము చిత్తగించెను. కాని భీమార్జునులు వెన్నంటి వాని పట్టుకొనివచ్చిరి. భీముని గ్రుద్దులకు వానికి పై ప్రాణములు పైన పోవుచుండెను. అర్జును బోధతో వాని చంపుట చాలించి, తల చెక్కలెగయునట్లు గొరిగి, పాండవదాసుడనని చెప్పుకొనునట్లు ఒప్పించి తెచ్చి ధర్మజుని కాళ్ళపై బడవైచిరి. ధర్మ రాజు వాని ఇంద్రియలోలతను, హీనతముడవని నిందించి దయదలచి విడిచిపుచ్చెను.

ఈ పరాభవమును భరింపజాలని సైంధవుడు పాండ[illegible] యుద్ధ మున గెలువపలయునని శక్తికై తపస్సు నారంభించెను. అంత శివుడు ప్రత్యక్షమై ఒకనాటి యుద్ధమున అర్జునుని తప్ప నల్వురిని గెలువగలవని చెప్పెను. ఇట్లు అరణ్యవాసము పన్నెండు వత్సరములు పాండవులు తపము లాచరించి లోకమునగల ఆయుధముల నెల్ల సంపాదించిరి. మునుపే పాండవుల జేయులు. ఈ అరణ్యవాసమున సంపాదించిన అస్త్రశస్త్రాదు లతో లోకైకవీరులై నిర్భయముగ కౌరవుల నెదిరింపనుండిరి. ఇట్లు పన్నెండేండ్లు గడువనున్న చివరిదినముల బ్రాహ్మణుని అరణి నొక

మృగము అపహరించుటచే తదన్వేషణకై వారు బయలుదేఱిరి. మార్గమధ్యమున వారికి దప్పిక యగుటచే జలాశయము కొఱకై చెట్టునెక్కి చూచిరి. అల్లంత దూరమున జలాశయమొండు గన్పట్టుటచే తొలుత సహదేవుడు జలాహరణార్థము పోయెను. కాని అచట నున్న యక్షుని ప్రశ్నలకు సమాధాన మివ్వకుంటచే సహదేవుడు నీరుత్రావి మూర్ఛాగ్రస్తుడయ్యెను. ఇట్లే నకులభీమార్జునులు సమాధానము లివ్వక నీరుత్రాగి గాఢనిద్రలో మునిగిపోయిరి. కాని అర్జునుడు మాత్రము యక్షప్రశ్నలు వచ్చు శబ్దమును బట్టి శబ్దవేది శరప్రయోగమును గావించెను. గాని లాభములేక తానును మూర్ఛనొందెను. ఎంతకు తమ్ములు రాకుంటుట జూచి ధర్మరాజే అచటికి వచ్చెను. తమ్ముల దుస్థితికి చింతిల్లెను. ధర్మరాజును గూడ అశరీరవాణి భీమాదులను వలె ప్రశ్నించెను.

అపుడు ధర్మజుడు అశరీరవాణికి నమస్కరించి ప్రత్యక్షమగుమని ప్రార్థించెను. ఆ యశరీరభూతము యక్షరూపమున నగపడి అడుగ యక్ష ప్రశ్నల కన్నింటికి సమాధానమిచ్చెను. అందులకు సంతసించి యక్షుడు పడియున్న తమ్ములలో నొక్కని బ్రదికించెదను. కోరుకొనుమని చెప్పగా ధర్మాత్ముడగు ధర్మరాజు నకులుని బ్రతికింపుమని ప్రార్థించెను. ఇచ్చట ధర్మజుని ధార్మికదృష్టి, వినయము స్పష్టమగుచున్నది. మాద్రీసుతుని కోరుట ధర్మరాజు కర్మతంత్రమునకే. కుంతి సంతానములో తానున్నాడు. కాబట్టి మాద్రిసంతతిలో నొక్కని బ్రదికింపగోరెను. దానివలన తన సవతి తల్లికి తృప్తియగునని ధర్మరాజు కనపరచిన ఈ దృష్టికి యక్షుడు మిక్కిలి సంతసిల్లి అందఱను బ్రదికించెను. అంత నా యక్షుడు తాను యముడనని చెప్పి తన రూపము జూపి ధర్మరాజు జ్ఞానమును వేనోళ్ళ పొగడెను. అంతియగాక పాండవులు అజ్ఞాతవాస సమయమున నెట్లున్నను నోటితో చెప్పినగాని ఎవ్వరిచే గుర్తింపబడనట్లు వరమిచ్చెను. మరియు బ్రాహ్మణుని అరణి గైకొనితెచ్చిన మృగము తానె యని చెప్పి తిరిగి

యిచ్చిపోయెను. పిమ్మట పాండవులు వారమురోజులలో అరణ్యవాసము ముగించి, అజ్ఞాతవాసమున ప్రవేశించిరి. కాని వారు నాల్గురోజు లరణ్యమున గడుపునపుడు తెలివియున్న కౌరవులకు చిక్కియుండెడి వారని తోచుచున్నది. దైవవంచితుల నెవడుబోధింప గలడు? అయ్యెడ పాండవులు బ్రాహ్మణులను తిరిగి పొమ్మని, ధౌమ్యద్రౌపదులతో రథములపై బయదేఱి విరాటనగరమునకు సమీపమున నాగి, రథములను ద్వారకకు పంపి, దాసజనమును పాంచాలమునకు పంపిరి. ఇక ధౌమ్యునకు తమ అగ్నులనిచ్చి ఇష్టమువచ్చిన దెసకు పొమ్మనిరి. పిమ్మట పాండవులు మత్స్యదేశమునకు పోయిరి. పోవుటకు ముందే ఆయుధముల నన్నింటిని శవముతో బంధించి; అస్త్రదేవతలను ప్రార్థించి వృక్షముపై గట్టిరి. అంత ధర్మరాజు స్నానాదులు నిర్వర్తించి ప్రవాహమునుండియే ధర్మదేవతను ప్రార్థించి వాని వరమున అతడు వెంటనే సన్న్యాసి అయ్యెను. ఇట్లే ధర్మదేవతాదత్తములగు అజ్ఞాతవాసమునకు తగిన వేషములు వహించి విరాటనగరము చేరిరి. ఆనాడు విరాటరాజసభ బహిరంగముగ జరుగుచుండెను. వీరిని చూచి అచటివారు ఆశ్చర్యపడుచుండిరి. సన్న్యాసి వేషధారియగు ధర్మరాజు విరాటుని సభకు నంతనింత దూరమున నుండగనే అతడు వితర్కించి సభతోగూడ లేచి యెదురువోయి నమస్కరించి వానిని దెచ్చి యున్నతాసనమున నుంచెను.

ఇట్లు దైవసహాయమున సార్వభౌముడగు ధర్మజుడు సామంతునకు నమస్కరింప కుండ దప్పినది. మొత్తముమీద దైవసంకల్పమున పాండవులు విరాటనగరమున కీచకవధకై ప్రవేశించినట్లు భావింపనగును విరాటుని ప్రశ్నమునకు ధర్మరాజు తాను ద్విజుడ, గురువిషయజాతుడ, ధర్మరాజు సఖుడనని చెప్పుచు గృహస్థుడననియు ధ్వనింపచేసెను. ఇట్లే భీముడును వలలుడై వంటలవాడుగ చేరెను. భీమునకు ఆకలి యెక్కువ

యగుటచే పాకశాల తనదిగా చేసికొనెను. ఇక అర్జునుడు నపుంసకుడే యని పరీక్షవలన తేల్చి, విరాటుడు అంతఃపురమున కన్నియలకు ఆటలు పాటలు చెప్పుటకు చేర్చుకొనెను. ఇక నకులుడు తాను హీనకులుడనని చెప్పికొనెను. హీనకులుడనగా తక్కువకులము వాడనియు, హీ హీ నకులుడననియు అర్థము. ఇట్లే సహదేవుడు గొల్లవాడుగ చేరెను. ద్రౌవదియు సైరంధ్రిగ జేరినది.

# 19

పాండవులు విరాటనగర ప్రవేశము చేయునరికి అప్పటికి షుమారు తొంబదియేండ్ల ప్రాయము వారై యుండిరి. ద్రౌపదికి డెబ్బదియేండ్ల వయస్సుండి యుండవచ్చును. విరాటనగరమున నున్నప్పుడు భీముడెందఱనో మల్లులనోడించెను. అచట చేరి పదునొకండు నెలల పదునైదు రోజులైన పిమ్మట సైరంధ్రిగనున్న ద్రౌపదిని కీచకుడు ప్రేమించి తన సోదరియగు సుధేష్ణను ద్రౌపదిని యొప్పించుటకై ప్రార్థించెను. వాడు సుధేష్ణకుసవతితల్లియగు, సూతస్త్రీకి కొడుకు. సైరంధ్రియందుగల కీచకుని కామభావమును సుధేష్ణ యెంతగనో దూషించి, నివారింప జూచినది. కాని లాభములేక సైరంధ్రిని వారుణి నెపమున కీచకునికడ కంపినది. అపుడు కీచకుడు ద్రౌపదిని ప్రత్యక్షముగా బలాత్కరింపబోయెను. అందులకు ద్రౌపది కోపించి తన పతుల ప్రాభవమును— దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర ద్గర్వాంధ ప్రతీవీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్ – అని హెచ్చరించినది. అంలియగాదు గీర్వాణాకృతులగు వారిచే చచ్చెదవనియు హెచ్చరించినది. తరువాత వాని బారినుండి తప్పించుకొని బయటికి వచ్చినది. ఇంతవరకు సుధేష్ణ కీచకుని ఆరాటమునకు అడ్డుకట్టలు వేయుటకు యత్నించినది. కావున నీమె మంచిదే యగుచున్నది తప్పనిసరిగ పంపవలసివచ్చి పంపుటచే నామెను నిందింపవలసి వచ్చినది. ద్రౌపది తప్పించుకొని విరాటరాజు సభచేయుచున్న రచ్చపట్టు దగ్గరకు వచ్చుచుండెను.

ఆ సమయముననే కీచకుడు ఆమె జుట్టు పట్టుకొనగా నామె ప్రార్థనచే ముందుగనె సూర్యుడు పంపిన అదృశ్యుడగు రాక్షసుని శక్తివలన

నాతని బతిమాలి సభలోనికి వచ్చినది. కాని అవమానముపాలైన కీచకుడు మరల పోక సిగ్గువిడచి అక్కడే నిలబడుటకు విరాటరాజు మిక్కిలి చింతించెను. వాడు బలవంతుడగుటచే నేమియు చేయలేక విరాటుడు పొమ్మని బ్రతిమాలెను. ధర్మరాజు, భీముడు ఆ యాపదను జూచిరి. భీమునకు భయంకరమైన కోపము వచ్చినది. ధర్మరాజుకు ముత్యములవంటి చెమట బిందువులు ఫాలస్థలము నలంకరించినవి. ఆ సమయమున భీముడు రచ్చ చెట్టు పెల్లగించి కీచకుని చంపవలయునని భావించెను. కాని అన్నగారి కనుసన్నచే వారింపబడెను. అంతియగాక ధర్మరాజుయొక్క నర్మగర్భ వాక్కులకు కట్టుబడియుండెను. ఆ సమయమున ధర్మజుడు - వలలుం డెక్కడ జూచె నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే ! ఫలితంబై వర శాఖ లొప్పగ అనల్పప్రీతి సంధించుచున్ ! విలసచ్ఛాయనుపాశ్రితతికి న్విశ్రాంతి గావింపగా గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపగా చెల్లునే ! అని భీమునితో పల్కెను. విలసితచ్ఛాయతో నున్నట్టి యీ చెట్టును చంపరాదని నివారించుటచే నాగిపోయెను. ఇక విరాటరాజు చేయు నది లేక కీచకుని పొమ్మని సైగ చేసెను.

బలవంతుడైన బావమరదిని విరాటు డేమియు చేయజాలక మిన్న కుండెను. ద్రౌపది మాత్రము తనవంటి బలవంతులవు గంధర్వుల ఇల్లాలి కిట్టి పరాభవము జరుగగా, నెవని ఇల్లాండ్ర కిక యాపద రాకుండును అని కోపావేశమున బల్కినది. అందులకు ధర్మజుడు మాత్రము - వారిజాక్షి ! నీ పరాభవ మందఱు చూచినదియే. నీ పరాభవంబున కోపింపజాలరే గంధర్వులకు తరికాదుగాక ! చనుము నీవు సుధేష్ణ సదనమునకు - అని పల్కగా ద్రౌపది యింకేమియో చెప్పబోయెను. వెంటనే ధర్మజుడు— గరువతనముగల ఇల్లాలు శైలూషివలె సభల నాటాడవచ్చునా ? అని అజ్ఞాతవాసమున కామె భాషణముల భంగమగునేమోయని గద్దించెను. అందులకు ద్రౌపది కినిసి పరాభవబాధ నొందియున్నదిగాన కసి నాపుకొన

లేక నా భర్తలవు గంధర్వులేవురలో నొకడు జూదమాడువాడు, ఒకడు నటుడుగాన జూదమాడువాని భార్యకు గరువతనం ఔక్కడిది? అంతియగాక నటుని భార్య నటి యగుటలో నాశ్చర్యమేమున్నది అని—ఏ శైలూషిగా ననంగరాదు కంకభట్ట! అని చెప్పి వెళ్ళిపోయినది. అలసిసొలసి చెల్లా చెదరైన యలకలతో వచ్చిన ద్రౌపదిని చూచి సుధేష్ణ యేమిది? అని ప్రశ్నించినది. అందులకు ద్రౌపది నీవలననే యిట్టి కష్టము వచ్చినదని చెప్పినది. స్నాన భోజనాదుల వర్జించి కీచకవధోపాయ మాలోచించు చుండెను. అందులకు భీముడే తగినవాడని యెంచి పాకశాలకు అర్ధరాత్రి పోయి భీముని తట్టిలేపినది. భీము డదరిపాటున లేచి-ఏల? ఈ అర్ధరాత్రి నీ రాక? అని పల్క- తెలిసియుండియె నీవి ట్లడుగుచున్న నేను చెప్పి మాత్ర మేమి ప్రయోజనమని తన వగనంతయు వెళ్ళబోసినది.

మరియు భీమునితో ఉ. నన్ను పరాభవించి సదనంబునకున్ జని కీచకుండు మున్నున్న తెఱంగు తప్పక సుఖోచితశయ్యను నిద్రచేయ నీ కన్నుమొఱుగున్న నూఱటకు కారణమెయ్యది భీమసేన! మీ యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా! అని ద్రౌపది బిట్టు విలపింపసాగినది. అపుడు భీముడు ధర్మజుని గొప్పతనమును, శాంతమును గూర్చి చెప్ప నామెయు నొప్పుకొని యెట్లయినను ప్రస్తుత పరిస్థితినిబట్టి కీచకుడు చావకున్న తానే చచ్చెదనని పట్టుబట్టినది. అపుడు భీముడు కీచక వధోపాయము నాలోచించి ద్రౌపదిని కీచకుని మోహించినట్లు నటించి వాని నొంటరిగ నర్తనశాలకు రమ్మని చెప్పిన రాత్రి విజనమగు నచ్చట వానిని మాటుబెట్టెదననియు చెప్పెను. ఇక ద్రౌపది యట్లే యని తన నివా సమునకు పోయి మామూలుగా నుండ కాముకుడు దుర్విదగ్ధుడుగాన మరు నాడాత డచ్చటికివచ్చి మాటాడజొచ్చిన భీముని వాగ్బలమున నైహికా ముష్మిక భయములేనిపై ద్రౌపది అర్ధరాత్రమున విజనమవు నర్తనాగారము నకు రమ్మని ఒకడనేరమ్మని కట్టడిచేసి పంపెను. అపుడు కీచకుడు విరహ

జ్వర పీడితుడవై రాత్రి కొంకు-మాయరవి యేల క్రుంకదొకో —అని ఉపాలంభనము ప్రారంభించెను. భీముడు సర్వసన్నద్ధుడై వచ్చి సైరంధ్రి నొక మూలనుంచి తానొక శయ్యపై పండుకొనెను. అపుడు కీచకుడు — సింగంబున్న గుహానికేతనమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మాతంగంబున్ బురుడించుచున్-భీముడున్న యెడకు వచ్చెను. మొదట కీచకుడు భీముని సైరంధ్రియే యని భావించి కీచకుడు తన ప్రాభవమంతయు నేకరువుపెట్టి తాకగా భీముడు కొన్ని మాటలాడి మెడలంకించుకొని వంగదీయ నతం డును గంధర్వుడనుకొని యెదిరించి లాగుకొన నిట్లు గూఢనిమర్దనముల కొట్టుకొనుచుండిరి. అజ్ఞాతవాసము చెడునేమోయని భీముడు, వ్యభిచరించు చోట తన్నులు తగిలెనన నామోషియని కీచకుడు చప్పుడులేకుండ బోరిరి. ఇంతలో భీముడు మూర్ఛనొంది లేచి కీచకుడు పోబోగా వానిజుట్టు పట్టి లాగి చంపివేసి పొట్టచించి కాళ్లుచేతులు దానిలో దూర్చి నేలమీద మెదిపి ముద్దచేసెను.

తర్వాత రహస్యముగ నిప్పుతెచ్చి ఆవెల్తురున భీముడు ద్రౌపదికి కీచక శవము చూపించెను. అంత ద్రౌపది భీముని కైవారము చేసినది. భీముడు యథాప్రకారము పాకశాలకుపోయెను. ఇక ద్రౌపది పవలెవరైనవచ్చిన అజ్ఞాతవాసముననున్న భీమాదులెవ్వరు నేమియు చేయరాదని తెల్లవారు లోపల ఉపకీచకులను తుదముట్టించవలయునని చూచినది. తానె కావలి వారల పిలిచి తన భర్తలగు గంధర్వులచేత వీడు చచ్చెనని చెప్పిచూపెను. వారు చెప్పగా కీచకుని తమ్ములు నూటనల్వురు మిక్కిలి దుఃఖించి సైరం ధ్రియే యిందులకు కారణమని యామెనుబట్టి తమ అన్నతో దహనము చేయనెంచిరి. కీచకుని శవముతో నామెనుకూడ కట్టి శ్మశానమునకు పోవు చుండిరి. ద్రౌపదియప్పుడుశవాసనముపైనున్న చింతామణివలె ప్రకాశించినది. అంత నామె కేకలతో నాథులార! గంధర్వ రత్నంబులార! నన్ను నుపకీచ కులు తమ అన్న శవముతో గట్టి తీసికొనిపోవుచున్నారు. రక్షింప వేగ

రావలయు మీరు - అని పెద్దగా నేడ్చినది. ఆ మాటలతో భీముడులేచి చూచి వారికంటె ముందు కోటగోడమీదుగాదూకి శ్మశానముచేరియుండెను. ఇతనిని చూచిన ఉపకీచకులు భయపడి పరుగెత్తనారంభించిరి. ఉపకీచకులను భీముడు తుదముట్టించుటయు నైనది.

ద్రౌపది మరునాడు స్నానముచేసి పరిశుద్ధురాలై ఊరిలో ప్రవేశించునప్పుడు ఆమెనుచేర జంకి పౌరులెల్లరు నిటునటు పారుట చిత్రముగ నుండెను. ఆమె అర్జునుని పాఠశాలకు పోయినది. అర్జును డామెనుజూచి-

కం॥ ఆ పాపాత్ముల నీచ
వ్యాపారక్రమము వారలందఱు మృత్యు
ప్రాపితులైన తెఱంగును
నీ పలుకుల నెఱుగవలయు నెలతుక చెప్పుమా!

అని జరిగిన సంగతి నెఱింగింపకోరెను. అపుడు సైరంధ్రి వానితో తన కృతార్థత్వము సూచించుచు—

గీ॥ కన్నియల కాట గఱపుచు నున్న నీకు
నకట! సైరంధ్రి యిప్పుడేమయ్యె నేని
ఖేద మొక్కింతయును లేమిగాదె సన్మి
తానసుండవై నన్నిటు లడుగుటెల్ల!!

అని కొంచెము ఎత్తిపొడుపుగా నన్నది. దాని కర్జునుడు నీవు కష్టపడుటకు నాకెంత దుఃఖముగా నున్నదియో నీవు నైజమెఱుగవు. నేనేమి సేతును అని తన దీనస్థితి నివేదించెను. అందులకు నీ మది నేను కొంత ఎఱుగని దానగాను. నీ విట్లుండుటయే నా కిష్టము, అని సమాధానించు నప్పటి ద్రౌపది మన స్తత్వ వర్ణనము చూచితీరవలయును. ఆమె సుదేష్ణ

దగ్గరకు పోగా జరిగినదంతయు నెఱింగిన ఆమె ద్రౌపదిని - మా పుర మును రాష్ట్రమును వదలిపొమ్మెంద్రైనన్....అని కోపావేశమున పల్కి నది. అంత ద్రౌపది మునుపటివోలె పదమూడు రోజులుమాత్రము నీ యింటనుండుట కొప్పుకొన్న నా భర్త లగపడి మీకు మేలుచేసి నన్ను గొనిపోదురు. అంవరకు నప్పటికి సంతసము కాగలదు, అనిన నామె అంగీకరించెను.

ఈవార్త దేశమంతయు ప్రాకగ పాండవులు విరాటుని కొలువునం దున్నట్లు కౌరవులు దీనిచే పసికట్టిరి. గూఢచారులు వచ్చిరేకాని, పాండ వుల జాడతెలియజాలక ఎందును లేరని చెప్పిరి. ఇక గత్యంతరములేక దుర్యోధనుడు సభచేసి దుశ్శాసనాదులను పాండవుల జాడగూర్చి ప్రశ్నిం చెను. దుశ్శాసనుడుమాత్రము పాండవులు చచ్చినచోట పూరియున్ మొల వదే యని మడిసిరని మాటనిచ్చెను. అందులకు ద్రోణుడుమాత్రము పాండవులు మరణించలేదని జవాబిచ్చెను. అంతియగాక వారు అమానుష తేజులని చెప్పెను. భీష్ముడు మాత్రము ధర్మజుడున్నయెడ కఱవు కాట కము లుండవు. అట్టిదేశమున పాండవుల నెమకుమని సమాధానించెను. కాని దుర్యోధనుడుమాత్రము కీచకుడు పాండవులచే హతుడయ్యెనని తలచెను. కీచకుని బలమున కోటువడి విరాటుడు పన్నుకట్టకున్నను దుర్యోధనుడు వానిపై నెత్తిపోక ఊరకుండెను. ఇప్పుడా భయము పోయినదిగాన విరాటునిపై నెత్తిపోయిన పాండవు లడ్డమువచ్చిన అజ్ఞాత వాసము చెడినదిగాన మరల అడవికి పొమ్మనవచ్చును. వారు లేకున్న విరాటుని సొమ్మెల్ల చూరగొని కసితీర్చుకొనవచ్చునని తలచెను. దానికిగా ఉత్తర గోగ్రహణ - దక్షిణ గోగ్రహణముల బెట్టించెను. సుశర్మను దక్షిణముగా బంపి, తాను సైన్యముతో ఉత్తరముగాపోవ బయలుదేరెను. అష్టమి నవములు యుద్ధమునకు మంచివి, అని అష్టమినాడు దక్షిణ గోగ్రహణము, నవమినాడు ఉత్తరగోగ్రహణము సాగించెను. అమా

వాస్యనాడే కురుక్షేత్ర సంగ్రామ ప్రారంభమైనది. ఏలన జ్ఞాని అమావాస్య రోజున మరణించిన చంద్రమండలము వేరుగా నుండదుగాన సూర్యమండలము భేదించుకొని పోగలడు. ఇందులకే—ఏమీ తెలియనివాడు ఏకాదశినాడు చస్తే, అన్నీ తెలిసినవాడు అమావాస్యనాడే చస్తాడు—అను సామెత బుట్టినది. ఇట్లు అష్టమినాడు సుశర్మ విరాటుని ఊరికి దక్షిణమున గోవుల బట్టెను.

విరాటుడువారితో పోరికి పోవుచుండ, ఇక విరాటునివైపు సారధ్యములు తామే చేసికొనుచు ధర్మజ భీమ నకుల సహదేవులు నల్వురు యుద్ధమునకు పోయిరి మహాయుద్ధము సాగినది. సంధ్యచీకటిలో కొంచెముసేపాగి అర్థరాత్రమున వెన్నెలలో యుద్ధము మరల చేయుచుండగా సుశర్మాదులు విరాటుని ఓడించి కట్టి తీసికొనిపోవుచుండిరి. విరాటుని సైన్యములెల్ల పారిపోవుచున్నవి. ఇది చూచిన ధర్మరాజు విరాటుని విడిపింపవలయునని తమ్ములతో చెప్పెను. ఈ నలువురుమాత్రమే శాత్రవులతో తలపడిరి. ఆ యుద్ధమున భీముడు రెండువేలు, నకులుడు ఏడు వందలు, సహదేవుడు ఐదునూర్లు, ధర్మరాజు వేయిరథముల శాత్రవులవి నుగ్గు గావించిరి. అట్టిసమయమున భీముడు భీమావేశముతో సుశర్మ రథ్యముల జంపి విరాటుని విడిపించి సుశర్మను దాను పట్టుకొని బంధించితెచ్చి విరాటుని రథస్తంభమున కంటగట్టెను. ఇక సుశర్మ సైన్యములన్నియు కాందిశీకము లయినవి. విరాటుని యావు లొక్కటియు తప్పిపోకుండ భీమ నకుల సహదేవులు పొదివికొనివచ్చి తమ గోపాలుర కప్పగించిరి. విరాటుడు పాండవులని యెఱుగకయు వారల నలువురకొనియాడ మొదలిడెను. దానివలన సుశర్మ తమ్ము గుర్తించునేమో యని ధర్మజుడు, నీవు మమ్ముగొనియాడవలదు ఈ సుశర్మను, వీరితరపువారిని విడిచిపుచ్చుమని అట్లు చేయించి తా మా రాత్రిశేష మట నొక నదీపులినమున గడిపి తెల్ల

వారిన తర్వాత జయాటోపముతో నూరిలో ప్రవేశింపదలచి, నిశ్చింతముగా మాటలాడుకొనుచు కాలము గడుపుచుండిరి.

తర్వాత సూర్యోదయసమయమున దుర్యోధనాదులు కౌరవులువచ్చి విరాటునగరమునకు నుత్తరముననున్న గోవుల మందల బట్టుకొని పోవుచుండ, గోపాలకులు గ్రామములోనికివచ్చి విరాటుని చిన్నకొడుకైన ఉత్తరునితో చెప్పిరి. చిన్నవాడుగాన ఉత్తరుడు విచారింపక తనకు సారధి లేడని, ఒక సారధి దొరికిన కౌరవుల గెల్చి పశువుల తేగలనని గప్పాలు కొట్టెను. నన్నుజూచి కౌరవులు అర్జునుడని భయపడునట్లు చేసెదననియు వాడనెను. అదివిని సైరంధ్రి లోలోన కుత్సించుచు అర్జునునివద్దకు పోయి పరిస్థితిచెప్పి అతని యిష్టప్రకారము ఉత్తరచేత ఉత్తరునకు చెప్పించి, ఎట్టకేలకు బృహన్నల నాతనికి సారధిగ నొప్పించి యుద్ధమునకు పంపెను. అప్పు డుత్తర కౌరవులగెల్చి వారి తలచీరలు తెమ్మని బృహన్నలకు చెప్పెను. ఉత్తరుడు కురుసైన్యముచూచి భయకంపితుడై రథము దిగి కాలికి బుద్ధిచెప్పెను. ఇక బృహన్నల చేయునదిలేక తన కేశములచే వీపు కప్పుకొని ఉత్తరుని వెంటాడి పట్టుకొనివచ్చెను. శత్రువులకు వెన్నుజూపి పోరాదు కాబట్టి బృహన్నల అట్లుచేసెను. ఇక బృహన్నల తానుయుద్ధము చేయుదుననియు, ఉత్తరుని సారధిగ నుండుమని యిష్టములేకున్నను, ఒప్పించి మట్టిచెట్టుమిద బెట్టిన అస్త్రముల గ్రహించెను. సందర్భానుసారముగ ఉత్తరుని ధీరునిజేసుకొన తాము పాండవులమని తా నర్జునుడనని తన పేళ్ళ నన్నింటిని వాడడుగగా చెప్పుచు, పదునొకండవపేరు కృష్ణుడనియు చెప్పెను. వానికి ధైర్యమువచ్చినది. ఈత డర్జునుడైన వీని రథముతోలి నేను పేరుపొందెద ననుకొనెను. అర్జునుడు తలచినప్పుడే శంఖము దేవదత్తము చేతికి వచ్చెను. అట్లే పెట్టక కట్టక మౌళింబుట్టిన క్రియ కిరీటము తలపై వచ్చి నిల్చినది. ఇక నీతని యుద్ధపద్ధతి గమనించిన కౌరవులు—బాహుల చాయలుం గమనభంగియు అర్జును నట్లయని

యూహించి, అర్జునుడే యని భావించిరి. ద్రోణు డర్జును గుర్తించి వానికి అజ్ఞాతవాసభంగ మగునేమోయని భయపడి కనుసన్నతో రెండర్థములం మాటలతో భీష్మ నిట్లడిగెను—

శ్లో॥ నదీజలం కేశవనారికేతు
ర్నగాహ్వయో నామ నగారిసూనః
ఏషోఽంగనా వేషధరః కిరీటీ
జిత్వావయన్నేష్యతి చాద్యగావః

దానికి భీష్మ డెఱుంగని యట్లు శత్రువులకు నిమ్మగుచోటు గడచి వచ్చితిమి ఎవరు వచ్చినను భయపడవలదని దుర్యోధనునకు చెప్పుచు అర్జును నజ్ఞాతవాస కాలము వెళ్ళిపోయినదని ద్రోణునకు సూచించెను. ఆ యర్థము తెలిసికొని ద్రోణుడు నిర్భయముగా వచ్చుచున్నవా డర్జునుడు మనము వాని గెలుచుట కష్టము. అతడు దేవలోకములను, రాక్షసలోకములను గెలిచినవాడు. శివునితో బాహుయుద్ధము చేసినవాడు. కాన వానిచేత దెబ్బలు తినుటకంటె వానితో ముందుగా రాజీచేసికొనుట మంచిది. అని చెప్పెను. దానికి దుర్యోధనుడు, కర్ణుడు కోపించి యిష్టమువచ్చినట్లు ద్రోణుని తిట్టిరి. అశ్వత్థామయు వారితో వాదులాడి ద్రోణుడు సిగ్గులేక యుద్ధము చేసినను నేను మాత్రము చేయనని గట్టిగా బలికెను. భీష్ముడు వారల నందరిని బ్రతిమాలి దుర్యోధనుని కర్ణుని నిరసించి అర్జునుడు వచ్చుచున్నాడు గాన మనలోమనకు వైరము తగదు అని పలికి అందఱ నేకముఖము చేసెను. దుర్యోధను డడుగ భీష్ముడు పాండవుల అజ్ఞాతవాసము అధికమాసములతో గూడ తిథులలెక్కతో నిన్నటితో వెళ్ళిపోయినది. కాననే తెలివిగలవా డర్జునుడు నేడు బయటబడెనని విస్పష్టముగ అనెను. భీష్ముని మాటలతో అంకిలిదేఱిన ద్రోణుడు కౌరవసైన్యములు నాలుగు భాగములుగ చేసి ఒక భాగము గొని దుర్యోధనుడు ముందు హస్తిపురి

పోవుచుండునట్లును ఒక భాగము సైన్యము విరాటుని పశువులచుట్టి కమ్మి కొని తోలుకొనిపోవుచుండునట్లుగాను, మిగిలిన రెండు భాగములు కలసి ఒక వ్యూహము పన్నుకొని వారివెనుక నేగునట్లును అమర్చి, అర్జునుడు వచ్చినప్పుడే సైన్యము యుద్ధముచేయుచుండ రాజు గోవులు ఇంటికి తప్పించుకొని పోవునట్లు నమర్చి, తాను భీష్ముడు, నశ్వత్థామ, కర్ణుడు ఈ సైన్యము నడపించుకొనుచు పోవుచుండిరి.

అంత ఉత్తర సారథ్యములో అర్జునుడు దేవదత్తము నూదుచు, గాండీవము సారించుచు, ఇంద్రదత్త కిరీటము మెఱయ జెండామీద హనుమంతుడు మ్రోయ వానిచుట్టు భూతములార్వ మహాసంరంభముగా వచ్చి వెనుక సైన్యములో దుర్యోధనుని గానక భీష్మ ద్రోణకృపాచార్యులకు నమస్కార బాణములు వేయుచు, ఆ సేనప్రక్కగా గడచిపోయి పేరు చెప్పి కేకవేసి అదలించి తన రథము భీష్మాదుల సైన్యమునకు గోవులతో బోవు సైన్యమునకు మధ్యముగా తోలించి కేకలతో బొబ్బలతో సైన్యము చెదరి తూర్పునకు పారిపోవునట్లుచేసి తానువచ్చిన రథమార్గమున గోవుల బట్టించి గోపాలకుల దోలుకొనిపొమ్మని తానుకాపాడుచు గోవుల మరల్చె. అంత నా సైన్యము లన్నియు నొక్కటైనవి. రాజుకూడ మరలివచ్చి వీరితో కలిసెను. అప్పుడన్ని సైన్యములతో నాయకులతో అర్జునుని కొక్కనికి మహాయుద్ధము సాగినది. చూచుటకు దేవతలు వచ్చి ఆకాశ మలంకరించిరి. అట్టి సమయమున—

మ. బలమెల్లన్ వెఱ రెండుపాయలుగ శుంభ ద్వేగుడై చొచ్చి యా
వలగా నడ్డమువచ్చి నాలువుగ దుర్వారోద్ధతిం బోయిమూ
లల నానాశకలాకృతిం దొరసి లీలాయాన దుర్దాంతుడై
వలయుంబుల్లని చించి చిక్కుపఱచున్ వైకల్యసంపాదియై.

ఇట్లు తుముల్యముగా సైన్యములనెల్ల నాశనముచేసి ప్రత్యేకముగా నాయకు లలో మాటిమాటికి పోరాడి యోడించి పారిపోవు కర్ణుని నిందించి, అతడు చూచుచుండ అతని తమ్ముని జంపి, భీష్ముని మూర్ఛపుచ్చి తక్కు సైన్య ములనెల్ల నడుకి దుర్యోధనునితో పెద్దయుద్ధముచేసి అతడోడి పాఱుచుండ

ఉ. క్షత్రియుడోడు నే తగదు కౌరవరాజ! యొకండ నే పృథా
పుత్రులలోన చిన్న నిను పోరికి పిల్వగ పోక పాడిగ్నే!

అని నా చేతిలో నోడిపోయి యే మొగముతో హస్తిపురి నూరేగెదవు. సింహాసనమున నెట్లు కూర్చుండెదవు. యుద్ధములో చచ్చుట మంచిది. ఓడిపోవుటకన్న, జూద మిక్కడ నాడంగరాదు సుమా ; "నీ యట్టివాడు నిస్సీ పోయిడిదే యిట్లు పోకు పోకు", మనిన ఘనాయకుడు మరలి త్రొక్కబడ్డ యహిగతి గనిపెన్—అప్పుడున్న నాయకులు మిగిలిన సైన్యములు నొక్కటియై యెదిరించి అర్జును ననేక శస్త్రాస్త్రములతో సందులేకుండ వీరరసావేశమున ప్రహరించుటయు, ఆ అర్జునుడా బాణ ముల వానలు తనకు సారథికి గుఱ్ఱములకు రథమునకు తగులకుండ కాచి కొనుచు నాయకుల నెవరిని చంపినను తన తోబుట్టువుల ప్రతిజ్ఞలకు భంగము వచ్చునేమోయని వీలయినను జంపక భంగపెట్టి పంపుదమని వారిపై, ఇక గంధర్వాస్త్రము మంత్రించి వేయగ నది సమ్మోహనాస్త్ర మగుటచే నందఱును మూర్ఛిల్లిరి.

ఈ సమయముననే అర్జునుడు ఉత్తరుని కౌరవవీరుల తలపాగలు కోయుమని చెప్పెను. ఉత్తరుడట్లు చేయుచుండగ, భీష్మన కా యస్త్రవిశే షము తెలిసియుండుటచే మూర్ఛనుండి తేరిచూచెను. ఉత్తరుడు చేయు చున్న పనిని చూచి భీష్ముడు-కౌరవ వీరుల శిరముల గోయుచున్నాడని భ్రాంతి నొందెను. తానొక్కడు అర్జునునితో యుద్ధముచేసి యోడెను. చేతులు కాళ్ళు నాడక మిక్కిలి ఆశ్చర్యము నొందెను. ఇంతలో అందఱు

మూర్ఛతేరి ఏడీ అర్జునుడు? అని ఆయుధములు దాల్చి సన్నద్ధులగుచుండ చూచి భీష్ముడు వారందఱతో-

ఉ. మోహన బాణపాతమున మున్ఁదలిచీర లెఱుంగకున్నయీ
బాహుబలంబుతోఁ గడగి పార్థుని తాఁకెడుబుద్ధిక్రమ్మరన్
సాహసవృత్తిఁ జేసి యవినారత పోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయుఁడే మనలందఱ నొక్కట మార్గణాగ్నికిన్

అని చెప్పి ఒడలెఱుగక మూర్ఛనొంది సీవల సైనికులుండ కుంతి కొడుకు గాన, ధర్మాత్ముడుగాన తలపాగలు మాత్రము కోయించి తృప్తినొందెను. తలలు కోయించిన ఈనాటితోనే పని తీరిపోయెడిది. ఔరా! వీని కరుణాతిశయము చెప్పశక్యము కానిది నీకు ఇట్లు పాండవులు కోరికిన ఊర కుందువా! అతడు మన ప్రాణములమీద ఆశవదలిన మనకు అంత పంతమేల? అని దుర్యోధనుని వారించెను. అప్పు డందరు దెబ్బలుతినియుండి మేనులు విరవిరపోవుచు చేయునదిలేక యింటిమొగముబట్టి పోవుచుండిరి. కర్ణదుర్యోధనులు నుస్సురనుచు వారివెంట పోవుచుండ నర్జునుడు వెంబడించి కర్ణదుర్యోధనుల కిరీటములలో మణులు మిట్టకోలలతో రాల్చి కర్ణుని వీపు పగులచేసి, భీష్మ ద్రోణ కృపులకు నమస్కారబాణములు వైచి అందఱతో పెద్దకేకవేసి పోయివచ్చెదనని చెప్పి అర్జునుడుఉత్తరునితో చెప్పి తన రథము మరలించెను.

మరల ధనుర్బాణములు మునుపటి చెట్టుమీద కట్టిపెట్టి దివ్య మహిమగల జెండా, దేవదత్తము మొదలగు సాధనముల ప్రార్థించి అంతర్ధానముచేయించి అర్జునుడు బృహన్నల వేషముతోనె తొట్టిలోనుండి, ఉత్తరుని ధనుర్బాణములు ధరించి రథముపై నుండచేసిపోవుచు గోపాల

కుల పిల్చి ఉత్తరుడే కౌరవసైన్యములగెల్చి గోవుల మరల్చెనని ఊరిలో చెప్పుమని పంపెను. ఇది ఉత్తరగోగ్రహణము.

దక్షిణ గోగ్రహణమున జయించివచ్చిన విరాటు డుత్తరుడు కౌరవ సైన్యములతో ఒక్కడు యుద్ధమునకు వోయెనన్నవిని భయపడి వాని సంగతి ఏమయినదో కనుగొని సైన్యముల వానికి సహాయము సంపుమని మంత్రులతో వ్యగ్రుడై మాటలాడుచుండ నాకబురు వచ్చినది. తనకొడుకు కౌరవసైన్యముల గెలిచి వచ్చుచున్నాడని విన్నంతనే విరాటుడు సంతోష గర్వములతో పలుకుచుండ ధర్మరాజు బృహన్నల సారధిగాన ఉత్తరుడు జయించెననెను దానికి విరాటుడు కోపించి సారధితెలివి గుఱ్ఱములు తోలుటకు గాని శస్త్రాస్త్రములతో నెదురించు కౌరవుల గెల్చుటకు నెట్లు ప్రయోగించును, అని అనుచు సుమాశము మీద జూదమాడనెంచి ధర్మజుని పిలచి పలకలాగుకొని ఉద్యుక్తుడగు విరాటునితో- జూదమాడుట యెంత లెస్స. మునుపు ధర్మరాజు జూదమాడి రాజ్యమును, తమ్ములను, పెండ్లా మును, ఓడి బాధపడెను, గాన యిది మంచిది కాదనుచు, చేరి జూదమాడు చుండ మరియు విరాటుడు తన కొడుకును పొగడ- ఉత్తరుడు కౌరవుల గెల్చిన నింతకన్న నాశ్చర్యమేమి కలదు? బృహన్నలకు యుద్ధము చేయ వలెనని కోరిక పుట్టి ఉత్తరుని సారధిగా గొనిపోయి వారలగెల్చి యావుల మరల్చి యుండవచ్చును, కాన పురిలోన బృహన్నల జయము చాటించు మనెను. ధర్మజుని పట్టు అట్టిది.

ఇక విరాటుడు అది సైపక చేతిసారెతో కంకభట్టును గొట్టెను. గంటిపడి నెత్తురు కారుచుండ సైరంధ్రివచ్చి పైట చెరగుతో తుడుచు చుండెను. విరాటుడది యేమన సైరంధ్రి ఉత్తముడగు నీతనిరక్తము బొట్టులెన్నిపడిన అన్నియేండ్లు దేశము అనావృష్టితో కఱవనుభవించును. నీ కట్టి యాపద వచ్చుట యిష్టములేక యిట్లు చేసితి ననెను. ఇంతలో

ఉత్తరుడు అర్జునుడు వచ్చినవారి గౌరవించి, సారధిని పంపి, రధికుడవు కొడుకుతో సభచాలించి విరాటుడంతిపురి కరిగెను. ఉత్తరుడు తండ్రితో ఒక మహాపురుషుని సాయముతో జయమయినదని చెప్పెను. ధర్మరాజు గంటి అర్జునుడు చూడకుండ వస్త్రము కప్పికొనియుండెను. అప్పటికి విరాటుడు నమ్మనున్న ఉత్తరుడు భయపడుచున్న నన్ను నొప్పించి సారధిగా చేసి తానర్జుడనని చెప్పి అప్రతిహతగతితో కౌరవుల మార్గాని గోవుల మరల్చి కౌరవుల పరాభవించిన, ఈ బృహన్నల అర్జునుడు. నిన్న కౌరవుల మాటలాడునప్పుడు వారి వారి మాటలనుబట్టి నేను నమ్మితిననెను. ఆరాత్రియందరు పాండవులు, ద్రౌపది, ధర్మరాజు మకాములో చేరి వారి యుద్ధము కబురులు వీరు, వీరియుద్ధము కబురులు వారు చెప్పుకొన్న తర్వాత - అర్జునుడు - ధర్మరాజు నాకు మొగము చూపకుండ వస్త్రము కప్పుకొని యుండెను. నేనేమి తప్పుచేసితిని. అజ్ఞాతవాసము వెళ్ళిపోయి నది గదా! మనల నీ సంవత్సరము పోషించిన వాని గోధనము పోవుచుండ కాపాడుట ఆవసరముగదా! అని పోయితిని అని చింతింప ధర్మజుడు— ఏమియు లేదు, విరాటుడు కొడుకుజయము కొనియాడ నేను బృహన్నల యుండ ఉత్తరున కేమికొదవ లేదన కోపముతో సారె తీసికొని కొట్టిన నీవు చూడకుండ గంటిని దాచితినని అర్జుననకు ధర్మజుడు చెప్పెను. దాని కందరు విరాటునిపై కోపించిరి.

# 20

ధర్మరాజు మాటలతో భీమాదులు శాంతించి విరటునిపై కోపము నుపసంహరించుకొనిరి. ఆ మరునాడు ధర్మజుడు విరాటరాజు సింహాసనముపై కూర్చుండ మిగిలిన వారును ఆయా ఆసనము లలంకరించిరి. యమధర్మరాజు వరము వలన ధర్మరాజు తన నోటిమీదుగ తాను ధర్మజుడనని చెప్పువరకును అందఱు కంకుభట్టునియే చూచిరి. అట్లు సింహాసనము నలంకరించిన కంకుభట్టును జూచి విరటుడు ఆశ్చర్య కోపములతో నిది యేమి? అని ప్రశ్నించెను. ధర్మజుడు తన యాజ్ఞ సూయాణముగ ప్రజల పాలించినవాడు. సూయాణమనగ గర్భిణీ స్త్రీలకు నొప్పులు కామితముతీర్చుట ప్రజలకు కావలసిన విచ్చి కాపాడిన ధర్మవ్రతుడు ధర్మరాజు. ఇతడు దిగ్విజయ మొనరించియు అజాతశత్రువనిపించుకొన్నవాడు. అని చెప్ప నమ్మక తక్కిన నలుగురు ఏరి? అని విరటుడు మిగిలిన వారి కూర్చి యడిగెను. వారందఱును అతనికి తెలియచేయబడిరి.

శకునిని నిన్నటి యుద్ధమున మామా! అని సంబోధించి - ఇవి బాణములు కాని అస్త్రములు గావని చెత్తిపోవిచెన అని యిట్టి మాటలు చెప్ప విరాటుడు దిమ్మరపోయి ధర్మజు పాదములపై బడెను. భీమార్జున నకుల సహదేవుల కౌగిలించుకొనెను. విరాటుడు తన సర్వస్వము రాజ్యము ధర్మజున కప్పగించి తాను సేవించుకొనెదననెను ఉత్తరుని పలుకులతో సుశర్మనోడించి ధర్మజాదులు, కౌరవుల నోడించి యర్జునుడు, సంపాదించిన రాజ్యము వారిదె వారికి మనమిచ్చుట యెట్టిది? అనగనే ఉత్తర నిచ్చుట కంగీకరించిరి. కాని అర్జునుడామెను భార్యగా స్వీకరించుట కిష్టపడక కోడలుగ స్వీకరించుట కిష్టపడెను. హరికి మేనల్లుడైన అర్జును పుత్రు

డభిమన్యుడు మహా పరాక్రమశాలి, అందగాడు, చిన్నవాడు. కాన వానికి పిల్లనిచ్చుట, దాన అర్జునుడు వియ్యంకుడగుట విరాటునకు మిక్కిలి ప్రియముగా నుండెను. ఇక సైరంధ్రి రాణి. ఆమె మహారాజ్ఞి కనుక ఆమెను గౌరవింపుమని సుధేష్ణకు కబురుచేసిరి. ఆనాడు పాండవులకు విరాటుడు విందుచేసెను. వారు మంచి యుల్లాసమున నుండిరి. ఆ మరు నాటి నుండి విరాటుని సాయముతో పాండవులు తమకు వేరుగా దేరాలు వేయించుకొనిరి. ఆ చోటునకు ఉపప్లావ్యమని పేరుంచిరి. తమ పేర ఖర్చు వ్రాయించుచు ఆహారపదార్థముల తెప్పించుకొనుచుండిరి. తమకు రాజ్యము ప్రాప్తించి నప్పుడు బాకీ తీర్చెదమని వారి యభిప్రాయము. ధర్మజుడు విడిగ మరియొక చోట శిబిరములందుండుటచే ప్రజలు కూరలు పెరుగులు మొదలగు పదార్థములు, ధనములు, ధాన్యములు వలసినవెల్ల ధర్మరాజునకు బహుమతిగా నిచ్చుచుండిరి. వానితోనె వారి శిబిరముల యందలి కోశాగారములు నిండిపోవుచుండెను. ఇక బంధుమిత్రులగు రాజులు అజ్ఞాతవాసమునుండి బయటపడిన ధర్మజునికి నాప్తితో నిచ్చు ధనముల కంతము లేకుండెను. ఇట్లుండి ఉత్తరాభిమన్యుల వివాహము సాగించిరి. యాదవ పాంచాలాదులందరు సర్వస్వము తెచ్చిరి. మహా వైభవముగ వివాహమహోత్సవము నెరవేరినది.

ఇక ఐదవరోజు కృష్ణుడొక సభ నేర్పాటుచేసి పాండవుల రాజ్య ప్రాప్తిని గూర్చి ముచ్చటించి ఒక దూతను బంపి అడిగించిన, వారు రాజ్యమిచ్చిన సరే కాకున్న రాజులనెల్ల బిలిచి చివరకు మమ్ము బిలువుం డనెను.అందులకు బలరాముడు పాండవులు ధర్మాత్ములయ్యు నుపాయముగా నడచుట చివరకు పొరపాటుపడి తప్పటడుగు వేసిరి. ఏలయన జూద మాడి రాజ్యభ్రష్టులైరి, వారు తెలివిగలవారై గెలిచిరి. కావున కౌరవుల తప్పు లేదు, అని అందుచే పాండవులే దూతనంపి తమరాజ్యమును దేహి యని సౌమ్యముగా నడుగుట సమంజసమనెను. అందులకు సాత్యకి బల

రాముని ఆక్షేపించెను. ధర్మరాజు వేడుకపుట్టి జూదమాడలేదనియు, ఈమాట బలరాము డనరాదనియు త్రాగుబోతు మాటలుకూడ ననియు ఆక్షేపించెను. అంతియగాక మాతనుబుచ్చి ధర్మరాజున కుచితంబుగ కౌరవులు రాజ్య భాగము నిచ్చిన గౌనుట సమంజసమని పల్కెను. దుర్యోధనుడు చక్కగ మార్గమునకు రాకున్న బాణములతో త్రోవకు తెచ్చెదనని సాత్యకి భీకర ముగ బల్క సభవారందఱు, అతని మాటలే సమంజసమనియు బల రాముని మాటలేమి మాటలనియు ఆక్షేపించిరి. అపుడు కృష్ణుడు సభ చాలించి గృహమునకు పోబోయెను. మరియు నెవరినైన ముందు దూతగ బంపి చూచి, పని కాకున్న తరువాత యుద్ధము చూతమనియు ముందు గనే రాజులందరకు కబురుపెట్టు మనియు, పాండవుల కార్యభారమంతయు ద్రుపద మహారాజుదే యనియు చెప్పిపోయెను.

ముందు ద్రుపదపురోహితుని రాయబారిగ పంపనిశ్చయించి యట్లే గావించిరి. అతడు కౌరవసభకేగి ప్రత్యేకముగ భీష్మద్రోణుల కట్టుకొని, చివరకు సభలో మాటాడ నుంకించెను. పాండవుల కెట్లయినను తేజో లాభము కలిగి రాజ్యము వచ్చునట్లు చేయుటయే, పురోహితుని కోరిక సమ్మ తించి పాండవరాజ్యము వారి కిచ్చివేయుడనియు, లేకున్న ధృతరాష్ట్రి నకు బుద్ధికల్గునట్లు చెప్పుడని పెద్దల కోరియు ద్రుపదుని పురోహితు డెన్నియో పాట్లుపడెను. ఈ పురోహితుని భాషణములువిని భీష్ముడు విప్ర స్వాభావికమై కొంచెముతీక్ష్ణముగానున్నను ధర్మనిరూపణముచేయుటయందు సర్వోత్తమమైన మాటలని కమ్మకొని పలికెను. దుర్యోధనుడు పాండ వాజ్ఞాతవాసము పూర్తియైనదా యని లెక్కచూడుమని భీష్మని ప్రశ్నింప, ఆత డుత్తరగోగ్రహణమునాడే ఆ సంగతి విశదమైనదని తెల్పెను. అవుకు సంవత్సరమునకు మూడువందల అరువది జనుపకట్టలుకొను పెద్దమనిషి ఇంకొక నలుపదికూడ కొనరాదా? అని అడుగువారి అవియేచాలునని. సమా ధానము చెప్పగా, అప్పుడప్పుడు తిథులు పెరిగి త్రిద్యుస్పృక్కులని వచ్చు

గదా కొన్ని కట్టలు పెరుగుపంలిసి వచ్చినన అవములవచ్చి కొన్ని తిథులు తగ్గునుగాన సరిపోవుననెను. భీష్ముని, పాండవుల లెక్కయది. భీష్ముని మాటవిని నమ్మక దుర్యోధనుడు అజ్ఞాతవాసము కాకముందే అర్జునుడు బయలుపడెనని దీనికి నుచిత మాచరింపుమని ధర్మజునకు కబురుపెట్టెను. ధర్మరాజు లెక్కసరిగా నున్నందున నిండెనసుము అని బదులుచెప్పెను. తర్వాత సాత్యకి ద్రుపదులు ఒక్కొక్క అక్షౌహిణి సేనతోవచ్చి పాండవులతో చేరిరి. కృతవర్మ అక్షౌహిణితో దుర్యోధనుని చేరెను, ఇక శల్యుడు నకుల సహదేవుల మేనమామ. ఇతనిని కాఫీహోటలు స్నేహముతో తన వైపు త్రిప్పుకొనవలెనని దుర్యోధనుడు తలంచెను. కాన మారువేషములతో తిరుగుచు శల్యుని ప్రయాణమునకు సౌకర్యముల నొదగూర్చుచుండెను. అందులకు సంతసించి శల్యుడు దుర్యోధనునివైపు యుద్ధము చేయుటకు నిశ్చయించెను. అంతటితో నూరకుండక పాండవుల చూచి వచ్చెదనని వెళ్ళి, అవసరము కల్గిన వారికి సాయముచేయగలనని పాండవులకును తాను కర్ణునకు సారధియైనచో అర్జునుని కనిపెట్టి యుండెదనని మాటనిచ్చి వచ్చెను.

ఇక కృష్ణమందిరమున కృష్ణుడు నిద్రించియుండగా ముందు దుర్యోధనుడు, పిమ్మట అర్జునుడును వెళ్ళిరి. దుర్యోధనుడు కృష్ణుని శిరమువైపు సింహాసనము నధిష్ఠించియుండెను. అర్జునుడు వినమ్రుడై పాదములచెంత నిలువబడియుండెను. కృష్ణుడు ముందుగనే యర్జునుని చూచి, యేమికావలయునో ముందుగ వానిని కోరుకొనుమని యడిగెను. తర్వాత దుర్యోధనుజూచి యేమిపని యన యుద్ధమునకు సాయముకోరి ముందువచ్చితినిగాన నాకేసాయముచేయుమని కోరెను. పదివేలమంది నారాయణ గోపాలబలము లొకవైపు, యుద్ధము చేయక ఊరకయుండు నే నొక్కడ నొక్కవైపు, ఈ రెంటిలో చిన్నగాన ముందు కోరవలయువాడు అర్జునుడనెను. అర్జునుడు కృష్ణునే కోరుకొనెనుగాని దుర్యోధనుడు

మాత్రము అర్జును తెలివితక్కువవలన కృష్ణుని మాయచేసి గొప్పబలము సంపాదించితినని యుత్సాహముతో బోయెను. ఇక బలరాముడు యుద్ధము చేయదలంపక తీర్థయాత్రలకు పోవనిశ్చయింప కృష్ణు డందులకు సంతసించెను. అర్జునుడు కృష్ణుని యుద్ధముచేయకున్న మంచిదియే సారధిగ నుండుమని కోరెను. పాండవులు అరణ్యవాసమునకుపోవునపుడు ద్రోణుడు వారిని అనుసరింప నిశ్చయించెను. కాని ఆకాశవాణి పాండవపక్షమున నున్నచో యుద్ధమున ధృష్టద్యుమ్నునకు సర్వసేనాధిపత్యమును, నీకు అంతకంటె తక్కువ ఆధిపత్యమును కల్గునుగాన, నీవు కౌరవపక్షముననే యుండుట మేలని పల్కినది. ఇక ద్రుపదపురోహితుని రాయబారమునకు ధృతరాష్ట్రుడు నీవు పొమ్ము. నేను ఆలోచించి తగినవాని పాండవులవద్ద కంపెదనని బ్రాహ్మణు పంపివేసి, సంజయుని రాయబారమునకు ఉపప్లావ్యమున కంపెను. తరువాత సంజయుడు ధర్మజుని చూచుటకై బయలుదేరిపోయెను. అపుడు శ్రీకృష్ణుడు అర్జునుడున్న డేరాకు పోయెను. కబురుచెప్పగానే శ్రీకృష్ణుడు లోనికిరమ్మని అంగీకరించెను. సంజయుడు వేషమువార్చి లోనికిపోగా అర్జునుడు పాదపీఠమును సమర్పింప నాతడు దానిపై చేతులుంచి తాను క్రిందకూర్చుండెను. తర్వాత సంజయుడు కార్యము ముచ్చటింపగా అర్జునునికన్న మున్నుగా శ్రీకృష్ణుడు వారి దుర్ణయముల నుచ్చరించి వారు చెడువారుగాని, బాగుపడువారు కారనిచెప్పెను. మరునాడు ధర్మజుని నిండుకొలువులో సంజయుడు మాటలాడెను, సంజయుడు భక్తుడు, ధర్మజ్ఞుడుగాన వెలితిలేకుండ పలికెను. కాని పంపినవారు నీవేమైన నిచ్చెదమన్న సంజయుడింక బాగుగ మాటాడువాడు. వారు పాలు పంపని లేకుండ పాండవుల శాంతుల చేసిరమ్మన్న చేయునదిలేక ఈ మూలముగా ధర్మాత్ముడవు అజాతశత్రుని చూచుభాగ్య మబ్బెనని తన్మాత్రమునకే చ్చెను.

సంజయు నంపినందుకు ధర్మజుడు కొంత చిడిముడిపాటు

నొందెను. సంబంధముకలవారి నేరినైన బంపక అస్వతంత్రుడగు సంజయు నంపిరేయని యాతని బాధ. సరే! ధర్మరాజు తనకు రాజ్యమిచ్చుట న్యాయమని సంజయునితో చెప్పెను. అందులకు సంజయుడు చిక్కకుండ, దక్కకుండ చెప్పుచుండెను. మరియు కోప మువసంహరింపుమనియు, బంధువులచంపి పాపముకట్టుకొనెదవా? నీ యట్టివాడవని పల్కెను. ఇక ధర్మరాజు ఆతతాయులను పాములవలె చంపవచ్చుననియు, అట్లుచేసిన భ్రూణహత్యాదోషము పోవుననియు, అసలింతకును భీష్మద్రోణులు మిన్న కుండుటచే నింతపుట్టినదనియు చెప్పెను. మరియు యుద్ధము చేయవలసి వచ్చెనని ధర్మరాజు బాధనొందగా సంజయుడు - ఇంతవరకు మీకు గడువ లేదా! ఇప్పుడు మాత్రము గడువదా! కాబట్టి యుద్ధమేల? మీరు శాంతులు గదా! అని సమాధానించెను. కౌరవులు దుష్టులై మీకేమియు నీకున్నను నీవు యుద్ధముచేయుటకంటె భిక్షాన్నము దినుటమంచిది అనెను. అందులకు కృష్ణుని కన్నులును ఎఱ్ఱబడినవి. సభలోనున్న రాజులెల్ల కోపించిరి. ధర్మజుడెట్టకేలకు ఐదుగురికి నైదూళ్ళిచ్చునట్లు చేయుమని సంజయునితో పల్కెను. అందులకు కృష్ణుడును సమ్మతింపలేదు. కారణము కౌరవులతో రాజీబడినచో వారి దుర్మార్గమును సాగనిచ్చినవార మగుదుమని భావించి యొప్పుకొనలేదు. కావున సంజయు డున్నవిషయములెల్ల మొగమోటమి లేకుండ నన శ్రీకృష్ణ డీరాజీ కుదురునదికాదు. అయినను నేనైన అచ్చటకువచ్చి భీష్మాదులతో మసచేసికొని చెప్పిచూచెదను. అట్లయిన కౌరవులు పాపమునకు, చావుకు తప్పి బ్రదుకుదురేమో యని కృష్ణుడు చెప్పి సంజయు నంపెను. సంజయు డారాత్రి హస్తిపురమునకేగి ధృతరాష్ట్రు శీలము మంచిదికాదని నిందించి మరునా డచ్చట జరిగిన విశేషములు చెప్పుదునని యింటికి పోయెను.

# 21

ఇక నాటిరాత్రి విదురుడు—జూదపుసిరి కానపడంగరాదని - చెప్పుచు, ధర్మరాజు అప్రమేయ గుణపూజ్యుడని ధృతరాష్ట్రునితో చెప్పెను. మరియు నీతుల నెన్నింటినో తెలియచేసెను. భగవద్భక్తులలో నుత్త మోత్తములు విదుర సంజయులు. సంస్కృతమున నీ విషయమంతయు ప్రజాగరపర్వమను పేరుతో నున్నది. విదురుడు స్మరించి సనత్సుజాతుని రప్పించెను. వీనిచే ధృతరాష్ట్రునకు తత్త్వోపదేశము విదురుడు చేయించెను. సనత్సుజాతుడు విద్య—అవిద్య అను రెండు కలవనియు, విద్యచే నవిద్యను నిరసింపవలెనినియు, రెండక్షరములు సంసారము, మూడక్షరములు మోక్ష మనియు నవి – "మమ, నమమ" – అనునవి అనియుచెప్పి ఆ ధృత రాష్ట్రు డడిగిన ప్రశ్నములకెల్ల సమాధానము చెప్పుచు తత్త్వోపదేశము చేసి పోయెను. సంజయుడు తొలుత ధర్మరాజు చెప్పినట్లు పిన్నపెద్దలకు ఆశీ ర్వచన నమస్కారములు తెలియజేసి, ధర్మరాజు రాజ్యము మాయది యని చెప్పినట్లుకూడ వివరించెను.

అసలు వాస్తవము విచారించినచో ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడగుటచే పాండురాజే రాజాయెను. కొడుకులు మైనర్లుగా నుండ పాండురాజు మర ణించెను. మైనరు వెళ్ళగానే హస్తిపుర సామ్రాజ్యమున పట్టాభిషిక్తుడై ధర్మరాజు ఐదేండ్లు రాజ్యముచేసిన తర్వాత దుర్యోధన ధృతరాష్ట్రుల దురాలోచనమున పాండవులు కాశీకేగుట, లక్కయిండ్లలో కాల్చుట, అయి పాండవు లజ్ఞాతులై యక్కడక్కడ తిరిగి ద్రౌపదిని వివాహమాడి మరలవచ్చి, హస్తిపుర సామ్రాజ్యము మరల నైదేండ్లు ధర్మరాజు నాధి పత్యముతో చేయుచుండిరి. అప్పటికి రాజ్యము పాండవులది యని తేలినది

కదా ! కాకున్న ధర్మజునకన్న మున్నుగా దుర్యోధను నేల అభిషేకింప రాదు ? అప్పుడు ధృతరాష్ట్రు మాయోపాయమున రాజ్యము విభక్తమైనది. అప్పటికి అర్ధరాజ్యమైన పాండవులకు కలదుగదా ! వారి పురనిర్మాణము, రాజ్యనిర్వహణము ఇరువదినాలుగేండ్లు జరిగిన తర్వాత జరాసంధుని చంపి రెండువంతుల రాజ్యము, ఈ యర్ధరాజ్యము కలుపుకొని రాజసూయాదులు చేసి మహావైభవమున నుండ నోర్వలేక పిలిచి జూదమాడి పరాభవించి పిదప ధృతరాష్ట్రుడు ఈ రాజ్యము మీదియే. అవి సుహృద్ద్యూతము, అని రాజ్యమునిచ్చి పంపెనుగదా ! పునర్ద్యూత మని పిలిచి రాజ్యముతో సంబంధము లేదు. ఈ పందెమున నోడిన పన్నెండేండ్లు అరణ్యవాసము ఒకయే డజ్ఞాతవాసము చేయవలెను. అజ్ఞాతవాసమున కనుగొన్న మరల పదమూడేడులు అట్లు చేయవలెను, అని పందెము పెట్టి ఆడిన ద్యూతము ప్రకారమైనను అనుకొన్నట్లు పదమూడేండ్లు నిర్విఘ్నముగ, అరణ్యాజ్ఞాతవాసము లొనరించివచ్చిన వారి రాజ్యభాగము వారికీక కాజేయుటకు దుర్యోధన ధృతరాష్ట్రులకేమి యాధారము కలదు. కాన రాజ్యమంతయు మాయది. తుష్యతు దుర్జనః-అను న్యాయముతో మొదలి రాజ్యము మీదియనిన, మా తండ్రి సంపాదించిన రాజ్యము మాకిండు. కానిచో నదియు మీరే కైకొని మేము ఇంద్రప్రస్థములోనుండి సంపాదించిన మా రాజ్యము మాకిండు? అదియు కాకపోయిన మాకయిదుగురకు ఐదూళ్ళిచ్చి తక్కినదంతయు మీరే గైకొనుడు, అని ధర్మజుడు చెప్పెను. మీరేమి అనెదరనుమని సంజయుడు గట్టిగా చెప్పెను.

దీనినిబట్టి పాండవుల రాజ్యము పెద్దదియని తోచుచున్నది. అందునను రెండువంతులు జరాసంధునిది. ఒకవంతు మాత్రమే పాండవులది యగుచున్నది. కాబట్టి మొత్తముమీద జరాసంధ వధానంతరము రాజ్యము మరింతపెరిగి, రాజసూయమునకు పూర్వమే జరాసంధరాజ్యము కలయుటచే పాండవుల భాగమే పెద్దది యగుచున్నది. ఇది అంతయు నిచ్చుటకు

ఇష్టపడకున్న ఐదూళ్ళయిన నిమ్మనిరని సంజయుడు మొగమాటమిలేకుండ చెప్పెను. దీనివలన సర్వశాంతి యగునని పల్కెను. ఇందులకును కర్ణ దుర్యోధను లంగీకరింపలేదు. నన్నయగారు తన భారతభాగమున దుర్యోధన ధృతరాష్ట్రుల విగతదయాహృదయులని పేర్కొనెను. నన్నయ దుర్యోధనుని ముందు పేర్కొనుటయే ధృతరాష్ట్రుని దౌరాత్మ్యాతిశయము నొడువుచున్నది. రాజ్యమివ్వకున్నచో ధర్మరాజేమి చేయగలడని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించెను? రాజు లట్టివారలగుటచేతనే—రాజ్యాంతే నరకం ధ్రువమ్—అని ప్రతిరాజును నరకమునకే పోవలయుట చెప్పబడెను. ఈ శాస్త్రములెల్ల సత్యములా అనవలదు. ఆస్తికులలో నాస్తికులలో-ఆస్తికులే నష్టపడనివారని పెద్దలు చెప్పిరి. శ్లో॥ నాస్తి చేన్నాస్తి నోహాని రస్తిచేన్నాస్తికో హతః - అని శంకరులు సెలవిచ్చిరి. నాస్తికుల మతము నిజమైన ఆస్తికులకు నష్టములేదు ఆస్తికుల మతమే నిజమగుచో నాస్తికులకు చోటులేకున్నది కావున రాజ్యాంతమున నరకమున్నది. కాని "యస్మిన్ మహీంశాసతి" అన్నట్లు రాజ్యముచేయు దిలీపాదులకు నరకములేదు. ఏలయన వారు ధర్మప్రభువులు. ఒకసారి దిలీపుడు రాజ్యము చేయుచుండగా బోగముసాని వస్త్రము వాయుదేవునిచే నెగురకొట్టబడెను. ధర్మముతప్పి నడచిన వానిపై దిలీపుడు కోపించి, వాయుదేవుని పట్టుకొని రమ్మని భటుల కాజ్ఞనిచ్చెను. వాయు పట్టుకొనిరాగా. అశ్లీలచేసితివని దిలీపుడు వాయువును ప్రశ్నించెను. అందులకా వాయుదేవుడు నిజమేయని యొప్పుకొని తనపని గాలి వీవనవేయుట యనియు, కాబట్టి తనతప్పు లేదనియు చెప్పగా, తన మనస్సున కామము లేదని చెప్పుమని దిలీపుడు వాని శిరస్సుపై చేయిపెట్టెను. అందులకు శిక్షింపుమని వాయువు దిలీపుని యడిగెను. ఇదియే నీకు పరాభవమని చెప్పి దిలీపుడు వానిని పొమ్మనెను. కాబట్టి రాజు ధర్మవర్తనుడై యుండవలయును. రాజు లంచమునకు లొంగరాదు.

ధృతరాష్ట్రున కెంతయేని మేలుచేసినవాడు పాండురాజు. ధృత రాష్ట్రునిచే నూరశ్వమేధములు చేయించెనట. సామంతులచే మ్రొక్కించె నట. అట్టి పాండునకెంతయో కీడుచేసినవాడు ధృతరాష్ట్రుడు. కాబట్టి కృతఘ్నుని పీనుగునైన కుక్కలును తాకవని విదురుడు మున్నే చెప్పెను. ధర్మరాజు రాజ్యభాగ మీకున్న యుద్ధమునకు రాగలడని సంజయుడు చెప్పెను. అందులకు దుర్యోధనుడు ఎవరితో రాగలడనియు? ధృతరాష్ట్రు డేమి తీసికొని రాగలడనియు ప్రశ్నించిరి యుద్ధమునకు అర్జునుడు వచ్చి నచో కృష్ణుడు సారథియగును, కనుక ఆ భగవంతున కెదుటనంటి యుద్ధ మెవ్వరును చేయజాలరని చెప్పెను. ఇంకను వారి ఆయుధములు, వారి శక్తిసామర్థ్యములును చెప్పెను. కాని అట్టివారినిగూడ నెదిర్చి నిలువగలనని కర్ణుడు పల్కెను. అప్పుడు భీష్ముడు వానిని యుపాలంభించెను. అందులకు కోపించి కర్ణుడు భీష్మానంతరము గాని తాను ఆయుధముపట్టనని శప థము గావించెను. అంతియగాక తాను అర్జునుని చంపువరకు కాలిగోళ్ళు తీయననియు ప్రతినపట్టెను ఇట్లు కౌరవులలో పుట్టిన కలవరము పాండవు లకు శుభసూచకమే యైనది.

ఇక ధర్మరాజు కృష్ణుని రాయబారిగ బంపనెంచి తమ్ములతో ద్రౌప దితో శ్రీకృష్ణుని దేరాలోనికిపోయి—

కం॥ ఆపదఁ గడవం బెట్టగ
నోపి శుభంబైనదాని నొడగూర్పను మా
కీ ఘట్టువునకు పాండు
క్ష్మాపాలుడు నిన్ను జూపి చనెను మహాత్మా॥

అని ప్రార్థించెను. ధర్మజుని భక్తిస్నేహవిశ్వాసములకు శ్రీకృష్ణుడు దిమ్మెరపోయి నీవేమిచెప్పిన నది నేనవశ్యత చేసెదనని చెప్పెను. దానికి

ధర్మజుడు కౌరవసభకేగి తమలోపము లేకుండ మాటలాడి సంధికుదుర్చు కొని రమ్మని, మమ్ము నిట్లు నిలువబెట్టుమని, బంధువుల చంపనోపనని పలువిధముల చెప్పెను. ఇట్లు ధర్మరాజు భీమార్జును లందఱును వరుసగా తమ తమ సందేశముల విన్పించిరి. కాని వీరందఱును ఏదో ఒకవిధముగ సంధి నభిలషించి చెప్పిరి. సహదేవుడు మాత్రము యుద్ధమే యుక్త మనెను. ఏలన భాగాస్పదులమగు అన్నదమ్ముల బిడ్డలము మీకు రాజ్యమిచ్చి పోయి మేము పదమూడేండ్లు అరణ్యాజ్ఞాతవాసములు చేసితిమికదా! అట్లే మాకు రాజ్యమిచ్చిపోయి మీరును పదుమూడేండ్లు విఘ్నేశ్వరుని బొడ్డులో వ్రేళ్లుపెట్టిన వైశ్యులవలె అరణ్యాజ్ఞాతవాసముల సల్పివచ్చిన తర్వాత మీకీవలసిన రాజ్యభాగమును మేమిచ్చెదము. కాకున్నరా అరచేత ప్రాణములు పెట్టుకొని యన్నాడు మాయలు వన్ను నేర్పులిక చెల్ల వనియు పల్కెను.

ఇక పాంచాలదేశమున బుట్టి మహావీరులగు పాండవుల ధర్మ పత్నియై, ప్రతివింధ్యాదులగన్న వీరమాతయగు ద్రౌపది తాను పరాభవ మందియున్నదిగాన, ఈ రాజీప్రయత్నములు చూచి, విని భగ్నమనో రథయై కనలి కృష్ణునితో గద్గదకంఠయై తన గోడ నిట్లు చెప్పు కొనినది. అంతలంతలు పనులుచేసి దాసులకు దొరలు తిండిపెట్టరా? అదియు లేకుండ వెడలనడచి యౌరా! ఇప్పుడు హక్కు ఏమియు లేని మనపంటి సంజయునిచేత చెప్పి రాయబారమా! సారమేమున్నది! ఇచ్చునది, పుచ్చుకొనునది యేమియు లేదుగదా! శాంతింపుడనియా! శాంతింపకేమున్నది. మా పెద్దతండ్రి శాంతింపు మన్నాడు. ఇంకనేమి కావలెనని ఈ కంటినీరు తుడుచు పైపై మాటలకే యుధిష్ఠిరుడు మనసార సంతసించెను. మునుపే శాంతుడగు ఈ అజాతశత్రువునకు శాంతి సాధ నము లెవ్వి సంపాదించుకొనవలెను. యుద్ధమైన నెవరు గెలుతురో? ఎవరోడుదురో? ఓడిన చచ్చుటకన్న కష్టము అని గదా యుధిష్ఠి

రుని మాటలు. ఉన్న గౌరవముకూడ పోవునట్లు తమ కీ తక్కువ దనము నేల కొనితెచ్చుకొనవలెను. విచారించిన ఈ సంధి వారికి మంచిది గాని మనకు కాదు. తన వారిని కొట్టలేక చేతులాడక ఈ మెత్తబడుట కాని పోరిలో మర్దింపదలచిన కౌరవుల గెల్పు విషయంబున శంకింప బని లేదు. జయము మనదే! ఏ కీడైన సైపవలెననుటకు వారేమి బ్రాహ్మణులా! వీరు శాంతించినను వారు కోరిన ఐదు ఊళ్ళైన నిచ్చెదరా! ఐనను నేను పరాయిదానగాని, వారు వారు ఒకతెగగాన వారికి వారంత మాత్రమీకుందురా! దీనికి తార్కాణము, వారు వీరు గలసి నన్ను సభ కీడ్చి జుట్టు పట్టి లాగి గుడ్డలూడ్చి పరాభవించిరిగాని వారి మర్యాదల కేమియు లోపములు లేవుగదా! కృష్ణా! యాజోపయాజుల వరముతో అగ్నికుండమున బుట్టితిని. భరతవంశమునకు పేరు తెచ్చి నిలువబెట్టిన పాండురాజునకు కోడలనైతిని. జనవంద్యులగు భర్తల నేవుర బొందితిని. నీతి పరాక్రమముల నారితేరిన కొడుకుల గంటిని. కూ అనిన నొక్క మాకున నగపడు పుట్టింటి అండగలదు.

ఇవి యన్నియు నట్లుండ గుణగరిష్ఠుడవగు నీవు దేవుడవు. నీ చెలియలిని సుభద్రను జూచు ప్రేముడి చూపుకన్న మిన్నయగు గౌరవ ముతో కలిసిన బాంధవముతో సంభావించెదవు నన్ను. ఇట్టి నన్ను ఒక చెప్పరానివాడు వసుధామరుల మంత్రములతో పవిత్రతమములైన వారి ధారలతో రాజసూయావభృదమున పావనతమములైన వెంట్రుకలబట్టి ఈడ్చుచుండ బ్రాహ్మణులకే శాంతియుండదే? క్షత్రియోత్తముల కక్కటా యిట్టి శాంతి ఎక్కడనుండి వచ్చినది. అయినను జూదములో మాటపో యిన వచ్చునసత్యమున కోర్వక సత్యసంధులు అప్పటి కూరకున్నను అప్పటినుండి యెన్నియోమారులు పదుమూడేండ్లు గడచిన శత్రువధ మొనర్చెదము, నీ పరాభవ దుఃఖము పోకార్చెదము అని నన్ను ఊర డించిన మాటలే యేట గలిపిరి. అయిన వారిజాక్షులయెడ అబద్ధము లాడ

వచ్చునని యే కవియైన చెప్పెనేమో? నా యన్నా! యిన్ని యేల? ఆలోచనము కూడ లేనివాడై కోడలిక నంకమువచ్చిన కులమున కెల్ల కలంకమనక నన్ను దాసిగ చేసిపుచ్చిన మహాపురుషుని పాలికి నా పతులు మా పెద్దతండ్రి యని సంధికి పోవుచుండ నేనును తగుదునని యా కొంపలో కోడరికంబు సేయ చెచ్చెర పోవుదునా! అటుగాక వారి దృష్టిలో దాసీని గాన శృంగారపు కట్టగొని యీడ్చిపెట్ట పోవుదునా? ఈ నాగతి నిర్ధారణ చేసి లోకవంద్యా! నీవు సంధికి పొమ్ము. రక్కసతాల్మితో ఈ పరాభవము నిన్నినాళ్ళు నిప్పునొడిలో ధరించునట్లు లోగ్చితిని. ఇప్పుడు కూడ నిది ఆరకున్న నన్ను నిర్ధహింపకుండునా? తేజముగల భర్తలు, సర్వలోక పరిపాలకుడవు, తోబుట్టువగు నీవు కలిగి నన్నీ సొదతోనే చావుమనెదరా?

అన్నా! ఒక్కటి చెప్పెద వినుము- పాండవుల కౌరవుల నొక్కటిగా నుండుమనుము పాండవవీరుల ననికి తేకుము, రాజీమాటలేల? యుద్ధమును కుదుర్చుకొనిరమ్ము. నా పరాభవమును సహింపలేని నా కొడుకులు ఐదుగురు, సుభద్రకొడుకును ముందుపెట్టుకొని యుద్ధమునకు నడచెదరు. చెప్పినమాటవిను కొడుకులతో సైన్యములగొని వృద్ధుడగు మా తండ్రి వీరికి బాసటగా రాగలడు, ఇట్లు నాకసి తీరును అని ద్రౌపది యేడ్చుచు వెండ్రుకలు కృష్ణునిముందు బెట్టి, దేవా! ఈ వెంక్రలు బట్టి యీడ్చిన ఆ చేయిముందు ముక్కలు ముక్కలయిపోయి, దానికి మూలమగు తన దుష్కృతమును దలచి యేడ్చిన తర్వాత దుశ్శాసనుడు చావవలెను. తొడలువిఱిగి పడియున్న దుర్యోధను పీనుగును నేను, ధర్మజుడు కన్నార జూడకున్న నెవరి పరాక్రమము లెందులకు? అని యేడ్చు ద్రౌపది నూరార్చి దాసీలచే వెండ్రుకలు ముడిపించి, తల్లీ! నీ యేడ్పులవంటివి కాని శత్రువుల పెండ్లాల యేడ్పులువిను సమయము వచ్చినది. నీవు ఏడ్వనేల? నేను కొంచెము నెమ్మదిగా ఆలోచించి చెప్పిన

మాట మేరువు తిరిగినను నెరవేరకుండదు. శత్రుసంహారముచేసి, నీ పరాభవ మడగించి తేజముననొప్పు భర్తల కనుగొనెదుగాక ! యముని వాహనమగు దున్నపెడలోని గంటలమ్రోత వినబోవు కౌరవులకు నా రాజీ మాటలు చెవికెక్కవు. అని అనేకవిధముల ద్రౌపది నూరార్చి పాండవులు మరల మరల చెప్పు నప్పలుకుల నూకొనుచు శ్రీకృష్ణుడు రాజీయైన మంచిదేకదా ! తప్పక అది యగునని నిరుత్సాహముగ నుండకుడు. సైన్యములు, ఆయుధములు సిద్ధముచేసికొని ఎప్పటికప్పుడు సిద్ధముగా నుండుడు. సంధి కాకపోయిన పక్షమున మనము శాంతముగ మాటలాడుట పెద్దల మదికెక్కుట. వారే యుద్ధముకోరిన వారిపగిది వీరివారిని చంపిన పాపము వారికి సంధించి, నేను పున్నెము మూటగట్టుకొని వచ్చెదను-అని చెప్పి భగవంతుడు హస్తిపురికి రాయబారిగ పోయెను.

# 22

శ్రీకృష్ణపరమాత్మ పాండవుల రాచకార్యము నిమిత్తము బయలు దేరి ఆ రాత్రి కుశస్థలమున నిలచి బ్రాహ్మణు లాహ్వానింప కొలది పరి వారముతో విందుల నారగించుచున్నాడని గూఢచారులు చెప్ప విని, ధృత రాష్ట్రుడారాత్రి ముఖ్యులైనవారితో కొలువిచ్చి దుర్యోధనునితో సర్వలోకము లకు అభిగమ్యుడగు భగవంతునకు అభిగమ్యులమైతిమి. ఇంతకన్న ఏమి కావలెను? మన గృహములెల్ల కస్తురితో అలికించి, కర్పూరముతో ముగ్గులు వెట్టించి, చాందినీలు కట్టించి, పూలపఱపులతో అలంకరింపు మనెను. ఆ దుర్యోధనుడు మనయిల్లు మనము అలంకరించుకొనుటయే గదా! దీనిలో నష్టమేమియని మనసున తలచి అంగీకరించెను. సంతోషా వేశమును అణచుకొనలేక మఱియు ధృతరాష్ట్రుడు అందరు వినుచుండగ నాయింటిలోగాని, దుర్యోధను నింటిలోగాని, దుశ్శాసను నింటిలోగాని, ఇంకను మనవారి నివాసములలో నేయేవస్తువు శ్రీకృష్ణున కింపునింపునో, అదియెల్ల ఆ దేవునకు నే నొసంగెదనని బిగ్గఱగా చెప్పెను. దానికి విదు రుడు నీకు ఉపకారముచేసిన తమ్ముని కొడుకులకు ఐదు ఊళ్ళు ఈయలేని నీకు ఇంతటి త్యాగబుద్ధి యెక్కడనుండి వచ్చినది? నీ తలపు నేను కను గొంటిని. ఏదో ఒకవిధముగ శౌరిని లంచమిచ్చి మోమోటబెట్టి పాండవుల కేమియు లేకుంట ఎగురకొట్ట నెత్తిన యెత్తిదిగా తోచుచున్నది. మేరు వంత ధనరాశి నిచ్చినను శ్రీకృష్ణు డర్జును నెడబాయునా? ఇవి అన్నియు నక్కఱలేదు. పాండవుల పనికై విజయముచేయు ఆ దేవుడు చెప్పిన పలుకులు మర్యాదగా విని అంతయో ఇంతయో వారలకిచ్చి సమాధానపడు

టయే ఆ స్వామి నారాధించుట యగును. కాన ఆ పనియందు జాగరూకుడ వగుమనెను.

దుర్యోధను డదివిని విదురుడు చెప్పినట్టిదియే యగును. యాద వుడు భేదతంత్రమున పాండవులనుండి వేరుపడువాడుగాడు. అదిగాక మనము వానికి లంచమిచ్చిన అసమర్థులమై యనుసరించినట్లు తలంప గలడు. కావున ఒకడుగావచ్చిన వాని మనమందఱము కలసి కట్టి కొట్టున బెట్టిన పాండవులు దిక్కులేక మరల నడవుల కేగుదురు. వారికి సాయ మైన సామంతులు కాందిశీకులగుదురు. నే నప్రతిహతముగ రాజ్య రమా విలాసముల ననుభవించెద నిది నా మతము, అని తన అభిప్రాయము నెఱుకచేసెను. అది విని భీష్మాదులెల్ల దిమ్మరపోయి యిట్టి అవినీతుల కేమిసేయగలమని దిగ్గున లేచిపోయిరి. ధృతరాష్ట్రుడు అశక్తత తోప కొడుకుతో దేవుడు అఘటనఘటనా పండితుడు. సర్వలోకైకవీరుడు. జ్ఞాతులమగు మనల గలసి మెలగుడని చెప్పుటకు దూతగా వచ్చుచున్నాడు. అట్టివాని బాధింపరాదని రాజనీతి. ఇదిగాక భగవంతుడు ఇంటికివచ్చుట ఇంతటిమేలని చెప్పశక్యమా ? అతండేమి చేసెరా పాపాత్మా ? అని భర్త్సించెను ఇట్టులా రాత్రి వేగెను. కృష్ణుని మరియాదగా తీసికొనివచ్చు టకు తగినవారి నంపిరి. దేవుడు కాల్యకృత్యములు తీర్చికొని వీరి ఆహ్వా నముతో వచ్చుచుండ దుర్యోధనాదు లెదురేగిరి.

శ్రీకృష్ణుడు హస్తిపురికి వచ్చి మొగసాలవద్ద రథము డిగ్గి సాత్య కియు కృతవర్మయు నిరుపార్శ్వముల రాగా దుర్యోధనాదులు ముందు సందడిబాపుచుండ ధృతరాష్ట్రుని కొలువునకు వచ్చి ఉభయకుశలోపరి, పాండవుల సౌజన్యము విశదమగునట్లు ధర్మజుడు చెప్పినరీతి పెద్దలకు నమస్కారము, సములకు నాలింగనాది గౌరవములు, చిన్నలకు దీవనలు, చెప్పి కొంతతడికి దుర్యోధను నింటికి పోయి అచ్చట ముచ్చటలతో

దుర్యోధనుడు తాను శ్రీకృష్ణునకు చేయించుచున్న విందును వీనులవిందు జేయ నా దేవుడు మెల్లగా తానావిందు కుడువనొల్లనని చెప్పెను.

దుర్యోధనుడు కర్ణాదుల గలుపుకొని మారాజున కిష్టుడవు, మాకు బంధుడవు మాయింట భుజింప ననుటకు తగినకారణము లేదనెను. భగవంతుడు వానిచేయి చేత తెమల్చుచు నేను ప్రస్తుతము పాండవ కార్యార్థిని. దూతను నేను నీయింట భుజించిన - తరువాత కార్యము నెరవేర కున్న కృష్ణుడు వారి సౌమ్మితిని మోమోటపడి కార్యము చెఱచెనందురు. దూతలు ముందుగా శత్రులింట భుజింపరాదు. వారును వారిం గుడువబెట్ట రాదు. దైవవశమున దేహమున కేతెవులు వచ్చినను అది వారి దుష్కృతి యందురు. మేము శత్రువులమా అందువేమో? సందేహమా! నాకు పాండవులు ప్రాణములు. వారిని జూచి సైపనివాడవు నీవు. ప్రాణముల బాధించువారు శాత్రవులే కారా? నీవు ప్రేమగా పిలిచి పెట్టుటలేదు. నాకాపద యనగా నన్నము పెట్టువారు లేకపోవుటలేదు కాన నీయింట నిప్పుడు కుడువనొల్లను. నీవారల ఇంటను భుజింపను. ఈ యూరిలో విదురు డొక్కడు యోగ్యుడని ఆతని అన్నము తినదగినదని నిర్ణయించితిని. కాన అచటకు పోయెదనని చెప్పి - యొప్పించి లేచిపోవుచుండ ముందుగా ఇండ్లకు పోయివచ్చి దారిలో శ్రీకృష్ణుని-మా యిండ్ల కానుక లాయత్తము చేసి వచ్చితిమి మహాత్మా! విజయముచేసి వానినెల్ల గ్రహింపవలయునని ప్రార్థించు భీష్మ ద్రోణాదులతో మీ యంథఱ యిండ్లకు వచ్చినట్టే మీ కానుకలెల్ల గ్రహించినట్టే యని విదురునితో వాని యింటికేగెను.

భీష్మాదులును మోములు చిన్నబుచ్చుకొని యిండ్లకరిగిరి. దీనిలో దేవుని యభిప్రాయము—అన్నలు తమ్ములు జూదమాడినను వారిరాజ్యము వీరు, వీరి రాజ్యము వారు లాగుకొనినను మీరు సంబంధము కలిగించుకొన వచ్చును-ఉండకుండవచ్చును. కాని ఒక మహాసభలో సామాన్యస్త్రీకి పరా

భవమగుచున్నను సమర్థులు సైచిచూడరాదు. అందును దేవాంశలో అగ్ని కుండమున జనించిన ప్రసిద్ధయగు రాజ్ఞికి పరాభవము జరుగుచుండ శక్తి గలిగి వారింపకుండుట, అది చేతగాకున్న లేచిపోకుండ అక్కడనే చూచు చుండుట యిది అనుమోదించుట అను నేరమున జేరుచున్నది.

శ్లో. కర్తా కారయితా చైవ ప్రేరకాశ్చానుమోదకః
సుకృతే దుష్కృతే చైవ చత్వారస్సమభాగినః॥

అని యున్నదిగాన, మీరపరాధులలో భాగస్థులుగాన మీ కానుక లక్కర లేదని దేవుని అభిప్రాయము. అది యెఱిగిన భీష్మాదులు కన్నములో తేలుకుట్టిన దొంగలవలె సరిబుచ్చుకొనిపోయిరి భగవంతునకు భక్తుడగు విదురుని యింట విందెట్లు జరిగెనో ? అది అవాఙ్మానసగోచరము, అనుభవైకవేద్యము. విదురుడు రాచకార్యము ప్రసంగించి రాత్రి చెప్పిన దుర్యోధను దురభిమానమును వ్యక్తపఱచి, ఈ రాజీకి నీవేల వచ్చితివి ? ఇంత టితో బొమ్మనెను. బంధువులలో విరోధమువచ్చి కొట్టుకొనుచుండ శ్రీకృష్ణు డడ్డమువచ్చి వారింపకపోయెను, అని లోకులు అనుకొనకుండ రాజీకి తగిన ప్రయత్నమంతయు శక్తివంచనము లేకుండ చేసెదను. మంచి పని చేసి దానివలన పుణ్యము నార్జించెదను. కాదనిన దుర్యోధను నెత్తిన ఈ పాపమెల్ల గట్టిపోయెదను. వా రేమి చేయుదురోయని భయపడవలదు. నేను నిక్కమగ్గిన అందు ఒక్కడేనియు బ్రమకజాలడు. అదియును పాండవులకు మేలేయని సమాధానించి నిదురపోయి మరునాడు తగురీతి దుర్యోధన ప్రభృతు లాహ్వానింప ధృతరాష్ట్రు నిండుకొలువున కా స్వతంత్రుడు పోయెను మునులు భగవంతుని సంధివాక్యచాతుర్యమును వినుటకు విచ్చేసిరి. పౌరులు, జానపదులు, యుద్ధార్థమువచ్చిన రాజులు, నిండిన కొలువున శ్రీకృష్ణు బూజించిరి. కృష్ణున కిరుపైపుల సాత్యకి కృతవర్మలు కూర్చుండిరి. వెనుకపీఠమున చేతులుమోపి విదురుడు కూర్చుండెను.

తక్కినవారెల్ల నుచితపీఠముల కూర్చుండిరి. కర్ణ దుర్యోధను లేకాసనమున నుండిరి. అందఱు విం జంబొకిడినభంగి నవశము దాకొరితచిత్తవృత్తులై యుంపగ, ఆ సర్వవందితుడు సభ్యులనెల్ల ఆదరముగ జూచుచు స్మితపూర్వముగ ధృతరాష్ట్రు నామంత్రించి యిట్లు పలికెను.

"భరతవంశము ధర్మమునందు పరాక్రమమునందు పేరుపడసినది. అందు శంతనుడు వంశకర్త. సర్వసమర్థుడగు భీష్ముడు తన తండ్రికినై రాజ్యము వదలుటచే వాని ప్రత్యక్షమున సవతితల్లి కొడుకు చిత్రాంగదు తరువాత విచిత్రవీర్యుడు రాజ్యముచేయుచు స్వర్గతుడైన వాని క్షేత్రముల యందు ధర్మముగ క్షేత్రజ సంతానము సంపాదించి భీష్ముడు వంశ మంతరింపకుండ కాపాడెను. అందు నీవు నీతమ్ముడు పాండురాజు ధర్మోత్తరులరు. నీ యింద్రియ వైకల్యమున పాండురాజు రాజ్యముచేయుచు నిన్నను వర్తించుట లోకవిదితము. వాని కుమారులైదుగురిని వాని యనంతరము మునులు మీకు అప్పగింప తగురీతి బెంచి వారిని రాజ్యమం దభిషిక్తులచేసి వారివలన తేజోలాభముల నందితివి. వారు దిగ్విజయ మొనరించి రాజసూయాదు లొనర్చి మహావైభవముననుండ నీకొడుకు జూదము నెపమున వారి భంగపెట్టి అడవులకుబంపుట లోకవిదితము. వంశక్రమాగతమగు సుచరిత్రక్రమ మిప్పుడు తప్పనేల ? వారి బిలిపించి తగు పదవినినిలిపి వంశప్రతిష్ఠ నిలుపుకొనుము. ఎంతయున్నను చాలకున్నట్లుండుట స్వభావము. దాని మార్చుకొనజాలినప్పుడే పురుషుని పౌరుషము. కావున మామా! ఆలోచింపుము మా తండ్రిచెప్పినట్లు అరణ్యవాసము, అజ్ఞాతవాస మట్లొనర్చివచ్చిన మాకు మాభాగ మీక ఎవ్వారేమి చేయగలరు. ధనకనకవస్తువాహనాది భోగసమయముల మా పెద్దతండ్రి మమ్మును వెలిబెట్టి తన కొడుకులనే అనుభవింపజేయునా? ఆతడు బ్రదికియున్న నూరేండ్లకు మాకు నాయన కన్న వేరుగా నొరులు రక్షకభటులు లేరు అని పాండవులు చెప్పమనిరి. నీ వేమనియెదవో? అనుము. నీ కొడుకుల మదినున్న లోభము

మానిచి వారిని నీలోనికి దెచ్చుకొనుము. నీయందలి భక్తితో వారిట్లను చుండిరిగాని వారేమియు ననదుగారు. అవి అన్నియు తలంచుము. నే నా వైపుననుండి వారితో వచ్చుచుండ నాకెదురై మీకు గెలుపుగొనలేరు. నిశ్చయము. నా ప్రార్థన నంగీకరించి వారి నీలోనికిదెచ్చుకొని కీర్తినొందుము. నీ కొడుకులు నూటయైదుగురునై భీష్మాదులు మేలుగోరుచుండ రాజలోక మెల్ల నీకు భృత్యులై మెలగ అటునిటు యుద్ధమునకు వచ్చినవారెల్ల ఉల్లాసముతో ఇండ్లకేగ జగము మేలెట్లుండునో అటు చూడుము" అని ఈ విధముగా భగవంతుడుచెప్పి, మునులచే చెప్పించి, ఇందు ఎవరికి కీడైనను నీకు దుఃఖము తప్పదు. విమర్శించుకొనుమని చెప్పెను. భీష్మాదులును చెప్పిరి.

ఇవి యన్నియు లెక్కసేయక, దుర్యోధనుడు దేవనితో కృష్ణా! విచారించినచో నావలన నేమియు తప్పులేదు. ధర్మజుడని పేరుగాని జూదపువ్యసనముగల ఆ రాజు శకునితో జూదమాడి ఓడిపోయెను. అతడు దానిలో తెలివిగలవాడగుటచే గెలిచెను. నా మంచితనముతో ఆ శకుని వలన నాకు కొంత సంక్రమింపవచ్చును. ఇంతమాత్రముతో జూదగాండ్ర జూదము వారించుటకుగాని వారు ఓడినధనముల వారి కిప్పించుటకుగాని నా పూచి యేమిగలదు. పాండవులు లేనినేరములన్నియు నాపైమోపి పలుపుర ప్రోపుచేసికొని నాపై నెత్తి విడిసిరిగదా! ఇది తెల్లము. ఇదిఅంతయు జూచి ఆత్మరక్షణమునకై నాకు తగినవారల నేనును ప్రోవుచేసికొంటిని. ఇంత అయిన తర్వాత భయమేటికి? అదికాక నా చిన్నతనమున అంధుడైన మా తండ్రి తమ్మునికొడుకులని పక్షపాతముతో ఏదియైన సంక్రమింపచేసినను న్యాయమునకది యెల్ల నెట్లు లొప్పుకొందును? పాండవులకు వాడి సూదిమొన మోపినంత భూమియు నీయను. వారేమి సేయుదురో సేయనిమ్ము. వారుగాని మేముగాని సంగ్రామంబునం జయంబుగొని రాజ్యముచేయుట నిశ్చయించితిని, అని వక్కాణించెను. అనేకు లనేకవిధముల చెప్పిరి. మనవంశములో పెద్దవానికి రాజ్యాధికారము లేదు. ప్రతీ

మహారాజునకు ముువ్వురుకొడుకులు. వారిలో దేవాపి పెద్దవాడు. వాడు చర్మరోగముగలవా డగుటచే వాని రాజునుగా చేసికొనుటకు ప్రజలొల్ల రైరి. రెండవవాడు బాహ్లికుడు. మాతామహారాజ్యము నాక్రమించుకొని యుండి ఇది వదులుకొనెను. మూడవవాడు శంతనుడు రాజాయెను. శంతను సంతతిలో నేను రాజ్యము వదలితిని. సత్యవతి కొడుకులగు చిత్రాంగద విచిత్రవీర్యులలో చిన్నవాడు విచిత్రవీర్యుడు రాజయ్యెను. విచిత్రవీర్యుని సంతతిలో ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడగుటవలన రెండవవాడు పాండురాజు రాజాయెను. కనుక నీకు రాజ్యములో పాండవులు దయ దలచి యీకున్న హక్కేమియు లేదని భీష్ముడు చెప్పెను.

శ్లో॥ మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం భాగమిచ్ఛసి
అరాజపుత్రోహ్య స్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి॥

నాకు రాజ్యములో భాగములేనిచో నీకు భాగమెట్లువచ్చును? రాజ్యము చేసినవాని కొడుకునకు రాజ్యము వచ్చును. స్వామియైనవాడు సంపాదింప వచ్చును. నీవు రాజ్యముచేయనివాని కొడుకువు. పాండవుల కన్న స్వామివి కావు. నీవు రాజ్యముగోరుట పరధనము నపహరింప దలచు టయే యని ధృతరాష్ట్రుడనెను.

శ్లో॥ రాజ్యంతు పాండో రిదమప్రధృష్యం
తస్యాద్యపుత్రాః ప్రభవంతి నాన్యే
న్యాయాగతం రాజ్యమిదంచ కృత్స్నం
యుధిష్ఠిరశ్శాస్తువై ధర్మపుత్రః॥

ఇది పాండురాజు రాజ్యము కాదనువా రెవ్వరును లేరు. వాని కొడుకు లిప్పుడు సర్వసమర్థులై యున్నారు. కాన మనకు హక్కులేదు. న్యాయముగా ప్రాప్తమైన ఈ రాజ్యమంతయు ధర్మపుత్రుడగు యుధిష్ఠి

రుడే పరిపాలింపవలయును—అని గాంధారి చెప్పినది. ఇట్లెందరు చెప్పినను వినక దుర్యోధనుడు కొలువుకూటమునుండి దిగ్గునలేచిపోయి, దుష్టచతుష్టయము కలసి శ్రీకృష్ణు బట్టుకొను సన్నాహమున నుండెను. అది కనిపెట్టి సాత్యకి తనవాడగు కృతవర్మతోజెప్పి యాదవ సైన్యములతో బయటివారలనెల్ల నీవు జంపుము. లోపలివారినెల్ల నే జంపెదను, అని ఏర్పాటు చేసివచ్చి శ్రీకృష్ణునితో రహస్యముగ చెప్పెను. శ్రీకృష్ణుడు దీని కింత రహస్యమేల? అందఱకు తెలియునట్లు పెద్దగా చెప్పుమనెను. సాత్యకి వారి అశక్తదుర్జనతను సభకు ఎఱుకచేసెను.

అప్పుడు శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో మీరుమీరు అన్నలు తమ్ములు. కొట్టుకొనిచచ్చుచుండ వలదని మధ్యవర్తిగాచెప్పవచ్చిన నాపై నింతయలుక ఏల? నాపైకి వచ్చిన దుర్యోధనాదులు రెండుదెబ్బలు కొట్టిన నేనొక దెబ్బయైననుగొట్టి వారిపని చక్కబెట్టి పోయివచ్చెదను సెలవిమ్మనెను. అప్పుడు గాంధారి ధృతరాష్ట్రులు విదురునిబంపి దుర్యోధను బిలిపించిరి. వాడు మొగము రాజుచుండవచ్చి సభలో గూర్చుండెను. అప్పుడు ధృతరాష్ట్రుడు గాంధారితో నీకొడుకెంత అవినీతుడో చూచితివా? అనెను. గాంధారి—నీ కొడుకు దుర్మార్గుడని యెఱిగి వానివెంటబడి నీవు పోనేల? వాని పెత్తన మేమికలదు? రాజ్యము పాండవులు నీకిచ్చినది. అందులో నీవు వారల కేమి యిచ్చెదవో నీనోటితో నను ము. ఎవ్వరేమి చేయగల రనెను. ధృతరాష్ట్రుడావిషయమున నోరుమూసికొని భగవంతునితో కృష్ణా! నాకొడుకు నెట్లయిన మాటలుచెప్పి యొప్పించమని ప్రార్థించెను. శ్రీకృష్ణుడాయా యీ మాటలు చెప్పుచు నేనొకడననియే కట్టివేయుటకు త్రాళ్ళు సంపాదించితివి కాబోలు! ఇంకను చాలత్రాళ్ళు కావలయునని నవ్వి విశ్వరూపము జూప నందరు నిశ్చేష్టులైరి. భీష్మాదులు మునులు ఆనందనిమగ్నులై ఆ రూపము గనుగొనుచుండిరి. ధృతరాష్ట్రుడది తెలిసికొని ప్రార్థింపవానికి దివ్యదృష్టి ప్రసాదించిన గాంధారియు కంటిపట్టమువిప్పి దాని తిలకిం

చెను. అంత నారూప ముపసంహరించి భగవంతు డూరక సభాభవనము వెలువడెను. వానివెంబడి ధృతరాష్ట్రుని సభయెల్ల వెలువడినది. ముని లంతర్హితులైరి. వారందఱితో భగవంతుడు కుంతియింటికివెళ్ళి మేనత్తను ప్రశంసించి కౌరవసభలోని విశేషములుచెప్పి నీ కొడుకుల కేమిచెప్పె దవో? చెప్పుము. మా యమ్మ ఏమనినది? అని వా రడుగుదురుగదా! అనెను.

కుంతి నీ విక్కడకేల వచ్చితివి? జూదమునాడు సత్యము చెల్లించు కొన అడవిపాలైన నా కొడుకుల నేమియు అనలేక ఊరకుంటిని. దాని వలన పాండురాజు తేజమే యశమే అంతరించి పోయినది. ఇప్పుడు దాని నెమకితెచ్చుకొనవలదా? నన్ను వీరమాత ననిపించుమని యుధిష్ఠిరు నితో చెప్పుము. చేతులబలిమితో వచ్చిన కలిమి ననుభవింపుమని వారల కెల్ల జెప్పుము, విదుల యను వీరమాత చరితము వారలకు జెప్పుము. రాచకార్యములలో నాయంతది ద్రౌపది. దాని యిష్టప్రకారము చేయుమని చెప్పుము. దేనికైనను నిర్వాహకుడవు నీవే యున్నావు— అని చెప్పి వద లెను. సెలవు తీసికొని కృష్ణుడు ఉపప్లావ్యమునకు వచ్చెను.

అట్లు ప్రయాణమై పోవుచు కర్ణు నొంటరిగా తీసికొనిపోయి నీవు సూర్యుని వరమువలన కుంతికి పుట్టితివి. కాన నీవును పాండవుడవే! సూతపుత్రుడవు కావు. నేనీరహస్యము దెలుప విని నిన్ను పాండవులు చేర్చుకొందురు. వారికి వీరికి ప్రభుడవు నీవు- అని ప్రలోభింపచేసెను. దానికి కర్ణుడు— కృష్ణా! ఈ విషయము నేనింతో యంతో వినియుంటిని నీ మాటతో గట్టిగా నమ్మితిని. కాని అతిరహస్యమగు నా జన్మమిపుడు బయటబెట్ట నేల? దానివలన మాకు గౌరవము లేకపోగా అర్జునున కోడి వారితో కలిసితినని నాకు, కర్ణునకు భయపడి వాని గలుపుకొనెనని యర్జు నునకు లోకాపవాదము కలుగగలదు. ఇంతయేల? నే నన్ననని తెలిసిన ధర్మరాజు రాజ్యము నంగీకరింపడు, అట్టి ధర్మాత్ము డీ లోకమును శాశ్వత

ముగ నేలవలదా? మాబోంట్లెల్ల ఈ మహాసంగ్రామమున దేహములు త్యజించి ఉత్తమలోకములకేగుదు మింతియ సిద్ధాంతమని శ్రీకృష్ణు నొప్పించి వెనుకకు తిరిగిపోయెను. దీనిలో కర్ణుని పట్టుదల ధర్మప్రవృత్తి తేటతెల్లమగుచున్నది. శత్రువులలోనైన మంచిని ప్రకటించుట తనవారిలోనైన చెట్టను వెలిబుచ్చుట కృష్ణస్వామి స్వభావము.

తరువాత కృష్ణుడు హస్తిపురిలో జరిగిన సంభాషణము వృత్తాంతము నెల్ల పూసగ్రుచ్చినట్లు చెప్పి ఇక మీ యిష్టము వచ్చినట్లు చేయుడు. నన్ను గట్ట యత్నించిన వానితో నింక మీ సంధియేమి కుదురునని వేరుగ ఉపాయమేమియు లేమి తిరిగి వచ్చితినని చెప్పెను. ధర్మజుడు ఏమి చేయు మనియెదవని గ్రుచ్చి గ్రుచ్చి అడుగ యుద్ధము కాక వాని వశపఱచుకొను ఉపాయ మెద్దియు లేదనిచెప్పెను.

కృష్ణుని శిబిరమునకు పంపి తనతమ్ముల నేమిచేయుదమని సలహా యడుగ వారలందఱు ఇందు మనయాలోచన యేమికలదు? భగవంతుడే అక్కడకుపోయి వారి స్వభావములన్నియు తెలిసికొని సంధికాదని వచ్చి యుద్ధమే కర్తవ్యమని గట్టిగా చెప్పెనుగదా! అదియే కర్తవ్య మనిరి. అయినను ఈ దినమెల్ల ఆలోచించి రేపు మీ నిశ్చయము తెలుపుడనెను. మరునాడు వారలట్లే చెప్పిన వినివిని ధర్మజుడు అయిన మీ యిష్టము నాచరింపుడనెను.

రెండువైపుల యుద్ధప్రయత్నము లుత్సాహముతో జరుగుచుండెను. కౌరవులు శకునికొడుకు నులూకుని రాయబారిగ పంపిరి. వాడు వచ్చి మీకు మగతనమున్న నడవుల కేల పోయెదరు? కృష్ణుడు మిమ్మునెల్ల నొక మూకగ అమర్చి బెదరించి రాజ్యము లాగవలెనని యత్నించెను. ఆయూపు తప్పినది కదా! ఇకనేమి గతి? చేతనయిన అరచేతులలో ప్రాణములు బెట్టుకొని యుద్ధమునకు తరలుడు. కానిచో మరల అడవులకు పొండు.

ఈ భీముడు దుశ్శాసను నెత్తురుద్రావెదనని గప్పాలుకొట్టెనుగదా! ఇంకను ద్రావడేమి? దుర్యోధను తొడలు గదతో గొట్టెద ననెనుగదా, మరచి పోయెనా! కర్ణుని చంపెదనన్న అర్జునుని ప్రతిన ఏమి య య్యెను! పదు మూడేండ్ల నుండి తూపులు త్రుప్పుబట్టెనేమో? ఇన్ని మాటలేల? మీచేత నయిన పనులు చేయుడు మీకు మేమిచ్చునది లేదని తెల్లమయినది కదా! భయపడి అయిదూళ్ళు అడిగితిరి. పాపమదియు లభింపదాయె! భీష్మ ద్రోణాదులు మా దిక్కు. మీకు ఆడియాసలు చెల్లవు అని ఇట్టివియే నోటికి వచ్చినట్లు పలికెను. దానికి రాజులెల్లరు కోపోద్దీపితులైరి. దూత గాన వాని శిక్షింపకుండ ధర్మజుడు వస్త్రమాల్యాదు లొసంగెను. కృష్ణుడు వానికి ప్రతిసందేశము చెప్పెను.

ఓరీ దురాత్మా! అనినవి యెల్ల అనినట్లు జరుగగలవు. తొందర గానె అనుభవింపబోవుచు రుచులడుగనేల? నేనక్కడ చెప్పియే వచ్చితిని గదా! కల సర్వపదార్థములు యాచకులకు బంధుమిత్రులకు కొల్లబెట్టుడు. అనుభవింపదలచిన కోర్కెలెల్ల అనుభవింపుడు. ఆలస్యము లేదుగాన అరచేత ప్రాణము లిడి అనికి నడవుడనియు—

ఉ॥ ఎందును నెవ్వరుంబడని యెంతయు కష్టముపాటు వచ్చినం
గొందలమంది పాండువిభు కోడలు దవ్వులనున్న గో
విందుడ! రమ్మటంచుఁ బలవించుట యోగగరాని యప్పుపో
లెందలపోయ వ్రేగయి చలింపక యున్నది యెప్పుడున్మదిన్॥

అనియు.

గీ॥ ఇట్టియే! దేరు గడపంగ నెంచు నుతికి
నెక్కగాండీవ మే డ్తెఱ నెక్కువెట్టి

రెంతు దొనలును బూని కిరీటి యనికి
వచ్చు నేడెల్లి యెందుఁ బోవచ్చు మీకు॥

అనియు ఇంకను వాగ్వ్యయమేల? ఆయుధముల బలాబలములు చూచుకొనుడు— కౌరవసభలో ఈ చిగురుమాట దుర్యోధనునితో నను.

గీ॥ బవరమెల్లియు బిరుదవై బరవసమున
వచ్చి చావును చావక బ్రదుకరాదు
కృష్ణసారథికంబగు జిష్ణురథము
తొడరి నీవెందు జొచ్చిన తోన జొచ్చు॥

అని చెప్పి పంపెను. ఇక ధర్మజుడు సేనాపతి నెవని చేయుదమన-వేయేటికి ధృష్టద్యుమ్నాయత్తము జేయుమీవు సైన్యము లెల్లన్ - అని శ్రీకృష్ణుడు చెప్పెను.

ఈ మధ్యలో వ్యాసుడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చి కృష్ణుని మాటలు వినక సంధిచెఱచుట ప్రమాదమని చెప్పగా అతడు తనకొడుకుతో చెప్పమనెను. దానికి వ్యాసముని, మైత్రేయుడువచ్చి చెప్పును. వానిమాటల వినుమని చెప్పిపోయెను. తర్వాత మైత్రేయుడు వచ్చి పాండవవీరుల నాజియందు జయించుట కష్టముగాన రాజీ చేసికొనుమని చెప్పగా ఆమునిని వాని మాటలను లెక్కచేయక దుర్యోధనుడు వెకలియై తొడలు చఱచు కొనెను. దానికి అలిగి మైత్రేయముని నన్ను అలక్ష్యము చేసితివిగాన నీ తొడలు మహాయుద్ధమున భీముని గదతో విఱుగగలవని శపించి, ధృతరాష్ట్రుడు ప్రార్థింప పాండవులతో సంధిచేసికొనిన నా శాపము జరుగదు. యుద్ధమే అయిన నిది తప్పదని చెప్పిపోయెను.

అతిరథమహారథాది నిర్ణయసమయమున భీష్ముడు కర్ణుని అర్ధరథు డనుటచే కర్ణుడు కసలి భీష్ముని యుద్ధసమయమున తాను యుద్ధము చేయ ననియు, ఆతడు గెలిచిన తాను వనవాసి నయ్యెదననియు, భీష్ముడు సచ్చిన తాను పాండవుల జంపి దుర్యోధను అసపత్న రాజ్య మేలించెదననియు ప్రతిజ్ఞ చేసెను. కౌరవసేనలకెల్ల భీష్ముడు సేనానాయకు డయ్యెను. భీష్ముడు మొదటనే శిఖండిని ఆడుది మగవాడైనవాడు గావున వాడు గొట్టి నను నేను చూచుచుందును గాని తిరుగగొట్టనని, పాండవులగొట్ట చేతులు రావని,తక్కినవారెల్ల నా మునుమునబడి యేమయ్యెదరో జూడుమని,మీటు గల రాజరథికుల నాటికి వేవుర వధింతుననియు పదిదినములు యుద్ధము చేసెదననియు, నరుశరములు నన్నుదాకి వడవేయునందాక ప్రతిబలంబు వీరులనెల్ల వేటాడెదననియు, దుర్యోధనునకు బాసయిచ్చెను. ఇట్లు ఉభయ పక్షములవారును సన్నద్ధులై కురుక్షేత్రమునకు నడిచి దృషద్వతి యను నది పొంత పాండవులును, శమంతపంచకమునొద్ద కౌరవులును శిబిరములువేసి నివసించిరి.

తరువాత వ్యూహముల పన్నుకొని రెండువైపులవారు రంగమునకు వచ్చిరి. యుద్ధప్రారంభమునకు మున్ను రథముదిగి వినీతవేషముతో చేతులు జోడించి ధర్మజుడు భీష్ముదెసకు బోయెను. వాని భావము నెఱుగ లేక పాండవ సైనికులెల్ల చిన్నబోయి పలికిరి. కృష్ణుడుమాత్ర మది యెఱిగి తక్కిన పాండవులతోగూడ తాను నట్లే భీష్మునివద్దకు పోయెను. భీష్ముడు మొగమును త్రిప్పుకొని – వచ్చి మంచిపని చేసితివి. రాకున్న శపింపదలచితినని, ధనమునకు పురుషులు దాసులు. నేను దుర్యోధనునితో నర్థసంబంధము కలవాడ నగుటచే ధర్మప్రధానుడవు,కౌరవవంశవర్ధనుడవు అగు నీ కేమాత్ర ముపకారము చేయజాలనైతిని, క్లీబునివలె మాటలాడు చుంటిని, అని ధర్మజుతో తన అభాగ్యమును జెప్పెను. దానికి ధర్మజుడు పితామహా! నీవు వానిసొమ్ముతిన్నందున వానివైపుయుద్ధముచేయుము.మను

మదనైనందుకు నన్ను మనసులో దీవింపుమని కోరి, ఆతని వధోపాయము తర్వాత రమ్ము చెప్పెద ననిపించుకొని పోయెను. ఇట్లే ద్రోణ కృపాచార్య శల్యులదర్శించి ముచ్చటించి తక్కువారలకు దుర్నిరీక్ష్యుడై వచ్చి రథమెక్కి కిరీట ధనురాదుల గ్రహించి శత్రుసైన్యములజూచుచు పెద్దగా ఈ కౌరవులలో ఎవరైన మాలో కలియవచ్చిన వారి నా తమ్ములతోపాటు చూచెదనని పలికెను. అదివిని ధృతరాష్ట్రుని వేశ్యాపుత్రుడగు యుయుత్సుడు కౌరవుల దుష్టత్వము నగ్గడించుచు నీవు ధర్మాత్ముడవగుటవలన నీలోనికి వచ్చితినని తన సైన్యముతో పాండవుల గలిసెను. అతని తనవారి కప్పగించి ధర్మజుడు నాకు ఐదుగురు తమ్ములు. ఈ యుయుత్సుడు యుద్ధములో చచ్చినను నేను బ్రదుకననెను. కాన పాండవపక్షమెల్ల యుయుత్సుని యుద్ధములో కనిపెట్టి యుండవలసివచ్చెను. ధర్మపక్షమున జేరుట, మంచివాడు, పాండవుల పరోక్షమున మహారాజయ్యెను.

# 23

శ్లో॥ కరకమల నిదర్శితాత్మ ముద్రః
పరికలితోన్నత బర్హి బర్హ చూడః
ఇతరకర గృహీత వేత్రతోత్రో
మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః—

రెండు సైన్యములు సన్నద్ధములై యుండ జూచి దుర్యోధనుడు ద్రోణాచార్యునియొద్దకరిగి ఉభయపక్షములనున్న వీరుల నెన్ని 11 అక్షౌహిణుల మహావీరులతో సన్నద్ధమై భీష్మాభిరక్షితమగు మనసైన్యము తేలికగా కన్పట్టుచున్నది. 7 అక్షౌహిణులసేనతో భీమసేనరక్షితమగు పాండవ సైన్యము సారవత్తరముగా గన్పట్టుచున్నది, ఇది యేమని అడిగెను. అది గ్రహించి భీష్ముడు తనపక్షము దైన్యము దక్కినయోధులు వినకుండ తన శంఖమునూదెను. దానివెంటనే కౌరవపక్ష వీరులెల్ల శంఖములనూదిసింహ నాదములతో రోదసి నింపిరి. వెంటనే పాండవులును అట్లుచేసిరి. వారి నాదమున కౌరవులనాద మడగినట్లుండెను. దేవదత్త పాంచజన్యముల మ్రోతలో సర్వము నడగిపోయెను. అప్పుడు అర్జునునికోరికపై శ్రీకృష్ణుడు ఆ రథమును రెండుసైన్యముల మధ్యమున నిలుపబెట్టెను. అర్జునుడు పర సైన్యమున నున్నవారనెల్ల తనవారలేనని వారల జంపుటకు సాహసింపక మెతకబడి మూడులోకముల రాజ్యమువచ్చినను నేను వీరల చంపను భూలోకమాత్ర మేలుటకు ఈ బంధువుల జంపుటకు మనమొప్పకున్నది. అని శస్త్రాస్త్రముల వదలి రథముపై కూలబడెను. శ్రీకృష్ణుడు వాని మాటలెల్ల ఖండించి క్షత్రియుడవగు నీకు ఇది పథముకాదనెను.

అర్జునుడు కృష్ణా! ఎవరిని పోషించుటకు రాజ్యము ధనము సంపాదింపవలెనో అట్టి గురువులు, తాతలు, జ్ఞాతులు, కొడుకులు, కొమ్మలు నశింపనుండిరి. తర్వాత జయించిమాత్ర మేమి చేయుదుమని కారుణ్యముతో నా చదివిన చదువులెల్ల విస్మృతములైనవి. విజ్ఞాన మడగినది. కాన నే నీకు శిష్యుడనైతిని. నిన్నాశ్రయించిన నన్ను ప్రబుద్ధుజేయమని ప్రార్థించెను. శ్రీకృష్ణస్వామి కిరీట కుండలములతో, నెత్తినధరించిన నెమలిపింఛము ప్రకాశించుచుండ దక్షిణహస్తమున జ్ఞానముద్రను వహించి బెత్తము, కొరడా, పగ్గములు ఎడమచేత దాల్చి అర్జునునకు కర్తవ్యము నుపదేశించెను. అట్టి బోధము అర్జును నిమిత్తముగాగొని సర్వలోకమునకు చేసినబోధము. అధికారి భేదమునుబట్టి భేదవాదములున్నను భగవంతుని బోధము అనగా భగవద్గీత, వేదములు, శాస్త్రములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు ఏకవాక్య మేకమతమని పదునెనిమిది అధ్యాయములతో సులువుగ బోధించెను. ఈ గీతముగూర్చి మా తండ్రిగారు నేను బ్రదికినంతకాలము చెప్పుచుందును, వినుడు. ఆయువు చాలనిచో మరల జన్మించి వచ్చిచెప్పెదనని ఒక సభలో వాక్రుచ్చిరి.

అంత తెలివిలేకున్నను నా ఎఱిగినంతయు ఇచ్చట జెప్పు నవకాశము లేదుగాన సంగ్రహించి ప్రస్తావవశమున అనుచుంటిని. "క్షంతవ్యో మే అపరాధః"

శరీరము కనబడుచున్నది. ఇది జడమని అజ్ఞులకును సులువుగ ఋజువు చేయవచ్చును. దీనియందు సర్వప్రకాశమగు తెలివిగలదు. దానినే సంవిత్తు అందురు. ఈ రెంటి భేదము కనుగొనలేనివాడు అజ్ఞుడు. అది ఎఱిగి వ్యవహరించువాడు జ్ఞాని. దేహము పోయినప్పుడు ఆ సంవిద్రూపమగు జీవుడు నశించుటలేదు. దీని నిర్ణయమునకే సాంఖ్యయోగాది శాస్త్రము లనేకము లేర్పడినవి. ఎవరెట్లు చెప్పినను జీవుడు—దేవుడు—మాయ—ఈ

మూడింటిమీద సర్వము ఆధారపడియున్నది. మాయపోయిన జీవుడు దేవుడు ఒక్కడేయని యుపనిషన్మతము. మాయను తెలిసికొని వదలిన జీవుడు శుద్ధుడగునని సాంఖ్యులమతము. అట్లు శుద్ధుడైన జీవుని మరల మాయ వశముచేసికొనకుండ అన్యుడగు దేవుడు చేయుచుండునని యోగులు చెప్పుదురు. పరమార్థమున సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమగు బ్రహ్మ మొక్కటియే సత్యము. ద్వితీయపదార్థమే లేదు. కలవంటి లోకమున వ్యావహారిక పాపపుణ్యములవలన చిద్రూపమున కేమియు మార్పు లేదు. దేహము, జీవుడు, ఇంద్రియములు, వాయుచేష్టలు, దైవములు కలసిన వ్యావహారికమున ఏపనియైన నెరవేరును. అట్టి పాపమును గానిపున్నె మునుగాని నే జేసితినని కర్తృత్వము తనపై వైచికొనుటయే అజ్ఞానము. ఇందఱు కలసిచేయు వ్యవహారముతో నాకు సంబంధములేదు. నే నంతట నెప్పుడు నుండువాడను. ఆకాశమునకు ఇతర భూతగుణములు అంటనట్లు పాపపుణ్యాది అంతఃకరణ గుణములు నన్ను అంటవు అను నిశ్చయముతో సాక్షిగనుండుట జ్ఞానము. సంవిద్రూపుడవు జీవుడు చంపువాడు గాడు చచ్చువాడు గాడు, కాన నా బంధువులు, నేను చంపను అనుటెల్ల అజ్ఞానమే. చచ్చునది జడమైన దేహము. అది ఎట్లును నిలువదు. చావని జీవుని జంపువాడు లేడు. ఇట్టులుండ వీరు బంధువులని నేను జంపువాడనని అహంకారమువదలి ప్రవర్తింపుము. నీకు పాపమంటదు. అటుగాక అహంకారముతో నేను యుద్ధముచేయననిన వ్యావహారిక శాస్త్రములబట్టి "క్షత్రియస్య యోద్ధవ్యః" అను స్వధర్మమును వదలి వర్తించు నీ కెట్లును పాపముతప్పదు. "స్వధర్మే నిధనం శ్రేయః" ఇంకొక ధర్మము బాగుగనున్నదని తాను చేయుటకన్న తన ధర్మమున జరుగకున్న చచ్చినను మేలు.

కాన నీకు యుద్ధ మవశ్య కర్తవ్యము. అని తత్త్వజ్ఞాన పురస్సరముగ అర్జును బోధించుచు వాని యడిగిన ప్రశ్నములనెల్ల సమర్థించుచు,

అతడు కోరగ తన విశ్వరూపము ప్రదర్శించి అందు ఈ యోద్ధలెల్ల తన నోటిలోబడి పోవుచున్నట్లు చూపి నీవు చంపకున్నను వీరెట్లును జచ్చువారే। నీవు నిమిత్తమాత్రముగ నుండి కీర్తి గైకొనుము. లెమ్ము. అని అర్జునుని ధీరునొనరించి కృష్ణదేవుడు యుద్ధమునకు ఉద్యుక్తుని చేసెను. అట్లు ప్రారబ్ధమగు యుద్ధమున మొదటినాడు సమానముగా పోరి సాయంకాలముచూచి రెండుపక్షములవారు వారివారి విడిదలలకుపోయిరి. భీష్మాదులు ప్రతిదినము కాల్యములదీర్చి యుద్ధమున కేగునప్పుడు ఆయుధములనంటి పాండవులకు జయమని రంగమున బ్రవేశించి రాక్షసావేశము వచ్చినట్లు యుద్ధము చేయుచుందురు. రెండవనాడు సాయంసమయమున పాండవులు చెలరేగుట జయమునొందుట జూచి దుర్యోధనుడు భీష్మనుపాలంభించెను.

మూడవనాడు రెండుజాములవరకు పాండవులకే విజయము. మూడవజామున భీష్ముడు విజృంభించెను. పాండవసైన్యములు భీష్మని మీద మొగకట్టలేక కాందిశీకములైనవి. కృష్ణార్జునులు బాణపంజరబద్ధులైరి. కృష్ణుడు చెప్పినను తాతగారగు భీష్మని గొట్టుటయందు అర్జునునకు ఉత్సాహము రాలేదు. అప్పుడు కృష్ణుడు మునికోలతో రథమునుండి డిగ్గి భీష్మని జంపెదనని వాని కెదురుగా బోవుచుండెను. దానికి అర్జునుడును రథము దూకి వెంటనంటి శ్రీకృష్ణుని నడుము రెండుచేతులతో బిగ్గబట్టి నేలకు ఈడిగిలబడి పదియడుగులలోపల దేవుని నిలిపి స్వామీ। యుద్ధములో నెంతవారలైన కొంచెముసేపు వెనుబడకుందురా। అంతమాత్రమున నీవు చెలరేగిన మా ప్రతిష్ఠ నశించిపోవునుగదా? దయచేయుము దేవా? నిన్ను నొప్పించిన భీష్మని పాటు చూచెదరమ్మని వేడుకొని నొగలెక్కించి తానును రథమెక్కి గాండీవముగొని విజృంభించి నాల్గవజామెల్ల కౌరవసైన్యముల పీనుగుపెంటలు గావించెను. భీష్మాదులెవ్వరును ఎదిరింపలేకపోయిరి. అప్పుడు భీష్ముడు ఆకసము జూచి ద్రోణునితో

గీ॥ కృష్ణసారథ్యమున నొప్పు క్రీడియపుడు
కౌరవానీకముల నెల్ల కసిమసంగె
కృష్ణసారథ్యమున నొప్పు క్రీడియిపుడు
ఎంతసేయంగవలయుఁ దానంతసేసె!!

అని సూర్యుడు ఎఱ్ఱవారుట జూపి ఆ నెపమున యుద్ధము చాలించి తన సైన్యములతో విడిదల కరిగెను. పాండవులును కృష్ణార్జునుల అతిలోక విక్రమమును పొగడుచు శిబిరముల కరిగిరి. పై పద్యములో ఒక కృష్ణ శబ్దమునకు విరాట్పుత్రుడగు ఉత్తరు డర్థము. "కృష్ణో విరాట్పుతే" అని నిఘంటువు గలదు. ఉత్తరుడు సారధియగు గోగ్రహణమున అంత సేసిన అర్జునుడు కృష్ణస్వామి సారధియైన యిప్పుడు ఎంతచేయవలెనో అంతయు జేసినాడని పద్యార్థము. దీని నెరుగక అచ్చులో నీపద్దెము ననేకులు అనేకవిధములుగ దిద్ది ప్రకటించుచున్నారు.

నాల్గవనాడు భీష్ముడు మకరవ్యూహముబన్ని యుద్ధమునకువచ్చెను. ధర్మరాజు నానతో ధృష్టద్యుమ్నుడు అర్ధచంద్రవ్యూహము పన్నెను. అందు భీష్ముని కెదురుగా అర్జునుని బెట్టి ఒక కొమ్మున భీముడు మఱొకకొమ్మున ధృష్టద్యుమ్నుడు నిలచి తక్కినవారల మధ్య నిలిపిరి. అర్జునుడు తాతగారిని కొట్ట మోమోటపడెను. అదిచూచి ధర్మజుడు ధృష్టద్యుమ్నుని చేతగాని వ్యూహము పన్నితివని ఆక్షేపించెను. వాడు సరిగనె పన్నితిని. దీని లోప మేమి? అన ధర్మరాజు అర్జునుని ఆ కొమ్మునకు బంపి భీముని దెచ్చి భీష్ముని కెదురు నిలుపుమనెను. ధృష్టద్యుమ్నుడు "వినయముతో రాజాజ్ఞను దెలుప అర్జునుడు నవ్వుచు భీమునిచోటికి 'పోయెను. భీముడు అట్టి రాజాజ్ఞను విని భీష్మునికి తనరథ మెదురుగా తోలించెను. భీముడు పిడికిలితో కూర్చుండి వేరే ఆయుధము లేకుండ తన రథాశ్వములు భీష్ముని

రథాశ్వముల ముట్టెలు ముట్టెలు కొట్టుకొనుచున్నను తనసారథి నింకను తోలుమని గదిమి తోలించెను. భీష్ముడు చేయునదిలేక తన రథమును తప్పతోలించుకొని తొలగిపోయెను. ఆ సందున భీముడు కౌరవుల మకర వ్యూహములో ప్రవేశించి చేయిపిడికిలితోనే బెదరించుచు వ్యూహము చెద గొట్టివచ్చి ధర్మజు మెప్పు నొందెను.

కం॥ మకరవ్యూహం బనియెడు
మకరాలయ మపుడు దర్ప మహామోజ్జ్వలుడై
మకరక్రీడం జండత
మకరాభీలముగ జొచ్చె మారుతి యధిపా!
(తిక్కన)

5-6-7 రోజులు సామాన్యముగ నిరువురగువారు పోరిరి. ఎట్లయినను ప్రతిదినము పాండవులదే జయము. 8వ నాడు పాండవుల పరాక్రమ మతిశయమగుటయు దుర్యోధనుడు భీష్మని సేనాధిపత్యము చాలించుకొను మని కర్ణుని దెచ్చుకొనెదనని నిష్ఠురముగా ననెను. దానికి భీష్ముడు నొచ్చియు రేపు జూడుము నా పరాక్రమమని బాసయిచ్చి 9వ నాడు మూడవజామున పాండవయోధుల నెలకట్టనీక విజృంభించి ఎక్కడ జూచిన తానై రౌద్రావేశము జూపెను. అర్జునుడును మెత్తపడెను. అపుడు శ్రీకృష్ణుడు చక్రముగొని భీష్మని చంపెదనని రథముమూకి పోవు చుండ అర్జునుడు మరల వెంటనంటి రథముమీదికి ప్రార్థించి తెచ్చెను. కాని ఆ నాల్గవజామునకూడ అర్జునుడు విజృంభింపలేకపోయెను. ఏల యన, దివ్యాస్త్రములతో తాతను జంపుట యుచితముగాదు. సామాన్యబాణ ముల నాయన లెక్కచేయడు. తండ్రిలేని తమ్ము బెంచిన తాత నెట్లు కొట్టనగునని మెత్తబడెను. ఆనాడు మాత్రము ప్రొద్దు చూచుకొని పాండ వులే ముందు యుద్ధము చాలించుకొని పోయిరి.

ఆ రాత్రి సభలో ధర్మరాజు కృష్ణునితో యుద్ధముచాలించి అడవి కేగెదనని సహాయమువచ్చిన రాజులనెల్ల భీష్మున కెరసేయలేనని బెద రించెను. కృష్ణుని మాటలును ధర్మజునకు నచ్చలేదు. చివరకు భీష్మ నొద్దకుపోయి సెలవుగొని వచ్చెదనని తగుపరివారముతో తమ్ములు కృష్ణుడు వెంటరాగా భీష్ముని శిబిరమునకు అర్ధరాత్రివేళ పోయెను. ఉభయకుశల ప్రశ్నాచారముల కనంతరము భీష్ముడు - వచ్చినపనిని యేమని యడుగ ధర్మజుడు తాతా! నీవు యుద్ధములో మూడవకన్ను దాచుకొనివచ్చిన రుద్రునివలె దూకెదవు. నిన్ను జయించు ఉపాయమేమి? అని నిన్ను ప్రార్థింప వచ్చితినన, ఆ తాత ఆ మనుమని ఆదరించి రేపు శిఖండిని మధ్యనిలిపి అర్జునుడు తీవ్రముగా గొట్టిన పడిపోయెద నట్లు చేయుడని సెలవిచ్చి పంపెనేగాని తాతగారి నట్లు కొట్టుటకు అర్జునుడు ఇష్టపడకపోయెను. కృష్ణు డెన్నియో చెప్పి యెట్టకేలకు బలవంతముగ ఒప్పించెను. 10వ రోజు రెండుజాములు దాటినతర్వాత భీష్ముడు సైన్య ముల నురుమాడుచు దారిచేసికొని ధర్మజుడున్న చోటికి పోయి తనకు కాలము వచ్చినదనియు శిఖండినడ్డము పెట్టి అర్జుననిచే గొట్టింపుమనియు, ఇంతియకాక మీరందరు అన్ని ఆయుధ ముల గొట్టి పడవేయుడనియు చెప్పెను. ధర్మరాజు సెలవీయగా పాండవ సైన్యములన్నియు నొక్కపెట్టున శిఖండిని ముందుబెట్టుకొని భీష్ముని దాకెను. అర్జునుడు శిఖండిని కాచుచుండెను. భీష్ముని కాపాడబోవు ద్రోణున కడ్డపడి ధర్మజుడు నకుల సహదేవుల సాయముతో నిలువ రించుటయు, తప్పించుకొనిపోలేక ద్రోణుడు తన కొడుకుతో ఇది ప్రాణ ములు దాచుకాలము గాదు. ధర్మరాజు మొగమున తీవ్రమగు కోపము గానవచ్చుచున్నది. ఈతనిని తప్పించుకొని నేను రాలేకయుంటిని. భీష్మునకు నీవు సాయమై నిలబడుమని చెప్పిపంపెను. శిఖండియు ఉత్సా

హముతో నెదిరించినను వాని బాణములు భీష్మునకు పువ్వులు చల్లి నట్లుండెను.

అపుడు కృష్ణుని ప్రేరణతో తప్పనిపని యిదియని యెంచి అర్జునుడు తన గాండీవమునుండి బాణములు శిఖండి ధనస్సును తాకుచు వాని బాణములవలె పోవునట్లు దృఢముగా వేసెను. ఆ దెబ్బలు భీష్ముడు మెచ్చుకొని ఇవి అర్జునుబాణములు, శిఖండివికావు. ఒక్కొక్కబాణము ఒడలెల్ల బ్రద్దలు చేయుచున్నది, అని మనుమని పరాక్రమము మెచ్చుకొనుచు విరథుడై విగతాయుధుడై పడిపోయెను. అప్పుడు రెండువైపులవారు ఆయుధములు విడచి ఆ మహాత్ముని దరికి దుఃఖితులై పోయిరి. అర్జునుడు మాత్రము ఆయుధహస్తుడై పోయెను. ఆ తాతకోరగా ఈ మనుమడు మూడుబాణములు మంత్రించివైచి భీష్ముని తలక్రింద ములుకులు మెత్తగా మోపి పిడులు నేలకాని వేరువేర నిలుచునట్లు అంపశయ్యకు తగిన దిండు వెట్టెను. ఆ మహాత్ముడు దాహమని అడుగుచుండ నెందరో నీళ్ళు తెచ్చిరి. అవి త్రావనని తేజోమయాస్త్రవిన్యస్తమగు భూమినుండి వెలువడి వచ్చి తననోట జొచ్చు నీరైన త్రావెదనని యు చెప్ప గంగాపుత్రుడు, అట్టివి నీవు తేగలవని అర్జునుని యడుగగా అతడవి సాధించి తాత దప్పిని మాన్చెను. అప్పుడు భీష్ముడు తన మనుమని నీవు నరుడను మునివి. నారాయణ సహాయార్థమవతరించితివి అని పెద్దలు చెప్పగా వింటిని. నీ కసాధ్యము లేదు. నేనెంత జెప్పినను వినక దుర్యోధనుడు సంధి సేయక ముప్పు తెచ్చుకొనెను— అని చెప్పెను. అందఱు మాటలాడకుండ భీష్మునికి రక్షణార్థము జనులను నియోగించి ఇరువాగులవారును బోయిరి. ఇక దుర్యోధనుడు కర్ణుని దెచ్చుకొని సర్వసేనాధిపత్యమిచ్చి యుద్ధము చేయనెంచెను గాని కర్ణుడు విజ్ఞుడగుటచే ధనురాచార్యుడు, గురుడుండ అది తనకు తగదని చెప్పి ద్రోణున కా యాధిపత్య మిప్పించెను.

భీష్ముని తర్వాత తనకు సర్వసైన్యాధిపత్యమిచ్చిరని మెచ్చుకొని దుర్యోధనునకు ఇష్టము వచ్చిన వరమిచ్చెదను, కోరుకొనుమనెను. దానికి పొంగి దుర్యోధనుడు - దుష్టచతుష్టయము ఆలోచించి ధర్మరాజును యుద్ధములో ప్రాణములతో పట్టితెచ్చి తన కప్పజెప్పుమని కోరెను. అందులకు ద్రోణుడు సంతసించి ధర్మజుని అజాత శత్రుత్వ మిప్పటికి సార్థకమైనది. నీవంటి శత్రువుడవు వాని చంపుమనక ప్రాణములతో తెమ్మంటివి! తెచ్చి యిచ్చిన ఏమి చేసెదవు? గెలిచితినని కీర్తిగొని రాజ్యమిచ్చెదవా? అని యడిగెను. వాడు గరువతనము లేనివాడు గాన వెంటనే బయటబడెను. మనము ధర్మజుని జంపిన తక్కిన నలువురు నాలుగూళ్ళు తెమ్మనెదరు. ఐదుగురును మనము శక్తిమంతులమై చంపినను కృష్ణుడు చక్రముతో అందఱ సంహరించి కుంతిచేతనైన రాజ్యము చేయించును గాని నారాజ్యము చేయుట సహింపలేడు. కాన ధర్మజుని ప్రాణములతో దెచ్చిన మరల జూదమాడి అడవికిబంపిన ఎవరిని నామీదకు రాకుండ ఆతడే చేయును. నే నప్రతిహతముగా రాజ్యమేలుకొందు ననెను. ద్రోణుడు మనమున కుత్సించి-అర్జునుడు నాకన్న అనేక దివ్యాస్త్రములు శివునివద్ద స్వర్గమునుండి సంపాదించినవాడు. వాడుండ నీపని సాగనీడు. కాన అర్జునుడు లేని సమయమున ధర్మజుడు పారిపోకుండిన ఎంద రడ్డమైనను చెండి పట్టుకొనివచ్చెదను. పారిపోయిన ఓడినట్లేగదా! అనెను. దుర్యోధనుడు ద్రోణునిచేతిలో ధర్మజుడు పట్టువడుననియే నమ్మి తన శిబిరములంతట ద్రోణప్రతిజ్ఞ చాటింపించెను. ధర్మజు డిది వేగులవారివలన తెలిసికొని తమ మీటింగులో అర్జును నిది యెట్లని యడిగెను. దానికి అర్జునుడు-

కం॥ క్షోణీనాయక! నామేఁ
ప్రాణము కలుగంగ నిన్ను బట్టికొనంగా
ద్రోణునక కాదు సగణ
స్థాణునకైనను వశంబె తలకేమిటికిన్॥

అని చెప్పెను. ఇక ద్రోణాధిపత్యముతో యుద్ధము సాగినది. పది దినములనుండి యుద్ధముచేయకుండ నుండిన కర్ణుడుగూడ భీష్మదర్శనము చేసి — వచ్చితి రాధేయుడ! కనువిచ్చి ననుంజూడు భరతవీరాగ్రణీ! అని ఓదార్చుచుపోయి తనకు, యుద్ధమునకు సెలవిమ్మనెను. అంత నాభీష్ముడు నీవు కౌంతేయుడవు. సంధిప్రయత్నము చేయుమని అందించిన కర్ణుడు యుక్తియుక్తముగ మాటలాడి ఇంతకు మూలము నేను. ఇప్పుడు నేను వారిలో కలియుట వారికి, నాకును యశస్కరముకాదు. మురరిపుని, పార్థుని తలంకించి పేరుపెచ్చుకొని వీరభోగము ననుభవించెద నట్లు శాసింపుమన భీష్ముడు — ఇంతకు జాలుదువే నెఱుగుదును బొమ్మని యనిచెను.

ఆ విధమున వచ్చి రెండుసేనలు సమముగా పోరెను గానిద్రోణుడు ధర్మజు బట్టుకొనలేకపోయెను. ఇంటికి పోవునవుడు ద్రోణుడు దుర్యోధనునితో నే జెప్పినది యిట్టిదియేగదా! అర్జునుడు దగ్గరనుండ వాని బట్టుకొన శక్యముకాదు. రేపు మరొకరంగముబెట్టి వాని తొలగించిన ధర్మజు నేను బట్టెదననెను. దానికి సుశర్మాదులగు సంశప్తకు లా పని మేము చేసెదము. దానికి నొరులెవ్వరును నోపరు — అని తమలో కలిసెడివారి నెల్ల కలుపుకొని అగ్నులువ్రేల్చి తత్సమక్షమున అర్జునుని గెలుతుము లేక చచ్చెదము. అంతియగాని పారిపోము, అని సంశాపములు పలుకుటచే సంశప్తకులయినవారు మరునాడు అర్జునుని మేము వేరే యుద్ధరంగముబెట్టు కొనుచున్నా మచ్చటికి రమ్ము. రాకున్న నీవు మాకోడినట్లే యని పిలిచిరి. అర్జునుడు యుద్ధమునకు ఎవరు పిలిచినను బోయెదనని ప్రతిన కలవా డగుటచే ధర్మజుని జాగ్రత్తగా నుండుమని భీమాదులతోగలిసి యుద్ధముచేయు చుండుమని సత్యజితుడను పాంచాలకుమారు జూపి యితడు బ్రదికియుండ నిన్ను ద్రోణుడు పట్టలేడు. అంత చిక్కు తటస్థించిన నీవు శిబిరమునకు బొమ్ము. తక్కువారు యుద్ధముచేయుచుందురని చెప్పి యటువోయెను.

అక్కడ సంశప్తకులతో అర్జునునకు ఎడతెగని పోరైనది. ఇక్కడ

ద్రోణునితో తక్కు పాండవపక్షమునకు తీరనిపోరయినది. అందు మూడు జాములు పోరిపోరి ధర్మజు గాపాడ భారపడిన సత్యజితుని ద్రోణుడు సమయించెను. తక్కిన భీమాది వీరుల దగ్గరకురాకుండ దూర ముగా తోలి వారేమియు చేయలేక చూచుచుండ ద్రోణుడు ధర్మజునిరథము పొదివిపట్టి నుంకించుచుండెను. అది సంశప్తకులతో పోరు అర్జునుడు ఆరుక్రోసులదూరమునుండి రథవేగములో ద్రోణుని సమీపించునంతకు బాణముల సోనలు గురియుచువచ్చి ద్రోణునకు చేతులాడకుండునట్లు చేసి ద్రోణ ధర్మజుల రథములమధ్యమున తన రథమును జొనిపెను. ద్రోణుడు నిరాశుడయ్యెను. ధర్మజు డవ్వలకు తప్పుకొనిపోయెను. అర్జునుడు నవ్వుచు మామూలుగ పోరుచుండెను. ఇది యద్భుతకర్మము. ఆరుక్రోసులనుండి బాణములు కురియుట - ధర్మజుని గురుని బారికి తప్పించవలెను. గురుని మేన తన బాణముతో గాయముకారాదు. ఆరుక్రోసులనుండి, ఐదు క్రోసులనుండి యిట్లు దగ్గరకువచ్చినను ఎంత యూపుతో లాగిన తన బాణ ములు ద్రోణునిచుట్టు పంజరముగా క్రమ్ముకొని కాయము గాయముకాకుండ జేయగలవో ఆ ఫక్కి ఆయనకే తెలియును. ఇంతలో నస్తమయమైనది. ఇరువాగులవారు శిబిరముల కేగిరి. దారిలో ద్రోణుడు దుర్యోధనునితో నెంత శ్రమముపడినను చేతికిచిక్కువేళ కర్జునుడు రానేవచ్చెను. ఏమి చేయుదుము? రేపు నిట్లే రెండవరంగము బెట్టింపుము. నా ప్రతిన నెర వేర్చుకొన యత్నించెదనని చెప్పెను. ఆ రాత్రి గడవ మూడవనాడు మామూలుగా అర్జునుని సంశప్తకులు బిలిచికొనిపోయిరి. ఇక్కడ ద్రోణుడు కౌరవసేనల పద్మవ్యూహముగ బన్నించెను. ఆ వ్యూహము జూచి పాండవపక్షమువారు దిమ్మరపోయిరి, దాని భేదింపనేరక వారు దూరముగా తమ మోహరము త్రిప్పుకొని పోయి ఆలో చించుచుండిరి. అప్పుడు ధర్మజున కొక ఆలోచనము కలిగినది. ఈ వ్యూహ మర్జునుడు, కృష్ణుడు, ప్రద్యుమ్నుడు గాక ఒరులు భేదింపలేరు.

వారిలోవాడుగాన అభిమన్యుడు చిన్నవాడైనను దారితీయగలడు. వాని ముందుబెట్టుకొని మనమెల్ల వాని గాపాడుచుపోయి యీనాటి భండనము గెలువవలెను. మనమందరము గాపాడుచుండ సహజ విక్రముడగు అభిమన్యున కేమి లోటు అని తోచుటతోనె ధర్మరాజు వాని బిలిచి సాంత్వనముగా చెప్పెను. అభిమన్యుడు నది తనకు కీర్తికరమగు పని యని యొప్పుకొనెను. వాని సారథి యనుమానించుచున్నను వాని బదరి అభిమన్యుడు ద్రోణపాలితమగు పద్మవ్యూహము లెక్కసేయక ఎదిరించి పోయెను.

ఆ॥ మెఱుపు మెఱసినట్లు మెఱయించి యరదంబు
కర్ణికార కేతు కాంతినెలుఁగ
అంబకముల గురుని నలయించి మించి యిం
ద్రజుని కొడుకు మొగ్గరంబుసొచ్చె॥ (తిక్కన)

అట్లుపోవు అభిమన్యు చుట్టుకొనిపోవు పాండవవీరుల సైనికులతనికి ప్రాపుకాకుండ ఒక్కనా డర్జునుడు లేనితఱి తక్క పాండవుల గెలుతునన్న శివుని వరమున సైంధవుడు నదికి కొండవలె నడ్డమువచ్చెను. కాన నెవ్వరు వానికి తోడులేకపోయిరి.

అభిమన్యు డొక్కరుడు పద్మవ్యూహముజొచ్చి చించి చెండాడి మూడుజాములు ఒక్క చేతిమీద కౌరవులనెల్ల నాపి విక్రమించుచుండ వానిచే దెబ్బలుతిని యోడి పాఱిన కర్ణుడు గురునిచేరి—ఈ అర్జునపుత్రుడు తండ్రినిమించి మన సేనల నేలకు గోలకు తెచ్చుచున్నాడు. అర్జునుతో పోరెరుగుదుము కాదే! వాని చేయింత పెట్టిదమ్ము కాదు. వీని నెట్లుగెలువవచ్చునని వాపోయిన నా యాచార్యుడు ధర్మసమరమున వీని జయించుట యరిది. అధర్మమనక పలువురుచేరి మాయయుద్ధమున చేతిలో ధనువు

విరిచి, తర్వాత చూచుకొందమని యనుటయు, కర్ణుండు అతని కభిముఖ ముగా పోయి దెబ్బలుతిని పారిపోయినట్లు పోయి ఆవలగా వెనుకకువచ్చి శరవైభవమున నతనివిల్లు నరుకుటయు, భూరిశ్రవుడు వాని గుఱ్ఱముల చదియ మోదెను. తక్కినవీరు లందరు రథమును, సారథిని, సర్వపరిక రము నుగ్గుసూచ మొనర్చిరి. ఒక్క ధనుస్సుతో గెలిచివచ్చెదనని ద్రోణుని పద్మవ్యూహము సొచ్చిన ఏకవీరు డింకొక విల్లులేమి గదగైకొని ప్రద్యు మ్నుని చెప్పిన విద్యాబలమున ఆకసమున కెగసి నాలుగుగడియలసేపు విహరించి క్రిందికివచ్చి ఒక్కొక్కరి గొట్టుచు పైకిపోవుచు మునుపటి కన్న కౌరవుల కాందిశీకుల నొనరించి అశ్వత్థామ రథముమీద దూకి ఆయన పారిపోగా అందున్న ఆయుధముల నెత్తుకొనిపోయి సూర్యుని చూచుచు ఇంక నిట్లే నాలుగుగడియలు గడిపిన ఇంటికి పోవచ్చునని ప్రతీక్షించు చుండ అప్పుడే సుఖముగ వీరపానాదులతో తృప్తుడై వచ్చిన దౌశ్శాసని గదగొని, ఆకసమున కెగసి వానితో పోరాడి యిద్దఱు నిలకువచ్చి గదా యుద్ధముచేసి అన్యోన్యఘాతములతో ఇద్దఱును మడిసిరి. ఒక్కని బాలుని అన్యాయముగ నిట్లుచేసిన మీరు రేపు అర్జునుచే నొక్కడును బ్రదుక బోరని ధర్మజుడు పెద్దగా నరచెను. పాండవవీరులు ఆ దినశేషము నట్లే గడిపి, అస్తమయమైన యుద్ధము చాలించి శిబిరముల కతి దుఃఖముతో నరిగిరి. కౌరవులు సంతసముతో బోయిరి. ధర్మజు డింటికిపోయి యభి మన్యునిగూర్చి దుఃఖించుచుండ వ్యాసభట్టారకుడు వచ్చి దుఃఖశాంతిగా చెప్పిన తనదుఃఖము వీరుడై చచ్చిన అభిమన్యునికొఱకు గాదనియు, అర్జును రక్షించుకొనుట కొఱకనియు చెప్ప, అట్లయిన మేలని నీవే ఱయింతువని చెప్పి అంతర్ధానమునొంది పోయెను.

అర్జునుడు సంశప్తకులతో పోరిపోరి సాయంకాలము తిరిగివచ్చుచు నపశకునముల నాలకించి ధర్మరాజును ద్రోణుడు పట్టుకొనెనేమో? అని శంకించి యడుగగా ధర్మరాజు సుఖముగానే యున్నాడుగాని, మనకు నింక

నేదియో అమంగళము జరిగినట్లు తోచుచున్నది, అని చెప్పు కృష్ణుని మాట లతో మరింత దుఃఖము వొడమ నక్లేవచ్చి యేడ్పుమొగములతో తన కగ బడకుండ తప్పించుకొను పరిజనులజూచి, ధర్మజు డున్నచోటికి వచ్చి, అచ్చట అభిమన్యుడు లేకుండుటకు వగచుచు, నన్న నడిగి తెలుసుకొని, నేను లేనివేళ నా కొడుకు నొక్కని కాపాడలేకపోయితిరి. మీ రాయుధము లలంకారార్థము దాల్చితిరికాని, అభిమానమునకు కాదని తన యోధుల నిందించి, ధర్మరాజుచెప్పగా అభిమన్యునకు తాతోపుపోకుండ శివునివరమున నుదీర్ణుడవు సైంధవు డెల్లవారి నానాడాగుట విని కోపించి అట్లయిన రేపు సూర్యు డస్తమింపకమున్నె ఆ సైంధవు తల తరిగెదను. అట్లు చేయలేక పోయిన గాండీవముతో నే నగ్నిలో ప్రవేశించెదనని ప్రతిన సేసెను. దుఃఖము కోపముగా మారినది. దానికి కృష్ణుడు నాతో నాలోచింపకుండ ప్రతినసేసితివి, ఆవైపుననున్న ద్రోణాదులు మనను చంపనిచ్చెదరా! ఇది దుర్ఘటమని చెప్పి అర్జునుని డేరాలోని కతని తీసికొనిపోయి శరములు మంత్రించి చుట్టునుబెట్టిన మంటపమునచేర్చి నీవు ప్రతిదినమును చేయు శివపూజ నొనర్పుమనెను. అర్జునుడును కృష్ణుని గూర్చుండబెట్టి శివపూజ చేసెను. వాని నిద్రింపుమని చెప్పి తాను తన డేరాలోనికేగి దారుకుడుపాద సేవ చేయుచుండగా పవ్వళించి నిద్రరాక దారుకునితో వచ్చిన కార్య వ్యతి క్రమమును జెప్పుచు, రేపు నాకు అర్జునునెడగల స్నేహమును లోకము గుర్తింపవలెను. ఎట్టు లేచెదనొ చూడుము! దారుకా! నీసీ గుర్తుగ శంఖ మూదినపుడు నీవు మన రథమును వ్యూహములోనికి దేపలెను జుమీ! అని వానిచే వల్లెయనిపించి రాత్రి నిట్లు గడపుచుండెను. అర్జునునకు ఒక కల వచ్చెను. అందు తానును, కృష్ణుడును ఆకాశగమనమున కైలాసమునకేగి, తాను కృష్ణునియందు పూజించిన పూవుల నా శివునినెత్తిన జూచి యచ్చెరు వడి, శివుని ప్రార్థించి, ఆ దేవు ననతితో నొక కొలనులోనున్న శివుని ధనుర్బాణముల దెచ్చి శివాజ్ఞతో నొక కుమారుడు చూపింప, పాశుపతము

ప్రయోగింపవై ఖరి క్రొత్తచేసికొని ఆ విభు డుపదేశింప మంత్రాదికము విని తదాశీః ప్రసాదమున ప్రసన్న మనస్కుడై, వచ్చినట్లు తోచెను. అప్పటికి తెల్లవారవచ్చినది. ఆ శుభసూచనమున నా వీటివారెల్ల నుల్లాస ముతో నుండిరి.

ఇక కౌరవుల స్కంధావారములో అర్జునుని ప్రతినవిని అందఱు వ్యగ్రులుగ నుండ సైంధవుడు కంపనపడ్డ కాకిపలె నటమటించి దుర్యోధ నునితో నే నొక్కడనే తన కపకారము చేసితినా! అర్జునుడు నన్ను జంప బూనెనట. వాని ప్రతిజ్ఞ కడ్డుపడువారు ముల్లోకముల లేరు. నేను కనబడ కుండ నా దేశమున కేగెదనన, స్వకార్యపరుడగు దుర్యోధనుడు వాని ద్రోణునికడకు గొనిపోయి, పర్యాలోచనము చేయగా నా గురుడు నేనొక వ్యూహమువన్ని నిన్ను అర్జునుడు చేరరాకుండ నాపెదను, యుద్ధరంగము విడిచి పోవలదు. అదిగాక పిల్లలగని పెద్దవాడవై పుణ్యపాపముల నెల్ల ఆరితేరిన నీకు పారిపోవు టుచితమా! చచ్చినను, బ్రతికినను కీర్తి చాల గలదని బోధించెను. ఎట్లయిన అర్జును ప్రతిజ్ఞ చెఱచిన నతడు సులభ ముగ అగ్నిబడి చచ్చును. వానితోగూడ తక్కిన పాండవులు పోదురని ఆ ప్రయత్నమున నుండిరి. కాలకృత్యముల దీర్చుకొని ఇరుగువాగును యుద్ధరంగమునకు నడిచిరి. ద్రోణుడు ముందువైపున శకటవ్యూహము, వెనుకవైపున అర్ధపద్మవ్యూహము నడుకువేసి, ముందు బండిపోలునుంచి దొలుపుమధ్యమువరకు సూచీవ్యూహము సూదిమాదిరి బారుగా నిలిపి, సూది బెజ్జము బండిదొలుపు మధ్యనుండు మేకు వెనుక పద్మవ్యూహము, మధ్య కర్ణికా నొక్కటిగా ముడిపెట్టి పదిక్రోసులు వెడలుపు, పన్నెండుక్రోసులు పొడవుగా దేవతలకు జూడరాని ఆశ్చర్యకరమగు మహావ్యూహము బన్ని మధ్యమున సైంధవు నునిచి వానిచుట్టు అశ్వత్థామ, కర్ణాదుల పదిరథముల వారి నిలిపి, తాను ద్వారమున నిలిచి అభేద్యముగ యుద్ధము సాగించెను.

ఆ వ్యూహమును జూచి దేవతలు ఆశ్చర్యమగ్నులైరి. అర్జునుడు తనకు తోడువచ్చెదనను సాత్యకిని, ధర్మరాజు గురునిచే పట్టుబడకుండ కాపాడుమని పనిచి, కృష్ణసారధికమగు తన రథమును వ్యూహాభిముఖముగ నడుపుచుండ, దుర్మర్షణుడు గజసేనలతో నటకువచ్చి అర్జును నే నొక్కడనే నేడు నిలిపెదనని ఎదిరించి వానిచే హతసైన్యుడై, దెబ్బలుతిని ద్రోణుని చాటునకు పారిపోయెను. ఇక కృష్ణుడు తన రథమును ద్రోణున కభిముఖముగా నడిపెను. ద్రోణుని జూడగానే అర్జునుడు గురువు నెట్లు కొట్టుదునా! అని మెత్తబడి కృష్ణునను మతి చేతులు జోడించి భక్తితో పలికెను

ఉ. మేలుదలంపు శోభనము మేకొని చేయుమునాకు పాండుభూ
పాలుని ధర్మనందనుని పంకజనాభుని యట్లకావె ? మ
త్పాలన వృత్తికీవు నిను ప్రార్ధనచేసి భవత్ప్రసాద లీ
లాలసితుండనై మొనదలంకగ జొచ్చెద భూసురోత్తమా.

అని నన్ను, అశ్వత్థామను ఒక్కవిధముగ జూచి, పెంచి విద్యల శిక్షించితివి. అనఘా! నాకు ద్రోహముచేసిన సైంధవుని గూర్చి చేసిన నా ప్రతిన మెట్లు నెరవేరునో యట్టి యుచితము నాలోచింపు మనెను. ద్రోణుడు నవ్వి, నన్ను గెలువక ఎట్లు వ్యూహముజొచ్చెదవు; యుద్ధము చేసి పొమ్మనెను. ఐనను అర్జునునకు తెంపు గలుగలేదు. అట్లయిన మీరు ముందుగా నామీద బాణములు వేయుడు. నేను తర్వాత వేసెదనని మెల్లగా యుద్ధమునకు దిగియు, మోమోట మెనయుచున్న కిరీటి నుపలక్షించి కృష్ణుడు ద్రోణునకు ప్రదక్షిణముగా రథము త్రిప్పుచు, వెనుకకు పోయి నప్పుడు ద్రోణుని విడిచి వ్యూహములోనికి రథము తోలెను. ద్రోణుడును అర్జునా! అర్జునా! ఇది యేమి; శత్రువుల గెలువకయే సుప్రతిష్ఠుడవు కాదలచితివా! అని వెనుకనుంచి బాణములుకొట్టుచు, వెంబడిపడెను. నీవు

గురుడవుగాని శత్రువుడవా; నీయొద్ద ఓడినను మాకు ప్రతిష్ఠయే యనుచు ముందుసైన్యముల నటికివేయుచు, కృష్ణుని సారథ్యము నేర్పున, తన శర లాఘవముతో కొంతదూరమేగిన తర్వాత ద్రోణుడీ సందున నందఱు వ్యూహమున జొచ్చిన ప్రమాదమగునని ద్వారము కాచుకొనబోయెను.

అప్పుడు కృష్ణుడా వ్యూహము పన్నిన గురుని నేర్పు మెచ్చుచు, అర్జునా! వ్యూహము చూచితివా? యనెను. అర్జునుడు ఇదియొకవ్యూహము కాదు. ఇచ్చట శకటవ్యూహములో సూచీవ్యూహ మమర్పబడినది. ఇంక ముందుముందేయే వ్యూహలక్షణముల నదికెనో అక్కడక్కడ తెలిసి కొని జాగ్రత్తగా నడుపవలె ననెను. అత్యంత వేగముతో నరనారాయణుల ఆ రథము సూచీవ్యూహము, శకటవ్యూహము ఛేదించుకొనుచు, లెక్కలేని వీరరథికుల నెల్లసాధనములతో నాశనముజేయుచు పోయి వెనుక నంట వేసిన అర్ధపద్మవ్యూహమును జూచి మెచ్చుచు అచ్చటికి తగిన విధమున ప్రవర్తించుచుండ, అర్జునునితో నారాయణుండు ద్రోణాదులగు వీరుల శర ములు శరీరములనిండ నాటి గుఱ్ఱములు డప్పినొందియున్నవి. ఇవి వెన్ను మునుగు నీరిలో నాప్యాయన మొనయవలెను. అంత జలము లేకున్నను త్రాగుటకైనను నీరులేకున్న నేడు నిన్ను గెలిపింపలేపు-అనెను. దానికి నవ్వి అర్జునుడు బావా! ఇదిగో జలములు అని చెప్పుచునే అంతలో నొక బాణము నేల బగులకొట్టి ఆ సందున నెగసిన జలధారకు చుట్టు కట్టవేసి, అది చెరువుచేసి పైన బాణములతో నిల్లుగట్టి చూప కృష్ణుడు గుఱ్ఱములను రథమునుండి విడిచి యా చెరువులోదించి ఒడలిబాణములుపీకి, మాలీసుచేసి, నీరుద్రావించి, దివ్యాస్త్రముతోవచ్చి జలమువెంబడి నప్పుడే మొలచిన గ్రాసముమేపి, తెచ్చి రథమునకు గట్టెను. ఈ లోపల అర్జునుడు రథము లేకుండ ఒక్కడు క్రింద నిలిచియున్నాడుగదా యని వానిపైబడిన, సైన్యములెల్ల వానిచే నుగ్గునూచమగుచుండెను. అప్పుడుల్లాసభాసుర ముఖుడై యర్జునుడు రథమెక్కెను.

అప్పు డచ్చట రాజులెల్ల శాత్రవుల మహావ్యూహములోనికి ఒక్క రథముతో తోడులేకుండ వచ్చి పైబడు శాత్రవుల లెక్క-సేయక, చెఱుచ త్రవ్వి గుఱ్ఱములకు మాలీసుచేసి, సారథి మరల రథమునకు గట్టువరక నేలనుండి ఎఱుగనట్లు వచ్చిన చతురంగసైన్యముల నుగ్గుసేయుచు, ఈ రథమెక్కిన వీడుడింక నెవరికి సాధ్యుడగును। వీనిచే సైంధవుడు చావక బ్రదుకునా? వీరలు శత్రుమధ్యమున నున్నట్లులేదు. ఆడువారిలో నాటలాడ చున్నట్లున్న దీ మహాయుద్ధము—అనిరి. అట్లు త్రోచినడచి పద్మవ్యూహము ఛేదించుకొని కర్ణికవద్దకు పోవునంతకు నచ్చటి సైంధవునకుకాపుగా నున్న సైన్యములు వెలుకపాటి విన్నబోయెను. చుట్టునున్న కర్ణాదు లాదరముతో సైంధవు కాచుచుండిరి, ఆ సందున సైంధవు వరాహధ్వజము దూరముగా నున్నట్లు చూచి అర్జునుడు—ఇడుగో వీడే సైంధవుడు। అశ్వత్థామ, కర్ణుడు, శల్యుడు, భూరిశ్రవుడు, ముఖ్యులుగా పదిమంది వీరరథికులు పోటుమగలు గాన వీనిచుట్టు కావలియున్నారు. వీరేమి కావగలరు? ఇంక ఈ సైంధవు డేమి బ్రదుకును? సైంధవునితల క్రిందపడకముందు సూర్యమండలమును డొనిచ్చెదనా। అంత యవసరమైన బాణపంజరములో సూర్యుని బిగించి సైంధవుతల నఱికెదననెను. అప్పుడు ఘోరముగా ననేక సైన్యములతో మహావీరులతో కృష్ణునకు, అర్జునునకు చేతులు కాళ్ళు ఆడనియంత మహాహవము సాగెను. ఈ లోపల దుర్యోధనుడు హుటాహుటిగా ద్రోణుని వద్దకువచ్చి గురుడనియుజూడక అనరాని మాటలని రాత్రి నమ్మకముగా చెప్పుటబట్టి మేము సైంధవుని యుద్ధరంగమునకు దెచ్చితిమి. లేకున్న నింటంబెట్టి వచ్చువారము. వ్యూహము గట్టిగ బన్నిన నేమి లాభము? అర్జును వదలితివి. అతడు వ్యూహమంతయు చెల్లాచెదరుచేసి, సైంధవుని యొద్దకు చేరినాడు. నీవు పాండవపక్షపాతివి. అర్జునునకు సైంధవు నప్పగించ నింత చేసితివి—అన ద్రోణుడు చిఱ్ఱరేగి పాండవుల శరవేదనతో నా యొడలు మండుచుండ నీవు మాటలతో నొప్పించవచ్చితివా? అపను

శక్తి యెఱిగి నీవిట్లనవచ్చితివా? ఇంతయగునని నేను భీష్ముడు చెప్పినను వినక సంధి చెఱచి చావుదెచ్చుకొంటిని. పాండవులు మిక్కిలివారు. నీవు తలచినంత సులభమా! వారిని గెలుచుట. నీవు దుష్టుడవు. నీ పక్షములో చేరుటవలన నాశక్తి యడగారిపోయినది. పొమ్మని విదలించిన, అతడు మెత్తబడి వేదుకొన నొక కవచము నభిమంత్రించి తొడిగి, పోయి అర్జునుతో పోరాడుము. వాని బాణములు నిన్నేమియు చేయవు. సైంధవు గాపాడుకొనుమని పంపెను. ఆ మదముతో దుర్యోధనుడు అర్జును నెదిరించి నీవు పాండురాజునకు నిజముగా బుట్టిన, పారక నిలువుమని పోరాడ జొచ్చెను. అర్జునుబాణము లా కవచము భగ్నముచేయలేక మిట్టిపడ జొచ్చెను. సర్వకవచ విచ్ఛేదిని యను నస్త్రము అర్జునుడువైచిన సర్వాస్త్ర విచ్ఛేదిని యను అస్త్రమున దానిని అశ్వత్థామ నఱకెను. అప్పుడు అర్జునుడు ఉపాయశాలిగాన కవచములేని అరచేతులలో ప్రకృతి బాణములు జొనుప, వాని ముంజేతులువాచి, తీపుపుట్టిన దుర్యోధనుడు ఆ కవచము నూడదీసి పారవైచి ద్రోణుని దిట్టుచు వెనుకకొదిగెను.

ఇట్టి ఘోరయుద్ధమున అర్జును డేమిచేయుచుండెనో? ఒక్కరథమే పోయెనని చింతించి ధర్మరాజు పంపగా సాత్యకి, ద్రోణుని దారి యిమ్మని ప్రార్థించి వానిచే నాక్షేపింపబడినవాడై ముఖమున జొరబడలేక ప్రక్కనున్న ఒకసైన్యమును నఱుకుచుబోయి, దారినబడి అర్జునుడు పోయిన త్రోవన సూచీవ్యూహము, శకటవ్యూహమున ననేకుల జంపుచు, దాటి పద్మవ్యూహముననున్న యర్జునునకు దాదాపు దగ్గఱకుపోయెను. ఈలోపల సాత్యకిచే దెబ్బలుతిని యోర్వలేక దుశ్శాసనుడు పారిపోయి ద్రోణుని వెనుక నొదుగ నా ద్రోణుడు—ఏమి! యువరాజ విభునకు నేమమే! సైంధవుని యేమిచేసె నరుడు? నీవీ మనుజేశులతో నిటు లేమిటికి తిరిగివచ్చితని—అడుకులు తిన్నప్పుడున్న యానందము కడుపున కుట్టెత్తినప్పుడుండునా? పాండవులు నాడు దయలేక అట్లు పలిచితిరి. ఇప్పుడొక సాత్యకి

చేతనే ఉడిగిమడగవలసివచ్చెను. భీమార్జునుల బారిబడిన నేమయ్యెదవో? ఇంకనైన నన్నతో నాలోచించి పాండవుల కైదూళ్ళయిన నిప్పింపుము. కానిచో మీ కొఱకు ప్రాణము లఱచేతిలోబెట్టుకొని నీకు సహాయము చేయ వచ్చిన రాజుల వెంటగొని, చావుకు తెగించి వారితో దాకుము— అని నిష్ఠురములు పలికి కుత్సించిన నతడేమియు ననక మరలిపోయి, సాత్యకిచేత మరల తన్నులుతిని ఇంకొకవైపున కొదిగెను. అట్లుపోవు సాత్యకితో భూరిశ్రవు డెదిరించెను. సోమదత్తుడు శివునివరమున తన్ను పరాభవించిన శిని, సత్యకుడు నప్పటికి లేకపోవుటచేత నా శిని మనుమడగు సాత్యకిని పరాభవింపగోరి, కన్నకొడు కగుటచే నట్టికాలమువచ్చి తీవ్రముగా పోరెను.

కొంతసేపటికి నిద్దరును విరథులై మల్లయుద్ధమునకు జొచ్చిపెనగు నపుడు సాత్యకిని క్రిందబడవైచి, భూరిశ్రవుడు వాని రొమ్ముత్రొక్కి, కత్తిదూసి వీనినాలుక గోయుదునని ఎడమచేతితో వాని నాలుక బట్టుకొనెను. దీనికొఱకే రాత్రి కృష్ణుడు దారుకునితో నన్నిమాటలుచెప్పి గుర్తుగ పాంచజన్యము నూదినపుడు తన రథమును దెమ్మని చెప్పియుండెను. ఇప్పుడు కృష్ణుడు భూరిశ్రవునిజంపి, నీ శిష్యుడు నీకొఱకింత కష్టపడి యొక్కడు ఇంత వ్యూహములో సాహసించివచ్చిన సాత్యకిని కాపాడుమని చెప్పి ఈ దుర్మార్గుడే నిన్న చేతిలో నాయుధములేని అభిమన్యు గుఱ్ఱముల నన్యాయముగా జంపెనని అర్జునునకు నీసెక్కజెప్పెను. దానికి అర్జునుడు ద్వంద్వయుద్ధములో నొకనిమీద రెండవపక్షమువారు ప్రహరింపరాదు. అయిన చూచుచు శిష్యుని చావనిచ్చెదనా?యని పలికి కృష్ణుడు తొందరపెట్టినను తొందరపడక వాని జంపకుండ కత్తితోనున్న వాని చేయి మాత్రము నఱికి సాత్యకిని కాపాడెను. భూరిశ్రవుడు విఫలప్రయత్నుడై తన్నుదాటిన నర్జునుడును నిన్న అభిమన్యున కతడుచేసిన అన్యాయమును వాక్రుచ్చి నిరుత్తరుజేసెను. సాత్యకి తప్పించుకొని యింతలో లేచివచ్చి

భూరిశ్రవు కంఠము నఱికెను. కృష్ణుడు శంఖమూద దారుకుడు తెచ్చిన రథము సాత్యకికి నిచ్చిన దానినెక్కి సాత్యకి విక్రమించెను.

ఇంతలో ధర్మజుడు భీమునంపెను. భీముడును ద్రోణుని దారియడిగిన ద్రోణుడు పరిహసించుచు—అర్జునుడు మ్రొక్కిపోయెను. సాత్యకి యర్థించిపోయెను. నీవు మొనగాడవుకూడ దారి యిమ్మని యడిగెదవు. నే నిక్కడ నెందులకుంటి ననుకొంటివి? అని యెత్తిపొడిచిన భీముడలిగి, అర్జునుడు దేవరాక్షసవ్యూహములలోనైనను నఱికికొనిపోవునుగాని, తగులువడువాడు గాడు. నీకు, నాయనకు నేమి మొగమోటమో అది యట్లుంచుము. నీవు గురుడవైన స్వేచ్ఛగా ఇంటికివచ్చిన భోజనము పెట్టెదను కాని, శత్రువునకు జయ మీయవచ్చిన నిన్ను క్షమించెదనా? చూడుమని యొక గదత్రిప్పి విసరివైచిన నది యసాధ్యమని ద్రోణుడు ముసలివాడయ్యు భయమున రథముదుమికి పారిపోయెను. ఆ గదతో ద్రోణుని రథము, గుఱ్ఱములు, సారథి సర్వము నుగ్గునూచమయ్యెను. భీముడు వ్యూహములోజొచ్చి అర్జునుడు, సాత్యకి నఱుకుకొనుచుపోయిన దారిన రథముతో నేగుచుండ వానికి భయపడి అందఱు దారియిచ్చి తొలగిరి. ఆ విధమున పోవు వానికి యింకొకరథము నమర్చుకొని, ద్రోణుడు మరల నడ్డము వచ్చి తీవ్రముగా కొట్టెను. దానికి కనలి భీముడు నిరాయుధుడై రథము దిగి ద్రోణుని బాణముల లెక్కసేయక పోయి ద్రోణుని రథము నెడమ చేతితో నొగఱపట్టి విసరివైచిన ఆ రథము గుఱ్ఱములతోకూడ కురుక్షేత్ర మెల్ల దాటిపోయి, యెక్కడనో పడెను. ద్రోణు డీలోపల నెట్టులో రథము దూకి ప్రాణము దక్కించుకొనిపోయి యింకొకరథమునెక్కి ద్వారభూమికి పోయెను. అట్లుపోయిన భీముడు సింహనాదము చేసిన గుర్తుతో అర్జున సాత్యకుల క్షేమమును, భీముని గెలుపును నెఱిగికొని సంతసించెను.

తరువాత భీమునిచేత పదునొకండు మార్లు ఓడిపారిన కర్ణుడు పండ్రెండవసారి యెదిరించిన భీముడు తన రథము దిగిపోయి కర్ణుని రథ

మెక్కి చూడ నతని కగపడకుండ కర్ణుడు రథము బల్లక్రింద దూరి ప్రాణము కాపాడుకొని భీముడు పిరికిపంద! పొమ్మని రథము దిగి తన రథమున కేగుచుండ, తాను విల్లుగొని భీముని రథము నటికి విరథుడగు వానితో యుద్ధముచేయ నతడు వాని బాణములకు యుద్ధములో తెగిపడి యున్న మొండెముల నడ్డమువైచి పోరిపోరి, యనియు లేమి నప్పుడును పారిపోక యూరక నిలువబడెను. అప్పుడు కర్ణుడు వాని తన ధనుస్సుతో కడుపు పొడుచుచు తిండిపోతా! నీకీ యుద్ధమేల? కడుపునిండ తిండి తినుచు నింటియొద్దనే యుండుము. అట్లుండలేకపోయిన నీవు తగినవారితో పోరుము. నావంటి వీరులపైకి రాకుము అనెను. భీముడు రోసమున రోజుచు వాని చేతిలో విల్లు లాగి విఱచివైచి అర్జునుని ప్రతిన తలచి విడిచివైచిన బ్రదికితివి పొమ్మని, తానర్జునుని దరికిపోయి కర్ణుడు నన్ను పరాభవించెను. నీ ప్రతిజ్ఞ తలచి వాని వదలితిని. నీవు వాని జంపెదవా? నన్ను వాని జంపుమందువా? అని తీవ్రముగా నడిగెను. అర్జునుడీ ప్రతిజ్ఞ యిట్లుండ నదియు నిప్పు డెట్లు చెప్పుడును. కొంచె మోర్చుకొనుము అని చెప్పుచు ఎదురైన కర్ణుని విరథునిచేసి యొడలెల్ల చిల్లులు పొడిచిన పారి పోవు కర్ణునితో-పదునొకండు పర్యాయములు భీమునిచేత నోడి పారిన నిన్నెవ్వ రేమనిరి? ఎప్పుడో ఒకసారి వీరులకైన నోటమి వచ్చును. అంతమాత్రమునకు భీము నేమంటివి. తులువా! నీ కులము, గౌనము తో చెంప్రజకుర-అని తిట్టి తరిమెను. దానికి భీముడు సింహనాదము చేసెను. ఇంతలో విశోకుడు మఱొక రథము తయారుచేసికొని రాగా భీముడది యెక్కెను. ఇట్లు భీముడు సాత్యకి యటునిటు సహాయము చేయుచుండ నర్జునుడు వశరథముల వీరులతో పోరుచు సందుచూచి సైంధవుని వరాహ ధ్వజము నరికిపడవైచెను. దాని కచ్చటి యందరు భయపడి యర్జును గ్రమ్ముకొనిరి.

అప్పుడు కృష్ణుడు అర్జునా! ప్రొద్దుక్రుంక వచ్చుచున్నది. ఈ పది

రథములవారు మనకవకాశ మీయకున్నారు. కాన నేనొక మాయచేసి సూర్యుడు కనబడకుండ చేసెదను. అప్పుడు పొరబాటున కనబడిన సైంధవు తల నరికి ప్రతిన దీర్చుకొనుము. తర్వాత సూర్యుడగపడును అని చెప్పెను. అర్జునుడు-ఇంకను రెండుగడియల ప్రొద్దు కలదు. జెండా నరికితినిగదా ! వీని తల నింతలో నరికెదను. నా పరాక్రమమునకు అప్రతిష్ఠ తేకుము. అని యనుచుండగనే వినక కృష్ణు డావని చేసెను. అందరు అర్జును డిక చచ్చునని పదమర సూచుచుండ దారిలో గొంతెత్తి సూర్యాస్తమయము చూచుచున్న సైంధవు తలను జరికాస్త్రమున నర్జునుడు నఱికెను. కృష్ణుడు దాని క్రింద బడనీకు మనెను. అర్జునుడా తలను బాణములతో నిలువుగా నడ్డముగా నాకాశమున ద్రిప్పుచు కసితో పైబడిన పసిరథములవారితో, వారి సైన్యములతో పోరుట అత్యాశ్చర్యముగ నుండెను. ఇంతలో సూర్యు డందఱకు కనబడెను. పైబడిన సైనికుల పలచనచేసి అశ్వత్థామ కర్ణాది వీరుల నోడించి యర్జునుడు సైంధవు తల నింక నెంత సేపు పైననే త్రిప్పవలెనని యడుగగా కృష్ణుడు వీని తండ్రి వృద్ధక్షత్రుడు వీనికి రాజ్యమిచ్చి తపమునకు పోవువేళ నాకాశవాణి వీని తల శాత్రవులచే నాకస్మికముగ తునుమబడునని చెప్ప నటులైన వీని తల క్రిందవైచిన వానితల వెంటనే పగులగలదు అని శపించిపోయెను. కాన అది శమంతపంచకము నొద్ద తపముచేయుచున్నవాని చేతులలో బెట్టిన క్రిందవైచి శపించినవాడే చచ్చిన మనకు ముందుగూడ ప్రమాదము లేకుండును. ఆపని పాశుపతముగాక మరియొక అస్త్రమేదియు జేయలేదు. అమ్మహాస్త్ర మువయోగింపు మనెను. అర్జును డట్లు చేయుటయు ఆ పాశుపతాస్త్రము వానితల బట్టుకొని బాణపరంపరాకారముగ బోయి యర్ఘ్య మిచ్చుచున్న వృద్ధక్షత్రుని దోసిలిలోబెట్ట వాడు చూడక వెంటనే క్రిందబడ వేసి తనతలయు బగిలి చచ్చెను. దానివలన అతడు మరల నింకొకశాపము బెట్టునను భయము లేకుండపోయినది. చూచువారలెల్ల ఇందఱతో

యుద్ధముచేయుచు నా శిరమును బంతివలె ఆకాశమున త్రిప్పనేల ? చివర కపి యెక్కడవైచెను? ఇంత యుద్ధమున వీరులు వానికి లెక్కగా లేదు, కృష్ణార్జునుల కిది యాటగా నున్నది యని యాశ్చర్యమందిరి. అంత భీమార్జున కృష్ణ సాత్యకులు పోయి ధర్మజు దర్శించి నమస్కరించి జరిగిన వృత్తాంతము సెప్ప నాత డానంద బాష్పములతో నేను ధన్యాత్ముడనని వారి నందఱ గౌగలించుకొని గౌరవించెను.

ఇక దుర్యోధనుడు ద్రోణునికడకు పోయి యేడ్చుచు దిట్టి నీవు కప్పవలె నటచు పాముపు. నీవలన నష్టపడితిని. ధర్మజుని బట్టెదనని యబద్ధమాడితివి. సైంధవు గాచెదనని యర్జునునేకాక వానికి తోడు భీమ సాత్యకులను బుచ్చి దుష్ప్రవేశమగు వ్యూహము పన్నియు లాభము లేకుండ చేసితివి, అని గురుని అనరాని మాటలని ఇంతియగాక నీవు యుద్ధము చాలించుకొని పొమ్ము. కర్ణునకు సేనాధిపత్యమిచ్చి పాండవుల గెలిచెద ననెను.

దానికి ద్రోణుడు నదరిపడి ఎదురేడ్చి-ఏమి చేయుదము? పాండవు లట్లు కాననమునకేగి నీవల్ల కష్టపడెనని తమంద రెరిగినదియే. ఆ దురిత మింత చేయకుండునా ! అది యటులుంచుము. పాండవుల వ్యూహము నెల్ల నాయొక్క చేతిమీద నాపి ప్రొద్దుకుంకు నంతవఱకు నెడతెరిపిలేకుండ శ్రమపడి పోరియు అగుణజ్ఞుడవగు నీచే మాటపడితిని. వారి యాయుధములు శరీరము మండించుచుండ నీవాకవైపున శరీరమే కాక యంతఃకరణమును మండించుచుంటివి. అర్జును గెలువశక్యము కాదని మునుపే చెప్పలేదా ? ఇంతమందిని రాకుండ నిలిపితినిగదా ! వచ్చిన ముగ్గురిని నీకర్ణుడు నీవు, నీసైన్యములు గెలువలేకపోయితిరి. నా యనంతరము నీపాటు నీవు పడెదవుగాక పొమ్ము. నేనీరాత్రికూడ యుద్ధము చేసెదను. పాంచాలుర నెల్ల జంపినగాని కవచము విడువను. దివిటీలువేయించు

యత్నము సేయుమని చెప్పి నాచేత దెగని పాంచాలురున్న వారి నిశ్శే షము సేయుమని నాకొడుకునకు చెప్పుమనెను. ఆ మాటలు రుచింపక పోయి కర్ణునితో నిదియంతయు చెప్పి ద్రోణుని చాలించి యిక నీవు సైన్యాధిపత్యము నొంది శత్రువుల సంహరింపు మనెను. అది విని కర్ణుడు దుర్యోధనుని జూచి రాజేంద్రా! సముద్రములో బుఱ్ఱవైచిన బుఱ్ఱెడు నీళ్ళు వచ్చునుగాని సముద్రపు నీరెల్ల వచ్చునా? అర్జుననంత పరాక్ర మములో నెంతటి వారంతగ నిలువవచ్చునుగాని వాని పరాక్రమమెల్ల నడంగింప నెవ్వరితరము. ఆ కుంతికడుపు చలువ యట్టిది. మనము చిన్న నాటినుండి విషాన్నము పెట్టించి, పాములచే గఱపించి, గంగలో బడవైచి, లక్క-యిండ్లలో గాల్చి, కాననమున కేగజేసి యొకనాశమునైన జూడ గలిగితిమా? ఇంకను నట్లగా తలపుము. ఎట్లయినను మొదలుపెట్టిన పని తుది జూడవలెను.

శ్లో॥ అనారంభో మనుష్యాణాం ప్రథమం బుద్ధిలక్షణం
ఆరబ్ధ స్యాంతగమనం ద్వితీయం బుద్ధిలక్షణం

అని రాజనీతి యనెను. కర్ణుని మాటలు విని అర్జునుని చూచిన పరాక్ర మము దలచి దుర్యోధను డంతరమున-

ఉ॥ ద్రోణుడు కర్ణుడుం గృపుడు ద్రోణసుతుండును నేల! వాని గీ
ర్వాణులకైనను౦ జెనక వచ్చునె! యెవ్వరునాజి గౌరవ
త్రాణ పరాయణత్వమున దర్పము సూపగ లేమిదెల్ల మ
క్షీణ పరాక్రముండయిన క్రీడికి నిక్క-పుటల్క- వచ్చినన్॥

అని దిమ్మరపోయి యూరకుండెను.

ఆ రాత్రి మహాయుద్ధము జరిగినది. కర్ణుడు రేగి యుద్ధము చేయు చుండ కృష్ణుడు ఘటోత్క-చుని బిలిచి ఈ రాత్రి కర్ణుని నీవు గాక ఎవరు

తలపడలేరు. నీవు వాని జయించి మీ తండ్రుల ఋణము తీర్చుకొనుము-అనెను. వాడు విజృంభించి మాయాయుద్ధము చేయుచుండ కర్ణునకు చేయియాడకుండెను. అప్పు డందరు కర్ణునితో నీకు ఇంద్రు డిచ్చిన శక్తి వీనిపై వైచి మర్యాదకాపాడుకొనుము. అర్జును సంగతి తర్వాత చూచు కొందమనిరి. అప్పటి కింకొక యుపాయములేక కర్ణుడు శక్తితో వాని సమయించెను. క్రోధ శోకములతో కర్ణు నెదిరించిపోవు ధర్మజునకు కృష్ణుడు వీడు రావణునంత వాడు. మనము లేనినాడు లోక మలోకము చేయును. వీడు కర్ణుని శక్తి కెరయగుటవలన మనమర్జును గాపాడుకొన గలిగితిమి. ఇది వాడు అర్జునునిమీద వేయవలెనని ప్రతిదినము వచ్చు చుండును. వారి వారలెల్ల నిది చెప్పుచుందురు. యుద్ధరంగమునకు రాగానే వాడు మరచునట్లు చేయుచుంటిని. ఇంక నెన్నాళ్ళు చేయుదుము. ఇది మనకు మేలుకాలముగాని కష్టకాలము గాదని యందఱ దుఃఖము శాంతింప జేసెను. ఆ రాత్రి తెల్లవారినది. కాల్యముల దీర్చికొని రాత్రి నిద్రలేక శరీరములు తూలుచుండ నట్లే పోరాడుచుండిరి. ఐదవనాడు రెండుజాము లయిన తర్వాత భీముడు కళింగసైన్యములతో యుద్ధము చేయుచు వాని గంధ గజమును చంపెను. దానిపేరు అశ్వత్థామ. వినరాని మాటవిన్న అస్త్ర సన్యాసము చేసెదనను ప్రతినగల ద్రోణుని యొద్దకుపోయి-భీముడు "అశ్వత్థామా హతః"-అని చెప్పెను. ద్రోణుడు కొంచెమాలోచించి శివవరమున బుట్టిన యశ్వత్థామ చావనివాడని తానెరుంగును గాన కళింగసైన్యములతో నింతదనుక పోరిన భీముడు గజమును జంపెనేమోయని యాలోచించి మామూలుగా యుద్ధము చేయుచుండెను. మూడుజాము లయినది. ద్రోణునకు కాలము దగ్గరకు వచ్చినది. కొండలమీదగాని నీటిలోగాని అడ్డు లేకుండపోవు ద్రోణుని రథచక్రము లంటిసలబడి లటుకు లటుకుమని కొట్టుకొనుచు రథవేగము తగ్గిపోయెను. ద్రోణుడు తెలిసికొని దర్మాత్ము లవు పాండవుల కపకారము చేయుటవలన నట్టిదశ తనకు తటస్థించె

ననియు నిక యుద్ధము చాలించెదననియు తలచుచుండ నాకాశవాణి దాని సమర్థించెను.

ఇన్ని కారణములతో తనచావు తనకు దెలిసిన మహాత్ముడు: వీర ధర్మప్రకారము పాండవసైన్యముల వధించుచున్నట్లు సందుచేసికొని ధర్మజు నున్నెడకు పోయి యడంగుటయు నాతదు కృష్ణప్రేరణమున "అశ్వత్థామా హతః", అని పెద్దగా నని "కుంజరః" అని మెల్లగా ననెను. అర్జునుడుమాత్ర మన్నతో మొదటినుండి సహజమవు సత్యమును వదల కుము. గురుని నసత్యమున జంపుటకన్న నన్యాయమెద్ది ? రాజధర్మముతో నిలవబడి గురుని చేతిలో చచ్చినను మనకపయశము లేదుసరిగదా ! వీర భోగ్యములగు లోకముల చూఱగొందుము. ఇదికి గెలిచిన రాజ్యమబ్బును. ఎట్లయినను బాధలేదు. అసత్యమాడవలదని గట్టిగా చెప్పుచుండెను. అది వినియు కృష్ణభీముల ప్రేరణతో ధర్మజు డట్లు పలికెను. ఆ "కుంజరః" అను మాట వినబడకుండ సైన్యవాద్య ఘోషాదులన్నియు నడ్డుపడినవి. దానితో ద్రోణు డస్త్రసన్యాసముచేసి రథముమీద కూర్చుండి యోగసాధనతో బ్రహ్మరంధ్రము బ్రద్దలుచేసికొనిపోయెను. ద్రోణుని తల నతని వధకై యాజోపయాజుల వరమున ద్రుపదుని యజ్ఞము నగ్నికుండమున బుట్టిన ధృష్టద్యుమ్నుడు, కృష్ణ పాండవాదులెల్ల వలదు వలదని కేకలు వేయుచున్నను తత్కాలజనితావేశమున కత్తితో నఱకెను. ద్రోణుడు సూర్యమండలము భేదించుకొని సిద్ధసాధ్య వందితమగు గతిగొనెను. ఇది ద్రోణపర్వము విధము.

ఈ కథలో పెద్దచర్చలు: గురుని విషయమై ధర్మజుడు అసత్యమాడవచ్చునా ? అస్త్రసన్యాసము చేసిన ద్రోణుని శిష్యుడగు ధృష్టద్యుమ్నుడు నరుకుట న్యాయమా ! వలదు వలదనిరి గాని యుధిష్ఠిరాదులంత అన్యాయము చేసిన ధృష్టద్యుమ్ను వధించిరా ? పోనీ వెడలనడిచిరా ? ఇది యంతయు నన్యాయమే యని అపోహలు గలవు. భీముని మాటతో

ననుమానము గలిగిన ద్రోణుడేమి చేయవలెను ? తన సైన్యములో దండ నాయకుడగు కొడుకు చచ్చెనో బ్రదికెనో తనకు తెలియదా ? అంత తెలియనివాడు సర్వసైన్యముల నేకముఖముచేసి యెట్లు నడుపగలడు ? ఒకవేళ దూరమునుండి తెలియకుండిన నశ్వత్థామను పిలువుమని కాని బ్రదికియున్నాడా ? అని కాని అడుగ చెప్పుటకు కౌరవసైన్యములో నెవ్వరు దిక్కులేరా ? దండనాయకులు నిలుచుటకు నెవరినెట్లు పిలువవలయునో అట్లు వేర్వేర శంఖధ్వనులు వారలకు గుర్తులుండునుగదా ! ఆ పని మరచినాడా ? అని ప్రతిప్రశ్నలు ఉన్నవి. రాయబారమప్పుడే భీష్మ ద్రోణులయందు కృష్ణుడు నేరము విశదీకరించెను. దానికి భీష్ముడు ధర్మజు మోముచూచుచు దానివలన తనపాపము పరిహారమగునని సూచించి పడి పోయెను. అట్లే ద్రోణుడును తనవాడు చావనివాడని తెలిసినను తెలిసికొను మార్గము ఉన్నను ఇది వంకబెట్టి ధర్మరాజును జూచుటకు తన పాపావనో దనమునకు అట్లుపోయి యడిగెను. ధర్మజుని "అశ్వత్థామా హతః" అన్న మాటకాక "కుంజరః" అను మాటతో ఆయనకు ప్రయోజనము లేదు. అట్లయిన కుంజరమా ? నాకొడుకా ? అని యడుగలేదా? వినరాని మాట విన్న చచ్చెదనన్న ప్రతిజ్ఞ కదియే చాలునుగాక! అతడట్లు చేసెను. ద్రుపదుని యజ్ఞమున ద్రోణు జంపుటకు పుట్టినవాడు నిమిత్తమాత్రముగా తలగోసి నా డననేల ? బ్రాహ్మణవృత్తిమాని క్షత్రవృత్తితో బ్రదికి ద్రోణునికి వృత్తికితగిన సంస్కారమైనగాని ఎంతయోగియైనను సూర్యమండలమును భేదింపలేడు. ఉత్తమలోకము లేదుగాన శిష్యుడగు వీరుడీ నెపమున నట్లుద్ధ రించెను. ఇది యంతయు భవితవ్యము. దీనిలో ధర్మజుడు కుంజరః అని మెల్లగానన్న దోషమునకు ముందు యమలోకము చూచెను. అంత మాత్రము సందులేకపోయిన నరకము పూర్తిగానే యనుభవింపవలసి యుండును, అని కథాభాగమును బట్టి సారాంశము తోచుచున్నది.

ఆ దినశేషమున అశ్వత్థామ ధర్మజు డసత్యమాడెనని, ధృష్ట ద్యుమ్నుడు తన తండ్రిని జుట్టుపట్టుకొని శిరము కోసెనని కడుకోపించి కోలాహలముచేసి పాండవ సైన్యమును నేలకు గోలకు వెచ్చి యాగ్నే యాస్త్రము వైచిన నది యర్జును నస్త్రముచే శమించుటయు, నారాయ ణాస్త్రము ప్రయోగించిన కృష్ణుడు పాండవపక్షమువారి నెల్ల రథములు దిగి ఆయుధములు క్రింద బెట్టి నమస్కారము సేయుడని యట్లు చేయించిన నదియు నుపశమించుటయు నాతడు రథము డిగ్గి పారిపోవుచుండ, దారిలో వ్యాసమహర్షి ప్రత్యక్షమై యడిగిన మహాత్మా ! నా ఆగ్నేయాస్త్రము అర్జు నాస్త్రముచే ప్రతిహతమాయెను. నారాయణాస్త్ర మూరకపోయెను. కృష్ణా ర్జునులు నాకన్న మిన్నలగుటకు కారణమేమియని యడిగెను.

నీవు పూర్వజన్మమున శివుని కరచరణాద్యవయవములతో నర్చ యందు పూజించితివి. వారు లింగాధిష్ఠానారూఢుని చేసి పూజించిరి. శివుని నర్చయందు పూజించుటకన్న లింగమున పూజించుట యధికఫలము. మీమీ పూజాఫలములు వేరువేరుగా ననుభవింపవలదా ? ఇట్లు పోవనేల ? నిలచి మొదలుపెట్టిన పని నెరవేర్చుకొని పోయెదనుగాక అని వానిని వ్యాసభట్టార కుడు మరలించెను. అంత నిరువాగువారు నస్తమయమువరకు పోరాడి శిబిరముల కేగిరి. దుర్యోధనుడు కోరికతీర తన కర్ణునకు సర్వసైన్యాధి పత్య పట్టాభిషేక మొనర్చెను.

# 24

మరునాటి యుద్ధములో నుభయ బలములు పోరాడినవి. అందు పాండవులకే విజయము సిద్ధించెను. వారలుల్లాసముతో బోయిరి. కౌరవులు కర్ణాధిపత్యము వచ్చినను జయింపకపోయితిమని యుసురుసు రయిపోయిరి.

ఇక కర్ణుని రెండవనాటి యుద్ధము తీవ్రముగా జరిగినది. కర్ణుడు తెగించి యానాడు తన గజాకారమగు దివ్యధ్వజమును పూజించి తెచ్చుకొనెను. ఆయుధములన్నియు సిద్ధముచేసికొని, వాని యుపాస్యదేవతల నుపాసించుకొని యుద్ధమునకువచ్చుచు, దుర్యోధనునితో నాకును, నర్జునునకును ఆయుధములలో, దివ్యాస్త్రప్రయోగములలో నెచ్చుతగ్గులు లేవు. లాఘవమున నాకన్న నతడు చాల తక్కువ. వానికి విరుగని రథముకలిగినను మనకు చాల రథములు వెంటనుంచుకొని ఒకటిపోయిన నొకటి వాడుకొనవచ్చును. వానికి అక్షయబాణతూణములున్న, మనము నంతకన్నబాణముల దెచ్చుకొనవచ్చును. కాని కృష్ణు డతనికి సారథియగుటచే మనయూపులన్నియు దప్పించుచున్నాడు. కాన మనల శల్యుడు సారథ్యమున - తెలివితేటలలో కృష్ణునంతవాడు. వానిని నాకు సారథిగా నమర్చిన నేను వారల జయించెదనని చెప్పుకొనెను. దుర్యోధను డాతని బ్రతిమాలి కాదన్నను ఎన్నింటికన్న మాటలుచెప్పి ఎట్టకేలకు కర్ణునికి సారథినిగా జేసెను. అప్పుడు శల్యుడు నేను హితము చెప్పెదను. కర్ణుడు కాదనరాదు. కోపపడరాదు. అట్లయిన మాకు పొందు కుదురునని మొదటనే చెప్పెను. రెండు జాములవరకు ననేక ద్వంద్వయుద్ధములు సాగుచుండెను. సంశప్తకులొకవైపున నర్జుననితో నెడతెగకపోరుచుండ, అశ్వత్థామ ఆయకొండ్ల యెద్దులు లాగలేక లాగుకొనివచ్చు బండ్లపైని బాణములుతెచ్చి యివి

యన్నియు కృష్ణార్జునులపై గాక మరియొకరిపైన పైవనని ప్రతినబూని యొకపైపున యుద్ధము చేయుచుండెను. మధ్యాహ్నమున కాబాణము లయి పోయిన నాతడు మరలెను. సంశప్తకులను కించిదవశిష్టముగా వధించి యర్జునుడు తన సైన్యము దరికి వచ్చునరికి కర్ణుడు ధర్మజుని పరాభవించి తీవ్రముగా పోరుచుండ నిలువలేక ధర్మరాజు శిబిరమునకు పారిపోవు చుండెను.

అయినను విడువక వెంటపడిన, అప్పుడు భీముని చేతిలో దుర్యోధనునకు చచ్చినంతపని వచ్చెను. దాని నుగ్గడించి శల్యుడు మనరాజు సచ్చిన నీపు ధర్మజు నేమిచేసి యేమి ప్రయోజనము? అని యొప్పించి దుర్యోధను ప్రాణత్రాణమునకు నచ్చుటకు రథము నడిపెను. ధర్మజు డింటికి పోయెను. కర్ణుడు భార్గవాస్త్రము ప్రయోగించి తీవ్రముగా పోరుచుండ వానియెదుట నెవ్వరు నిలువలేకపోయిరి. భీముడు మాత్రము దీకొని సైన్యముల నిలుపుకొని పోరుచుండెను. ఆ యుద్ధతీవ్రత్వముజూచి రాజు కనబడకపోవుటకు చింతించి పోయి భీము నడుగగా రాజుగారు యుద్ధరంగమున లేరు. ఇంటికి బోయెనేమో? యనెను. నీవువెళ్ళి చూచిరమ్మన నేనుపోయిన ఓడిపోయితి నందురు. నీవే పోయి చూచిరమ్మనెను. నీవు జయించుచుండుము, మేము మా యన్నసంగతి చూచివచ్చెదమని కృష్ణుడు రథము త్రిప్పెను. అంతకుముందే కర్ణుని తీవ్రతజూచి సంశప్తకులతో, నశ్వత్థామతో యుద్ధము చేసిచేసి అలసివలసివచ్చిన యర్జునుడే—వట్టపగలింటి భాస్కరు పగిది కర్ణు డుగ్రమూర్తియై వెలుగుచున్నవాడు. మాధవా! మన రథము మరలనిమ్ము! అని కర్ణునకు ప్రతిష్ఠతెచ్చెను. అర్జునుడు భీమునితో కర్ణుడు తీవ్రముగా బోరుచున్నాడు. అదుగో సంశప్తకులు మరల సిద్ధమై వచ్చుచున్నారు. అశ్వత్థామయు నిప్పుడే రాగలండు. నేను పోయిన నెట్లు? అనిన భీముడు వినిని, వారినిగూడ నే నొక్కడన నిలిపి పోరాడగలను, నీవే యింటికి పొమ్మనెను.

ఆ భీమునియూపు లోకాతీతముగా నున్నది. వట్టివట్టి మాటలేకాక అప్పుడే కర్ణు నెదిరించి పోరాడి మూర్ఛనొందించి వాని రథముమీద నెక్కి- ఆనాడు సభలో నన్నమాటలకు నేడు ధర్మజుని పరాభవించినందులకు వీని నాలుక గోసెదనని కత్తి ఝళిపించిన, శల్యుడు వానితో నిది చావు గాదు. మూర్ఛ మునిగిన వాని నాలుకగోసిన చచ్చును. అర్జునుడు వీని జంపు ప్రతినపట్టి యున్నవాడు. నీవీ పనిచేసిన ఆ సత్యసంధు డగ్నిప్రవే శము చేసిన మీ యింటికి ముప్పురాదా? యని వారించెను. భీముడు సంతో షించి మామా! నీవు చెప్పుటనుంచి మాకు ముప్పుతప్పెను. నీమాట కాద నను, అని రథము దిగిపోయెను. ఇట్లు మహాభీమముగా యుద్ధము సాగు చుండ కృష్ణార్జునులు శిబిరమునకేగి ధర్మజుని దర్శించిన, వారు కర్ణునిజంపి వచ్చినారనుకొని వారి నగ్గించి మాటలవలన కర్ణుడు బ్రదికియుండెనని తెలిసి తాను బాధపడి యుండుటవలన అర్జును నిందించి నీ చేతకాకపోయిన గాండీవము కృష్ణునకిచ్చిన కర్ణు జంపెడువాడనెను. దానికి అర్జునుడు తన యన్నను జంపెదనని కత్తిదూసెను. ఇది యేమన-గాండీవము నింకొక రికి నిమ్మనువాని గొంతుకోయ ప్రతినబూనినవాడ ననెను. కృష్ణుడు వాని బదరి — ధర్మజు దూషింపుము. అది చంపినట్లే యని యట్లు చేయించెను. అర్జునుడు మరల కత్తిదూసి తనతల కోసికొనియెద నన నిదియేమి యని కృష్ణుడు — పూజ్యుడగు నన్నను దూషించినందుల కన్న, నీకు ధర్మము తెలియదు. ఆత్మశ్లాఘ చేసికొనుమర్జునా! అది చచ్చినట్లే యని యట్లు చేయించి, ధర్మజుని కోపపరిహార మగునట్లు ప్రార్థించి, తాను అర్జునుడు వాని పాదముల కెఱగి యుద్ధానుజ్ఞ తీసికొనిపోయిరి. అప్పు డర్జునుడు కర్ణుని చంపకుండ నీరేయి నీ కగపడనని ధర్మజుతో చెప్పిపోయెను.

కృష్ణార్జునులు మరల యుద్ధరంగమునకు వచ్చువేళకు యుద్ధభార మంతయు భీముని చేతిమీదనే యున్నది. ఇంతలో దుశ్శాసనుడువచ్చితాను మున్ను పెట్టిన బన్నములెల్ల వాక్రుచ్చి తనతో యుద్ధముచేయుమని, సోత్సా

నముగా బలికిన భీముడు రేగి వాని విరథునిచేసి, గద విసిరి వాని బడవైచి, తాను రథము దిగిపోయి, వాని చుట్టును తిరుగుచు, ఇంకొకరు వానిని రక్షింపరాకుండ పొదివి, ఓరీ దుశ్శాసనా! నీవు నా కగపడితివి. అప్పు డాడిన మాటలుగాక, ఇప్పుడును వెదకికొనుచువచ్చి యిన్నిమాట లాడితివి. జూదమునాటి ప్రతిన నెరవేర్చుకొనియెదను. నీ కిక్కడ నెవ్వరేని దిక్కు గలిగిన బిలుచుకొమ్మని పెద్దగా జెప్పుచు రౌద్రాకారముతో చుట్టును దిరుగుచు అప్రతిష్ఠపాలై పోయెనుగాని, ధృతరాష్ట్రి డేమి సంపాదించెను? ఆ సభలో ద్రౌపదికి పరాభవము చేయవలదని తాననిన యింత పుట్టదుగదా! మీచేత నీకు భర్తలేడు అనిపించుకొనిన దాని మగడిప్పుడు వచ్చినాడురా! మా మగవార లింతపని చేసిరని అప్పుడు విఱ్ఱవీగిన కాంత లిట్లు అపతిత్వ దీనత నొందుచుండిరని పలుకుచు ప్రాణముంతగనే వక్షస్థలము బ్రద్దలు చేసి నెత్తురుద్రావి తలకుపోసికొని ఒడలెల్ల రక్తమయుడై పిడికిలిబట్టుకొని చుట్టును తిరుగు భీమునిపై బోలేక భీతితో దుర్యోధన, కర్ణ, కృపాశ్వత్థామాదులెల్ల దిమ్మరపోయి చూచిరి. ఇట్లు ప్రతిన దీర్చుకొని, నా రెండు ముఖ్యప్రతిజ్ఞలలో నొకటి తీరినది- బాటు మాటు కాకుండ దుర్యోధనుడు, కర్ణుడు, కృపుడు, అశ్వత్థామ మొదలగువీరు లేమియు చేయలేక చూచుచుండ, పాండవపత్ని కేశాంబరముల నాకర్షించిన వాని జంపి నెత్తురు ద్రావితిని. ఇక రెండవదికూడ ఇట్లే తీర్పబోవుచున్నానని వాని నొక్క త్రొక్కు త్రొక్కి చంపి, విశోకుడుతెచ్చిన రథమెక్కి కౌరవుల కెదురుగా నడచెను. అంతకుముందేవచ్చి భీముని ప్రతిజ్ఞ కడ్డువచ్చువారిని నఱక సిద్ధపడియుండి, ప్రతిన నెరవేరుటకు సంతసించి యర్జునుడును కలసికొనెను.

ఇక జాము ప్రొద్దున్నది. కర్ణుడు మనసు చెడి తాను జూచుచుండగా నింత ఘోరము జరిగినది. గనుక నింక నా పౌరుష మెన్నటికి అని తెగించి అర్జునుతో నెదుర్కొనెను. రెండువైపులవారు చూచుచుండిరి. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము సాగినది. కర్ణుడు సర్పముఖాస్త్రము అర్జు

నుపై ప్రయోగించెను. అది కంఠమునకు సరిగా గుఱివెట్టక తొందరచే ఫాలస్థలమునకు సూటి చేయుటచే శల్యుడాక్షేపించెను. మరల గురివెట్టు మనెను. కర్ణుడొక బాణము రెండుమార్లు గురివెట్టునా ? యని వాడప్లే వైచెను. అది వచ్చువేళకు కృష్ణు డర్జునుని రథము నాలుగంగుళములు భూమిలోనికి నదిమెను. ఆ యస్త్రము అర్జును కిరీటము నెత్తుకొనిపోయి తల రాలేదని తిరిగి వచ్చుచుండ-ఇదియేమని అర్జును డడుగగా - ఇది తక్ష కుని కొడుకగు సర్పరాజము. ఖాండవ దహనమప్పుడు ఇది పారిపోవు చుండ నీవు నడిమికి నరికి అగ్గిలో పడవైచితివి. ఆ తల నాటినుండి కర్ణునియొద్దనుండి నీమీది పగతో కిరీటమపహరించి అంతతో బోక మరలి వచ్చుచున్నది - అని కృష్ణుడు చెప్పెను. అర్జునుడు దాని నారు బాణము లతో ముక్కలు ముక్కలు చేసెను.

ఇంద్రుడిచ్చిన శక్తి ఘటోత్కచునిపై పోయి సర్వముఖా స్త్రి మిట్లయిన కర్ణు డుస్సురుమనెను. ఇంతలో బ్రాహ్మణ శాపమున కర్ణుని రథచక్రము భూమిలో క్రుంగెను. అది యెత్తుకొనియెదను కొంచెము సేపాగుమని దర్పముగా నడిగెను. దాని కర్జునుడు కొంతసేపు ఆగెను. కృష్ణు డాక్షేపించెను. కర్ణుడు రథమెత్త ఆ రథమును వదలక భూమి యంతయు దానితో లేచివచ్చెను. మరల రథమెక్కిన నింకను క్రుంగెను. మరల నాగుమనిన వాని దుర్మార్గములన్నియు చెప్పి యభిమన్యుని విల్లు చాటుగా నుండి యెట్లు నఱికితివని నిరుత్తరుజేసి కృష్ణుడు ప్రేరేప అర్జును డొక యస్త్రము మంత్రించివైచి వాని బడవేసెను. కర్ణుడు నేలబడి నంతనే రథము చక్రము పైకివచ్చినది. అట్టి నాయకుడు లేని మ్రోడుపడిన రథమును శల్యుడు తోలుకొనిపోయెను. ఇట్లు 17వ నాటి సాయంకాలను కర్ణరహితులైన దుర్యోధనులు శిబిరముల కేగుట, పాండవులు జూదమున నోడి అడవికి పోవునంతటికన్న దీనముగా నుండెను. కర్ణపర్వము తుది ఫలశ్రుతి వ్రాయబడినది.

చం॥ అనలుఁడుఁ భాస్కరుండును సుధాంశుఁడు నధ్వర సం
ప్రవర్తకుల్
వినుము నరేంద్ర ! యీ క్రతువు విఘ్నమయంబిది నిర్వ
హించి ర
ర్జునుఁడును కర్ణుఁడున్ సమరరూపమునందగ నీ ప్రబంధ మిం
పానరం జరించి నన్నీనిన నొంకు నరుంజిరసౌఖ్యసంపదల్॥

అని తిక్కన వ్రాసెను. ఇక్కడికి వర్ణ్యమయినది. తక్కినది కథావిశే షమునకు ప్రసంగింపబడినది.

18వ దినమున శల్యుని సేనాధిపతిగా చేసికొని కౌరవులు యుద్ధమునకు వచ్చిరి. రెండుజాములలో ధర్మజుడు వాని బడవైచెను. మూడవ జాములో దుర్యోధనుడిక నీవే సేనాపతివి మామా ! యని శకునిని మాటతో సేనాపతిని చేసెను. వాడు పోరి నకుల సహదేవుల చేతిలో సకుటుంబ సపరివారముగా చచ్చెను. కృపకృతవర్మాశ్వత్థామలు పారి పోయిరి. 11 అక్షౌహిణులు నాయకులు నశించిరి.

కం॥ పలపలని మూకలో కా
ల్నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీ కొడుకు గదా
కలిత భుజుండై యొక్కఁడు
తొలఁగి చనియె నేమి చెప్పుదుం గురునాథా !

అట్లు పోయి దుర్యోధను డొక చెఱువులో జలస్తంభన విద్యతో దాగి యుండెను. అది తెలిసికొని పాండవులు పోయి వాని నిష్ఠురములాడి బయటకు రావించి భీమునితో గదా రణము గోరిన వానియిచ్ఛమైనట్లు చేసిరి. ఆ యుద్ధము చూచుటకు బలరాముడును వచ్చెను, బలరాముడు దుర్యోధన

పక్షపాతి. కృష్ణుడు పాండవపక్షపాతి యను పేరున్నను స్వపక్ష పరపక్ష నిర్ధామధాముడు కావుననే దేవుడనవలసి వచ్చినది. భీమ దుర్యోధనుల గదాయుద్ధము సాగినది. కొంతసేపునకు కృష్ణుని యాలోచనమున నర్జునుడు వాని తొడగొట్టుమని భీమునకు సంజ్ఞచేసెను. భీముడు తెలిసికొనియు తొందరపడక తనకు భారమైనను పోరాడుచుండెను. అప్పుడు పట్టికొట్టు దుర్యోధనుని గదతాకుతో భీముడు మోకాళ్ళు నేలమోపి దిమ్మర పోయి కూర్చుండబడెను. ఆ సమయమున దుర్యోధనుడు మరల భీముని పైగా పట్టికొట్టవచ్చుట జూచి ఆ యెగసినప్పుడు కూర్చుండియే వాని తొడలకుబట్టించి భీముడు గదవిసరగా నతడు తొడలునలిగి క్రిందబడెను. అప్పుడు బలరాముడు గదాయుద్ధమున తొడలు విరుగగొట్టుట భీముడు చేసిన యధర్మమని కృష్ణునితోగూడ నందఱ నిందించెను. దానికి బలరామునితో కృష్ణుడే మాటలాడెను. దెబ్బతిని మోకరిలబడిన వానిపై పట్టికొట్టవచ్చునా ? ఆ దిమ్మరపోయినవాని నింకొక దెబ్బకొట్టిన చచ్చునుగదా ! ముందు అధర్మము దుర్యోధనుడు చేయుటవలన తన ప్రాణము కాపాడుకొనుటకు ప్రతినతీర్చుకొనుటకు నట్లు కొట్టెను. అదియుగాక మైత్రేయముని శాపమున వాని తొడలు భీముని గదచే విరుగవలసియున్నవి.

ఇవి యన్నియు తెలిసియున్న దుర్యోధనుడు తన తొడల గాపాడుకొనవలదా ? ప్రమాదమన్న ననుభవింప నిమ్ము.

ఉ॥ ధారుణి రాజ్యసంపద మదమ్మున ద్రోవది కృష్ణ నిట్లు రం
భోరు నిజోరు దేశమున నుండగఁ బిల్చిన యుద్ధురాత్ము దు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరు తరోరు జేయుదు సుయోధను నుగ్రరణాంత
రమ్మునన్

అని భీముడు ప్రతిన చేసెనుగదా ! అది తప్పయిన నుగ్రరణాంతరమ్మున గదతో తొడవెట్లు గొట్టెదవు ? అది యధర్మముగాన ప్రతిన మార్చుకొమ్మని యప్పటి సభాస్తారులగు భీష్మాదు లెవరైన ననిరా ? భీముడప్పుడే వాని తొడలు విరుగగొట్టవలసినది. ధర్మాత్ముడుగాన నిన్నినాళ్ళాగినాడు. ఇది యంతయు నెరిగిన నీవైనను అధర్మమగు ప్రతిన మార్చుకొమ్మని భీమునకు జెప్పియుంటివా ? ఇందు భీముని తప్పేమియు లేదనుచుండ బలరాము డౌనౌను, శిఖండి నడ్డము బెట్టి తాతను బడగొట్టిన అర్జును తప్పులేదు. అసత్యమాడి గురుని జంపించిన ధర్మజుని తప్పులేదు. రథచక్రము క్రుంగినప్పు డర్జునునిచే కర్ణు జంపించిన నీ తప్పును లేదు. ఒక తప్పయిన ననవచ్చును. అన్నియు తప్పు లయినప్పుడు దాని విమర్శమింక నేల ? అని బలరాముడు తీవ్రముగా మాటలాడెను. దానికి భగవంతుడు అన్నిటికి సమాధానము చెప్పి పాండవుల తప్పు ఇసుమంతయు లేదు. కలికాలము రాబోవుచున్నది. ఇట్టి వన్నియు ధర్మములుగానే చెల్లునని బలరాముని నవ్వులకు బుచ్చెను. దుర్యోధనుడు "కంసదాసుని పుత్ర ! కావుము నీ దురాచారము" అని కృష్ణు నాక్షేపించినవానికి నివి యన్నియు చెప్పి మాటలాడకుండ చేసెను. ధర్మరాజు "పాపపుణ్య చింత యింకేటికి పద్మనాభా !" అని ధర్మరాజు తమకు నిట్టివియే కొన్ని యప్రతిష్ఠలు ఎంత ధర్మముగా నడచినను రానేవచ్చినవి—అని విసువుతో ననిన—నిది నా పని. మీకేమియు దోసము లేదు. ఇట్లే ఏకలవ్యుని వ్రేలు కోయించితిని. అట్లే చేయకున్న దుర్యోధనుడు వానిని చెప్పుకొనిన నాకు సంకటమయ్యెడిది. అని చెప్పెను. ద్రోణుడు ఏకలవ్యుని వ్రేలు కోయించుటకూడ తనపనియే యని చెప్పు శ్రీకృష్ణుని ప్రసంగమునుబట్టి తప్పొప్పుల నిర్ణయించు భారమెవ్వరికిని లేదు.

ఇది యిట్లుండగా మహాత్ముల చరితముల తప్పులెన్ను వారికి వారి తప్పులలో భాగము పంచుకొన నేనని పెద్దలు చెప్పుచున్నారు.

ఆర్షగ్రంథములలో నెక్కడ సందియము కలుగునో అక్కడనే దాని సమాధానము నుండును. సందేహము తీరిన దాకా చదువుచు పెద్దల నడిగి తెలిసికొనుటయే దాని మందని మా తండ్రిగారు చెప్పిరి. ప్రకృత మనుసరింతము.

అంతట పాండవులు కౌరవ శిబిరములకేగి యక్కడి ధనధాన్యాదులు మిగిలిన సైన్యములు లెక్కలు చూచుకొని దాసదాసీజనుల నాదరించి, తమ శిబిరములలో ఒక అక్షౌహిణీ సైన్యము మిగులగా దాని సేనాధిపతి మొద లగు వారికి జాగ్రత్తగా నుండుమని వారొక్క నది యొడ్డున నారాత్రి గడపిరి. పాండవు లైదుగురు కృష్ణసాత్యకు లట్లు లేకునికి కృప కృతవర్మాశ్వత్థామలు దుర్యోధను దర్శించి యీ ముగ్గురి మీద నశ్వత్థామను సైన్యాధిపతిగ జేయించుకొని యారాత్రి శిబిరముమీదికిపోయి పాండవుల యక్షౌహిణీ సేనను ధృష్టద్యుమ్నుని నిద్రించువారి నెల్ల నఱికి కసిదీర్చుకొనిపోయి ప్రాణము పోవుచున్న దుర్యోధనునితో చెప్పి పాండ వులు లేకపోవుటచే ఈ పరాక్రమము సాగినది. వారున్న శిబిరము మీద పోవుట కుదరనిదే! ఇప్పుడు వారు పైన బడకుండ తప్పించుకొన వలెనని పారిపోయిరి. కృతవర్మ ద్వారక కేగెను. కృపుడు హస్తినాపురి కేగెను. అశ్వత్థామ సన్యసించి గంగ యొడ్డున తపము చేసికొను చుండెను. దానికి దుఃఖించుచు ద్రౌపది ప్రేరణతో భీముడు అశ్వత్థామపై బోవుచుండ కృష్ణార్జునులును వానికి కాపుగా వెనుకనుండి పోయిరి. భీము డతని నిష్ఠురములాడ అశ్వత్థామ బ్రహ్మశిరోనామాస్త్రము మంత్రించి పాండవేయదారగర్భముల నెల్ల నిది నశింపచేయునని వేయ అర్జునుడును కృష్ణుని పనుపున బ్రహ్మశిరోస్త్రమే వేసి దాని నాపెను. ఆ రెండు పోరుచుండ వ్యాసనారదులు వచ్చి యుద్ధమంతయు నైన తుది నివి యేల? వీని నుపసంహరింపుడని చెప్పిన విని యర్జునుడు వారి మాటలనాదరించి తన యస్త్రము నుపసంహరించెను. అశ్వత్థామ కది చేతకాలేదు. అట్లు

చెప్పిన తనకు సామర్థ్యా యని దాని మరింత దీపింప చేసెను. కృష్ణుడు వాని "పాండవేయ దారగర్భములు" అను మాటకు పాండవి అన పాండు రాజు భార్య. ఆమె కొడుకులు పాండవేయులు. వారి దారల గర్భము లపై నిది ప్రసరించును గదా! అందొక్కటి నేను సంరక్షించెదను. గర్భములు నిన్నేమి చేసినవని, ఐన నిట్లు చేసిన పాపమనుభవింపుము. మూడువేల సంవత్సరములు దుర్గంధదూషిత శరీరుండవై కుష్ఠురోగము ననుభవింపుమని శపించెను. వ్యాసనారదులు దాని ధృఢపరిచిరి. ఆ యుద్ధములో పాండవుల దప్పించి నందుకు దుఃఖించి య స్త్రము నుద్దీప్తముచేయ దానిచే నప్పుడు పాండవదారగర్భము లన్నియు నశించెను. భగవంతుడు ఉత్తర గర్భమును కాపాడెను. కులము పరిక్షీణమైనప్పుడు పుట్టెనుగాన వానికి పరీక్షిత్తని పేరుపెట్టిరి.

తర్వాత ధర్మరాజు చచ్చిన భారతవీరులకెల్ల సంస్కారము లాచరింపించి, కృష్ణు నాజ్ఞచే పట్టాభిషిక్తుడై భీష్ముని వలన ధర్మములు నేర్చుకొనుట వంకపెట్టి శాంత్యానుశాసికపర్వముల ధర్మప్రవచన మిప్పటికి గల రాజకుమారుల ప్రబోధార్థముగ చెప్పించి తా నశ్వమేధము నొనర్చి గతకల్మషుడై ముప్పదియారేండ్లు రాజ్యము చేసి చివరకు పరీక్షిత్తునకు యౌవరాజ్యమిచ్చి, యుయుత్సునకు మహారాజ్యమిచ్చి సుభద్రను పై పెత్తనమున కమర్చి ద్రౌపదితో వారు స్వర్గమున కేగిరి. అందు ధర్మరాజును శరీరముతోనే స్వర్గమునకు తీసికొనిపోయి తమ్ముల చూపుమని యాతడడుగ యమలోకమునకు తీసికొనిపోయి నరకము చూపగా కోపించి యామహాత్ముడు శాపముపెట్టునేమో యను భయముతో నారదు వెంటబంపి, అవసరమైనప్పుడు దేవేంద్రుడు యముడు ప్రత్యక్షమై వాని యడిగిన వానినెల్ల సమర్థించి నా తమ్ముల నేల నరకములో బడవైచితిరి? వారేమి తప్పు చేసిరి? అని యడుగ నీ తమ్ములు తప్పు చేయలేదు, నరకమునకు రాలేదు, మహాత్ముడవగు నీవే గురునిమిత్తమున ఆడిన

అసత్యలేశమునకు నీకు నరకము చూపవలసి యిట్లు చేసితిమి. నీ తమ్ములు నరకములో నున్నట్లు చూపుట యొక నాటకము. మేము కల్పించితిమి, అని ఆయనను స్వర్గమునకు శరీరముతోనే తీసుకొనిపోయి రను గ్రంథమునుబట్టి, పాండవుల తప్పులన్నియు మన మనుకొనుట దక్క నిక్కములు గావని తోచుచున్నది. నిక్కములైన నింద్రియ ములు మా నాటకమని యేల చెప్పుదురు ? ఇది యంతయు ప్రసక్తాను ప్రసంగముగా వచింపబడినది కాని - యిచట భారతము నంతయు చెప్పు టకు ప్రారంభింపబడినిది కాదు. అట్లయిన కొన్ని వత్సరములు పట్టును.

ఈ భారతము సంస్కృతమున హరివంశ, విష్ణు, భవిష్యములతో నూరు పర్వములగును. ఇది త్రిపురాసుర సంహారముతో ముగింప బడినది. అందును శివుడు మూడుసార్లు మూడు పురముల యసురుల నశింపచేసినట్లున్నది. అందువలననే గచ్ఛద్వ్యాఖ్యాత గ్రంథము నంతను సందేహించి - ఇది చారిత్రాత్మకము గాకున్నను నిందు గ్రహింపదగినది పరమార్థమే యని వచించెను. అది యెట్లన త్రిపురములు స్థూల సూక్ష్మకారణశరీరములు. ఇందు మొదట శివానుగ్రహమున స్థూల శరీరము నందలి రోగాదులు పోగా సాధకుడు ఉపాసనమున కర్హుడగును. శరీరదార్ఢ్యమునుబట్టి సూక్ష్మశరీరమున కామాదులు రేగిన రెండవసారి శివుడు సూక్ష్మమును శుద్ధిచేయుట. శారీరకరుజలు మానసికకామాదులు పోయిన పిమ్మట కారణశరీరమందలి తమము పొంగి జడసమాధి నాపాదించును. మూడవసారి శివానుగ్రహముతో నది పోయిన దేవతలు స్వస్థులైరని దీని భావమనియు తక్కిన భారతము నంతయు నిట్లే సమన్వయించుకొమ్మని యాయన చెప్పెను. ఈ విధముగా విద్య లన్నియు పరంపరగా జ్ఞానప్రచోదనమునకే ఏర్పడెను. వృత్తి రహిత స్థితిని కూడ తెలిసికొను సంవిత్తే అనగా చరమవృత్తియే ప్రకృతి.

దాని కాశ్రయము బ్రహ్మము. కాన కర్మకాండముతో కర్మములాచరించి యుపాసనవలన ప్రబుద్ధులైయున్నట్టు లుండుటయే ముక్తి. కాన వేదాది విద్యలలో నేకథలు చెప్పినను అవి యన్నియు మోక్షసాధకములే. కథలు కూడ బోధము కొఱకే ఏర్పడినవి. దీనికి దత్తాత్రేయమహాత్మ్యమున నొక కథ చూడుడు.

కేవల కర్మప్రధానుడగు నొక సోమయాజి ప్రతిదినము వైశ్వదేవము చేసి బలిదానము చేయుచుండ నా బలిక్రిందపడకుండ మాయమైపోవుచుండెను. అట్లు కొంతకాలము చనిన ఒకనాడు బలి వదలుసరికి ఒక బ్రహ్మరక్షస్సు చేయిపట్టి దానిగొని తినెను. అందులకా దంపతులు భయాశ్చర్యముల నందుచుండ నా రాక్షసు డిట్లనెను. ఈ రావిచెట్టు నందుండి నే నెన్నియో పాపములు చేసితిని. ఎన్ని చేసినను ఆకలి దప్పి తీరుటలేదు. కొంతకాలమునుండి నీవిచ్చు బలి పిడచ తినుట వలన నాకలిదప్పులు తీరి సుఖముగా నుండి ఎవ్వరిజోలికి పోకుండ నుంటిని. కాన మీకేమైనా నుపకారము చేసి కృతార్థుడ గావలెనని కనబడితిని. వర మర్థింపుడనెను. సోమయాజి కేమి కోరవలెనో తెలియలేదు. సోమిదమ్మ వాని కన్న పటుత్వము కలది. దంపతు లిద్దఱు నాలోచించి శ్రీ దత్తాత్రేయస్వామి నొకసారి చూపుమని యర్థించిరి. ఆ బ్రహ్మరాక్షసుడు మీ రడుగరానిది యడిగితిరి. ఆ స్వామి యీ యూర నప్పుడప్పుడు తిరుగుచుండును. కాని నా యట్టి వానికి వారికి నెంత దవ్వు ! అయినను మీ యుపకారము నెంచి చూపెదను కాని ఆయన మీకు స్వాధీనుడగుట దుర్లభము కాన మూడుమార్లు చూపెదను. మీ యదృష్టమెట్లున్నదో ? సిద్ధముగ నుండుడు అని చెప్పి యంతర్ధానము నొందెను.

ఒకప్పుడు వచ్చి సోమయాజిని గొనిపోయి మాంసపు దుకాణము వద్ద బేరము చేయుచున్న వానిని దూరముగా నుండి అడుగో దత్తదేవుడు

అని చెప్పి రాక్షసుడు చూచుచుండెను. సోమయాజి మాంసపుదుకాణము వద్ద కెట్లు పోవును. ఆ మాంసముగొను వాని నెట్లా శ్రయించును? అట్లే చూచుచుండ నల్లదేవుడంతర్ధానము నొందెను. రెండవసారు చండాల వాటిక వద్ద నున్న వాని జూపెను. సోమయాజి భార్యబోధమున, రాక్షసుని బోధమున వాని యొద్దకు పోయెను. ఆ దేవుడొక పశుశవమును కత్తితో కోసి యా ముక్కలు కాకులు మొదలగు పక్షులకు, కుక్కలకు బెట్టు చుండెను. స్వామి వానిని బెదిరించి కొట్టితిట్టి పంపెను. రాక్షసుడిక నీయన దేవుని కొలువలేదని నిరాశుడై విసువుకొనెను. పతివ్రతయవు సోమిద మ్మయు పతినిక మీరు పోవలదు. దేవునకు మనమీద దయలేదేమో? మీరు బాధలు పడలేరు – అని యుపచారములు చేసి వాని గాయములు మాన్పెను. సోమయాజి యా యిద్దఱ మాటలనుబట్టి స్వామి సమాశ్రయ మున పరమార్థము గమనించి ఈతూరి చూడుడు! నేనును పట్టువట్టెదను. అని యొక నిశ్చయమున నుండెను. బజారున వారి యింటి ముందుగా పిచ్చివాని వలె పోవుచున్న స్వామిని మూడవసారి రాక్షసుడు చూపెను. ఆయన వెంటబడి సోమయాజి పోవుసరికి స్వామి స్మశానసమీపమున కేగెను. వెంటనే పోయి సోమయాజి హఠాత్తుగా సాష్టాంగప్రణామము చేయుచు రెండుపాదములు గట్టిగా పట్టెను. స్వామి కొట్టినను తిట్టినను బెదరించినను విడువలేదు. ఇక వాని విడిపించుకొన స్వామి చేతకాలేదు. అప్పుడు ప్రసన్నుడై ఏమి కావలయునో కోరుకొమ్మనెను. సోమయాజి కేమియు తోచలేదు. రాక్షసుడు కాని, భార్యగాని చెప్పలేదు. అప్పుడేమియు తోచక తాత్కాలిక బుద్ధితో ఈ దినమున మా యింట శ్రాద్ధము, అందు భోక్తగా మిమ్ము నిమంత్రించుచుంటి ననెను. స్వామి చిత్రితుడై యట్లే స్నానము చేసి వచ్చెదను. నీవు పోయి యా ప్రయత్నమున నుండు మనెను.

సోమయాజి యింటికి వచ్చి జరిగిన సంగతి భార్యకు చెప్పి ఏమి

కోరవలెనో? నీవు చెప్పకపోతివి. నాకేమియు తోచలేదు. శ్రాద్ధభోక్తగా నిమంత్రించితిని. ఆయనయు వచ్చెదనని యొప్పుకొనెను. పాకము చేయుమనెను. సోమిదమ్మ తమ భాగ్యమునకు మెచ్చుకొనుచు పాకము సిద్ధము చేసెను. దర్భలు నర్చనపాత్రలు వగైరా సోమయాజి సిద్ధము చేసెను. స్వామి శుద్ధసమాచారుడై వచ్చెను. సోమయాజి స్వామికి నర్ఘ్యము, నాసనము నిచ్చెను. స్వామి రెండవ బ్రాహ్మణు డేడి యని యడిగెను. ఈ యానందములో వారు రెండవ బ్రాహ్మణుని పిలువలేదు. మరచి పోయిరి. సోమయాజి చేతులు పిసికికొనుచు భార్యదగ్గరకు పోయి యా ప్రమాదమును చెప్పెను. ఆమె స్వామి వద్దకు వచ్చి దేవా! మీ యాజ్ఞ యయిన పిలిచెదననెను. స్వామి పిలువమనెను. సోమిదమ్మ వాకిలిలోనికరిగి సూర్యుని జూచి లోకబాంధవా! కర్మసాక్షీ! శ్రాద్ధమున పితృస్థానమున భోక్తగా దత్తాత్రేయస్వామి వారు దయచేసినారు. విశ్వేదేవస్థానమున అంతవాడవు నీవుగాక వేరెవరు గలరు. స్వామి సెలవీగా నే ప్రార్థించుచుంటిని. అని పిలువ సూర్యుడు నొక బ్రాహ్మణుడుగా మండలము నుండి దిగి వచ్చెను. సోమయాజి వానికి విశ్వేదేవస్థానమున నాసనమిచ్చి పూజించెను. దానికి నచ్చెరువువడుచు దత్తదేవుడు మూడవ బ్రాహ్మణుడేడీ విష్ణుస్థానము లేని శ్రాద్ధము వ్యర్థము గదా! అనెను. మరల సోమయాజి బిత్తరపోయి దిక్కులుచూచు చుండెను. సోమిదమ్మ గార్హపత్యాగ్ని వద్దకు పోయి ఈ సంగతి యంతయు చెప్పి విష్ణుస్థానమున కాహ్వానించిన నగ్నిదేవుడా కుండము నుండి వెలువడి వచ్చి బ్రాహ్మణరూపమున నర్చితుడై విష్ణుస్థానమున గూర్చుండెను. ఇక సోమయాజి యథావిధిగ శ్రాద్ధము నెరవేర్చెను. శ్రాద్ధానంతరము భోక్తల భోజనపాత్రము లా బమ్మరక్కసి కొసంగుడని దత్తదేవుడు చెప్పెను. అట్లు చేయ తదుచ్ఛిష్టానుభవమున రాక్షసత్వము పోయి దివ్యశరీరముతో వారి కెల్లనమ్రుడై సెలవు దీసికొని విమానారూఢుడై దివ్యలోకముల కేగెను. సూర్యాగ్నులు మెచ్చు

కొని కర్తల నాశీర్వదించి పోయిరి. దత్తస్వామి సర్వవిద్యలు సర్వమహిమలు నీయందు భాసించును. నీవు లోకోద్ధారము చేయుచు నిష్టమైనంత కాలము ఇందుండి తర్వాత నీ పత్నితో గూడ బ్రాహ్మలోకమున కేగుము. అని యాదేశించి యంతర్ధానము చేసెను. ఇట్లు కర్మకాండము మోక్షోపాయమైనది కదా!

ఇంకను భారతమున సుదర్శనోపాఖ్యానము గృహస్థాశ్రమముననే ముక్తి నొందవచ్చునని చెప్పుచున్నది. దానికి అతిధిపూజ ముఖ్యము, అందు తన దేహము ప్రాణము పత్నిపుత్రాదులు పశుభవనాదులు సర్వము నతిధికొఱకే యను భావముతో పత్ని నతిధి సత్కరించిన సుదర్శునునతిధి యగు ధర్మదేవత మెచ్చి వరములిచ్చి మృత్యువును జయించితివని చెప్పి పోయెను. ఇట్టి ప్రసంగములనేకములు గలవు. కాన కర్మోపాసనాదికములు ముక్తికి పరంపరాకారణములు. స్వరూపజ్ఞానము సాక్షాత్కారణము. కావుననే శ్రీశంకర భగవత్పాదుల వారు వేదములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు - ఇవి యన్నియు వాక్యావాంతర వాక్యకలనచే నేకవాక్యమని యనుగ్రహించిరి. స్వరూపజ్ఞానము భాసింపగనే పుణ్యాపాపములు లేకుండును. అవి లేకున్న జన్మజరాదులు నడంగును. అదియే బ్రాహ్మియవస్థితి. దాని కనేకమార్గములున్నను. శ్రోతలు యనుగతి శ్రీమద్భగవత్పాదుల వారి దక్షిణామూర్తి స్తవమందలి నాకు తోచిన భావము ననువదించి ముగించెద.

# 25

శ్లో॥ విశ్వం దర్పణదృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం
యథానిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రభోధసమయే స్వాత్మానమేవా
ద్వయం
తస్మైశ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

అద్దమునందు నగపడుచున్న నగరమువలె తనలోనున్న విశ్వమును నిద్రవంటి తన యందలి మాయచేత వెలుపల నున్నట్లు చూచుచు ప్రబోధ సమయమున సజాతీయ విజాతీయ స్వగతభేదము లేని స్వస్వరూపమును మాత్రమే యనుభవించినట్టి శ్రీమంతుడగు గురురూపమున సాధకుల కుపాసనీయుడగు దక్షిణామూర్తి స్వామికిదె నా నమస్కృతి.

అద్దమునందు ఇంకొక వస్తువు వాస్తవముగ నుండు నవకాశము లేదు అయినను కనబడుచున్నది కదా? అది యెట్లు? అదియే మాయ. మాయయన అసత్యవస్తువు సత్యముగాభాసించుట. లేని వస్తువు భాసించుట ఎట్లు? నిద్రలో లేని వస్తువులు భాసించుట లేదా? అవి మెలకువలో లేనివని నిశ్చయింపబడుట లేదా! అట్లే అజ్ఞాన దశలో అగపడు ఈ ప్రపంచము స్వరూపజ్ఞాన దశయందు భిన్నముగ గన్పట్టుట లేదు. ఇచ్చట మనోజన్యజ్ఞానమును గొని అందఱు జ్ఞానుల మనుచున్నారు. ఈ జన్యజ్ఞానము అజ్ఞానమే. దీనికి కారణమగు అఖండ జ్ఞాన స్వరూపమగు వారు జ్ఞానులు. ఆ దశలో "బ్రహ్మ సత్యం-జగన్మిథ్య"

అని అనుభవించుచు సాధకులకు అట్టి యజ్ఞానమును దొలగించువాడు గురుమూర్తి. గు - అన అంధకారమని, రు - అన దాని తొలగించు వాడని పెద్దలు అందురు. కాన అజ్ఞానాంధకారము పోగొట్టి తన స్వానుభవమును శిష్యునందు ప్రకాశింపజేయుశక్తి గలవాడు గురుమూర్తి సగుణబ్రహ్మము, దక్షిణముఖమగు పరమేశ్వర స్వరూపము దానికి నమస్సు. అన ప్రహ్వీభావము. ప్రపంచోన్ముఖమగు ననుభవము బ్రహ్మాభిముఖ మగుటయే ప్రహ్వీభావమున కర్థము.

శ్లో॥ బీజస్యాంతరివాంకురోజగదిదం ప్రాఙ్నిర్వికల్పంపున
ర్మాయా కల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతం
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవయ స్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే !

విత్తనము నందలి యంకురముపలె సృష్టికి పూర్వకాలమందు వికల్ప రహితమైనది యయ్యు తరువాత మాయచేకల్పింపబడిన దేశముయొక్కయు కాలముయొక్కయు భేదవిధములచేతనైన విచిత్రత్వములచేత చిత్రింపబడిన ఈ జగమును గారడివానివలె నే దేవుడు విస్ఫార జేయుచున్నాడో? మహాయోగివలె నొక్కడే నానారూపములతో నగపడుచున్నాడో అట్టి శ్రీదక్షిణామూర్తి యని యుపాసింపబడు శ్రీ మన్మహా గురుమూర్తి కొఱకైన నా నమన మిదె తన్మయత కగునుగాక ?

శ్లో॥ యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థకం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యోబోధయత్యాశ్రితాన్

యత్సాన్ తూత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవాం
భోనిధౌ ।
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణా
మూర్తయే॥

ఏ గురుమూర్తియొక్క సద్రూపమగు ప్రకాశము అసత్ప్రాయ వస్తు రూపము గలదిగా భాసించుచున్నదో ఏ దేవుడు తన్నాశ్రయించినవారికి తత్త్వమసి యను వేదవాక్యముచే ప్రత్యక్షముగ స్వరూపమును బోధించుచున్నాడో ఏ భగవంతుని బోధానుభవము వలన మరల ఈ సంసార సాగరమందు రావలసినపని లేకుండబోవునో అట్టి శ్రీ గురుమూర్తికి శ్రీ దక్షిణామూర్తికి నిదె నమస్సు. ప్రహ్వీభావము.

శ్లో॥ నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణద్వారా బహిస్స్పందతే
జానామీతి తమేవ భాంతమను భాత్యేతత్సమస్తంజగ
త్తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా
మూర్తయే॥

చాల చిల్లులుగల కుండలో నున్న పెద్ద దీపపు వెలుతురువలె నెవని స్వరూప జ్ఞానము చక్షురాదింద్రియముల వెంట బయటికి స్రవించుచున్నదో తెలిసికొనుచున్నానను నొకదే విభుడు స్వయముగా భాసించుచుండగా వాని స్ఫురణము ననుసరించి ఈ జగమంతయు భాసించుచున్నదో అట్టి శ్రీకరుడగు గురుమూర్తికి ఆ బీజమును భాసింపజేయు వాడగు శ్రీ దక్షిణామూర్తికి, స్వామికి మా మనోవాక్కాయ కర్మముల ప్రహ్వీభావమిది. అనగా నివియన్నియు తత్ప్రవణములగుట. సగుణవిషయమున నమస్కృతి. గుణాతీత భావమున తాద్రూప్యస్థితి.

శ్లో॥ దేహం [illegible] మనో బుద్ధిం శూన్యం
విదుః
స్త్రీబాలాంధ జడోపమాస్త్వహమితి భ్రాంతా భృశం
వాదినః
మాయాశక్తి విలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా
మూర్తయే!

ఆడువారు, బాలురు, గ్రుడ్డివారు, జడుల పోలికగాగల మిక్కిలి భ్రాంతు లగు మతవాదులు అహం — నేను అనుచోట తమ్ము తామెఱుగక దేహమును గాను ప్రాణమును గాను ఇంద్రియములను గాను మనస్సును గాను బుద్ధిని గాను శూన్యమును గాను చెప్పుచున్నారు. తదన్యమగు సర్వసాక్షి స్వరూపమును స్ఫురింపచేయుచు మాయాశక్తియొక్క విలాసముల వలన నేర్పడిన వారి వారి వ్యామోహముల మొదలంట నశింపజేయునట్టి శ్రీమద్గురుమూర్తికి దక్షిణామూర్తికి నిదె నమస్సు.

శ్లో॥ రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛా
దనా
త్సన్మాత్రః కరణోప సంహరణతో యోఽభూత్సుషుప్తః
పుమాన్
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా
మూర్తయే !

మాయ చక్కగా వ్యాపించుటవలన రాహుచే గ్రసింపబడిన సూర్య చంద్రుల యట్టివాడై సత్తామాత్రుడైన పురుషుడు సుషుప్తినొందినవాడగును. మెలకువ వచ్చినప్పుడు నేనింతదనుక నిద్రించితినని యేసాక్షి

తత్కాలమందునుగల తన్ను గుర్తించుచున్నాడో యట్టి శ్రీ గురుమూర్తికి దక్షిణామూర్తికి నిదె నమస్కృతి. గాఢనిద్రలో నింద్రియాదులు పరమించినను తన్ను దాననుభవింపకున్న మెలకువ వచ్చిన తరువాత గుర్తింపలేడు. అనుభూత విషయమే స్మృతిగోచరమని సిద్ధాంతము. సుషుప్తానుభవమున లేని కరణాదులు అహం శబ్దార్థములు కానేరవు.

శ్లో॥ బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తా స్వనువర్తమాన మహామిత్యంత స్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటీ కరోతి భజతాం యోభద్రయా ముద్రయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా మూర్తయే !!

నేను బాలుడను అనువానికి కొన్నినాళ్ళకు వయస్సు రాగా నేను వయసులో నున్నవాడ ననుకొనునపుడు బాల్యము పోయినను "నేను" పోలేదు. తరువాత నేను వృద్ధుడ నన్నప్పుడు యౌవనము పోయినను "నేను" పోలేదు. అట్లే నేను మేల్కొంటిని. నేను కలగంటిని. నేను గాఢనిద్ర నొందితిని, అనునపుడు జాగ్రత్స్వప్న సుషుప్తులు మారుచున్నను నేను మారుట లేదు. ఇట్లు సర్వావస్థలయందు నహమని లోపల నెల్లపుడు స్ఫురించుచున్న స్వస్వరూపమునే దేవుడు అజ్ఞానమును తొలగించుటచేత భద్రమగు జ్ఞానముద్రచేత భక్తులకు ప్రకటించుచున్నాడో అట్టి శ్రీ గురుమూర్తికి శ్రీ దక్షిణామూర్తికి ఈ ప్రణామము.

శ్లో॥ విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధత
శ్శిష్యా చార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః

స్వప్నే జాగ్రతివా యఏష పురుషోమాయా పరి
భ్రామిత
స్తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా
మూర్తయే !

ఈ పురుషుడు మాయచే మిక్కిలి విభ్రాంతి నొందింపబడినవాడై మెల
కువ యందుగాని కలయందుగాని కార్యకారణ ధర్మముతోను ప్రభు
భృత్యసంబంధముతోను గురుశిష్య రూపముతోను అట్లే తండ్రులు బిడ్డలు
నను విధముతోను నిట్లే భార్యాభర్తృత్వాది న్యాయముతోను విశ్వమును
గనుగొనుచుండెనను మాట యేది కలదో? అట్టి భ్రాంతిని తొలగించి ఈ
విశ్వమును సచ్చిదానంద స్వరూపమగు తన్నుగానే నిద్రా దృష్టాంతమున
ననుభవింపజేయు శ్రీ గురుదేవునకు దక్షిణామూర్తిస్వామికి నిదె ప్రణతి.

శ్లో॥ భూరంభాంస్యనలోఽనిలోంబర మహర్నాథో
హిమాంశుఃపుమా
నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవమూర్త్య
ష్టకం
నాన్యత్కించ నవిద్యతే విమృశతో యస్మా త్పరస్మా
ద్విభో
స్తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా
మూర్తయే !!

భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, చిదా
భాసుడు-ప్రతి శరీరములయందు తోచు జీవుడు నను నెవని యెనిమిది రూప
ములే ఈ జంగమ స్థావరాత్మకమవు విశ్వముగా దోచుచున్నదో, గురు
బోధతో విమర్శించి చూచువానికి ఏ పరాత్పరుడవు విభునికన్న నన్యమగు
నది యావంతయు నుండదో, అట్టి దక్షిణామూర్తి రూపుడవు గురు

స్వరూపమున నిదె చేరి యుంటివి అని తొమ్మిది శ్లోకములతో శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు ఒక ప్రకరణమును జూపియున్నారు. ఇదియే మనము ప్రారంభములో చెప్పుకొన్న బ్రహ్మము. భూమము నను తత్త్వమునుండి యవ్యక్తము దానినుండి మహత్తు, అద్దానివలన అహంకారము తర్వాత సూక్ష్మభూతములు, పంచీకృత భూతములు నిట్లు క్రమ సృష్టమగు నీ వ్యావహారిక ప్రపంచమున విజ్ఞానమును వదలి జ్ఞానియగు వానికి వ్యవహారము విరామము నొంద నేది మిగులునో యదియే సత్య స్వరూపము, సంవిత్తు, ఆనందము—నని గురుశిష్య దృష్టితో శబ్దింపబడు నపరూపమగు రూపము.

శ్లో॥ అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథారసం నిత్య మగంధ వచ్చయత్
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే॥

అనియు

శ్లో॥ తదా స్తిమిత గంభీరం
న తేజో నతమ స్తతం
అనాఖ్య మనభివ్యక్తం
సత్కించిదవ శిష్యతే॥

అనియు శ్రుతిస్మృతుల ననేకముల జూపి వ్యవహారములో జేయు గురుల బోధమువలన దోచుప్రకాశము. ఇది యనుభవమునకు వచ్చిన కర్తవ్యము లేదు. మిగిలినది భూమ మొక్కటియే.

ఓమ్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ